# చాణక్య
# నీతి దర్పణం

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు
తెలుసుకోండి... ఫేస్‌బుక్
మోహన్ పబ్లికేషన్స్ పేజ్ లైక్ చేయండి.



# చాణక్య నీతి దర్పణము

చాణక్యుడు



హిందీ అనువాదము :

జగదీశ్వరానంద సరస్వతి

ఆంధ్రానువాదము :

ఆరమండ్ల వెంకయ్యార్య

ఉభయభాషా ప్రవీణ

# పరిచయము

సంస్కృతములో వైదికవాఙ్మయముకాక లౌకిక వాఙ్మయముకూడ కలదు. అందులో కావ్యములు, నాటకములు, చరిత్రలు, చంపూగ్రంథములు (గద్య పద్య మిశ్రితము) నీతి శతకములు, సుభాషితములు, గద్య గ్రంథములు మున్నగునవి పలువిధములుగా నున్నవి. వానిలో నీ 'చాణక్యనీతి దర్పణ' మనునది నీతిబోధక గ్రంథము.

దీనిని సంస్కృత భాషలో చాణక్యుడు రచించెను. ఈయనకు బహునామములు గలవు. కాని చణకుని పుత్రుడగుటచే చాణక్యుడను నామమే ప్రసిద్ధమయ్యెను. ఈయన బ్రాహ్మణ వంశమునందు సంభూతుడయ్యు 'ఇదం క్షాత్రం ఇదం బ్రాహ్మ్యం' అనినట్లు శస్త్రశాస్త్రములలో ప్రవీణుడు. కావుననే యొకనాడు నందరాజుచే పరాభవింపబడి నందరాజ వంశమును నశింపజేసి మౌర్యవంశీయుడగు చంద్రగుప్తుని రాజుగా జేసి మౌర్య సామ్రాజ్యమును స్థాపించి విస్తరింపజేసిన యద్భుతవ్యక్తి.

ఈ చాణక్య నీతి దర్పణములో మూడో నాలుగో శ్లోకములు ప్రక్షిప్తములుగా గుర్తింపబడినవి. అందలి విషయము వేదధర్మమునకు విరుద్ధముగా నుండుటచే నవి ప్రక్షిప్తములని నిర్ధారింపబడినవి. మిగిలిన శ్లోకము లన్నియు సరళమైన భాషలో సంస్కృతభాషా పరిచయముగల నెవ్వనికైనను నర్థమగునట్లు వ్రాయబడియున్నవి. అన్నిరకములైన నీతులు నిందు వివరింపబడినవి. ఈ గ్రంథమందలి విషయము పండిత పామరులనికాని, బాలవృద్ధులనికాని, స్త్రీ పురుష భేదమనికాక మానవులకు నెల్లరకు నుపయోగపడుచు నామమును సార్థకపఱచుకొనుచున్నది. దర్పణ మనగా నద్దము. అద్దములో జూచినచో ముఖమందలి మచ్చలుకాని, మడుతలుకాని, నిమ్నోన్నతములుగాని యెట్లు సుస్పష్టముగా కానవగునో

యట్లే యీ గ్రంథమందు నీతిని బోధించు వివిధ విషయములు గలవు. ఒక విధముగా జూచిన నీతికి సంబంధించిన సర్వ విషయములు కలవేమో యనిపించుచున్నది.

ఒకనాడు పోస్టుద్వారా యొక లేఖవచ్చినది. దానిని విప్పిచూడగా సికిందరాబాద్ సీతాఫలమండి వాసులు, హోమియో వైద్యులు, నిరాడంబర జీవులునైన శ్రీ కోడూరి సుబ్బారావుగారి వ్రాత కనబడినది. అందు తాను నేనను వదించిన మనుస్మృతి చదివినట్లును, ఆ రచన తనకు నచ్చినట్లును, అట్లే చాణక్య నీతి దర్పణమను గ్రంథమును ఆంధ్రానువాదము చేసిన బాగుండుననియు వ్రాసిరి. దానికి నేను ఆ గ్రంథమును చూడలేదని సమాధానము వ్రాయగా వెంటనే 'చాణక్య నీతి దర్పణము' అను గ్రంథమును శ్రీ స్వామి జగదీశ్వరానంద సరస్వతిగారి హిందీ యనువాదమున్న దానిని బంపిరి. ఆ గ్రంథమును దీసికొని చదివిచూడగా ఆ శ్లోకశైలి, యందలి భావములు, అనువాదకుని విమర్శయు నాకు నచ్చుటచే శ్రీ కోడూరి సుబ్బారావుగారి కోరికమేర కీ గ్రంథమును నాశక్తికొలది ఆంధ్రమున ననువదించితిని. ఇంతకు పూర్వమే దీనిని పూర్తిచేయ తలంపున్నను ఆర్యసామాజిక కార్యములుకొన్ని అవరోధములగుటచే త్వరగాపూర్తిచేయ జాలనైతిని. ఈ గ్రంథమును తెనిగింప నన్ను ప్రేరేపించిన శ్రీ కోడూరి సుబ్బారావుగారికి నా కృతజ్ఞతలు, చదువరులు ఆమూలాగ్రముగా జదివి నీతిజ్ఞులై వర్ధిల్లుదురు గాత!

తెనాలి
6-5-96

—వెంకయ్యార్య.

ఓం

# ప్రస్తావన

సంస్కృత సాహిత్యము రత్నములతో నిండియున్నది. కొన్ని శ్లోకముల రసాస్వాదనము చేయుదు.

శ్లో॥ ఉత్తమః క్లేశవిక్షోభం క్షమః సోఢుం న హీతరః ।
మణిరేవ మహాశాణఘర్షణం న తు మృత్కణః ॥

కష్టముల సహించుటకు ఉత్తముడే సమర్థుడగునుగాని సాధారణ మనుష్యుడుకాడు. ఎట్లనగా శాణము ఉలి మొదలగువాని దెబ్బలను మణియే సహించునుగాని మట్టిపెళ్ళగాదు.

ఏక ఏవ ఖగో మానీ వనే వసతి చాతకః ।
పిపాసితో వా మ్రియతే యాచతే వా పురందరమ్ ॥

స్వాభిమానముగల చాతకపక్షి వనములో నుండును. అది దప్పిక యైనను చచ్చుటకు సిద్ధపడుచు వర్షబిందువుల కొఱకు ఇంద్రుని (మేఘుని) యాచించునుగాని యితరముగానున్న క్రిందిజలమును ముట్టదు. అట్లే లోకములో అభిమానవంతులు మరణించుటకైనను సిద్ధపడుదురు కాని నీచకర్మలకు పాల్పడరు.

నిర్గుణేష్వపి సత్త్వేషు దయాం కుర్వన్తి సాధవః ।
న హి సంహరతే జ్యోత్స్నాం చంద్ర శ్చాండాల వేశ్మసః ॥

సజ్జనులు గుణహీనములగు వస్తువులందును దయజూపుదురు. చంద్రుడు తన వెన్నెలను గుణహీనులగు (చాండాలురు) వారి గృహము లపై ప్రసరించకుండ చేయదుగదా!

చాణక్యుడిట్టి వందలకొలది శ్లోకముల రచించెను. ఈ విషయ మును 'కామందకీయ నీతిసారము' లో నిట్లు రచించిరి.—

నీతిశాస్త్రామృతం ధీమా నర్థశాస్త్ర మహోదధేః ।
సముద్దధ్రే నమస్తస్మై విష్ణుగుప్తాయ వేధసే ॥
(కామంద. 1–2)

అర్థశాస్త్ర రూపమైన మహాసముద్రమునుండి నీతిశాస్త్ర రూపమైన యమృతమును వెలికిదీసిన మహాబుద్ధిమంతుడగు విష్ణుగుప్తుడను నామము గల చాణక్యునకు నమస్కారము.

పంచతంత్ర రచయితయైన విష్ణుశర్మకూడ చాణక్యుని నీతిశాస్త్ర కర్తలలో లెక్కించెను.

మనవే వాచస్పతయే శుక్రాయ పరాశరాయ ససుతాయ ।
చాణక్యాయ చ విదుషే నమోఽస్తు నయశాస్త్ర కర్తృభ్యః ॥
(పంచ. 1–2)

మనువు, బృహస్పతి, శుక్రుడు, పుత్రుడైన వ్యాసునితో గూడిన పరాశరముని, విద్వాంసుడైన చాణక్యుడు మొదలగు నీతిశాస్త్రకర్తలకు నమస్కారము.

చాణక్యుడెవరు ?

చాణక్యుడు ఒక యద్భుత రాజనీతిజ్ఞుడు. అతడు మగధదేశమును పాలించు నందవంశమును నశింపజేసి వారిస్థానములో మౌర్యసామ్రాజ్యమును స్థాపించెను. మఱియు రాజనీతి విషయకమగు నపూర్వమైన కౌటిల్యార్థశాస్త్రమును రచించి సంస్కృత సాహిత్యములో తన నామమును క్రియను అమరమైన దానినిగా జేసెను.

కౌటిలీయార్థశాస్త్రములో చివర తన సంబంధమైనది వ్రాయబడినది చూడుడు—

యేన శాస్త్రం చ శస్త్రం చ నందరాజగతా చ భూః ।
అమర్షే ణోద్ధృతాన్యాశు తేన శాస్త్ర మిదం కృతమ్ ॥
(కౌ. అ. 15–1–180)

దుష్టులైన నందరాజుల చేతిలో చిక్కిన పృథివిని, శస్త్రములను శాస్త్రములను విడిపించిన ఆచార్య చాణక్యునిద్వారా యీ గ్రంథము రచింపబడెను. హేమచంద్రుడు రచించిన 'అభిధాన చింతామణి' అను గ్రంథములో క్రింద వ్రాయబడిన నామాంతరములు కలవు— వాత్స్యాయనుడు, మల్లనాగుడు, కుటిలుడు, చణకాత్మజుడు, ద్రామిలుడు, పక్షిలస్వామి, విష్ణుగుప్తుడు, అంగులుడు— అభిధాన చింతామణి 853, 854.

ఈయన కిన్ని పేర్లున్నను తండ్రిపెట్టిన నామము విష్ణుగుప్తుడు చణకుడను ఆచార్య పుత్రుడగుటచే తండ్రికి సంబంధించినదగు చాణక్యుడను పేరు వచ్చియుండును. లేక మిక్కిలి కుశాగ్రబుద్ధికల వాడగుటచే అత్యంత చతురుడను నర్థమున చాణక్యుడను పేరు కలిగియుండును. కౌటిలీయ అర్థశాస్త్రమున చాలచోట్ల కౌటిల్య నామమును వాడెను. బహుశా యది వారి గోత్రనామము కావచ్చును, ఆచార్య లనేకులు ఈయనను కుటిలనీతి అర్థశాస్త్ర రచయిత కావున కౌటిల్యుడనిరి. మహామహోపాధ్యాయ గణపతిశాస్త్రిగారు— కుటల గోత్రనామమువలన కౌటల్యుడు కాని కౌటిల్యుడుకాడని వ్రాసిరి. చాణక్య జీవితమునుదెల్పు ప్రామాణిక విషయములు లభింపలేదు. కాని చాణక్యుడు మౌర్యసామ్రాట్ అయిన చంద్రగుప్తునకు మహామంత్రిగాను హితకారిగాను సునిశ్చితమైయున్నది. నందవంశపతనము, చంద్రగుప్త రాజ్యప్రతిష్ఠయు చాణక్యుని బుద్ధికౌశల ఫలములే.

ఈయన బ్రాహ్మణదేశాని ప్రతిదినము లోభుల యిండ్లకు వెళ్ళి యాచించు బ్రాహ్మణుడుకాడు. రాజ్యనాశనము, రాజ్య నిర్మాణముచేయు బ్రాహ్మణుడు. మఱియు స్వాభిమానియైన తపస్వి. నల్లగానుండి కురూపి యగుటచే నొక పర్యాయము శ్రాద్ధక్రియకు పిలువబడి తిరస్కృతుడై పంక్తినుండి బహిష్కృతుడై యాయవమానముతో క్రుద్ధుడై నందుని రాజ్యభ్రష్టునిజేసి నందవంశమునే మూలోచ్ఛేదము కావించెను. చాణక్యుని నీతిమత్తతకు నిదర్శనములు నందుల రాజ్యము వారి వంశనాశనము, మౌర్యసామ్రాజ్య స్థాపనము.

చాణక్యుని విద్యాభ్యాసము తక్షశిల విశ్వవిద్యాలయమందు జరిగెను. ఆయన జన్మస్థల నిర్ణయమునకు దాఖలాలులేవు. కాని యిప్పుడు పాకిస్థాన్ లో నున్న 'ఢేులమ్' అను గ్రామములో తక్షశిల యుండుటచే వారిజన్మము పంజాబులోనై యుండవచ్చును.

ఉపలశకల మేతద్ భేదకం గోమయానాం
వటుభి రుపహృతానాం బర్హిషాం స్తోమ ఏషః ।
శరణమపి సమిద్భిః శుష్యమాణాభిరాభిర్
వినమిత పటలాన్తం దృశ్యతే జీర్ణకుడ్యమ్ ॥
(ముద్రారాక్షసమ్. 3-15)

ముద్రారాక్షస నాటకములో చాణక్యుని గృహమిట్లు వర్ణింపబడెను. చాణక్యుని పాకలో నొకవైపున పిడకలను పగులగొట్టు రాయి, మఱొకచో శిష్యులు తెచ్చిన దర్భలు, కప్పుపై ఎండుటకు ఆరబెట్టిన సమిధలు గలవు. ఆ సమిధల భారమునకు ఇంటికప్పు వంగియున్నది. ఇట్టి యింటిలో చాణక్యు డుండెడివాడు. ఒకసారి విదేశరాయబారి చాణక్యుని పాకజూచి 'ఇంతపెద్ద రాజ్యమునకు ప్రధానమంత్రియైనవాడు ఇట్టి పాకలో నుండుటయా? అనగా వినిన చాణక్యుని సమాధానము చూడుడు —

ఏ దేశములో ప్రధానమంత్రి పాకలో నుండునో యాదేశవాసులు సుందర భవనములం దుందురు. ఏదేశ ప్రధానమంత్రి ఆకాశమునంటు సౌధములలో నుండునో ఆదేశ ప్రజలు గుడిసెలలో మగ్గుదురు అనెను.

చాణక్యుడు చంద్రగుప్తు డొకే సమయమున నుండిరి. ఆంగ్లేయుల లెక్కప్రకారము క్రీస్తుపూర్వము 322 లేక 325 సంవత్సరములకు పూర్వము మౌర్యసామ్రాట్ అయిన చంద్రగుప్తుని సమయముగా నున్నది. ఇదే సమయము చాణక్యునిదై యున్నది.

చాణక్య నీతియేగాక చాణక్యుని రచనలు 'కౌటిలీయ అర్థశాస్త్రము' మున్నగు గ్రంథములు గలవు. రాజనీతి సంబంధమున 'కౌటిలీయ అర్థ శాస్త్రము' అద్భుతమైన గ్రంథము. ఆయన రచనలు కొన్ని—

1. వృద్ధచాణక్య—దీనిలో నెనిమిది అధ్యాయములు, 124 శ్లోకములు గలవు.
2. చాణక్య నీతిశాస్త్రము—దీనిలో 108 శ్లోకములున్నవి.
3. చాణక్యసార సంగ్రహము—దీనిలో 300 శ్లోకములున్నవి.
4. లఘుచాణక్య—దీనిలో 8 అధ్యాయములు, 91 శ్లోకములుగలవు.
5. చాణక్య రాజనీతి శాస్త్రము—ఇందు 8 అధ్యాయములు, 512 శ్లోకములుగలవు.

ఇప్పటివరకు చాణక్యనీతికి అనువాదములు 50 వఱకుగలవు. వానిలో నధికాంశము చౌకబారు కాగితముపై ముద్రింపబడి అనువాదము సరిగాలేదు. ఈ గ్రంథముపై నెక్కువ పరిశోధన చేసినవారు 'లుడ్విగ్' అనువారు. ఆయన చాణక్యనీతితో బాటు యితర గ్రంథములనుగూడ సంపాదించెను. ఈ గ్రంథము 5 భాగములుగా నున్నది. మూలము మాత్రమే దైవనాగరిలిపి యున్నది. మా యీ సంస్కరణలోని విశేషములు—

1. అత్యంత శుద్ధమైన మూలపాఠము. 'లుడ్విగ్' సంస్కరణ నుండి సాయము పొందితిని. కాని కొన్నిచోట్ల 'లుడ్విగ్' మహాశయుని పాఠము స్వీకరింపలేదు.

2. మహత్త్వపూర్ణ పాఠభేదములను పాదటిప్పణిలో చూపబడినవి. పాఠభేదమువలన శ్లోకార్థములో భేదమున్నచో దానినిగూడ ప్రదర్శించితిని.

3. శ్లోకములోని ప్రతి శబ్దమునకు నర్థము వ్రాయబడినది.

4. శబ్దానంతరము భావార్థముకూడ వ్రాయబడినది.

5. తంబుగా శ్లోకము లన్నింటికి విమర్శ యీయబడినది. వేదము, దర్శనము, ఉపనిషత్తు, రామాయణము, భారతము, పురాణము మొదలగు గ్రంథములనుండి ఉదాహరణము లీయబడినవి.

6. అకారాది అక్షరక్రమమున నన్నింటికంటె ముందు శ్లోకముల పట్టిక యీయబడినది.

7. విమర్శలో జూపబడిన వేదమంత్రములు, శ్లోకములు, సూక్తులు, హిందీ—ఉర్దూ వాక్యములకు అనుక్రమణిక యీయబడినది.

8. మంచికాగితముపై ముత్యములవలె ముద్రింపబడుట దీనిలోని విశేషము.

చాణక్యనీతిపై నింతవఱకు నిట్టి విస్తృత భాష్యము ఎక్కడను ప్రకాశింపజేయబడలేదు. దీనికి భాష్యము వ్రాయుటలో దగిన పరిశ్రమ చేయవలసివచ్చినది. విమర్శించుటలో సుమారు 500 ప్రమాణము లిచ్చితిని. 'సద్యః ప్రజ్ఞాహరీ తుండీ' (17–13) అను శ్లోకమునకు విమర్శ వ్రాయుటకు భరత్‌పూర్ వెళ్ళి రామకృష్ణ రాజపుత్ర ఔషధాలయ గ్రంథాలయ సహాయము పొందితిని.

గోవిందరామహాసానంద సంచాలకుడగు శ్రీ విజయ కుమారుని ఈ పుస్తక ప్రచురణ కొఱకును, శ్రీ రామకృష్ణదాస్ 'రసిక' అను వారిని పూఫులు చూచుటకును, న్యూ విజయ ప్రింటర్స్ సంచాలకుడగు శ్రీ అమరనాద్‌గారిని, ప్రూఫ్‌రీడర్ ఓం ప్రకాశ్‌గారిని, ప్రెస్ కర్మచారి శ్రీ సేవకరామ్‌గారిని, అట్లే మిగిలిన ప్రెస్ వర్కర్లను హృదయపూర్వకముగ ధన్యవాదములతో నభినందించు చున్నాడను. వీరందరియొక్క సహాయముతో నీ పుస్తకము సర్వాంగ సుందరముగ శుద్ధప్రతి తయారైనది.

ఇప్పుడు పాఠకుల కరకమలములందే గ్రంథ ముంచబడినది, నాకు ఆశయేకాదు దీనిని శ్రీమద్ వాల్మీకి రామాయణము, శుక్రనీతి సారముల వలె దీనినికూడ గౌరవింతురని పూర్ణవిశ్వాస మున్నది.

వేదసదన్
H, 1/2 మోడల్‌టౌన్
ఢిల్లీ—9
15—7—83

జగదీశ్వరానంద్
(తెలుగు అనువాదము)




# చాణక్య నీతిదర్పణము

## ప్రథమాధ్యాయము

శ్లో॥ ప్రణమ్య శిరసా విష్ణుం త్రైలోక్యాధిపతిం ప్రభుమ్।
నానాశాస్త్రోద్ధృతం వక్ష్యే రాజనీతి సముచ్చయమ్। 1

శబ్దార్థము :- త్రైలోక్యాధిపతిం = పృథివి, అంతరిక్షము, దివి యను ముల్లోకములకు నధిపతియైనట్టియు, ప్రభుం = సర్వశక్తిమంతుడైనట్టియు, విష్ణుం = సర్వవ్యాపకుడైన పరమేశ్వరుని, శిరసాప్రణమ్య = తలవంచి నమస్కరించి, నానాశాస్త్రోద్ధృతం=నానాశాస్త్రములనుండి యేరి, రాజనీతి సముచ్చయమ్=రాజనీతి సముచ్చయమను గ్రంథమును, వక్ష్యే= చెప్పుదును.

తాత్పర్యము :- పృథివి, అంతరిక్షము, ద్యులోకములను ముల్లోకములకు స్వామియు, సర్వశక్తిమంతుడును, సర్వవ్యాపకుడునైన పరమేశ్వరుని తలవంచి నమస్కరించి వేదాదులగు ననేక శాస్త్రములనుండి యేరి రాజనీతి సముచ్చయమను పేరుగల గ్రంథమును చెప్పుదును.

వివరణము :- "వేవేష్టి వ్యాప్నోతి చరాచరం జగత్ స విష్ణుః" చరాచర జగత్తునందంతట వ్యాపించియుండుటచే పరమాత్మనామము విష్ణువని మహర్షి దయానందసరస్వతి సత్యార్థప్రకాశము ప్రథమ సముల్లాసమున దెలిపియున్నారు. ప్రభువనగా సర్వశక్తిమంతుడు, అనగా తాను చేయదలచిన దానిని చేయగలడని కాదు. ఎందుచేతననగా పరమేశ్వరుడు తన్నుతాను చంపుకొని మరొక పరమేశ్వరుని సృష్టింపలేడు. స్వయముగా మూర్ఖుడు కాలేడు. వ్యభిచారము మొదలగు పాపకర్మలు చేయలేడు.

ఎవ్వనిని గూడ తన రాజ్యముకంటె వెలుపల నుంచలేదు. తనపై తా నెక్కలేడు. సర్వశక్తిమంతు డనగా పరమేశ్వరుడు సృష్ట్యుత్పత్తి స్థితి లయములను జేయుటలోను, జీవులకు (మనుజులకు) కర్మానుసారము ఫల మిచ్చుటలోను కొంచెము కూడ నితరుల సాయముకొరకయే తనసామర్థ్య ముతో పూర్తిచేయగలడు.

రాజనీతి సముచ్చయము :- చాణక్యుడు తాను వ్రాసిన గ్రంథము నకు రాజనీతి సముచ్చయమని పేరిడెను, కాలాంతరమున నదీ చాణక్య నీతిదర్పణముగా మారినది.

నానాశాస్త్రోద్ధృతమ్ :- చాణక్యుడీ గ్రంథమును తాను కల్పించి వ్రాయలేదు. వేదము, మనుస్మృతి, మహాభారతము, ఉపనిషత్తులు మొద లగు గ్రంథములనుండి సారమును వెలికిదీసి దీనిని సిద్ధముచేసెను.

శ్లో॥ అధీత్యేదం యథాశాస్త్రం నరో జానాతి సత్తమః ।
ధర్మోపదేశ విఖ్యాతం కార్యాకార్యం శుభాశుభమ్॥ 2

అర్థము :- సత్తమః నరః = శ్రేష్ఠమనుష్యుడు ఇదం = ఈ నీతి సముచ్చయమును యథాశాస్త్రమ్ = శాస్త్ర పద్ధతిగ, అధీత్య = చదివి ధర్మోప దేశ విఖ్యాతమ్ = వేదము. మనుస్మృతి మొదలగు ధర్మశాస్త్రములందు ప్రసిద్ధమైన. కార్యాకార్యమ్ = చేయదగిన చేయరానట్టియు, శుభాశుభమ్ = మంచిచెడ్డపనులను జానాతి = బాగుగా దెలిసికొనుచున్నాడు.

తా॥ శ్రేష్ఠమనుష్యుడు ఈ రాజనీతి సముచ్చయమును శాస్త్రపద్ధతిగా జదివి వేదము, మనుస్మృతి మొదలగు ధర్మశాస్త్రములందు ప్రసిద్ధమైనట్టి కర్తవ్యాకర్తవ్యములను, పుణ్యాపాపములను, మంచిచెడ్డలను బాగుగా తెలిసికొనును.

వివరణము :- 'సత్తమః నరః' శ్రేష్ఠనరుడెవడో మహాభారతము చెప్పుచున్నది. చూడుడు—

అమిత్రమపి చేద్దీనం శరణైషిణ మాగతమ్ ।
వ్యసనే యోఽనుగృహ్ణాతి స వై పురుషసత్తమః॥ (మ.భా. అను 59-10)
శత్రువైనను దైన్యముతో శరణుజొచ్చినచో నట్టి సంకటస్థితిలోనున్న మనుష్యునిపై దయజూపు వానిని పురుషశ్రేష్ఠునిగా జెప్పుచున్నారు

శ్లో॥ తదహం సంప్రవక్ష్యామి లోకానాం హితకామ్యయా ।
యేన విజ్ఞాన మాత్రేణ సర్వజ్ఞత్వం ప్రపద్యతే॥ 3

అర్థము :- అహం = నేను, లోకానాం = ప్రజలకు, హితకామ్యయా = మేలుచేయవలెనను కోరికతో తత్ = ఆ నీతిసముచ్చయమును, సంప్రవక్ష్యామి = బాగుగా జెప్పుదును, యేన = దేనిని, విజ్ఞానమాత్రేణ = తెలిసికొనిన మాత్రముచేతనే, మనుజుడు, సర్వజ్ఞత్వం = సర్వము తెలిసికొనుటను, ప్రపద్యతే = పొందుచున్నాడో (దానిని).

తా॥ నేను మానవమాత్రులకు శుభముచేయు కోరికతో ఆ రాజనీతి సముచ్చయమును అనగా దేనిని తెలిసికొనినంతమాత్రమున మనుష్యుడు సర్వజ్ఞుడు కాగలడో యట్టి దానిని బాగుగా చెప్పుచున్నాను.

వివరణము :- సర్వజ్ఞుడనగా భూత వర్తమాన భవిష్యత్తులను తెలిసినవాడని కాని, లోకలోకాంతరములందలి విషయముల సన్నింటిని తెలిసినవాడని కాని యర్థముకాదు. ధర్మార్థకామములు జ్ఞానముకలవాడని యర్థము.

శ్లో॥ మూర్ఖశిష్యోపదేశేన దుష్టస్త్రీ భరణేన చ ।
దుఃఖితైః సంప్రయోగేణ పండితోఽప్యవ సీదతి॥ 4

అర్థము :- మూర్ఖశిష్యోపదేశేన = బుద్ధిహీనుడైన శిష్యుని చదివించుటచేతను, లేక ధర్మసంబంధ విషయములను నుపదేశించుటచేతను, చ = మఱియు, దుష్టస్త్రీభరణేన = వ్యభిచారిణియు, కఠినముగా మాట్లాడు

నదియు నగు స్త్రీని పోషించుటచేతను, దుఃఖితైః = నానాప్రకారములగు రోగములచే పీడింపబడునట్టియు, ఆత్మీయుల వియోగముచే బాధపడునట్టియు, ధననాశాదులచే దుఃఖితులైనట్టి వారితో, సంప్రయోగేణ = వ్యవహారము చేయుటచేత, పండితః అపి = బుద్ధిమంతుడైనవాడు కూడ, అవసీదతి = దుఃఖితుడై కష్టముల ననుభవించును.

తా॥ బుద్ధిహీనుడైన శిష్యునకు ధర్మోపదేశముచేసినను, వ్యభిచారిణి, కఠినభాషిణియైన స్త్రీని పోషించినను, నానారోగములచే పీడితులును, ప్రియజనుల వియోగపీడితులును, ధననాశాదికారణములచే దుఃఖితులును నైన వారితో వ్యవహారము చేయుటచేతను బుద్ధిమంతుడైన మనుష్యుడు కూడ దుఃఖములపాలు కావలసివచ్చును.

వివరణము :-

ఉపదేశో హి మూర్ఖాణాం ప్రకోపాయ న శాంతయే ।
పయః పానం భుజంగానాం కేవలం విషవర్ధనమ్॥ పం.తం 1-42

ఉపదేశించుటచేత మూర్ఖులు కోపింతురేకాని శాంతింపరు. పాములకు పాలు పోసినచో విషమే వృద్ధియగును.

మూర్ఖుని పంచలక్షణములు :-

మూర్ఖస్య పంచచిహ్నాని గర్వో దుర్వచనం తథా ।
హఠశ్చైవ విషాదశ్చ పరోక్తం నైవ మన్యతే॥

1) దురభిమానము 2) కఠినముగా మాట్లాడుట (బూతులు తిట్టుట) 3) మొండిపట్టు పట్టుట 4) దుఃఖితుడగుట 5) ఇతరుల మాటను వినకుండుట యను నైదును మూర్ఖుని లక్షణములు.

దుష్టస్త్రీని (వ్యభిచారిణిని) పాలన పోషణచేయరాదు.

మాతా యస్య గృహే నాస్తి భార్యా చాప్రియవాదినీ ।
అరణ్యం తేన గంతవ్యం యథారణ్యం తథా గృహమ్॥
(పంచతంత్ర 4-53)

ఎవని తల్లి యింటిలో నుండదో, ఎవని భార్య అప్రియములు పలుకుచు దురాచారిణి యగునో యట్టి యింటి యజమానుడు అరణ్యమునకు బోవలెను. అట్టి యిల్లు అరణ్యముతో సమానమని యర్థము.

దుఃఖితులు, రోగులు, పీడితులు, శోకసంతప్తులతో వ్యవహరించి నచో కష్టములు సంప్రాప్తమగును. వైద్యుడు "పరదుఃఖేన దుఃఖ్యతే" ఇతరుల దుఃఖముతో దుఃఖము కలవాడగును. ఇందువలన దుఃఖితులతో వ్యవహరించుటచేత పండితుడుకూడ దుఃఖితుడగును.

శ్లో॥ దుష్టాభార్యా శఠం మిత్రం భృత్యశ్చోత్తర దాయకః ।
స సర్పేచ గృహే వాసో మృత్యురేవ న సంశయః॥ 5

అర్థము :- దుష్టా=కఠినముగా మాట్లాడునట్టియు దురాచారిణియు నైన, భార్యా=భార్యయు, శఠం=మోసకాడగు, మిత్రం = స్నేహితుడు, చ=అట్లే, ఉత్తరదాయకః=ఎదురు పలుకునట్టి, భృత్యః = సేవకుడును, చ=మరియు, ససర్పే=సర్పమున్నట్టి, గృహే=ఇంటియందు, వాసః= నివసించుటయు, మృత్యురేవ=మృత్యువుతో సమానమే, సంశయః న = సందేహములేదు.

తా॥ కఠినముగా మాట్లాడునట్టియు దురాచారిణియునగు భార్యయు, మోసకాడగు మిత్రుడు, ఎదురు చెప్పు సేవకుడు, సర్పముండు గృహనివాసము మృత్యువుతో సమానమే సంశయము లేదు.

వివరణము :- దుష్టభార్య -

అః పాకం న కరోషి పాపిని, కథం పాపీ త్వదీయః పితా ।
రండే జల్పసి కిం, తవైవ జననీ రండా త్వదీయా స్వసా ।

నిర్గచ్ఛ త్వరితం గృహాత్ బహిరితో, నేదం త్వదీయం గృహమ్।
హా! హా! నాథ! పమాద్యదేహి మరణం జారస్య భాగ్యోదయ॥

గృహస్థు డొకడు ఆకలితో వ్యాకులుడై యింటికి వచ్చి భోజనము చేయ దలంచును. కాని యింటిలో వంట తయారుకాకపోవుటచే క్రోధావేశమున భార్యతో - ఓ పాపిని! ఇప్పటివఱకేల వంటచేయలేదు? పత్ని - నేనేల పాపినియగుదును? నీ బాబు పాపియగును. కోపించిన భర్త ఓసి ముండ? అధిక ప్రసంగము చేయుచున్నావేమి యనగా - ఆమె నేనేల ముండ నగుదును? నీ తల్లి నీ సోదరియే ముండలగును కుపితుడైన పతి - నా యింటినుండి బయటకు పొమ్మనును, భార్య - ఇదినీ యిల్లేమియు గాదు. అని సమాధానము ఈయగా భర్త - ఓరి భగవంతుడా! నాకీనాడే చావు వచ్చిన బాగుండునని వ్యభిచారిణియైన భార్యపెత్తనముగల యింటి యజమానుడు వాపోవును. నిజముగా నిట్టి కులట మృత్యువేయగును.

ధూర్తమిత్రుడు :-

ముఖం పద్మదలాకారం వాచా చందనశీతలా।
హృదయం క్రోధసంయుక్తం త్రివిధం ధూర్తలక్షణమ్॥

ముఖము పద్మమువలె ప్రసన్నముగా నుండును. వాక్కు చందనమువలె చల్లగానుండును. హృదయము క్రోధయుక్తమైయుండును. ఈ మూడు లక్షణములు గలవాడే ధూర్తుడు. దొంగతో దొంగతనము చేయుమని చెప్పును. యజమానునితో మేల్కొని యుండుమని చెప్పును. ఇట్టి ధూర్తుడు కూడ మృత్యువుతో సమానుడే. మిత్రుని మోసముచేసిన ధూర్తుడు మృత్యువునకు కారణమగును.

శ్లో॥ ఆపదర్థే ధనం రక్షేద్ దారాన్ రక్షే ద్ధనైరపి।
ఆత్మానం సతతం రక్షేద్ దారైరపి ధనైరపి॥ 6

అర్థము :- ఆపదర్థే = ఆపత్కాలమున నుపయోగపడుటకై, ధనం = ధనమును, రక్షేత్ = రక్షింపవలెను, ధనైరపి = ధనములకంటె నధికముగా, దారాన్ = భార్యను, రక్షేత్ = రక్షింపవలెను, సతతం = ఎల్లప్పుడు, దారైరపి = భార్యకంటె నధికముగ, ఆత్మానం = తన్నుతాను, రక్షేత్ = రక్షింపవలెను.

తా॥ ఆపత్కాలము కొఱకు ధనమును రక్షింపవలెను ధనము కంటె నధికముగా భార్యను రక్షింపవలెను. ఎల్లపుడు భార్యకంటెను ధనముకంటెను నధికముగా తన్నుతాను రక్షించుకొనవలెను. తాను నశించిన తరువాత ధనము భార్యవలన ప్రయోజనముండదు. కావున ఆత్మరక్షణము ముఖ్యము

వివరణము :- విదురనీతి - మ.భా ఉ. 37-17 చూడుడు—

త్యజేత్ కులార్థం పురుషం గ్రామస్యార్థే కులం త్యజేత్ ।
గ్రామం జనపదస్యార్థే ఆత్మార్థం పృథివీం త్యజేత్॥

కులమును రక్షించుటకు పురుషుడు బలిదానము కావలెను గ్రామరక్షణ కొఱకు కులమును త్యజింపవలెను జిల్లారక్షణ కొఱకు గ్రామమును త్యజింపవలెను. ఆత్మరక్షణ కొఱకు సర్వప్రపంచమును విడువవలెను.

శ్లో॥ ఆపదర్థే ధనం రక్షే చ్ఛ్రీమతాం కుత ఆపదః ।
కదాచి చ్చలతే లక్ష్మీః సంచితోఽపి వినశ్యతి॥ 7

అర్థము :- ఆపదర్థే = ఆపదలను బోగొట్టుకొనుటకు, ధనం = ధనమును, రక్షేత్ = రక్షింపవలెను, శ్రీమతాం = ధనవంతులకు, ఆపదః = ఆపదలు, కుతః = ఎట్లుకలుగును ? కదాచిత్ = ఎన్నడైన దైవయోగముతో, లక్ష్మీః = సంపద, చలతే = పోయినచో, సంచితోఽపి = సంపాదింపబడినది కూడ, వినశ్యతి = నశించిపోవును.

తా॥ ఆపత్కాలయములో ఆపదలను నివారించుకొనుటకు ధనమును రక్షించుకొనవలెను. శ్రీమంతులకు ఆపద లెట్లు వచ్చును? ఎప్పుడైనను దైవయోగమువలన సంపదపోవును. అప్పుడు కూడబెట్టిన ధనము కూడ నష్టమగును.

శ్లో॥ యస్మిన్ దేశే నసమ్మానో న వృత్తి ర్నచ బాంధవాః ।
న చ విద్యాఽఽగమః కశ్చిత్ తం దేశం పరివర్జయేత్ ॥ 8

అర్థము :- యస్మిన్ దేశే=ఏ ప్రదేశమందు, సమ్మానః = ఆదరము, గౌరవము, న=లేదో, వృత్తిః=బ్రతుకుతెరువు, న=లేదో, బాంధవాః చ=బంధువులు కూడ, న=లేరో, కశ్చిత్=ఏదైనను, విద్యా+ఆగమః చ=విద్యాప్రాప్తియు, న=లేదో, తం దేశం=ఆ దేశమును, పరివర్జయేత్=విడిచిపెట్టవలెను.

తా॥ ఏ ప్రదేశములో ఆదరాభిమానములుండవో, జీవనము జరుగదో, బంధుబాంధవులుండరో, ఏదైన విద్యాప్రాప్తికలుగదో, అట్టి ప్రదేశమును విడిచిపెట్టవలెను.

శ్లో॥ ధనికః శ్రోత్రియో రాజా నదీ వైద్యస్తు పంచమః ।
పంచ యత్ర న విద్యన్తే న తత్ర దివసం వసేత్ ॥ 9

అర్థము :- ధనికః = ధనవంతుడు, శ్రోత్రియః = వేదజ్ఞుడైన బ్రాహ్మణుడు, రాజా=ధార్మికుడు, న్యాయశీలుడునైనరాజు, నదీ=పొలము తడుపుట కుపయోగించునదియు, పంచమః=అయిదవవాడైన, వైద్యః = రోగముల బోగొట్టు వైద్యుడు, యత్ర=ఎక్కడ, పంచ=ఈ అయిదును, న విద్యన్తే=ఉండవో, తత్ర = అచ్చట, దివసం = ఒక్కరోజైనను, న వసేత్ = ఉండరాదు.

తా॥ ధనవంతుడు, వేదజ్ఞుడైన బ్రాహ్మణుడు, ధార్మికుడు న్యాయశీలుడైన రాజు, వ్యవసాయమున కుపయోగించు నదియు, ఐదవ వాడైన వైద్యుడునను నిట్టి అయిదు లేనిచోట నొక్కరోజైనను నుండరాదు.

వివరణము :- ధనికః = అవశ్యకమైనపుడు ఋణమిచ్చు ధనికు డుండవలెను: శ్రోత్రియః=జనులకు ఉపదేశముచేసి సన్మార్గమున నడపుటకు వేదజ్ఞుడైనబ్రాహ్మణుడుండవలెను.బోధాయన గృహ్యసూత్రములో శ్రోత్రియ శబ్దమున కిచ్చిన నిర్వచనము-బ్రాహ్మణేన బ్రాహ్మణ్యా ముత్పన్నః ప్రాగుప నయనా జ్జాతః ఇత్యభి ధీయతే॥ - బ్రాహ్మణుని వలన బ్రాహ్మణియందు పుట్టినవాడు ఉపనయనమునకు పూర్వము 'జాతు'డు అనబడును. "ఉప నీత మాత్రో వ్రతానుచారీ వేదానాం కించి దధీత్య బ్రాహ్మణః" బ్రహ్మ చర్యాది వ్రతముల పాలించువాడును, యజ్ఞోపవీతము ధరించినవాడును కొంత వేదపఠనముచేసిన వాడును బ్రాహ్మణు డనబడును - "ఏకాం శాఖా మధీత్య శ్రోత్రియః" వేదములోని యొక శాఖను అధ్యయనము చేసినవాడు శ్రోత్రియు డనబడును. మరియు దానకమలాకరములో—

"ఏకాం శాఖాం సకల్పాం వా షడ్భిరంగై రధీత్య చ।
షట్కర్మ నిరతో విప్రః శ్రోత్రియో నామ ధర్మవిత్॥

కల్పము లేక షడంగములతో గూడిన వేదము యొక్క యొక శాఖను అధ్యయనముచేసి - చదువుట, చదివించుట, యజ్ఞముచేయుట, యజ్ఞము చేయించుట దానమిచ్చుట, దానముపుచ్చుకొనుట యను షట్కర్మలయందు ఆసక్తికలిగి నిర్వహించు ధర్మము తెలిసినవాడైన బ్రాహ్మణుడు శ్రోత్రియు డగును. రాజు - న్యాయము, రక్షణలకొఱకు ధార్మికుడైన రాజు ఆవశ్యక మగును. నదీ - పొలము తడుపుటకు అభివృద్ధిపొందుటకు నదుండ వలెను. వైద్యుడు - రోగములు సంభవించినపుడు రోగనివృత్తిచేయుటకు వైద్యుడుండవలెను.

శ్లో॥ లోకయాత్రా భయం లజ్జా దాక్షిణ్యం త్యాగశీలతా।
పంచ యత్ర న విద్యన్తే న కుర్యాత్ తత్ర సంస్థితిమ్॥ 10

అర్థము :- యత్ర = ఎక్కడ, లోకయాత్రా = జీవనోపాధి, భయం=దండనభయము, లజ్జా=లోకలజ్జ, దాక్షిణ్యం=చతురత, త్యాగశీలత=దానప్రవృత్తి అను నట్టివి, పంచ=అయిదు, యత్ర = ఎక్కడ, న విద్యన్తే=ఉండవో, తత్ర = అక్కడ, సంస్థితిం = నివాసమును, న కుర్యాత్=చేయరాదు. (అనగా ఉండరాదు)

తా॥ ఎక్కడ బ్రతుకుతెరువు, వ్యాపారము, దండభయము, లోకలజ్జ, చతురత, దానమిచ్చు ప్రవృత్తి యను నైదు విషయము లుండవో యచ్చట నివసింపరాదు.

శ్లో॥ జానీయాత్ ప్రేషణే భృత్యాన్ బాంధవాన్
వ్యసనాఽఽగమే।
మిత్రంచాఽఽపత్తికాలేషు భార్యాం చ విభవక్షయే॥ 11

అర్థము :- ప్రేషణే=పనులలో నియమించిన తరువాత, భృత్యాన్=సేవకులను, వ్యసనాగమే = దుఃఖము సంభవించినపుడు, బాంధవాన్ = బంధువులను, ఆపత్తికాలేషు=ఆపదలు కలిగినపుడు, మిత్రం = మిత్రుని, చ=అట్లే, విభవక్షయే=ఐశ్వర్యము పోయినపుడు, భార్యాం = భార్యను, జానీయాత్=తెలిసికొనవలెను. (పరీక్షించవలెను)

తా॥ పనుల నిర్వహణనుబట్టి నౌకరుల శక్తి తెలిసికొనవలెను. దుఃఖములు సంప్రాప్తమైనపుడు బంధు బాంధవులెంత యుపయోగపడుదురో గుర్తించవచ్చును. కష్టకాలములో సాయపడుటను బట్టి మిత్రుని స్థితి తెలియును. అట్లే ఐశ్వర్యము క్షీణించినపుడు భార్యస్వభావము తెలిసికొనవచ్చును.

శ్లో॥ ఆతురే వ్యసనే ప్రాప్తే దుర్భిక్షే శత్రుసంకటే।
రాజద్వారే శ్మశానే చ యస్తిష్ఠతి స బాంధవః॥ 12

అర్థము :- ఆతురే = రోగము వచ్చినపుడు, వ్యసనేప్రాప్తే = దుఃఖము సంభవించినపుడు, దుర్భిక్షే=కఱవు వచ్చినపుడు, శత్రుసంకటే= శత్రువులవలన కష్టము కలిగినపుడు, రాజద్వారే=రాజసభయందు, చ = మఱియు, శ్మశానే=శ్మశానమందు (వల్లకాడు), యః - ఎవడు, తిష్ఠతి = తోడుగా వెంటనుండునో, సః=వాడే, బాంధవః=నిజమైన బంధువు.

తా॥ రోగము వచ్చినపుడు, దుఃఖము కలిగినపుడు, కఱవు వచ్చినపుడు, శత్రువుల బాధ యేర్పడినపుడు రాజసభయందు, శ్మశానమందు నెవడు తనతో నుండునో యతడే నిజమైన బంధువు.

శ్లో॥ యో ధ్రువాణి పరిత్యజ్య అధ్రువం పరిషేవతే।
ధ్రువాణి తస్య నశ్యన్తి అధ్రువం నష్టమేవ చ॥ 13

అర్థము :- యః=ఏ మనుష్యుడు, ధ్రువాణి = నిశ్చితపదార్థములను లేక భోగాదులను, పరిత్యజ్య=విడిచిపెట్టి, అధ్రువం=అనిశ్చిత వస్తువును లేక భోగ్యపదార్థము కొఱకు, పరిషేవతే=పరుగెత్తుచు ప్రయత్నించునో, తస్య=అతనియొక్క, ధ్రువాణి = నిశ్చితపదార్థములు లేక కార్యములు, నశ్యన్తి=నశించును లేక చెడిపోవును, చ=మఱియు, అధ్రువం= అనిశ్చిత పదార్థము, నష్టమేవ=నష్టమేయగును.

తా॥ ఏ మనుష్యుడు నిశ్చితములగు పదార్థములను విడిచిపెట్టి యనిశ్చితములగు పదార్థములను పొందుటకు ప్రయత్నము చేయునో యతనికి నిశ్చితపదార్థములు నష్టములగును, మఱియు ననిశ్చితపదార్థము లెటులైనను నష్టములే గదా!

శ్లో వరయేత్ కులజాం ప్రాజ్ఞో విరూపామపి కన్యకామ్ ।
రూపవతీం న నీచస్య వివాహః సదృశే కులే॥ 14

అర్థము :- ప్రాజ్ఞః=బుద్ధిమంతుడు, కులజాం = శ్రేష్ఠకులమందు పుట్టినట్టి, విరూపామపి = అందవిహీనమైన దానినైనను, కన్యకాం = కన్యను, వరయేత్=వరింపవలెను. వివాహమాడవలెనుకాని, రూపవతీం= అందకత్తెయైనను, నీచస్య=నీచుని యొక్క కులమందలి కన్యను, న = వివాహమాడరాదు. వివాహః=వివాహము, సదృశేకులే=తన గౌరవమున కనుకూలమైన కులమందలి కన్యనే చేసికొనవలెను.

తా॥ బుద్ధిమంతుడైనవాడు శ్రేష్ఠకులమునందు పుట్టినట్టి కన్యను సౌందర్యవతి కాకున్నను వివాహము చేసికొనవలెను, అందకత్తెయైనను నీచకులమునందు పుట్టిన కన్యను వివాహమాడరాదు. సదృశయైన కన్యనే వివాహమాడవలెను.

వివరణము :- ఈ శ్లోకము నిశ్చయముగా ప్రక్షిప్తమే. ఈ శ్లోకము ఈ యధ్యాయములోని పదునాలవ శ్లోకమునకు విరుద్ధముగా నున్నది. దానిలో 'స్త్రీరత్నం దుష్కులాదపి' అనగా దుష్కులమునుండి యైనను స్త్రీ రత్నమును గ్రహింపవలెనని యున్నది.

శ్లో॥ నఖీనాం చ నదీనాంచ శృంగీణాం శస్త్రపాణినామ్ ।
విశ్వాసో నైవ కర్తవ్యః స్త్రీషు రాజకులేషు చ॥ 15

అర్థము :- నఖీనాం=గోళ్లుగల సింహములు, పెద్దపులులు మొదలగు వాని విషయములో, నదీనాం = నదుల విషయములో, చ = అట్లే, శృంగీణాం=పెద్ద పెద్ద కొమ్ములుగల అబోతుల విషయములో, శస్త్రపాణినాం=ఆయుధములు చేతులలో గలవారి విషయములో, స్త్రీషు = స్త్రీల యందు, చ=మరియు, రాజకులేషు = రాజకుమారులందు, విశ్వాసః = విశ్వాసము, న ఏవ కర్తవ్యః=చేయగూడదు. అనగా నమ్మరాదు.

తా॥ వాడియైన గోళ్లుగల సింహాది మృగములందు, లోతైన నదు లందు, వాడియైన కొమ్ములుగల ఆబోతులు మొదలైన వానియందు, చేతిలో పదునైన కత్తులు గొడ్డళ్లు మొదలగు నాయుధములుగల వారియందు, స్త్రీల యందు, రాజకులములందు, విశ్వాసము కలిగియుండరాదు.

వివరణము :- స్త్రీలయందు విశ్వాసముండనిచో గృహకృత్యములు నెఱవేఱవు. స్త్రీ పురుషులలో పరస్పరము విశ్వాసము లేకున్నచో ఆ గృహము నరకమగును. విశ్వాసములేని స్త్రీ పురుష సంతతి మోసగాళ్లగు దురు. ఇచ్చట స్త్రీలయందు విశ్వాసముంచరాదనుట యనగా వారిని స్వేచ్ఛగా అరక్షితలుగా విడువరాదని యర్థము. వారిని స్వేచ్ఛగా విడిచి నచో వారు శారీరికముగా దుర్బలలగుటచే బలవంతులైన పురుషులచే పరాభవింపబడుటకు, పతితలగుటకు నవకాశమున్నది. కావున స్వేచ్ఛగా విడువరాదనిరి. ఆ విషయములో దప్ప తక్కిన సర్వవిషయములందును వారి సలహాలు, సంప్రదింపులు మొదలగునవన్నియు నుండవలెను.

శ్లో॥ విషాదప్యమృతం గ్రాహ్యమమేధ్యాదపి కాంచనమ్ ।
నీచాదప్యుత్తమా విద్యా స్త్రీ రత్నం దుష్కులాదపి॥ 16

అర్థము :- విషాదపి = విషమునుండికూడ, అమృతం = అమృ తము. గ్రాహ్యం=గ్రహింపదగినది, అమేధ్యాదపి = అశుద్ధమైన మురికి పదార్థము నుండియు, కాంచనం=బంగారము, నీచాదపి=నీచునినుండియు, ఉత్తమా=శ్రేష్ఠమైన, విద్యా=విద్యయు, దుష్కులాదపి = దుష్కులము నుండియు, స్త్రీ రత్నమ్ = రత్నమువంటి స్త్రీ, గ్రాహ్యం = గ్రహింప దగినదే.

తా॥ విషమునుండియు నమృతమును స్వీకరింపవలెను. అశుద్ధ మైన మురికినుండియు బంగారమును తీసికొనవచ్చును. నీచుడైన వాని

నుండియు శ్రేష్ఠమైన విద్యలను కళాకౌశలముల నేర్చుకొనవచ్చును. అస్త్రీ దుష్టకుల సంభవమైనను స్త్రీ రత్నమును గ్రహించి వివాహమాడవచ్చును.

శ్లో॥ స్త్రీణాం ద్విగుణ ఆహారో బుద్ధిస్తాసాం చతుర్గుణా ।
సాహసం షడ్గుణం చైవ కామోఽష్టగుణ ఉచ్యతే॥ 17

అర్థము :- స్త్రీణాం=పురుషులకంటె స్త్రీలకు, ఆహారః = ఆహారము, ద్విగుణః=రెట్టింపుండును, తాసాం=వారికి, బుద్ధిః = బుద్ధి, చతుర్గుణా=నాలుగురెట్లుండును, సాహసం ఏవ=సాహసముకూడ, షడ్గుణం= ఆఱురెట్లుండును, చ=మఱియు, కామః=కామము, అష్టగుణః=ఎనిమిది రెట్లుగా, ఉచ్యతే=చెప్పబడుచున్నది.

తా॥ స్త్రీలకు పురుషులకంటె ఆహారము రెండురెట్లు కావలెను. బుద్ధి నాలుగురెట్లుండును. సాహసము ఆఱురెట్లుండును. కామము ఎనిమిది రెట్లుండును.

వివరణము :- ఈ శ్లోకములో స్త్రీ నిందలేదు. స్త్రీ స్వభావస్థితి చిత్రింపబడినది. స్త్రీలు గర్భమును ధరించి బిడ్డలనుకని పాలనిచ్చి పోషించుచుందురు అందుచే వారి యాహారము రెట్టింపుండును. స్త్రీకి బుద్ధి పురుషునికంటె నాలుగురెట్లుండును. ఈ విషయము నేడు విద్యాలయములలో మహావిద్యాలయములలో, విశ్వవిద్యాలయములలో మగపిల్లల కంటె ఆడుపిల్లలే ప్రథమస్థానము లందున్నారు. పురుషుడు 25 సంవత్సరములకు యువకుడగును. స్త్రీ 16 సంవత్సరములకు యువతియగును పురుషుడు 25 సంవత్సరములలో నెంతనేర్చునో స్త్రీ 16 సంవత్సరములకే యంత నేర్చును. దీనినిబట్టియు పురుషుని బుద్ధికంటె స్త్రీ బుద్ధి తీవ్రమైన దని ధృఢపడుచున్నది.

మఱొకమాట స్త్రీలు స్వేచ్ఛరు అల్లుదురు. దానిలో నొక్క తప్పు కూడ నుండదు. పిల్లలకు తినిపించుచుందురు. ప్రక్కవారితో మాట్లాడు

ముందురు. విషయమును చర్చింపుచుందురు. ఇట్లు పలువిషయములలో నాకేసారి పాల్గొనుటచే నాలుగురెట్లు బుద్ధియున్నట్లు సిద్ధమగుచున్నది. ఏ పురుషుడు నిట్లొకేసారి యింతపని చేయజాలడు. సహజముగా స్త్రీలు సాహసస్వభావము గలవారు కాదు. ఒకవేళ సాహసించవలసి వచ్చినచో పురుషునిమించి సాహసము చూపుదురు. మైథునసమయమున వీర్యస్ఖలనము కాగానే పురుషునకు కామశాంతి కలుగును. అంతేకాదు మైథునమునందు విముఖత యేర్పడును. అందుచేత వీర్యస్ఖలనమునకు తరువాత పురుషుడు శారీరిక మానసిక దృష్టులతో స్త్రీ సేవనములో నసమర్థుడగును. పురుషుని వలె స్త్రీలకు మైథునసమయమున కామశాంతి కొఱకు స్వాభావికమైన క్రియ లేనందువలన వారాంగనలు (వేశ్యలు) ఒకరి తరువాత నొకరికి ననేకమంది పురుషులకు కామశాంతి కలుగచేయుచున్నారు. ఇందువలన శారీరికదృష్టితో స్త్రీ పురుషునికంటె మిక్కిలి యధికమైన కామము కలది యగును.

మొదటి అధ్యాయము సమాప్తము

# ద్వితీయాధ్యాయము

శ్లో॥ అన్నృతం సాహసం మాయా మూర్ఖత్వ మతిలుబ్ధతా ।
అశౌచత్వం నిర్దయత్వం స్త్రీణాం దోషాః స్వభావజాః॥ 1

అర్థము :- అన్నృతం=అబద్ధమాడుట, సాహసం=ఆలోచింపకయే పనిని చేయబూనుట, మాయా=మోసగించుట, మూర్ఖత్వం=మూర్ఖత్వము, అతిలుబ్ధతా=మిక్కిలి లోభగుణము, అశౌచత్వం = అపవిత్రత, నిర్దయత్వం = దయలేకయుండుట యనునవి, స్త్రీణాం=స్త్రీలకు, స్వభావజాః= స్వాభావికములగు, దోషాః=దోషములు.

తా॥ అబద్ధమాడుట, సాహసించుట అనగా ఆలోచింపక యేపని యందైనను త్వరగా లగ్నమగుట, మోసగించుట, మూర్ఖత్వము, లోభి తనము, అపవిత్రత, దయావిహీనత, అను నివి స్త్రీలకు స్వభావముతోనే పుట్టిన దోషగుణములు.

వివరణము :- ఈ శ్లోకము నిశ్చయముగా ప్రక్షిప్తమే. "ద్వారం కిమేకం నరకస్య నారీ" అనగా నరకమునకు స్త్రీ యొక ద్వారమని స్త్రీల విషయములో సమాజములో హీనమనోవృత్తియున్న సమయములో నెవరో యీ శ్లోకము వ్రాసి చాణక్య నీతిలో ప్రక్షిప్తముచేసి యుందురు.

మూర్ఖత్వము స్త్రీలకు స్వాభావికగుణమేయైనచో నే స్త్రీకిని జ్ఞాన ముండరాదు. అట్లే నిర్దయతకూడ స్త్రీలకు స్వాభావిక గుణముకాదు. స్త్రీ సాక్షాత్తుగా దయామూర్తి. బుద్ధిమంతుడైన చాణక్యు డిట్టి మూర్ఖత్వము కల వచనములు వ్రాయడు. మఱియు అబద్ధమాడుట స్త్రీలకు సహజ గుణమా ? అయినచో స్త్రీ యెన్నడును సత్యము చెప్పజాలదు. స్త్రీ నిజమే చెప్పనిచో భర్త, బిడ్డలు, అత్తమామలు మున్నగువారితో నసత్య సంభా షణమే చేయుచున్నచో ఆ యింటి వాతావరణము అవిశ్వాసముతో నిండి ఆ యిల్లు నరకముగా తయారగును. ఇట్లే ఆ శ్లోకములోని యితర దోష ములు గూడ నసత్యములే.

శ్లో॥ భోజ్యం భోజనశక్తిశ్చ రతిశక్తిర్వరాంగనా ।
విభవో దానశక్తిశ్చ నాఽల్పస్య తపసః ఫలమ్॥ 2

అర్థము :- భోజ్యం = భుజించుటకు దగిన మంచి మంచి పదార్థ ములు లభించుటయు, చ = మఱియు, భోజన శక్తిః = ఆ పదార్థములు లభించిన తరువాత వండుసంతవఱకు నోర్పు గలిగియుండుటయు భుజించు శక్తియు, వరాంగనా = అందమైన భార్యలభించుటయు, రతిశక్తిః = ఆమె లభించిన తరువాత నామె ననుభవించుటకు దగిన కామశక్తి కలిగియుండు

టయు, విభవః = సంపదకలిగియుండుట, చ = మఱియు, దానశక్తిః = దానముచేయు స్వభావము కలిగియుండుట యను నివి, అల్పస్య = స్వల్పమైన, తపనః=తపస్సుయొక్క, ఫలం=ఫలము, న = కాదు. అనగా నివి గొప్ప తపోవంతునకుగాని లభింపవని భావము.

తా॥ మంచి భోజనపదార్థము లభించుటయు, ఆ భోజన పదార్థము తిని హరించుకొనుశక్తియు, అందమైన భార్యలభించుటయు, ఆమెతో హాయిగా భోగమనుభవించుటకు కామశక్తి కలిగియుండుటయు, సంపద కలిగియుండుటయు, ఆ సంపదను దానముచేయు బుద్ధికలిగియుండుటయు, నను నివి యల్పమైన తపస్సుచే సంప్రాప్తము కావు. గొప్ప తపస్సంపన్నుడై యుండవలెను.

వివరణము :- పైన జెప్పిన విషయములు భగవంతుడు సమానముగా నిర్మింపక విషమముగా నిర్మాణము చేయును. చూడుడు—

యః సుందరస్తద్ వనితా కురూపా యా సుందరీ సా పతిరూపహీనా,
యత్రోభయం తత్ర దరిద్రతా చ విధే ర్విచిత్రాణి విచేష్టితాని॥

తా॥ పురుషుడు అందగాడైన స్త్రీ అంద విహీనయు, భార్య అందకత్తెయైన భర్త రూపహీనుడును, ఇద్ద ఱొక్కటిగా నున్నచో వారు దరిద్రులుగా నుండుటయు విధాత యొక్క విచిత్రపు లీలలు — అట్లే ధనమున్నవాడు లోభియు, దాత ధనహీనుడుగాను నుందురు అటులకాక పై విషయములు సమములుగా నున్నచో నవి యచ్చటవారి యొక్క పూర్వజన్మ తపః ఫలముగా భావింపవలెను.

శ్లో॥ యస్య పుత్రో వశీభూతో భార్యా ఛందానుగామినీ।
విభవే యశ్చ సంతుష్ట స్తస్య స్వర్గ ఇహైవ హి॥ 3

అర్థము :- యస్య=ఎవనికి, పుత్రః = పుత్రుడు, వశీభూతః = వశమందుండునో, భార్యా = భార్య, ఛందానుగామినీ = భర్త యిష్టాను

సారము ఆచరించునదగునో, చ = మఱియు, యః = ఎవడు, విభవే = సంపదయందు, సంతుష్టః=సంతృప్తి కలవాడగునో, తస్య= అట్టివానికి ఇహ+ఏవ=ఇహైవ=ఈ పృథివియందే, స్వర్గః=సుఖముండును.

తా॥ ఎవనికి పుత్రుడు వశమందుండునో, ఎవని భార్య అతని యిచ్ఛానుసారముగా ప్రవర్తించునో, ఎవడు తన సంపదచే సంతుష్టుడగునో యట్టివానికి నిక్కడే స్వర్గము.

వివరణము :- మఱొకరు చెప్పిన దానిని చూడుడు—

అస్తి పుత్రో వశే యస్య భృత్యో భార్యా తథైవ చ।
అభావే సతి సంతోషః స్వర్గస్థోఽసౌ మహీయతే॥

తా॥ ఎవనియొక్క పుత్రుడు, సేవకుడు, భార్య వాని వశమున నుందురో, అట్లే యెవడు ధనము లేకున్నను సంతుష్టుడుగా నుండునో నట్టివాడు భూతలమందే సుఖము ననుభవించును (స్వర్గమును). కపిలాచార్యుడు తన తల్లియగు దేవహూతితో స్వర్గ నరకముల గూర్చి చెప్పినది చూడుడు.

అత్రైవ నరకః స్వర్గ ఇతి మాతః ప్రచక్షతే।
యా యాతనా వై నారక్యాస్తా ఇహాప్యుపలక్షితాః॥

(భాగ. పు. 3 20 29)

తా॥ ఓ మాతా! స్వర్గ నరకము లిచ్చటనే యున్నవని చెప్పుదురు. నరకములో నేబాధలున్నవో యవి యిక్కడ కూడ కనబడుచున్నవి.

శ్లో॥ తే పుత్రా యే పితుర్భక్తాః స పితా యస్తు పోషకః।
తన్మిత్రం యస్య విశ్వాసః సా భార్యా యత్ర నిర్వృతిః॥ 4

అర్థము :- యే=ఎవరు, పితుః = తండ్రికి, భక్తాః = భక్తులో, తే=వారు, పుత్రాః=పుత్రులు, యస్తు = ఎవడైతే, పోషకః = బిడ్డలను

పోషించుచు మంచిచెడ్డల చూచునో, సః=వాడే, పితా=తండ్రి, యస్య=ఎవనికి, విశ్వాసః=విశ్వాసము, అనగా విశ్వసింపదగినవాడే, తత్ = మిత్రం=ఆ స్నేహితుడు, యత్ర=ఎవరివలన, నిర్వృతిః = సుఖము కలుగునో, సా=ఆమెయే, భార్యా=భార్య.

తా॥ తండ్రియందు భక్తికలవారే పుత్రులు. బిడ్డలపాలన పోషణ చేయువాడే తండ్రి. విశ్వాసపాత్రుడైన వాడే మిత్రుడు. ఏ స్త్రీ వలన భర్తకు సుఖము ప్రాప్తించునో యట్టి స్త్రీయే భార్య.

వివరణము :- పుత్రునిగూర్చి శుక్రనీతిసారము 2-38 లో చూడుడు—

ప్రాప్యాఽపి మహతీం వృద్ధిం వర్తేత పితురాజ్ఞయా।
పుత్రస్య పితురాజ్ఞాఽపి పరమం భూషణం స్మృతమ్॥

తా॥ పుత్రు డున్నతస్థానములోనున్నను తండ్రి యాజ్ఞ ననుసరించి నడవవలెను తండ్రి యాజ్ఞను పాలించుట పుత్రునకు పరమభూషణము.

తత్కర్మ నియతం కుర్యాద్యేన తుష్టో భవేత్ పితా।
తన్నకుర్యాద్యేన పితా మనాగపి విషీదతి॥ (శుక్ర. 2-44)

తా॥ ఏ పని చేసిన తండ్రి సంతుష్టుడగునో యా పనిని పుత్రు డవశ్యము చేయవలెను. తండ్రికి నే కొంచెము దుఃఖము కలిగించునదైనను ఆ పని పుత్రుడు చేయరాదు.

యః ప్రీణయే త్సుచరితైః పితరం స పుత్రో
యద్భర్తు రేవ హితమిచ్ఛతి తత్కలత్రమ్।
తన్మిత్ర మా పది సుఖే చ సమక్రియం య
దేత త్త్రియం జగతి పుణ్యకృతో లభన్తే॥

తా॥ తన సదాచారములతో తండ్రిని ప్రసన్నుని చేయువాడు పుత్రుడు. ఎల్లపుడు భర్తయొక్క శుభమును గోరునట్టిదియే భార్య. సుఖ

దుఃఖ సమయములలో వెంటనుండి యొకే రీతిగా నుండువాడు మిత్రుడు. ప్రపంచములో నీ ముగ్గురు పుణ్యాత్ములకే లభింతురు.

శ్లో॥ పరోక్షే కార్యహన్తారం ప్రత్యక్షే ప్రియవాదినమ్ ।
వర్జయేత్తాదృశం మిత్రం విషకుంభం పయోముఖమ్॥ 5

అర్థము :- పరోక్షే=చాటున, కార్యహన్తారం = పనులుచెడగొట్టు వాడును, ప్రత్యక్షం = ఎదుట, ప్రియవాదినం = తియ్యనిమాటలు చెప్పు వాడును, ఆయిన, తాదృశమ్=అట్టి, మిత్రం=స్నేహితుని, పయోముఖం= మూతిదగ్గఱ పాలుండి, విషకుంభం = నిండుగా విషముగల కడవనువలె, వర్జయేత్=విడిచిపెట్టవలెను.

తా॥ చాటున కార్యములకు హానికలిగించుచు, ఎదుట తియ్యని మాటలాడునట్టి మిత్రుని పయోముఖ విషకుంభమునువలె విడువవలెను. కడవలోపలనంతయు విషముండి కడవమూతిదగ్గఱ పాలుకల దానిని పయోముఖ విషకుంభమందురు.

శ్లో॥ న విశ్వసేత్ కుమిత్రే చ మిత్రేచాపి న విశ్వసేత్ ।
కదాచిత్ కుపితం మిత్రంసర్వంగుహ్యంప్రకాశయేత్ ॥ 6

అర్థము :- కుమిత్రే = చెడ్డస్నేహితునియందు, న విశ్వసేత్ = విశ్వాసముంచరాదు, మిత్రేచాపి = మంచిస్నేహితునియందును, న విశ్వసేత్=విశ్వాసముంచరాదు, కదాచిత్=ఎన్నడైన, కుపితం=కోపించినట్టి, మిత్రం=మిత్రుడు, సర్వం = సమస్తమైన, గుహ్యం = రహస్యమును, ప్రకాశయేత్=వెల్లడించును, అందుచేత నమ్మరాదు.

తా॥ చెడ్డస్నేహితునియందు విశ్వాసముంచరాదు. మంచిమిత్రుని యందును విశ్వాసముంచరాదు. ఎందుచేతననగా నెప్పుడైనను కోపము వచ్చినచో ఆ మిత్రుడు తన రహస్యముల నన్నింటిని వెల్లడించును.

వివరణము :- అథర్వవేదము 19-15-6 లో చూడుడు—

'అభయం మిత్రా దభయ మమిత్రాత్' అనగా మిత్రునినుండి మొదట అభయమును కోరెను. కారణము మిత్రుడుగానున్నపుడు రహస్యములు తెలిసికొనియుండును. కావున కోపము వచ్చినచో ఆ రహస్యముల వెల్లడింపకలడు అందుచేత శత్రువుకంటె మిత్రునినుండియే అభయమును ముందుగా కోరెను.

శ్లో॥ మనసా చింతితం కార్యం వాచా నైవ ప్రకాశయేత్ ।
మంత్రేణరక్షయేద్ గూఢంకార్యంచాపినియోజయేత్ ॥7

అర్థము :- మనసా=మనస్సు ద్వారా, చింతితం = ఆలోచింపబడిన, కార్యం=పనిని, వాచా=వాక్కుతో, నైవ ప్రకాశయేత్ = ప్రకాశింపజేయనే కూడదు, మంత్రేణ=ఆలోచన ద్వారా, రక్షయేత్ = రక్షింపవలెను, చ=మఱియు, గూఢమపికార్యే = రహస్యమైన కార్యమందును, నియోజయేత్=పరిణతిచెందవలెను. (సిద్ధిపొందవలెను)

తా॥ మనస్సుతో నాలోచించిన కార్యమును వాక్కుతో వెల్లడింపరాదు. ఆ కార్యమును బాగుగా ఆలోచించుచునే రక్షింపవలెను. రహస్యముగా నుంచియే ఆ కార్యమును పూర్తిచేయవలెను.

వివరణము :- ఋగ్వేదము 10-31-2 లో — 'స్వేన క్రతునా వదేత్' అనగా తాను ఆలోచించిన దానిని చెప్పదలచిన దానిని కర్మచేసి చూపవలెను. అనగా కర్మద్వారానే వెల్లడింపవలెను.

శ్లో॥ కష్టం చ ఖలు మూర్ఖత్వం కష్టం చ ఖలు యౌవనమ్।
కష్టాత్కష్టతరం చైవ పరగేహ నివాసనమ్॥ 8

అర్థము :- మూర్ఖత్వం=మూర్ఖత్వము, ఖలు చ=నిశ్చయముగా, కష్టం = కష్టదాయకమైనది, చ=మఱియు, యౌవనం = యౌవనావస్థ,

ఖలు = కూడ, కష్టం = దుఃఖదాయకమైనది, చ = అట్లే, పరగేహనివాసనం = ఇతరుల యింట నివసించుట, కష్టాత్కష్టతరమ్ ఏవ = మిక్కిలి కష్టదాయకమైనదే.

తా॥ మూర్ఖత్వము నిశ్చయముగా కష్టమును గలిగించును. మఱియు యౌవనము కూడ కష్టమును కలిగించునదియే. అట్లే యితరుల యిండ్లలో నివసించుటయు నత్యంత కష్టదాయకమే.

వివరణము :- మూర్ఖత్వమును గూర్చి-(యోగవా-ఉప-29-57)లో చూడుడు—

న మౌర్ఖ్యా దధికో లోకే కశ్చిద స్తీహ దుఃఖదః - అనగా మూర్ఖత్వమును మించి ప్రపంచములో దుఃఖమును కలిగించునది మఱొకటిలేదు.

యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వ మవివేకతా ।
ఏకైక మప్యనర్థాయ కిము యత్ర చతుష్టయమ్॥

యౌవనము, ధనసంపద, ప్రభుత్వము, అవివేకము (అజ్ఞానము) అను వానిలో నే యొక్కటున్నను అనర్థమును కలిగించును. అటులకాక నాలుగు నొక్కచో నున్నచో నింక చెప్పవలసిన దేమున్నది ?

ఇతరుల యింట నివాసమును గూర్చి (మ.భా.వన. 313-115) లో యక్షుడు యుధిష్ఠిరు నడిగెను. ఎవడు ప్రపంచములో సుఖముగానుండి సంతోషించును? దానికి యుధిష్ఠిరుని సమాధానము.

పంచమేఽహని షష్ఠే వా శాకం పచతి స్వగృహే ।
అనృణీ చాప్రవాసీ చ స వారిచర! మోదతే॥

తా॥ జలచరుడవైన యక్షా! ఋణము లేనివాడు, పరదేశమందు లేనివాడు, అయిదాఱు రోజులకైనను తన యింటిలో వంటచేసికొని భుజించు వాడును సుఖమును కలవాడగును-మఱియు.

వినా కార్యేణ యే మూఢా గచ్ఛన్తి పరమందిరమ్ ।
అవశ్యం లఘుతాం యాన్తి కృష్ణపక్షే యథా శశీ॥

తా॥ మూఢులైనవారు పనిలేకుండ సోమరులై యితరుల యిండ్లకు పోవుదురో వారు కృష్ణపక్షములో చంద్రుడు క్షీణించి అల్పుడగు నట్లు తేలికమై పోవుదురు.

శ్లో॥ శైలే శైలే న మాణిక్యం మౌక్తికం న గజే గజే ।
సాధవో న హి సర్వత్ర చందనం న వనే వనే॥ 9

అర్థము :- శైలే శైలే=ప్రతి పర్వతమునందును, మాణిక్యం = మాణిక్యము, న=ఉండదు, గజేగజే=ప్రతి యేనుగు నందును, మౌక్తికం= ముత్యము, న=పుట్టదు, సాధవః=సజ్జనులైనవారు, సర్వత్ర=అంతట, నహి = ఉండరు గదా! అట్లే, వనే వనే = ప్రతి అరణ్యమునందును, చందనం=గంధపుచెట్టు, న=ఉండదు.

తా॥ ప్రతిపర్వతమునందు మాణిక్యములుండవు. ప్రతి యేనుగు తల యందును ముత్యములు పుట్టవు-సాధువులు అన్నిచోట్ల నుండరు. ప్రతి అరణ్యమునందు మంచిగంధము చెట్టుండదు.

శ్లో॥ పుత్రాశ్చ వివిధైః శీలై ర్నియోజ్యాః సతతం బుధైః
నీతిజ్ఞాః శీలసంపన్నా భవన్తి కులపూజితాః॥ 10

అర్థము :- బుధైః=బుద్ధిమంతుల ద్వారా, పుత్రాః చ = బిడ్డలైన బాలబాలికలును, సతతం = ఎల్లపుడును, వివిధైః = అనేకవిధములగు, శీలైః=మంచిగుణములతో, నియోజ్యాః=నియుక్తులు కావలెను (మంచి గుణములను నేర్పవలెను), నీతిజ్ఞాః = నీతి నెఱింగినవారును, శీలసంపన్నాః = శీలసంపదకలవారు మాత్రమే, కులపూజితాః = కులమునందు (మానవసమాజమందు) పూజింపబడినవారు, భవన్తి=అగుచున్నారు.

తా॥ బుద్ధిమంతుల ద్వారా తమ బిడ్డలు ఎల్లపుడు వివిధములగు మంచిగుణములు గలవారుగా దిద్దబడవలెను, కులములో గుణవంతులే పూజింపబడుదురు కావున పిల్లలను గుణవంతుల జేయవలెను.

వివరణము :- శీలమన నేమో వ్యాసమహర్షి —

(మ. భా. అను. 124-66) లో

అద్రోహః సర్వభూతేషు కర్మణా మనసా గిరా ।
అనుగ్రహం చ దానం చ శీలమేతత్ప్రశస్యతే॥

తా॥ ప్రాణులన్నిటియందు మనోవాక్కాయ కర్మలతో ద్రోహము (వైరము) లేకుండుటయు, దయకలిగియుండుటయు, దానముచేయుటయు, శీలముగా ప్రశంసింపబడుచున్నది

శ్లో॥ మాతా శత్రుః పితా వైరీ యేన బాలో న పాఠితః ।
న శోభతే సభా మధ్యే హంస మధ్యే బకో యథా॥ 11

అర్థము :- యేన = ఏ తల్లిచేతగాని తండ్రిచేతగాని, బాలః = కుమారుడు, న పాఠితః=చదివింపబడడో, అట్టి, మాతా=తల్లి, శత్రుః= శత్రువు, పితా=తండ్రి, వైరీ=శత్రువు, అటుల చదివింపబడని బాలుడు, హంసమధ్యే = హంసల మధ్యలో, యథా=ఎట్లు, బకః = కొంగ, న శోభతే=ప్రకాశింపదో యట్లే, సభామధ్యే=సభలో, న శోభతే = ప్రకాశింపడు.

ఏ తల్లిదండ్రులు పిల్లలను జదివింపరో వారు శత్రువులు. కారణము హంసల మధ్యలో కొంగ రాణింపనట్లు ఆ చదువురాని బాలుడు సభా మధ్యలో రాణింపడు కావున అట్టి స్థితికి దెచ్చిన తల్లిదండ్రులు శత్రువులే. ఈ శ్లోకమును దయానందమహర్షి తన సత్యార్థప్రకాశము ద్వితీయ సముల్లాసములో బాలశిక్షాప్రకరణములో ఉద్ధరించినారు.

శ్లో॥ లాలనాద్బహవో దోషా స్తాడనాద్ బహవో గుణాః ।
తస్మాత్పుత్రం చ శిష్యంచ తాడయేన్న తు లాలయేత్ ॥ 12

అర్థము :- లాలనాత్ = గారాబము చూపుటవలన పిల్లలలో, బహవః = చాల, దోషాః = దోషములును, తాడనాత్ = దండించుటవలన, బహవః = చాల, గుణాః = గుణములును కలుగును, తస్మాత్ = అందువలన, పుత్రంచ = పుత్రుని, శిష్యంచ = శిష్యుని, తాడయేత్ = దండింపవలెను, న తు లాలయేత్ = గారాబము చూపరాదు.

తా॥ లాలన చేయుటవలన (బుజ్జగించుట) పిల్లలలో చాల దోషము లుత్పన్నములగును. దండించుట వలన చాల గుణములు గలుగును. కావున సంతానమును, శిష్యులను దండింపవలెనే కాని లాలింపరాదు.

వివరణము :- పతంజలి మహర్షి వ్యాకరణభాష్యము (8-1-8) లో

సామృతైః పాణిభిర్ఘ్నన్తి గురవో న విషోక్షితైః ।
లాలనాశ్రయిణో దోషాస్తాడనాశ్రయిణో గుణాః॥

తా॥ దండించుటవలన సంతానము శిష్యుడును దోషములేనివారును, గుణయుక్తులు నగుదురు. తల్లిదండ్రులు, అధ్యాపకులు అమృతమయము లగు హస్తములతో కొట్టుదురు. విషమయములగు చేతులతో కాదు. వారు ఈర్ష్యాద్వేషములతో కాక పైకి భయమును కనబఱచుచు లోపల దయ కలిగియుందురు.

శ్లో॥ శ్లోకేనవా తదర్ధేన పాదేనైకాక్షరేణ వా ।
అబన్ధ్యం దివసం కుర్యాద్ దానాధ్యయన కర్మభిః॥ 13

అర్థము :- శ్లోకేన = ఒక్క శ్లోకమును పఠించుట ద్వారా కాని చింతనచేయుట ద్వారా కాని మనన చేయుట ద్వారా కాని, లేక తదర్ధేన = సగము శ్లోకము ద్వారా కాని, పాదేన = ఒక పాదము ద్వారా కాని, ఏకాక్ష

రేణవా = ఒక యక్షరము ద్వారా కాని, దానాధ్యయన కర్మభిః = దానము, అధ్యయనము మొదలగు శుభకర్మల ద్వారా కాని, దివసం = దినమును, అబంధ్యం = సార్థకమైన దానినిగ, కుర్యాత్ = చేయవలెను. వ్యర్థపఱపరాదు.

తా॥ ఒక్క శ్లోకమును బాగుగా చదివి చింతనచేసి మాటి మాటికి మనన చేయుట ద్వారా కాని, సగము శ్లోకము ద్వారా కాని, ఒక పాదము (నాల్గవవంతు) ద్వారా కాని యొక యక్షరము ద్వారా కాని ప్రతిదినము స్వాధ్యాయము చేయవలెను. దానము, అధ్యయనము మొదలగు శుభ కర్మల ద్వారా దినమును సార్థకపఱపవలెను. వ్యర్థము చేయరాదు.

వివరణము :- దినమును సార్థకపఱచుటలో విదురుని వచనము— (విదురనీతి 3-67-68) లలో

దివసేనైవ తత్కుర్యాద్ యేన రాత్రౌ సుఖం వసేత్ ।
అష్టమాసేన తత్కుర్యాద్ యేన వర్షాః సుఖం వసేత్॥
పూర్వం వయసి తత్కుర్యాద్ యేన వృద్ధః సుఖం వసేత్॥
యావజ్జీవనే తత్ కుర్యాత్ యేన ప్రేత్య సుఖం వసేత్॥

తా॥ రాత్రి సుఖముగా నుండుటకు తగినట్లుగా పగలు పని చేయవలెను. ఆ పని వలన రాత్రి యే చింతయు లేక హాయిగా నిద్రపట్టవలెను ఇట్లే సంవత్సరములో నెనిమిది మాసములు ప్రయత్నముచేసి వర్షఋతువులో సుఖముగా నుండవలెను. పరలోకములో (పరజన్మలో) సుఖముగా నుండుటకు దగిన కర్మలను ఈ జన్మలో జీవితమంతయు ప్రయత్నింపవలెను.

శ్లో॥ కాంతా వియోగః స్వజనాపమానః
ఋణస్య శేషం కునృపస్య సేవా ।

దరిద్రభావో విషమా సభా చ

వినాఽగ్ని మేతే ప్రదహన్తి కాయమ్॥ 14

అర్థము :- కాంతా వియోగః భార్యా వియోగము, స్వజనాపమానః = తన బంధు బాంధవుల ద్వారా కలిగిన యనాదరము, ఋణస్య శేషం = ఋణశేషము, కునృపస్యసేవా = దుష్టరాజును సేవించుట, దరిద్రభావః = దారిద్ర్యము, చ = మఱియు, విషమా సభా = స్వార్థపరులసభయు, ఏతే = ఇవి యన్నియు, అగ్నిం వినా = అగ్ని లేకుండనే, కాయం = శరీరమును, ప్రదహన్తి = దహించుచున్నవి.

తా॥ భార్యా వియోగము, బంధు బాంధవుల అనాదరము, ఋణ శేషము, దుష్టరాజును సేవించుట, దారిద్ర్యము, అజ్ఞానులు స్వార్థపరులైన వారుగల సభ యివి యన్నియు అగ్ని లేకుండనే శరీరమును దహింప జేయును.

శ్లో॥ నదీతీరే చ యే వృక్షాః పరగేహేషు కామినీ ।

మంత్రిహీనాశ్చ రాజానః శీఘ్రం నశ్యన్త్య సంశయమ్॥ 15

అర్థము :- యే = ఏ, వృక్షాః = వృక్షములు, నదీతీరే = నదియొద్దున నున్నవో, చ = మఱియు, పరగేహేషు = ఇతరుల యిండ్లలో నుండునట్టి, కామినీచ = స్త్రీయు, మంత్రిహీనాః = మంత్రులు లేనట్టి, రాజానః = రాజులును, శీఘ్రం = మిక్కిలి త్వరగా, నశ్యన్తి = నశింతురు. అసంశయమ్ = సందేహము లేదు.

తా॥ నదియొద్దుననున్న చెట్లు, ఇతరుల యిండ్లలో నుండు స్త్రీ, మంత్రిలేని రాజులు, శీఘ్రముగా నశింతురు. ఇందులో సంశయము లేదు.

శ్లో॥ బలం విద్యా చ విప్రాణాం రాజ్ఞాం సైన్యం బలం తథా।

విత్తం బలం చ వైశ్యానాం శూద్రాణాం పరిచర్యకా॥ 16

అర్థము :- విప్రాణాం=బ్రాహ్మణులకు, బలం=బలము, విద్యా= విద్య, తథా = అట్లే, రాజ్ఞాం=రాజులకు, బలం=బలము, సైన్యం = సైన్యము, వైశ్యానాం=వైశ్యులకు, విత్తం = ధనము, బలం = బలము, శూద్రాణామ్ =శూద్రులకు, పరిచర్యికా=సేవ, బలమ్=బలము.

తా॥ బ్రాహ్మణులకు తేజస్సు విద్యయు, బలము, రాజులకు బలము సైన్యము, వైశ్యులకు బలము ధనము, గోసంరక్షణ మొదలైనవి, శూద్రులకు బలము సేవింపుటయు.

వివరణము :- విదురనీతి (2-73) లో—

హింసాబల మసాధూనాం రాజ్ఞాం దండవిధిర్బలమ్ ।
శుశ్రూషాతు బలం స్త్రీణాం క్షమా గుణవతాం బలమ్॥

తా॥ దుష్టులైన వారికి బలము హింసించుటయే. దండించుటయే రాజులకు బలము. శుశ్రూషచేయుటయే స్త్రీలకు బలము. గుణవంతులకు ఓర్పె బలము.

చాణక్య శతకము 1-81 లో

దుర్బలస్య బలం రాజా బాలానాం రోదనం బలమ్ ।
బలం మూర్ఖస్య మౌనిత్వం చోరాణామనృతం బలమ్॥

తా॥ రాజు దుర్బలులకు బలము, పిల్లలకు బలము ఏడ్చుట, మూర్ఖునకు బలము మౌనముగా నుండుట, దొంగలకు అబద్ధమాడుట బలము.

శ్లో॥ నిర్ధనం పురుషం వేశ్యా ప్రజా భగ్నం నృపం త్యజేత్ ।
ఖగా వీతఫలం వృక్షంభుక్త్వాచాఽభ్యాగతాగృహమ్॥ 17

అర్థము :- వేశ్యా=వేశ్య, నిర్ధనం = ధనహీనుడైన పురుషం = పురుషుని, ప్రజాః=ప్రజలు, భగ్నం=పరాజితుడైన లేక శక్తిహీనుడైన, నృపం=రాజును, త్యజేత్=విడువవలెను, ఖగాః=పక్షులు, వీతఫలం =

పండ్లులేని, వృక్షం=వృక్షమును, అభ్యాగతాః=అతిథులు, భుక్త్వా=భుజించిన తరువాత, గృహం=ఆ యింటిని, విడిచిపెట్టుచుందురు.

తా॥ వేశ్య ధనహీనుని, ప్రజలు ఓడిపోయిన రాజును విడుచుదురు. పక్షులు పండ్లులేని చెట్లను, అతిథులు భోజనముచేసిన యింటిని విడిచిపెట్టి వెళ్లుదురు.

శ్లో॥ గృహీత్వా దక్షిణాం విప్రా స్త్యజన్తి యజమానకమ్ ।
ప్రాప్తవిద్యాగురుంశిష్యాదగ్ధాఽరణ్యంమృగా స్తథా॥ 18

అర్థము :- విప్రాః = బ్రాహ్మణులు, దక్షిణాం = దక్షిణను, గృహీత్వా=తీసికొని, యజమానకం=యజమానుని, త్యజన్తి=విడుతురు, శిష్యాః=శిష్యులు, ప్రాప్తవిద్యా=విద్యను పొందినవారై, గురుం = గురువును, త్యజన్తి=విడుచుచున్నారు, తథా=అట్లే, మృగాః=లేళ్లు మొదలగు జంతువులు, దగ్ధారణ్యం=కాలిపోయిన యరణ్యమును విడిచిపెట్టును.

తా॥ బ్రాహ్మణులు దక్షిణ పుచ్చుకొని ఆ యజమానుని విడిచి వెళ్లుదురు. శిష్యులు విద్యనుపొంది గురువును విడిచిపెట్టుదురు. అట్లే మృగములు పశువులు దహింపబడిన వనమును విడుచును.

శ్లో॥ దురాచారీ చ దుర్దృష్టి ర్దురావాసీ చ దుర్జనః ।
యన్మైత్రీ క్రియతే పుంభిర్నరః శీఘ్రం వినశ్యతి॥ 19

అర్థము :- దురాచారీ = ఆచారవిహీనుడును, దుర్దృష్టిః = చెడ్డదృష్టిగలవాడును, దురావాసః=చెడ్డస్థలములందుండువాడును, చ = మఱియు, దుర్జనః=దుష్టుడు మొదలగు, పుంభిః=పురుషులతో, యన్నరః=ఏ మనుష్యుడు, మైత్రీ=స్నేహమును, క్రియతే=చేయునోవాడు, శీఘ్రం = శీఘ్రముగా, వినశ్యతి=నశించుచున్నాడు.

తా॥ ఆచారహీనుడు పతితుడునైన వానితోను, మంచిచూపులేని వానితోను, చెడ్డస్థలములో నుండు దుర్జనునితోను, స్నేహముచేయువాడు శీఘ్రముగా నశించును.

వివరణము :- ఈ శ్లోకము పూర్వార్ధములో సుందరమైన అను ప్రాసాలంకారము గలదు. చాణక్యుడు మఱొకచోట గూడ. దుర్జనుని దూరముగా నుంచుమని ఆదేశించెను. (చాణక్య శతకము - 3-35 లో)

దుర్జనః పరిహర్తవ్యో విద్యయాలంకృతోఽపి సన్ ।
మణినా భూషితః సర్పః కిమసౌ న భయంకరః॥

తా॥ విద్యగలవాడైనను దుర్జనుడు దూరముగా నుంచదగినవాడే. ఎట్లనగా మణికలిగియున్నను సర్పము భయంకరమైనదే గదా!

దుర్జనః ప్రియవాదీ చ నైవ విశ్వాసకారణమ్ ।
మధు తిష్ఠతి జిహ్వాగ్రే హృది హాలాహలం విషమ్॥

(చాణక్య శత. 3-28)

తా॥ దుర్జనుడు, ప్రియముగా మొగమిచ్చకమునకు మాట్లాడువాడు కూడ నమ్మదగనివాడు. అట్టి వానికి నాలుకచివర తేనెయు, హృదయమందు భయంకరమైన విషమునుండును.

శ్లో॥ సమానే శోభతే ప్రీతిః రాజ్ఞి సేవా చ శోభతే ।
వాణిజ్యం వ్యవహారేషు దివ్యా స్త్రీ శోభతే గృహే॥ 20

అర్థము :- ప్రీతిః=ప్రేమ, సమానే=సమానులయందు, శోభతే=ప్రకాశించును, రాణించును, చ=మఱియు, సేవా=సేవ, రాజ్ఞి=రాజునందు, శోభతే=ప్రకాశించును, వాణిజ్యం=వ్యాపారము, వ్యవహారేషు=వ్యవహా

రములందును (కృషిచేయుటలోను) గృహే=గృహమందు, దివ్యా=గుణ వంతురాలైనట్టి, స్త్రీ=స్త్రీ, శోభతే=ప్రకాశించుచున్నది.

తా॥ సమానమైన వారియందు ప్రీతిరాణించును. సేవించుట రాజు నందు శోభించును. వ్యవహారములందు (కృషిచేయుటలో) వాణిజ్యము (వ్యాపారము) శ్రేష్ఠము. ఇంటిలో మంచిగుణములుగల స్త్రీ శోభించును.

ద్వితీయాధ్యాయము సమాప్తము

# తృతీయాధ్యాయము

శ్లో॥ కస్య దోషః కులే నాస్తి వ్యాధినా కో న పీడితః ।
వ్యసనం కేన న ప్రాప్తం కస్య సౌఖ్యం నిరంతరమ్॥ 1

అర్థము :- కస్య=ఎవనియొక్క, కులే=కులమునందు, దోషః= దోషము, నాస్తి=లేదు? వ్యాధినా=వ్యాధిచేత, కః = ఎవడు, పీడితః= పీడింపబడినవాడు, న = కాదు, వ్యసనం = కష్టము, కేన = ఎవనిచేత, న ప్రాప్తమ్=పొందబడదు ? కస్య=ఎవనికి, నిరంతరం = ఎల్లపుడు, సౌఖ్యం=సౌఖ్యముండును ?

తా॥ ఎవని కులములో దోషములేదు ? వ్యాధిచే పీడింపబడని వాడెవడు ? కష్టము నెవడు పొందుటలేదు ? ఎవనికెల్లపుడు సుఖమున్నది ?

వివరణము :- ఎల్లపుడు నెవనికి సుఖముండును ? మేఘదూతము 2-49 లో —

కస్యాత్యన్తం సుఖముపనతం దుఃఖమేకాన్తతో వా ।
నీచైర్గచ్ఛత్యుపరి చ దశా చక్రనేమి క్రమేణ॥

తా॥ నియమముగా సుఖముకాని దుఃఖముకాని యెవని కెల్లప్పు డుండును? చక్రమునకు పైభాగమున చుట్టబడియున్న యినుప పట్టా యొకసారి పైకి యొకసారి క్రిందికి నెట్లు చక్రభ్రమణమునుబట్టి యుండునో యట్లే మానవజీవితములో కష్ట సుఖములుండును.

చక్రవత్పరివర్తన్తే దుఃఖాని చ సుఖాని చ ।

చక్రమువలె సుఖదుఃఖములు పరిభ్రమించుచుండును.

చక్రార పంక్తిరివ గచ్ఛతి భాగ్యపంక్తిః (స్వప్ననాటకము)

చక్రములోని ఆకుల వరుసవలె మనుష్యుని భాగ్యము మాఱు చుండును.

సుఖస్యానన్తరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖమ్ !
సుఖదుఃఖం మనుష్యాణాం చక్రవత్పరివర్తతః॥
(మ. భా. అను 174-19)

తా॥ సుఖము తరువాత దుఃఖము, దుఃఖము తరువాత సుఖము మనుష్యులకు సుఖదుఃఖములు చక్రమువలె నొకదాని తరువాత నొకటి మాఱుచు వచ్చుచుండును.

శ్లో॥ ఆచారః కులమాఖ్యాతి దేశమాఖ్యాతి భాషణమ్ ।
సంభ్రమః స్నేహమాఖ్యాతి వపురాఖ్యాతి భోజనమ్॥ 2

అర్థము :- ఆచారః=మనుష్యుని యొక్క యాచారము, కులం= కులమును-శీలమును, ఆఖ్యాతి=ప్రకటించును, భాషణం = మాట్లాడుట, దేశం=అతని దేశమును, ఆఖ్యాతి=చెప్పుచున్నది, సంభ్రమః = సమ్మా నము, స్నేహం=ప్రేమను, ఆఖ్యాతి=చెప్పుచున్నది, వపుః=శరీరము, భోజనం=అతని యాహారమును, ఆఖ్యాతి=వెల్లడించుచున్నది.

తా॥ ఆచారము ఆతని కులము (శీలము)ను దెలుపును, మాటలు ఆతని దేశమును దెలుపును. గౌరవాదులు స్నేహమును (ప్రేమను) దెలుపును. శరీరము యొక్క బల, హీనములు ఆతని అన్నాదుల దెల్పును.

వివరణము :- శరీరము కుష్కించుటను బట్టి యతని యాహార మును దెలిసికొనవచ్చును. ఇది యొక పూట భుజించు వారి విషయములో గాదు. ఒక పూట తినువారి భోజనము మంచిదో చెడ్డదో వారి శరీరము ద్వారా తెలియబడదు. మనుష్యుని యాహారము సాత్వికముగాను స్నిగ్ధము చమురు) కలదిగాను, రుచికరముగాను. అన్ని గుణములు సమపాళ్లలో నున్నది యైనచో శరీరము బలిష్ఠముగా నుండును. భోజ నము సరియైనది కానిచో చిక్కిపోవును. కావున మనుష్యుని శరీరస్థితిని గమనించి యాతని యాహారమును దెలిసికొనవచ్చును.

శ్లో॥ సుకులే యోజయేత్కన్యాంపుత్రంవిద్యాసుయోజయేత్ ।
వ్యసనే యోజయేచ్ఛత్రుంమిత్రంధర్మేనియోజయేత్ ॥3

అర్థము :- కన్యాం=పుత్రికను, సుకులే = మంచిసంప్రదాయము గల కుటుంబమున, యోజయేత్ = చేర్చవలెను. (పెండ్లిచేయవలెను), పుత్రం=కుమారుని, విద్యాసు = విద్యలయందు, యోజయేత్ =అభ్యసించు వానినిగా చేయవలెను, శత్రుం=శత్రువును, వ్యసనే=దుఃఖమునందు (కష్టమనుభవించునట్లు), యోజయేత్ = చిక్కుకొనునట్లు చేయవలెను, మిత్రం = స్నేహితుని, ధర్మే = ధర్మమునందు ప్రవర్తించు వానినిగా, వియోజయేత్=నియుక్తుని చేయవలెను.

తా॥ కన్యను ఉత్తమవంశములోని వానికిచ్చి పెండ్లిచేయవలెను. పుత్రుని విద్యలయందాసక్తికలవానినిగా జేయవలెను. శత్రువును కష్ట

ములు, దుఃఖములు పొందువానినిగా జేయవలెను. మిత్రుని ధర్మమార్గమున నడచువానినిగా జేయవలెను.

శ్లో॥ దుర్జనస్య చ సర్పస్య వరం సర్పో న దుర్జనః ।
సర్పోదంశతి కాలేన దుర్జనస్తు పదే పదే॥ 4

అర్థము :- దుర్జనస్య = దుర్జనునియొక్కయు, చ = మఱియు, సర్పస్య=సర్పముయొక్కయు మధ్య (ఆ రెంటిలో), సర్పః = పాము, వరం=శ్రేష్ఠమైనది, దుర్జనః=దుర్జనుడు, న = కాదు, కారణమేమనగా, సర్పః=పాము, కాలేన=కఱచుటకు దగిన కాలముననే, దంశతి = కాటు వేయును, దుర్జనస్తు=దుర్జనుడైనచో, పదే పదే = అడుగడుగునను హాని కలిగించును.

తా॥ దుర్జనుని సర్పమును పోల్చిచూచినచో సర్పమే శ్రేష్ఠమైనది. సర్పము దానిని జూచి కాని చూడక కాని త్రొక్కినచో యొత్తిడిచేసినట్టి సమయముననో తప్ప తక్కిన సమయములలో కాటువేయదు. దుర్జను డట్లు కాక యడుగడుగునను చెడును గలిగించు ప్రయత్నము చేయుచుండును.

వివరణము :- దుర్జనుని గుణమెట్టిదో చూడుడు—చాణక్య రాజనీతి శాస్త్రము 3-32 లో —

దుర్జనస్య ముఖే ప్రీతి ర్వాణీ చందనశీతలా ।
హృదయే తస్య దుర్బుద్ధేః కులిశాదపి కర్కశమ్॥

తా॥ దుర్మార్గుని నోటిలో ప్రియమైనట్టియు, గంధమువలె చల్లనైనట్టియు మాటలుండును. ఆ దుష్టుని హృదయములో వజ్రాయుధమునకు మించిన కాఠిన్యముండును.

శ్లో॥ ఏతదర్థం కులీనానాం నృపాః కుర్వన్తి సంగ్రహమ్।
ఆదిమధ్యావసానేషు న త్యజన్తి చ తే నృపమ్॥ 5

అర్థము :- నృపాః=రాజులు, కులీనానాం=సత్కులమున పుట్టిన వారియొక్క, సంగ్రహం=సంగ్రహమును (సమకూర్చుటను) ఏతదర్థం= ఇందుకొఱకే, కుర్వన్తి = చేయుచున్నారు, తే = అట్టివారు, నృపం = రాజును, ఆదిమధ్యాఽవసానేషు = మొదటకాని, మధ్యకాని చివరకాని, చ=కూడ, నత్యజన్తి=విడిచిపెట్టరు.

తా॥ రాజులు మంచివంశమువారిని తమదగ్గఱకు చేర్చుకొందురు. అట్టి మంచివంశమువారు ఆ రాజును మొదట కాని, మధ్యలో కాని, చివరకు కాని, యే స్థితిలోను విడువక యంటిపెట్టుకొని యుందురు.

వివరణము :- మంచివంశము వారి (కులీనుల) సంబంధము నాశనము నుండి రక్షించును—

కులీనైః సహ సమ్పర్కం పండితైః సహ మిత్రతామ్ ।
జ్ఞాతిభిశ్చ సమం మేలం కుర్వాణో న వినశ్యతి॥
(చాణక్య నీతిశాస్త్రము-56)

మంచివంశమువారితో సంబంధము, పండితులతో మైత్రి, బంధువులతో కలసిమెలసి యుండుటయు కలిగిన మనుజు డెన్నడు నష్టముపొందడు.

శ్లో॥ ప్రలయే భిన్న మర్యాదా భవన్తి కిల సాగరాః ।
సాగరా భేదమిచ్ఛన్తి ప్రలయేఽపి న సాధవః॥ 6

అర్థము :- సాగరాః=సముద్రములు, ప్రలయే=ప్రలయకాలమున, కిల=నిశ్చయముగా, భిన్నమర్యాదాః=హద్దునుదాటునవి, భవన్తి = అగుచున్నవి, సాగరాః = సముద్రములు, భేదం = ఒడ్డును వేఱుచేయుటను, ఇచ్ఛన్తి = కోరుచున్నవి (చేయుచున్నవి), సాధవః = సాధువులు (సజ్జనులు), ప్రలయేఽపి = ప్రలయకాలమందుకూడ, న = తమ మర్యాదను అతిక్రమింపరు.

తా॥ ప్రలయకాలమందు సముద్రములు తమ చెలియలికట్ట నతిక్ర మించును. సముద్రములు తమ స్థానమునుండి వేఱగునవియగును. కాని సాధువులు ప్రలయము సంభవించినను (గొప్ప ఆపదలు) తాము మర్యాదను విడువరు.

వివరణము :- సజ్జనుల శీలము చూడుడు—

దుర్జన వచనాంగారైర్దగ్ధోఽపి న విప్రియం వదత్యార్యః।
అగరు రపి దహ్యమానః స్వభావగంధం పరిత్యజతి కిం ను॥

దుర్జనుల యొక్క మాటల రూపాగ్నితో కాల్చబడినను ఆర్యుడు తప్పుడు మాటలాడడు. అగరువత్తి అగ్నిచే కాల్చబడుచున్నను తన స్వాభావిక సుగంధమును విడిచిపెట్టదు గదా! అట్లే ఆర్యుడును.

శ్లో॥ మూర్ఖస్తు పరిహర్తవ్యః ప్రత్యక్షో ద్విపదః పశుః।
భినత్తి వాక్శల్యేన అదృష్టః కంటకో యథా॥ 7

అర్థము :- మూర్ఖస్తు=మూర్ఖుడైతే, పరిహర్తవ్యః = విడిచిపెట్ట దగినవాడు, అతడు, ప్రత్యక్షః=ప్రత్యక్షమైన, ద్విపదః =రెండుకాళ్లును, పశుః=పశువు, వాడు, వాక్శల్యేన=బాణములవంటి మాటలతో, భినత్తి= బాధించును, అదృష్టః=కనబడకుండునట్టి, కంటకః=ముల్లు, యథా=ఎట్లు బాధించునో వాడట్లు బాధించును.

తా॥ మూర్ఖుడు ద్విపాదపశువగుటచే నతనిని దూరముగా నుంచ వలెను. కనబడని ముల్లు ఎట్లు బాధించునో యా మూర్ఖుడు వాగ్రూప బాణములతో నటుల బాధించును.

శ్లో॥ రూపయౌవన సంపన్నాః విశాలకుల సంభవాః।
విద్యాహీనా న శోభన్తే నిర్గన్ధా ఇవ కింశుకాః॥ 8

అర్థము :- రూపయౌవన సంపన్నాః = రూపము, యౌవనము, కులము అను సంపదలు కలవారైనను, విశాల కులసంభవాః = గొప్ప కుటుంబములో పుట్టినవారైనను, విద్యాహీనాః=విద్యలేనివారు, నిర్గంధాః= సువాసనలేని, కింశుకాః = మోదుగు పుష్పములవలె, న శోభన్తే=ప్రకాశింపరు, రాణింపరు.

తా॥ అందమైన శరీరము యౌవనము కలిగి గొప్పకులములో బుట్టినవారైనను విద్యలేనివారైనచో వారు (సుగంధము) మంచివాసనలేని మోదుగు పుష్పములవలె రాణింపరు.

శ్లో॥ కోకిలానాం స్వరోరూపం స్త్రీణాం రూపం పతివ్రతమ్ ।
విద్యా రూపం కురూపాణాం క్షమా రూపం
తపస్వినామ్॥ 9

అర్థము :- కోకిలానాం = కోయిలలకు, స్వరం = కంఠధ్వని, రూపం = రూపము. స్త్రీణాం = స్త్రీలకు, పతివ్రతం = పాతివ్రత్యము, రూపం=రూపము, కురూపాణాం = అందవిహీనులకు విద్యా = విద్య, రూపం=రూపము, తపస్వినాం=తపోవంతులకు, క్షమా=ఓర్పు, (సహనము), రూపమ్=రూపము.

తా॥ కోకిలలకు వాని స్వరమే అందమైన రూపము. స్త్రీలకు పాతివ్రత్యమే మంచియందము. శారీరకముగా నందములేనివారికి విద్యయే రూపము. తపోవంతులకు క్షమయే రూపము. (అందము)

శ్లో॥ త్యజేదేకం కులస్యాఽర్థే గ్రామస్యాఽర్థే కులం త్యజేత్ ।
గ్రామం జనపదస్యాఽర్థే ఆత్మాఽర్థే పృథివీం త్యజేత్ ॥ 10

అర్థము :- కులస్యార్థే = కులము యొక్క రక్షణకు, ఉన్నతికి, వృద్ధికి, సుఖశాంతులకొఱకు, ఏకం=పురుషు నొకనిని, త్యజేత్ = విడువ

వలెను, గ్రామస్యార్థే=గ్రామము కొఱకు, కులం=కులమును, త్యజేత్ = విడువవలెను, జనపదస్యార్థే=జనులుండు ప్రదేశము యొక్క మేలుకొఱకు, గ్రామం=గ్రామమును విడువవలెను, ఆత్మార్థే = ఆత్మోన్నతి కొఱకు, పృథివీం=భూమండలము నంతటిని, త్యజేత్=విడువవలెను.

తా॥ కులముయొక్క రక్షణ, యభివృద్ధి మొదలగువాని కొఱకు నొకనిని విడిచిపెట్టుటకు సిద్ధపడవలెను. గ్రామవృద్ధికొఱకు కులమును విడువవలెను. దేశాభివృద్ధికొఱకు గ్రామమును విడువవలెను ఆత్మరక్షణ కొఱకు నభివృద్ధికొఱకు నంపూర్ణ భూమండలమును విడిచిపెట్టుటకు సిద్ధ పడవలెను. నందేహింపరాదు.

వివరణము -: ఈ శ్లోకములో కులము, గ్రామము, దేశము, ఆత్మ మొదలగునవి యొకదానికంటె నొకటి శ్రేష్ఠమని చూపుటకు స్వర్ణసిద్ధాన్తమును ప్రతిపాదించెను. (లోహములలో నొకదానికంటె మఱి యొకటి గొప్పదై చివరికి బంగారము గొప్పదియైనట్లు) అన్నిటికంటె ఆత్మ గొప్పదని వివరించెను.

శ్లో॥ ఉద్యోగే నాస్తి దారిద్ర్యం జపతో నాస్తి పాతకమ్।
మౌనే చ కలహో నాస్తి నాస్తి జాగరితే భయమ్॥1 1

అర్థము :- ఉద్యోగే = ప్రయత్నమునందు (అనగా ప్రయత్నము చేయువానికి) , దారిద్ర్యం=దారిద్ర్యము, నాస్తి=లేదు: జపతః = ఈశ్వరుని ఓ౩మ్ నామము జపించుటవలన, పాతకం=పాపము నాస్తి = ఉండదు, చ=మఱియు, మౌనే = మౌనమునందు (అనగా మౌనముగా నున్నచో), కలహః = కలహము, విరోధము, నాస్తి = కలుగదు, జాగరితే=మేల్కొనిన వానియందు, భయం=భయము: నాస్తి=ఉండదు.

తా॥ పురుషుడు ప్రయత్నము చేయుచున్నచో నాతనికి దారిద్ర్యము లేదు. ఈశ్వరుని ముఖ్యనామమగు ఓ౩మ్‌ను అర్థసహితముగ జపించుచు

న్నచో నితరులతో కలహమురాదు. మేల్కొనియున్నచో నెవనివలనను భయముండదు.

వివరణము :- పురుష ప్రయత్నమున్నచో దారిద్ర్యముండదు—

ఉద్యోగః ఖలు కర్తవ్యః ఫలం మార్జారవద్భవేత్ ।
జన్మప్రభృతి గౌర్నాస్తి పయః పిబతి నిత్యశః॥

నిత్యము ప్రయత్నము చేయుచున్నచో తప్పక ఫలము లభించును. పిల్లికి చిన్నప్పటినుండియు దగ్గఱ తనకు ఆవు లేకున్నను నిత్యము ప్రయత్నముచేసి పాలుత్రాగుచునే యున్నది.

జపించువానికి పాపమంటదు—

జకారో జన్మవిచ్ఛేదః పకారః పాపనాశకః ।
తస్మాజ్జప ఇతి ప్రోక్తో జన్మ పాపవినాశకః॥

జకారము జన్మకలుగకుండజేయును. పకారము పాపమును నశింపజేయును. జన్మము, పాపము రెంటిని నాశముచేయునది కావున జపమందురు. పరమాత్ముని నామము లన్నింటిలో మూగవాడు కూడ పలుకదగిననామము 'ఓమ్' అనునది శ్రేష్ఠమైనది. అందుచేత 'ఓమ్'నే జపింపవలెను. చాణక్యుడు—

ఓంకార శబ్దో విప్రాణాం యస్య రాష్ట్రే ప్రవర్తతే ।
స రాజా హి భవే ద్యోగీ వ్యాధిభిశ్చ న పీడ్యతే॥
(చాణక్య రాజనీతి శాస్త్రము 4-9)

ఏ రాజు యొక్క రాజ్యములో బ్రాహ్మణులు ఓంకార శబ్దమును ప్రతిధ్వనింపజేయుదురో ఆ రాజు యోగి యగును. వ్యాధులచే పీడింపబడని వాడగును.

శ్లో॥ అతిరూపేణ వై సీతా అతి గర్వేణ రావణః॥
అతిదానం బలిర్దత్త్వా అతి సర్వత్ర వర్జయేత్॥ 12

అర్థము - అతిరూపేణ = మిక్కిలి సౌందర్యముచేత సీతయు, అతిగర్వేణ=మిక్కిలి గర్వముచేత, రావణః = రావణుడును, బలిః = బలిచక్రవర్తి, దానం=దానమును, అతి=అధికముగా, దత్త్వా=ఇచ్చియు, బంధనము పొందిరి. ఇందువలన, సర్వత్ర=అంతటను, అతి = అతిని (అనగా శక్తికి మించిన దానిని) వర్జయేత్=విడిచిపెట్టవలెను.

తా॥ అతి సౌందర్య కారణముచేత సీత అపహరింపబడెను. గర్వాతిశయముచే రావణుడు చంపబడెను. అధికముగా దానముచేయుటచే బలిచక్రవర్తి బంధనములలో బడెను. ఈ దృష్టాంతములవలన అతిగా ప్రవర్తించుట కూడదని నిర్ధారణ యగుచున్నది.

శ్లో॥ కో హి భారః సమర్థానాం కిం దూరం వ్యవసాయినామ్।
కో విదేశః సవిద్యానాం కః పరః ప్రియవాదినామ్॥ 13

అర్థము :- సమర్థానాం = శక్తిమంతులకు, కోహి = ఏ పని, భారః=కఠినమగును, వ్యవసాయినాం = వ్యాపారము చేయువారికి, కిం= ఏ స్థానము, దూరం = దూరమగును ? సవిద్యానాం = విద్వాంసులకు, విదేశః=పరదేశము, కః=ఏది యగును ? ప్రియవాదినామ్=మధురముగా మాట్లాడువారికి, పరః=ఇతరుడు, కః=ఎవ్వడు ?

తా॥ శక్తిసంపన్నులకు నే పనియు భారముకాదు. వ్యాపారము చేయువారికి దూరమేయుండదు. విద్వాంసులకు స్వదేశమనియు పరదేశమనియు భేదముండదు. మధురముగా మాట్లాడువారి యెడల తన పరభేదముండదు.

శ్లో॥ ఏకేనాఽపి సువృక్షేణ పుష్పితేన సుగన్ధినా ।
వాసితం తద్వనం సర్వం సుపుత్రేణ కులం తథా॥ 14

అర్థము : పుష్పితేన=పుష్పించినట్టియు, సుగంధినా = సువాసన గలిగినట్టియు, సువృక్షేణ=మంచివృక్షముతో, ఏకేనాపి = ఒక్కదానితో నైనను, తద్వనం=ఆ వనము, సర్వం=సమస్తము, వాసితం = సువాసన గలదియగును తథా=అట్లే. సుపుత్రేణ = మంచిపుత్రునితో, కులం = కులమంతయు నలంకరింపబడును.

తా॥ సుపుత్రు డొక్కడైనను తనవంశమునకు ప్రతిష్ఠాదులు కలిగించునట్లు సువాసనగల పూలతోగూడిన వృక్షమొక్కటియైనను ఆ వనము నంతటిని సువాసన కలదానినిగా జేయును.

శ్లో॥ ఏకేన శుష్కవృక్షేణ దహ్యమానేన వహ్నినా ।
దహ్యతే తద్వనం సర్వం కుపుత్రేణ కులం తథా॥ 15

అర్థము - వహ్నినా = అగ్నిచేత, దహ్యమానేన = కాల్చబడు చున్న, ఏకేన = ఒక్కటైన, శుష్కవృక్షేణ = ఎండిన చెట్టుచేత, తద్వనం=ఆ వనము; సర్వం= అంతయు, దహ్యతే = కాల్చబడుచున్నది, తథా = అట్లే, కుపుత్రేణ = చెడ్డపుత్రునిచేత, కులం = కులమంతయు నప్రతిష్ఠపాలగును.

తా॥ అడవిలోనున్న యెండుచెట్టుకాలి యా యడవిని నంతటి నెట్లు దహించునో యట్లే వంశములో నొక్క దుష్టపుత్రుడున్నచో నాతనివలన ఆ వంశమంతయు దుష్టమైనదిగా మాఱిపోవును.

శ్లో॥ ఏకేనాఽపి సుపుత్రేణ విద్యాయుక్తేన సాధునా ।
ఆహ్లాదితం కులం సర్వం యథా చంద్రేణ శర్వరీ॥ 16

అర్థము :- విద్యాయుక్తేన = విద్యచే నలంకరింపబడినట్టియు, సాధునా=సజ్జనుడైనట్టియు, ఏకేనాపి = ఒక్కడైనను, సుపుత్రేణ = సుపుత్రునిచేత, సర్వంకులం=కులమంతయు, యథా = ఎట్లు, శర్వరీ = రాత్రి, చంద్రేణ = చంద్రునిచేత ప్రకాశింపచేయబడుచున్నదో యట్లే, ఆహ్లాదితం=సంతోషపెట్టబడును

తా॥ విద్యాయుక్తుడైన సాధువగు నొక్క కుమారుడున్నను ఆ వంశము సంతోష సముద్రములో నోలలాడును. చంద్రోదయముచేత రాత్రి యెట్లు ప్రకాశించునో ఆ సుపుత్రునితో ఆ వంశము ప్రసిద్ధమగును.

శ్లో॥ కిం జాతైః బహుభిః పుత్రైః శోకసంతాపకారకైః।
వరమేకః కులాఽఽలంబీ యత్ర విశ్రామ్యతే కులమ్॥ 17

అర్థము :- శోకసంతాపకారకైః = దుఃఖముచేత బాధించునట్టి, బహుభిః=అనేకులగు, పుత్రైః = పుత్రులు, జాతైః = పుట్టినట్టివారితో, కిమ్=ఏమి ప్రయోజనము ? యత్ర = ఎవని యాశ్రయమున, కులం = కులమంతయు, విశ్రామ్యతే=విశ్రాంతిని, సుఖమునుపొందునో, అట్టివాడు, కులాలంబీ=కులమునంతటికి నాధారమైనవాడు వరం = శ్రేష్ఠుడైనవాడు, ఏకః=ఒక్కడే చాలును.

తా॥ శోకమును, సంతాపమును, హృదయక్షోభను గలిగించునట్టి పుత్రు లెందఱుండి ప్రయోజనమేమి ? వంశమున కాధారభూతుడగు నొక్కపుత్రుడు శ్రేష్ఠుడుచాలు. అతని యాశ్రయమువలన వంశమంతయు విశ్రాంతిగ సుఖము ననుభవించును.

వివరణము :- స్త్రీలు శ్రేష్ఠులైన పుత్రుల గనవలెను. పిఱికివారిని గనరాదు —

నిరుత్సాహం నిరానందం నిర్వీర్యమరినందనమ్ ।
మా స్మ సీమన్తినీ కాచిజ్జనయేత్ పుత్రమీదృశమ్॥

ఏ స్త్రీ కూడ ఉత్సాహ శూన్యుని, ఆనందము లేనివానిని, శక్తి విహీనుని, శత్రువుల కానందము కలిగించు పుత్రుని కనరాదు.

శ్లో॥ లాలయేత్ పంచవర్షాణి దశవర్షాణి తాడయేత్ ।
ప్రాప్తే తు షోడశే వర్షే పుత్రం మిత్ర వదాచరేత్ ॥ 18

అర్థము :- పుత్రం = కుమారుని, పంచవర్షాణి = అయిదేండ్లు, లాలయేత్ = బుజ్జగించుచు లాలించవలెను, దశవర్షాణి = పదేండ్లు వచ్చు వఱకు, తాడయేత్ = దండింపవలెను, షోడశేవర్షే = పదునాఱవ సంవత్సరము, ప్రాప్తేతు = ప్రాప్తింపగా, మిత్రవత్ = స్నేహితునివలె, ఆచరేత్ = వ్యవహరింపవలెను.

తా॥ అయిదు సంవత్సరముల వయస్సు వఱకు పుత్రుని లాలించి ముద్దుపెట్టుకొనవలెను. పది సంవత్సరముల వయస్సు వచ్చువఱకు మంచిమార్గమున నడపించుటకై భయపెట్టుటకు కొట్టవలెను. పదునాఱవ సంవత్సరము వచ్చిన తరువాత పుత్రుని మిత్రునివలె సమానునిగ చూడవలెను.

శ్లో॥ ఉపసర్గేఽన్య చక్రే చ దుర్భిక్షే చ భయావహే ।
అసాధుజన సంపర్కే యః పలాయేత్ స జీవతి॥ 19

అర్థము :- ఉపసర్గే = అధిదైవికములైన- అతివృష్టి అనావృష్టి మొదలైనవి, అధిభౌతికములైన యుద్ధాదులు సంభవించినపుడు, చ = మఱియు రోగాదులు కలిగినపుడును, అన్యచక్రే = శత్రువులు దురాక్రమణ చేసినపుడును. చ = అట్లే, భయావహే = భయావహములగు, దుర్భిక్షే = కఱవు మొదలైనవి సంభవించినపుడును, అసాధుజన సంపర్కే = దుష్టుల సంబంధమేర్పడినపుడు, యః = ఎవడు, పలాయేత్ = పాఱిపోవునో (వాని యందు చిక్కువడడో) సః = అట్టివాడు, జీవతి = జీవించుచున్నాడు.

తా॥ అతివృష్టి అనావృష్టి మొదలగు అధిదైవికములగు కష్టములు, యుద్ధాదులైన అధిభౌతికములగు కష్టములు, కలరా, మశూచి మొదలగు సంటువ్యాధులు, శత్రువుల దురాక్రమణము, భయమును గలిగించు కలవుకాటకములు, దుష్టులసంపర్కము కలిగినపు డెవరు పాటింపకుందురో వారు జీవింతురు.

శ్లో॥ ధర్మార్థ కామమోక్షాణాం యస్యైకోఽపి న విద్యతే।
జన్మజన్మని మర్త్యేషు మరణం తస్య కేవలమ్॥ 20

అర్థము :- యస్య=ఎవనికి, ధర్మార్థ కామమోక్షాణాం=ధర్మము, అర్థము, కామము. మోక్షము అను నాలుగు పురుషార్థములలో, ఏకోఽపి= ఒక్కటికూడ, న విద్యతే = తెలియబడదో, తస్య = అట్టివానికి, జన్మ జన్మని=ప్రతిజన్మయందును, మర్త్యేషు = మరణశీలురగు మానవులలో, మరణం=మరణము, కేవలం=ఒక్కటియే యుండును (లభించును).

తా॥ ధర్మార్థ కామమోక్షములను నాల్గింటిలో నొక్కదానినిగూడ నెవ్వడెఱుగడో వాడు మనుష్యులలో మాటి మాటికి పుట్టి చచ్చుచుండును. ఆతనికి సుఖముకాని ఆనందము కాని కలుగదు.

శ్లో॥ మూర్ఖా యత్ర న పూజ్యన్తే ధాన్యం యత్ర సుసంచితమ్।
దంపత్యోః కలహో నాఽస్తి తత్ర శ్రీః స్వయమాగతా॥21

అర్థము :- యత్ర=ఎక్కడ, మూర్ఖాః=మూర్ఖులు, న పూజ్యన్తే= పూజింపబడరో, యత్ర=ఎక్కడ, ధాన్యం = ఆహారాది ధాన్యము, సు సంచితమ్=ఎక్కువగా ప్రోగుచేయబడినదో, యత్ర = ఎచ్చట, దంప త్యోః=దంపతులకు, కలహః = కలహము, నాస్తి = లేదో, తత్ర = అచ్చట, శ్రీః=సంపద, లక్ష్మి, స్వయం=తనంతటతాను, ఆగతా=వచ్చి నివసించును.

తా॥ ఎచ్చట మూర్ఖులు పూజింపబడరో, ఎక్కడ పుష్కలముగా ధాన్యము పండునో, ఎచ్చట దంపతులకు కలహముండదో యచటకు లక్ష్మి స్వయముగా వచ్చును. (ఉండును)

వివరణము :- మూర్ఖులను పూజించుచోటికి లక్ష్మిరాదు. అక్కడ వినాశము తాండవమాడును —

అపూజ్యా యత్ర పూజ్యన్తే పూజనీయో న పూజ్యతే ।
త్రీణి తత్ర ప్రవర్తన్తే దుర్భిక్షం మరణం భయమ్॥
(స్కంధపురాణము-మాహేశ్వర ఖండము 3-45)

పూజింపదగనివారిని పూజించుచు, పూజింపదగినవారిని పూజింపకుండుటయు జరుగునో యచట కఱవు, అకాలమృత్యువు, భయము స్థిరపడును. లక్ష్మి యెచ్చట నుండు ననగా పతి పత్నులు తగవులాడనిచోట లక్ష్మి చెప్పినదట— 'వసామి నారీషు పతివ్రతాసు' - (మహా. భార. అనుశా. 11-14) నేను పతివ్రతలగు స్త్రీలలో నుందునని

'దంపత్యోః సమతా నాస్తి యత్ర యత్ర హి మందిరే'

అలక్ష్మీస్తత్ర తత్రైవ విఫలం జీవనం తయోః॥ (బ్రహ్మ పురాణ కృష్ణ-69-64) ఏ యింటిలో దంపతులలో కలయిక యుండదో యచట దారిద్ర్యముండి వారి జీవనము వ్యర్థమగును.

తృతీయాధ్యాయము సమాప్తము

## చతుర్థాధ్యాయము

శ్లో॥ ఆయుః కర్మ చ విత్తం చ విద్యా నిధనమేవ చ ॥
పంచైతాని హి సృజ్యన్తే గర్భస్థస్యైవ దేహినః॥ 1

అర్థము :- ఆయుః=గర్భము మొదలు మరణము వఱకు నున్న స్థితి ఆయువు, చ=అట్లే, కర్మ = కర్మయు, విత్తం = ధనము, చ = మఱియు, విద్యా=విద్యయు, చ=మఱియు, నిధనమేవ=మరణము అను, ఏతాని పంచ=ఈ అయిదును, దేహినః=దేహధారియైన జీవునకు, గర్భస్థస్యైవ=గర్భమునందున్నవానికే, సృజ్యన్తే హి=సృజింపబడును గదా! నిశ్చయింపబడియ ండును.

తా॥ ఆయుస్సు అనగా గర్భధారణ లేక జన్మ మొదలు మృత్యు పర్యంతమున్న సమయము, అట్లే కర్మయు, ధనము, విద్యయు, మృత్యువు - ఈ అయిదును శరీరధారియగు జీవునకు గర్భములో నుండ గానే నిశ్చయింపబడును.

వివరణము :- పూర్వజన్మ కర్మఫలము నిశ్చితపద్ధతిలో సంభవించును. మహర్షి పతంజలి—

సతిమూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః॥ (యోగదర్శనము 2-13)

అవిద్య మున్నగు పంచక్లేశ రూపమూల మున్నంతవఱకు దానిఫలమగు జాతి అనగా పశు పక్షి మనుష్య మొదలగు పుట్టుక: ఆయువు అనగా జీవిత పరమావధి: భోగమనగా సుఖ దుఃఖముల చక్రభ్రమణము అను మూడింటిలో జాతి నిశ్చయముగా కనబడుచునే యుండును. దీనిని మార్చలేము. మిగిలిన ఆయుస్సును భోగమును పురుష ప్రయత్నముచే మార్చబడుచున్నవి.

ఆయుస్సు - కాలమృత్యువు: అకాలమృత్యువు కూడ కలుగును.

ఏకోత్తరం మృత్యుశత మథర్వాణః ప్రచక్షతే ।
తత్రైకః కాలసంజ్ఞస్తు శేషా ఆగన్తవాః స్మృతాః (సుశ్రుతము)

అథర్వవేద వేత్తలు మనుష్యునకు జీవనములో 101 సార్లు మృత్యువగుననిరి. వానిలో నొకటి కాలమృత్యువగు ననిరి. వానిలో నొకటి మాత్రము కాలమృత్యువు, మఱియు మిగిలినవి అకాలమృత్యువులు.

వైద్యశాస్త్రము అపమృత్యువు=అకాలమృత్యువును సిద్ధింపజేయు చున్నది. అపమృత్యువు లేనిచో వైద్యశాస్త్రము యొక్క యావశ్యకతయే యుండదు. శుద్ధమైన అన్నపానాదులు, సదాచారమువలన ఆయుస్సు పెరుగును. అశుద్ధమగు అన్నపానాదుల వలనను దురాచారాదుల వలనను ఆయుస్సు క్షీణించును.

కర్మము :- మానవునకు కర్మలు స్వతః సిద్ధముగానే నిశ్చితములై యీ కర్మ యీ వ్యక్తి చేయవలయును అని యున్నచో శాస్త్రోపదేశము వ్యర్థమగును. కర్మలు నిశ్చితములేయైనచో జీవునకు పాపపుణ్య కర్మల ఫలము అంటరాదు. కారణము జీవుడు తన యిష్టానుసారము చేయక పరవశుడై పూర్వనిశ్చితములనే చేసెను కావున నతడు బాధ్యుడు కాక పోవలసివచ్చును.

ధనము :- ధనప్రాప్తియు నిశ్చితమైయున్నచో ధనముకొఱకు వ్యాపారము, నౌకరి. వ్యవసాయము మొదలగు పురుష ప్రయత్నములు వ్యర్థము. ఎవనికెట్లు జరుగవలెనో యట్లే జరుగునని ప్రయత్నములు మానవలెను.

విద్యా :- ఎవని కెంత విద్య కలుగవలెనో నిశ్చితమైయున్నచో విద్యాలయములు, మహావిద్యాలయములు, విశ్వవిద్యాలయములు మూసి వేయవలెను. చదువుట వ్రాయుటయు నావశ్యకములు కావు. మనుష్యుడు జ్ఞానిగా తనంతట తానేయగును.

మృత్యు విచక్షణ ఆయువునుగూర్చి వ్రాసిన దానితోనే సరి సరిపోవును.

మనుష్యుడు తన భాగ్యమునకు స్వయముగానే నిర్మాతయగును. తన పురుష ప్రయత్నముతోనే ధనము, విద్య మొదలగు వానిని పొందును.

శ్లో॥ సాధుభ్యస్తే నివర్తన్తే పుత్రా మిత్రాణి బాంధవాః ।
యే చ తైః సహ గన్తారస్తద్ధర్మాత్సుకృతం కులమ్॥ 2

అర్థము :- పుత్రాః=పుత్రులు, మిత్రాణి=మిత్రులు, బాంధవాః= బంధువులు, తే = అనువారందఱు, సాధుభ్యః = మంచివారినుండి, నివర్తన్తే=విముఖులుగా నుందురు, చ=మఱియు, యే=ఎవరు, తైః సహ= ఆ సాధువులతోకూడ, గన్తారః=అనుసరించుచుందురో వారు, తద్ధర్మాత్ = ఆ పుణ్యమువలన, కులమ్=కులము, కుటుంబము, సుకృతమ్=ధన్యమైన దగును, పుణ్యవంతమగును.

తా॥ ఎవరు సాధువుల ననుసరించుచు వారితో సత్సంగము జేయుదురో వారికి ననుకూలముగా నాచరింతురో యా పుణ్యమున వారి పరివారము (కుటుంబము) పుణ్యముకలది యగును. అటులకాని వారి పుత్రులు, మిత్రులు, బంధు బాంధవులు సాదువులనుండి దూరముగా నుందురు.

శ్లో॥ దర్శన ధ్యాన సంస్పర్శైర్మత్సీకూర్మీ చ పక్షిణీ ।
శిశుం పాలయతే నిత్యం తథా సజ్జన సంగతిః॥ 3

అర్థము :- మత్సీ = చేప, కూర్మీ = తాబేలు, చ = మఱియు, పక్షిణీ=పక్షియు, దర్శన=చేప చూపుతోను, ధ్యాన = తాబేలు ధ్యానముతోను, సంస్పర్శైః = పక్షి స్పృశించుటతోను నిత్యం = ఎల్లపుడు, శిశుం=సంతానమును, పాలయతే=పోషించుచున్నది, తథా=అట్లే, సజ్జన సంగతిః=శ్రేష్ఠుల సాంగత్యము కూడ మనుష్యులను పోషించుచు మేలు చేయుచుండును.

తా॥ చేప చూపుతోను, తాబేలు ధ్యానముతోను, పక్షిస్పర్శతోను (తాకుట) తమ తమ సంతానమును నిత్యము రక్షించుచుండును. అట్లే శ్రేష్ఠపురుషుల సంబంధము మనుష్యులను పోషించును, రక్షించును.

వివరణము :- సత్సంగ మహిమనుగూర్చి భర్తృహరి—

జాడ్యం ధియో హరతి సించతి వాచి సత్యం,
మానోన్నతిం దిశతి పాపమపాకరోతి ।
చేతః ప్రసాదయతి దిక్షు తనోతి కీర్తిం,
సత్సంగతిః కథయ కిం న కరోతి పుంసామ్॥ (భర్తృ. నీతి. 22)

సత్సంగతి బుద్ధిమాంద్యమును పోగొట్టును. వాక్కునందు సత్యమును నిల్పును. గౌరవమును పెంచును, గొప్ప గౌరవమును గలిగించును. పాపమును పోగొట్టును. దిక్కులందంతట యశస్సును వ్యాపింపజేయును. మానవులకు సత్సంగతివలన యేమి కలుగదో చెప్పుము.

శ్లో॥ యావత్స్వస్థో హ్యయం దేహో యావన్మృత్యుశ్చ దూరతః ।
తావదాత్మహితం కుర్యాత్ ప్రాణాన్తే కిం కరిష్యతి॥ 4

అర్థము :- యావత్ హి=ఎంతవఱకైతే, అయం=ఈ, దేహః=దేహము, స్వస్థః=రోగములేనిదై యుండునో, చ=మఱియు, యావత్=ఎంతకాలము, మృత్యుః=మరణము, దూరతః = దూరముగా నుండునో, తావత్ = అంతవఱకు, ఆత్మహితం = తనకు మేలును గలిగించు ధర్మాచరణము, పుణ్యకర్మలను, కుర్యాత్ = చేయుచుండవలెను, ప్రాణాన్తే = ప్రాణములు పోయిన తరువాత, కిం కరిష్యతి=ఏమి చేయగలడు ?

తా॥ ఈ శరీర మెంతకాలము రోగములేనిదై స్వాస్థ్యము కలదై యుండునో, యంతవఱకు తనకు మేలుకలిగించు శుభకర్మలను, ధర్మా

చరణము, పుణ్యకర్మలు చేయవలెను. మరణించిన తరువాత నేమి చేయ గలరు ?

వివరణము :- ఈ విషయమే భర్తృహరి—

యావత్స్వస్థ మిదం శరీర మరుజం యావజ్జరా దూరతో,
యావచ్చేన్ద్రియ శక్తిరప్రతిహతా యావత్క్షయో నాయుషః ।
ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్,
సన్దీప్తే భవనే తు కూపఖననం ప్రత్యుద్యమః కీదృశః॥

(భర్తృ. వైరా. 79)

శరీరము రోగము లేకుండ స్వస్థతగా నున్నపుడు, ముసలితనము రాకముందే, ఇంద్రియ శక్తి పటుత్వము కలిగియున్నపుడు, ఆయుస్సు క్షీణింపనపుడు బుద్ధిమంతుడు తన శ్రేయస్సు కొఱకు మిక్కిలి ప్రయత్నింపవలెను. అటులకాక అన్నియు క్షీణించిన తరువాత ప్రయత్నించుట కొంప తగులబడుచుండ బావిత్రవ్వుటకు ప్రయత్నించుటవలె వ్యర్థ మగును

ఆత్మకల్యాణము కొఱకు నేమి చేయవలెనో జవాబు—

కురు పుణ్య మహోరాత్రం స్మర నిత్యం మహేశ్వరమ్ ।
త్యజ దుర్జన సంసర్గం భజ సాధు సమాగమమ్॥

రాత్రింబవళ్లు పుణ్యకర్మలుచేయుము. పరమేశ్వరుని నిత్యము స్మరింపుము. దుర్జన సాంగత్యము విడువుము. సజ్జనసాంగత్యము చేయుము. కాని క్రింది పరిస్థితి యుండును.

వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయన్తీ,
రోమాశ్చ శత్రవ ఇవ ప్రహరన్తి గాత్రమ్ ।

ఆయుః పరిస్రవతి భిన్నఘటాదివామ్భో,
లోకో న చాత్మహిత మాచరతీతి చిత్రమ్॥

(చాణక్య రాజనీతి శాస్త్రము 4-24)

భయంకరమైన పెద్దపులివలె వృద్ధావస్థ భయభీతుని చేయుచుండును. రోగములు శత్రువులవలె శరీరమును ఆక్రమించుచుండును. పగిలినకుండ నుండి నీరు స్రవించుచున్నట్లు ఆయుస్సు క్షీణించుచుండును. అయినను మనుష్యుడు తన కల్యాణము (మేలు) కొఱకు ప్రయత్నముచేయడు. ఇది మహావిచిత్రము.

శ్లో॥ కామధేను గుణా విద్యాహ్యకాలే ఫలదాయినీ।
ప్రవాసే మాతృసదృశీ విద్యా గుప్తం ధనం స్మృతమ్॥ ౫

అర్థము :- విద్యా=విద్య, కామధేను గుణా = కామధేనువువలె పోయపడునట్టి గుణముగలది, హి=ఎట్లనగా, అకాలే = సమయముకాని సమయమందుగూడ, ఫలదాయినీ = ఫలములనిచ్చును ఉపయోగపడును, ప్రవాసే=విదేశములందున్నపుడు, మాతృసదృశీ = తల్లివలె హితమును రక్షణచేయును, అందువలన, విద్యా=విద్య, గుప్తం=దాచబడిన, ధనం= ధనముగా, స్మృతమ్=చెప్పబడుచున్నది.

తా॥ విద్యయు, కామధేనువు సమానగుణములు గలవి. కామధేనువు సమయ వివక్షత లేకుండనే ఫలముల నిచ్చును. విద్య గృహమునకు వెలుపల ప్రదేశములోనున్నను, విదేశములలోనున్నను తల్లివలె మేలును రక్షణము కలిగించును. విద్య దాచిన ధనమువంటిదిగా తలంపబడుచున్నది.

వివరణము :- విద్య నిజముగా కామధేనువే—

మాతేవ రక్షతి పితేవ హితే నియుంక్తే,
కాంతేవ చాభిరమయత్యపనీయ ఖేదమ్।

కీర్తిం చ దిక్షు వితనోతి దదాతి లక్ష్మీం,
కిం కిం న సాధయతి కల్పలతేవ విద్యా॥

విద్య తల్లివలె రక్షించును. తండ్రివలె మేలుకలుగు కార్యము లందు నియోగించును. దుఃఖములను బోగొట్టు భార్యవలె ఆనందమును గలిగించును. నాల్గుదిక్కులందు కీర్తిని వ్యాపింపజేయును. ధనప్రాప్తి కలిగించును. కల్పవృక్షమువలె విద్యయేమి యీయదు? సమస్తమును ప్రాప్తింపజేయును.

అపూర్వః కోఽపి కోశోఽయం విద్యతే తవ భారతి।
వ్యయతో వృద్ధి మాయాతి క్షయ మాయాతి సంచయాత్॥

ఓ విద్యాదేవి! నీ కోశము చాలవిచిత్రమైనది. నిన్నెంత యితరులకు దానముచేయుదురో యంత పెరుగుచునే యుందువు నిన్నితరులకు నీయక కూడబెట్టినచో తగ్గిపోవుదువు. విద్యాధనము సాధారణ ధనమునకు వ్యతిరేకము.

శ్లో॥ వరమేకో గుణీ పుత్రో నిర్గుణైశ్చ శతైరపి।
ఏకశ్చన్ద్రి స్తమో హన్తి న చ తారాః సహస్రశః॥ 6

అర్థము :- శతైః=వందలకొలది, నిర్గుణైః అపి = గుణహీనుల కంటె, గుణీ=గుణవంతుడైన, పుత్రః = పుత్రుడు, ఏకః = ఒక్కడు, వరం=శ్రేష్ఠుడు, చంద్రః=చంద్రుడు, ఏకః=ఒక్కడే, తమః=చీకటిని, హన్తి = పోగొట్టుచున్నాడు, చ = కాని, సహస్రశః = వేలకొలది, తారాః=నక్షత్రములు, న=పోగొట్టలేవు గదా!

తా॥ గుణరహితులైన మూర్ఖులగు వందలకొలది పుత్రులకంటె గుణవంతుడగు శ్రేష్ఠపుత్రుడొక్కడు చాలు. చంద్రు డొక్కడే చీకటిని బోగొట్టగలడుగాని వేలకొలది నక్షత్రములు పోగొట్టజాలవు గదా!

వివరణము :- గుణవంతుడగు పుత్రుడొక్కడే నిజముగా చాలును—

ఏకేనాఽపి సుపుత్రేణ సింహీ స్వపితి నిర్భయమ్ ।
సహైవ దశభిః పుత్రై ర్భారం వహతి రాసభీ॥

మంచిపుత్రుడు కలిగిన ఆడుసింహము అడవిలో సుఖముగా నిర్భయముగా నిద్రించును. కాని గాడిదకు పది సంతానమున్నను బరువు మోయక తప్పదు గదా!

శ్లో॥ మూర్ఖశ్చిరాయుర్జాతోఽపి తస్మాజ్జాతమృతో వరః ।
మృతః స చాఽల్పదుఃఖాయ యావజ్జీవంజడో దహేత్ ॥ 7

అర్థము :- చిరాయుః = చాలకాలము బ్రతుకునట్టి, మూర్ఖః = మూర్ఖుడు, జాతోఽపి = పుట్టినవాడైనను, తస్మాత్ = అతనికంటె, జాతమృతః=పుట్టగానే చచ్చినవాడు, వరః=శ్రేష్ఠుడు, మృతః = చచ్చినట్టి, సః=వాడు, అల్పదుఃఖాయ = చచ్చినపుడు మాత్రమే దుఃఖము కలిగించును, జడః=చిరకాలము జీవించిన మూర్ఖుడు, యావజ్జీవం=బ్రతికినన్ని నాళ్లు, దహేత్ =దహింపజేయును. దుఃఖము కలిగించును.

తా॥ చిరాయువుగా మూర్ఖుడు పుట్టుటకంటె పుట్టగానే చచ్చుట మేలు. పుట్టగానే మరణించినచో దుఃఖము స్వల్పముగానే యుండును. మూర్ఖుడు జీవించినంతకాలము దుఃఖపెట్టుచు దహించుచుండును గదా!

వివరణము :- ఈ భావమునే మరొక కవి రచించెను—

అజాత మృత మూర్ఖాణాం వరమాద్యౌ న చాంతిమః ।
సకృ ద్దుఃఖకరా వాద్యావ న్తిమస్తు పదే పదే॥

సంతానము లేకుండుటయు, సంతానము కలిగి నశించుటయు, మూర్ఖత్వము కలిగియుండుటయు అను మూటిలో మూడవ దానికంటె

మొదటి రెండే శ్రేష్ఠములు. మొదటి రెంటివలన నొక్కపారే దుఃఖము కలుగును. కాని మూడవది యగు మూర్ఖత్వమువలన బ్రతికినంతకాలము దుఃఖము సంభవించును.

శ్లో॥ కుగ్రామవాసః కులహీన సేవా
కుభోజనం క్రోధముఖీచ భార్యా।
పుత్రశ్చ మూర్ఖో విధవా చ కన్యా
వినాఽగ్నినా షట్ ప్రదహన్తి కాయమ్॥ 8

అర్థము :- కుగ్రామవాసః = చెడ్డగ్రామములో నుండుటయు, కులహీనసేవా=నీచకులమువాని సేవయు, కుభోజనం = చెడ్డభోజనము, చ= మఱియు, క్రోధముఖీ=క్రోధస్వభావముగల, భార్యా = భార్యయు, చ= అట్లే, మూర్ఖః=మూర్ఖుడైన, పుత్రః=పుత్రుడు, చ=మఱియు, విధవా = భర్తపోయిన, కన్యా = వయసురాని, బిడ్డలులేని కూతురు, షట్ = ఈ యాఱుగురును, అగ్నినావినా=నిప్పులేకుండనే, కాయం = శరీరమును, దహన్తి=కాల్చుదురు.

తా॥ చెడుగ్రామ నివాసము, నీచకులమునందు పుట్టినవానిని సేవించుటయు, చెడ్డభోజనము, క్రోధస్వభావముగల భార్యయు, మూర్ఖుడైన పుత్రుడు, విధవయైన కన్యయు అను నీ యాఱును అగ్నిలేకుండనే శరీరమును దహించును.

వివరణము :- కుగ్రామ మనగా - ధనికుడు, విద్వాంసుడు, రాజు, నది, వైద్యుడు అను వారలులేని గ్రామము. కుభోజన మనగా - చల్ది, పాచిపోయినది, సగము ఉడికినది, సగము నీళ్లున్నది, ఏహ్యభావమును గలిగించునట్టి దోషములు కలిగి తినుట కసహ్యముగానుండి జీర్ణముకాదో యట్టి భోజనము. ఒక కవి యిట్లు చెప్పెను—

కుభోజ్యేన దినం నష్టం కుకలత్రేణ శర్వరీ ?
కుపుత్రేణ కులం నష్టం తన్నష్టం యన్నదీయతే॥

చెడ్డ భోజనముచే ఆ రోజు, చెడ్డభార్యచే రాత్రియు. చెడ్డపుత్రునిచే కులము నష్టపడును. ఇతరుల కీయని ధనముకూడ నష్టమగును.

శ్లో॥ కిం తయా క్రియతే ధేన్వా యా న దోగ్ధ్రీ న చ గుర్విణీ ।
కోఽర్థః పుత్రేణ జాతేన యోనవిద్వాన్ చ భక్తిమాన్॥9

అర్థము :- యా=ఏ యావు, దోగ్ధ్రీ=పాలిచ్చునది, న=కాదో, చ=మఱియు, యా=ఏ యావు, గుర్విణీ=గర్భముదాల్చునది, న=కాదో, తయా = అట్టి అవుతో, కిం క్రియతే = ఏమిచేయబడును ? యః=ఎవడు, విద్వాన్=విద్వాంసుడు, భక్తిమాన్=భక్తిగలవాడు, న=కాదో,అట్టివాడైన, జాతేన=పుట్టినట్టి, పుత్రేణ=పుత్రునితో, కః అర్థః=ఏమి ప్రయోజనము ?

తా॥ ఏ యావు గర్భము ధరింపకయు పాలు ఈయకయుండునో (గొడ్డుటావు) అట్టిది యెందుకు పనికిరాదు. అట్లే పుత్రుడు విద్వాంసుడు, భక్తిమంతుడును కాకున్నచో నాతనితో నేమి ప్రయోజనము.

వివరణము :- పుత్రుడు గుణవంతుడు కావలెను—

యస్య పుత్రో న వై విద్వాన్న శూరో న చ ధార్మికః ।
అప్రకాశం కులం తస్య నష్ట చంద్రేవ శర్వరీ॥

ఎవని పుత్రుడు విద్వాంసుడు, శూరవీరుడు, ధార్మికుడు కాడో యట్టి వాని వంశము చంద్రుడులేని రాత్రివలె ప్రకాశవిహీనమగును.

దానే తపసి శౌర్యే చ యస్య న ప్రథితం యశః ।
విద్యాయా మర్థలాభే చ మాతురుచ్చార ఏవ సః॥

దానము, తపస్సు, శౌర్యము, విద్యాప్రాప్తి ధనలాభము, ప్రసిద్ధ కీర్తియు గలవాడు కేవలము పుత్రుడే కాక తల్లికి గొప్పఫలము వంటి వాడు.

శ్లో॥ సంసారతాప దగ్ధానా త్రయో విశ్రాన్తి హేతవః।
అపత్యం చ కలత్రం చ సతాం సంగతి రేవ చ॥ 10

అర్థము :- సంసారతాప దగ్ధానాం=ప్రపంచములోని ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములను మూడు తాపములతో తపించువారికి, త్రయః=మూడు, విశ్రాంతి హేతవః=శాంతి సాధనములు, అపత్యం = విద్వాంసుడు, ధార్మికుడునైన పుత్రుడు, కలత్రం=సాధ్వియు, పతివ్రతయు నగు భార్యయు, చ=మఱియు, సతాం=సత్పురుషుల యొక్క సంగతిః = సాంగత్యము అనునవి.

తా॥ ప్రపంచములో ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములను త్రివిధతాపములతో తపింపబడువారికి మూడు శాంతిసాధనములు గలవు. విద్వాంసుడు, ధార్మికుడునైన పుత్రుడు, సాధ్వియు, పతివ్రతయునగు భార్యయు, శ్రేష్ఠపురుషుల సహవాసము నను మూడును శాంతిసాధనములు.

వివరణము :- వస్తుతః ఈ మూడే గృహస్థునకు శాంతిదాయకములు-పుత్రుని వచనము లెంత శాంతిప్రదములో చూడుడు—

కిం మిష్టం సుతవచనం మిష్టతరం కిం తదేవ సుతవచనమ్।
మిష్టాన్మిష్టతమం కిం శ్రుతి పరిపక్వం తదేవ సుతవచనమ్॥

తియ్యనిదేది ? పుత్రవచనము. దానికంటె తియ్యనిదేది ? అదియు పుత్రుని ప్రియవచనమే. తీపికంటె తీపికలదేది ? చెవులు వినుటకలవాటు పడిన పుత్రుని వచనములే తియ్యనివి.

స్త్రీ సంబంధములో వేదవాక్యము—

జాయేదస్తం మఘవన్త్సేదు యోనిః॥ (ఋ. 3-53-4)

ఓ ఐశ్వర్యశాలి! స్త్రీయే గృహము. ఆమెయే విశ్రామస్థలము—మఱియు చూడుడు—

న గృహం గృహమిత్యాహుర్ గృహిణీ గృహముచ్యతే।
గృహం తు గృహిణీ హీనం కాన్తారాదతి రిచ్యతే॥
(పంచతంత్రము 3-152)

గృహమనగా నాలుగుగోడలతో నిర్మింపబడినదికాదు. గృహిణి (స్త్రీ)యే గృహము. గృహిణిలేని యిల్లు అరణ్యముకంటె భయంకరమైనది.

పతివ్రతా పతిప్రాణా పత్యుః ప్రియహితే రతా।
యస్య స్యాదీదృశీ భార్యా ధన్యః స పురుషో భువి॥
(పంచతంత్రము 3-151)

భర్తను తన ప్రాణముకంటె మిన్నగా భావించుచు నాతని ప్రియమైన దానినే కోరుచు దానియందే యాసక్తికలదైయుండునో యట్టి పతివ్రత భార్యగాగల పురుషుడు పృథ్విలో ధన్యుడు.

సాధు సంగతి :- సత్సంగము కూడ శాంతిదాయకమే—

చందనం శీతలం లోకే చందనాదపి చన్ద్రమాః।
చంద్ర చందనయోర్మధ్యే శీతలా సాధు సంగతిః॥

ప్రపంచములో మంచిగంధము చల్లనైనది. చందనముకంటె చంద్రుడు మిక్కిలి చల్లగానుండును. చందనము చంద్రులకంటెగూడ సాధుసంగమము మిక్కిలి చల్లనైనది.

శ్లో॥ సకృజ్జల్పన్తి రాజానః సకృజ్జల్పన్తి పండితాః।
సకృత్కన్యాః ప్రదీయన్తే త్రీణ్యేతాని సకృత్సకృత్॥ 11

అర్థము :- రాజానః=రాజులు, సకృత్=ఒక్కసారే, జల్పన్తి= ఆజ్ఞయిత్తురు, పండితాః=విద్వాంసులు, సకృత్=ఒక్కసారే, జల్పన్తి = బోధింతురు, కన్యాః=కన్యలు, సకృత్=ఒక్కసారే, ప్రదీయన్తే = ఈ బడుదురు, అనగా కన్యాదానము ఒక్కసారే యగును, ఏతాని త్రీణి=ఈ మూడును సకృత్ సకృత్=ఒక్కొక్కసారే.

తా॥ రాజు లొక్కసారే ఆజ్ఞాపింతురు. పండితు లొక్కసారే చెప్పుదురు. కన్యాదాన మొక్కసారే చేయబడును. ఈ మూడు నొక్కొక్క సారే చేయబడును. పలుసార్లు కాదు.

శ్లో॥ ఏకాకినా తపో ద్వాభ్యాం పఠనం గాయనం త్రిభిః।
చతుర్భి ర్గమనం క్షేత్రం పంచభిర్బహుభీ రణః॥ 12

అర్థము :- తపః=తపస్సు, ఏకాకినా=ఒంటరిగను, పఠనం = చదువుట, ద్వాభ్యాం=ఇద్దఱితోను, గాయనం=పాడుట, త్రిభిః = ముగ్గురి తోను, గమనం=యాత్ర, చతుర్భిః = నలుగురితోను, క్షేత్రం = వ్యవసాయము (పొలము పని), పంచభిః = అయిదుగురితోను, రణః = యుద్ధము, బహుభిః=చాలమందితోను చేసినచో బాగుగానుండును.

తా॥ తపస్సు ఒంటరిగా చేయవలెను. పాఠమిద్దఱు కలిసి చదువవలెను. గానము ముగ్గురు చేయవలెను. యాత్ర నల్వురు చేయవలెను. కృషి (వ్యవసాయము) అయిదుగురు చేయవలెను. చాలమంది కలిసి యుద్ధము చేయవలెను.

శ్లో॥ సా భార్యా యా శుచిర్దక్షా సా భార్యాయాపతివ్రతా।
సాభార్యా యా పతిప్రీతా సా భార్యా సత్యవాదినీ॥ 13

అర్థము :- యా = ఎవతె (ఎవరు), శుచిః = అంతశ్శుద్ధి బహిశ్శుద్ధి కలిగి పవిత్రముగా నుండునో, దక్షా=పని నిర్వహించుటలో నేర్పు

శక్తికలదై యుండునో యామె, భార్యా=భార్య, మఱియు, యా = ఎవతె, పతివ్రతా=పతివ్రతయైయుండునో, సా=ఆమెయే, భార్య, యా=ఎవతె, పతిప్రీతా=పతియందు ప్రీతికలదై యుండునో, సా = ఆమె, భార్యా = భార్య మఱియు,సత్యవాదినీ=సత్యమునే పలుకునట్టి, సా=ఆమె, భార్యా= భార్య.

వివరణము :- స్త్రీ తన గుణములతోనే గౌరవము పొందు చున్నది. సరియైన భార్యయే పోషింపదగినది—

పుత్రసూః పాకకుశలా పవిత్రా చ పతివ్రతా ।
పద్మాక్షీ పంచపైర్నారీ భువి సంయాతి గౌరవమ్॥

వీరపుత్రుల కను నట్టిదియు, వంటచేయుటలో నేర్పుకలదియు, పవిత్రయు, పతివ్రతయు, పద్మాక్షియనను అయిదుపకారములతో స్త్రీ ప్రపంచములో గౌరవము పొందును. (పుత్రవతి, పాకకుశల, పవిత్ర, పతివ్రత, పద్మాక్షి అను నైదు పదములలో ముందుపకారమున్నది)

శ్లో॥ అపుత్రస్యగృహంశూన్యందిశఃశూన్యాస్త్వబాంధవాః ।
మూర్ఖస్యహృదయంశూన్యంసర్వశూన్యా దరిద్రతా॥ 14

అర్థము :- అపుత్రస్య = బిడ్డలులేనివానియొక్క, గృహం = గృహము, శూన్యమ్=సున్న, అబాంధవాః = బంధువులులేని, దిశః = దిక్కులు చోట్లు, శూన్యాః = సున్నాలే, మూర్ఖస్య = మూర్ఖునియొక్క, హృదయం=హృదయము, శూన్యం=శూన్యము, దరిద్రతా=దారిద్ర్యము, సర్వశూన్యా=సర్వము శూన్యముగానుండును.

తా॥ పుత్రులులేనివాని యిల్లు శూన్యము. బంధువులులేని మనుష్యునకు దిక్కులు శూన్యము. మూర్ఖుని యొక్క హృదయము శూన్యము. దరిద్రునకు సర్వము శూన్యమే.

వివరణము :- దారిద్ర్యము విషయములో నందఱు వినదగినది—

'సర్వకష్టా దరిద్రతా' — (చాణక్య శతకము)

దారిద్ర్యము అన్నివిధముల కష్టముల నిచ్చునదే.

'దారిద్ర్యా న్మరణం వరమ్' — (వైరాగ్య శతకమ్)

దరిద్రుడుగా బ్రతుకుటకంటె చచ్చుట మేలు.

'దారిద్ర్య మేకం గుణకోటి నాశీ'

దారిద్ర్య మొక్కటే సర్వగుణముల నశింపజేయును;

అయినను దారిద్ర్యము వలన లాభమున్నది—

హే దారిద్ర్య! నమస్తుభ్యం సిద్ధోఽహం త్వత్ప్రసాదతః।
పశ్యామ్యహం జగత్సర్వం న మాం పశ్యతి కశ్చన॥

ఓ దారిద్ర్యమా! నీకు నమస్కారము. నీ దయవలన నేను సిద్ధుడనైతిని. ఈ జగత్తునంతను నేను చూచుచున్నాను. నేను దరిద్రుడ నగుటచే నన్నెవరు చూచుట లేదు.

శ్లో॥ అనభ్యాసే విషం శాస్త్రమజీర్ణే భోజనం విషమ్।
దరిద్రస్య విషం గోష్ఠీ వృద్ధస్య తరుణీ విషమ్॥ 15

అర్థము :- అనభ్యాసే=అభ్యసించనివానికి, శాస్త్రం = శాస్త్రము, విషం=విషము, అజీర్ణే=జీర్ణముకాని వానికి, భోజనం=భోజనము, విషం= విషము, దరిద్రస్య=దరిద్రునకు, గోష్ఠీ=సభ, విషం=విషము, వృద్ధస్య= ముసలివానికి, తరుణీ=యువతి, విషం=విషము.

తా॥ అభ్యసింపనివానికి శాస్త్రము, విషతుల్యము. జీర్ణించుకోలేని అజీర్ణరోగికి భోజనము విషతుల్యము. పలువిషయములు చర్చించు సభ దరిద్రునకు విషతుల్యము. ముసలివానికి పడుచు స్త్రీ విషతుల్యము.

శ్లో॥ త్యజేద్ధర్మం దయాహీనం విద్యాహీనం గురుం త్యజేత్।
త్యజే త్క్రోధముఖీం భార్యాం నిః స్నేహాన్
బాంధవాన్ త్యజేత్॥ 16

అర్థము :- దయాహీనం = దయలేనట్టి, ధర్మం = ధర్మమును, త్యజేత్ = విడువవలెను, విద్యాహీనం = విద్యలేని, గురుం = గురువును, త్యజేత్ = విడువవలెను, క్రోధముఖీం = క్రోధముతో కూడిన ముఖము గల, భార్యాం = భార్యను. త్యజేత్ = విడువవలెను, నిః స్నేహాన్ = స్నేహ రహితులగు, బాంధవాన్ = బంధువులను, త్యజేత్ = విడువవలెను.

తా॥ మనుష్యుడు దయాహీనమైన ధర్మమును విడువవలెను. విద్య లేని గురువును, క్రోధముతో గూడిన ముఖముగల భార్యను, స్నేహ రహితులైన బంధుబాంధవులను విడిచిపెట్టవలెను.

శ్లో॥ అధ్వాజరా మనుష్యాణాం వాజినాం బంధనం జరా।
అమైథునం జరా స్త్రీణాం వస్త్రాణా మాతపో జరా॥ 17

అర్థము :- మనుష్యాణాం = మనుష్యులకు, అధ్వా = ఎక్కువ దూరము నడచుట, జరా = ముసలితనము, వాజినాం = గుఱ్ఱములకు, బంధనం = కట్టివేయుట, జరా = ముసలితనము, స్త్రీణాం = స్త్రీలకు, అమైథునం = సంభోగము చేయకుండుట, జరా = ముసలితనము, వస్త్రాణాం = గుడ్డలకు, ఆతపః = ఎండ, జరా = ముసలితనమగును.

తా॥ మనుష్యులు అత్యధికముగా నడచినచో ముసలితనము వచ్చును. గుఱ్ఱములను కట్టివేసి యుంచినచో వానికి ముసలితనము వచ్చును. స్త్రీలకు సంభోగము లేకున్నచో త్వరగా ముసలితనము వచ్చును. గుడ్డలు ఎక్కువగా నెండలో నున్నచో త్వరగా చిరిగిపోవును.

వివరణము :- ఆరోగ్యము కొఱకు నడక మంచిదేకాని అధిక ముగా నెక్కువకాలము నడచిన అలసిపోయి ముసలితనము చిహ్నములు కనబడును. గుఱ్ఱమును కట్టివేసినచో ముసలితనము వచ్చును. మఱియు హీనముచేయును. త్రిప్పకున్నచో గుఱ్ఱము హీనముచేయును. తమలపాకు క్రుళ్లిపోవును. రొట్టె మాడిపోవును; అందుచే వానిని త్రిప్పుచుండవలెను.

వస్త్రములు ఎల్లపుడు నెండలో నెండినచో రంగుపోవును. త్వరగా చినిగిపోవును.

ఒక గ్రంథకర్త వృద్ధావస్థకు అయిదు కారణములు చెప్పెను. అందులో నధికముగా మార్గమున నడచుట యొకటి—

శీత మధ్వా కదన్నం చ వయోఽతీతాశ్చ యోషితః।
మనసః ప్రాతికూల్యం చ జరాయాః పంచ హేతవః॥

1 మిక్కిలి చల్లదనము 2 మార్గమున నధికముగా నడచుట 3 చెడ్డయన్నమును దినుట 4 వృద్ధస్త్రీతో సహవాసము 5 మనస్సునకు వ్యతిరేకత.

మనస్సున కనుకూలమైనచో మనస్సున కుత్సాహము కలిగి ఆయుస్సు వృద్ధియగును. మనస్సునకు ప్రతికూలమైనచో నలసిపోయి ఆయుస్సు తగ్గును ముసలితన మావరించును.

శ్లో॥ కః కాలః కాని మిత్రాణి కో దేశః కౌ వ్యయాగమౌ;
కశ్చాఽహం కాచ మేశక్తి రితిచి న్త్యంముహుర్ముహుః॥18

అర్థము :- కః=ఏది, కాలః = కాలము? మిత్రాణి = మిత్రులు, కాని=ఎవరు? దేశః=దేశము, కః=ఏది? వ్యయాగమౌ = ఆదాయ వ్యయములు, కౌ=ఏవి? అహంచ=నేనుగూడ, కః=ఎవ్వడను? మే=

నాయొక్క, శక్తిః=శక్తి, కా=ఏది ? ఇతి=అని. ముహుర్ముహుః=మాటి మాటికి, చిన్త్యం=చింతింపదగియున్నది.

తా॥ ఏది కాలము ? ఎవరు మిత్రులు ? ఏది స్థానము ? ఆదాయ వ్యయములేవి ? నే నెవడను ? నా శక్తి యేమి ? అని మాటి మాటికి ఆలోచించుచుండ వలయును.

వివరణము :- ఈ శ్లోకములో ఆత్మచింతన విషయము చెప్పబడి నది. ఆత్మచింతనవలన మనుష్యుడు ఉన్నతిని పొందును. జీవితములో ముందుకు సాగగలడు.

నా ఆదాయ వ్యయములేవి ? వ్యయమెప్పుడును ఆదాయముకంటె తక్కువగా నుండవలెను. నే నెవడను ? నే నెక్కడనుండి వచ్చితిని ? వెళ్లునపుడు నావెంట నేమి వచ్చును ? అనినిత్యము వీనిని గూర్చి ఆలోచింప వలెను. నా శక్తియేమి ? — 'అహమిన్ద్రో న పరాజిగ్య ఇద్ధనమ్' (ఋ. 10-48-5) నే నింద్రుడను. ఇన్ద్రియముల శక్తికలవాడను - నేను ధన్యుడనగుటకు నెన్నడు నోడిపోను.

శ్లో॥ జనితా చోపనేతా చ యస్తు విద్యాం ప్రయచ్ఛతి ।
అన్నదాతా భయత్రాతా పంచైతే పితరః స్మృతాః 19

అర్థము :- జనితా=జన్మనిచ్చువాడును, ఉపనేతా = యజ్ఞోపవీత ధారణ చేయించువాడును, చ=మఱియు, యస్తు = ఎవడైతే, విద్యాం = విద్యను, ప్రదుచ్ఛతి=ఇచ్చుచున్నాడో (బోధించుచున్నాడో), అన్నదాతా= అన్నము పెట్టువాడు, భయత్రాతా = భయమునుండి రక్షించువాడును, ఏతే=ఈ, పంచ=అయిదుగురు, పితరః=పితరులుగ, స్మృతాః=తలంప బడుచున్నారు.

తా॥ జన్మనిచ్చువాడును, యజ్ఞోపవీత ధారణచేయించువాడును, విద్యనేర్పువాడును, అన్నదాతయు, భయమునుండి రక్షించువాడు - ఈ అయిదుగురును పితరులని చెప్పబడుదురు.

వివరణము :- ఈ శ్లోకమువలన పితరులు జీవించిన వారే యని తెలియుచున్నది. మరణించినవారు పితరులు కారు. పారక్షణే అను ధాతువుతో పితర శబ్దము తయారగును. దాని యర్థము రక్షించువాడు. జీవించి యున్నవాడు రక్షింపగలడు కాని మరణించినవాడు కాడు కదా! మరణించినవాడు తన్ను రక్షించుకొనలేడు. ఇతరుల రక్షింపలేడు. పాండవ కౌరవులకు యుద్ధము జరుగునపుడు సేన లెదురెదురుగా నున్నపుడు శ్రీకృష్ణుడర్జునుని ప్రార్థనవలన నాతని రథమును రెండు సేనల మధ్య నిలిపి—

'తత్రాపశ్య త్స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్॥ (గీత. 1-22)

అర్జును డక్కడ నిలబడి తండ్రులను తాతలను మొదలైన వారిని చూచెను. ఇచ్చట పితర అను దానికి చనిపోయిన తాత ముత్తాతలైనచో అర్జునుడు చనిపోయిన వారి నెట్లుచూచును ? ఏల భయపడును ? ఆ శస్త్రధారులందఱు చనిపోయినట్లేనా ? తేలిన సారాంశము పితరులనగా బ్రతికినవారే.

శ్లో॥ రాజపత్నీ గురోః పత్నీ మిత్రపత్నీ తథైవ చ ।
పత్నీమాతా స్వమాతా చ పంచైతా మాతరః
స్మృతాః॥ 20

అర్థము :- రాజపత్నీ=రాజుగారి భార్య, గురోః=గురువుయొక్క, పత్నీ=భార్యయు, తథైవచ=అట్లే మఱియు, మిత్రపత్నీ = స్నేహితుని భార్యయు, పత్నీమాతా = అత్తగారును, స్వమాతా చ = తన తల్లియు, ఏతాః పంచ=ఈ యైదుగురు, మాతరః=తల్లులుగా, స్మృతాః = తలంపబడుదురు ?

తా॥ రాజు భార్యయు, గురువు భార్యయు, మిత్రుని భార్యయు, భార్య తల్లియు, తన తల్లియు-ఈ అయిదుగురు తల్లులుగా తలంప బడుదురు.

శ్లో॥ అగ్నిర్దేవో ద్విజాతీనాం మునీనాం హృదిదైవతమ్।
ప్రతిమా స్వల్పబుద్ధీనాం సర్వత్ర సమదర్శినః॥ 21

అర్థము :- ద్విజాతీనాం = బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను, ద్విజులకు, దేవః = దేవుడు, అగ్నిః = అగ్నిహోత్రము, యజ్ఞమే, మునీనాం = మునులకు, హృది = హృదయమందు, దైవతమ్ = దేవత నివసించును, స్వల్పబుద్ధీనాం = అల్పబుద్ధులకు, మూర్ఖులకు, ప్రతిమా = మూర్తియందును, సమదర్శినః = సమదృష్టిగలవారికి, సర్వత్ర = అంతటను, దేవతా = పరమేశ్వరుడుండును.

తా॥ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను ద్విజాతులవారికి అగ్నిహోత్రమే (యజ్ఞము) దేవుడు. మునులకు దైవము హృదయమందుండును. స్వల్పబుద్ధులుకలవారికి విగ్రహమునందును, అంతటిని సమానముగా జూచు సమదర్శులకు దైవమంతటనుండును.

వివరణము :- మూర్తిపూజ అధమము—

ఉత్తమా సహజావస్థా మధ్యమా ధ్యాన ధారణా ।
అధమా మూర్తిపూజా చ తీర్థయాత్రా౽ధమా౽ధమా॥

సహజావస్థ ఉత్తమము, ధ్యానధారణము మధ్యమము, మూర్తిపూజ అధమము, తీర్థయాత్రలుచేయుట అధమాధమము.

మఱియు నింకొకటి చూడుడు—

యస్యాత్మబుద్ధిః కుణపే త్రిధాతుకే
స్వధీః కలత్రాదిషు భౌమ ఇజ్యధీః ।

యత్తీర్థబుద్ధిః సలిలేన కర్హిచిత్
జనేష్వభిజ్ఞేషు స ఏవ గోఖరః॥ (భాగ.పురా. 10-84-13)

ఎవడు వాత, పిత్త, కఫములను త్రిధాతువులతో గూడిన శరీరము ఆత్మయనుకొనునో, మఱియు స్త్రీ పుత్రాదులందు మమత్వబుద్ధి కలిగి యుండునో, ఎవడు మూర్తియందు (విగ్రహము) పూజ్యబుద్ధికలిగి యుండునో, ఎవడు నీటియందు తీర్థబుద్ధికలిగియుండునో వాడు విద్వాంసుల దృష్టిలో ఆవుల కొఱకు మేత మోయు ఎద్దో, గాడిదయో యగును.

చతుర్థాధ్యాయము సమాప్తము

## అథ పంచమోఽధ్యాయః

శ్లో॥ గురు రగ్ని ర్ద్విజాతీనాం వర్ణానాం బ్రాహ్మణో గురుః।
పతిరేవ గురుః స్త్రీణాం సర్వస్యాఽభ్యాగతో గురుః॥ 1
(బ్రహ్మపురాణము 80-70)

అర్థము :- ద్విజాతీనాం = బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు, అగ్నిః = అగ్నిః, గురుః = గురువు, వర్ణానాం = బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర అను వర్ణములవారికి, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, గురుః = గురువు, స్త్రీణాం = స్త్రీలకు, పతిరేవ = భర్తయే, గురుః = గురువు, సర్వస్య = అందఱకు, అభ్యాగతః = అతిథి, గురుః = గురువు.

తా॥ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను ద్విజులకు గురువు అగ్ని. బ్రాహ్మణాది నాలుగు వర్ణముల వారికి బ్రాహ్మణుడు గురువు. పతియే స్త్రీలకు గురువు. అందఱకు నతిథియే గురువు.

వివరణము :- వేదాది శాస్త్రములందు గురుమహిమ గానము చేయబడినది—

యో నో అగ్నే అరరివా అఘాయురరాతీవా మర్చయతి ద్వయేన ।
మన్తో౯ గురుః పునరస్తు సో అస్మా అను మృక్షీష్ట
తన్వం దురుక్తైః॥ (ఋ. 1-147-4)

ఓ జ్ఞానస్వరూప ప్రభూ ! ఇతరులు చేయు దానాది సత్కార్యముల నెవడు విఘ్నము చేయునో, స్వయముగా దానాది సత్కర్మలు చేయడో, పాపమందు నిమగ్నుడై మనస్సులో నొకటి తలచి బయటి కొకటి చెప్పుచు మోసగించునో యట్టి వానిని ఆలోచనాపరుడగు గురువు దయ దలచి చెడుమార్గమునుండి మరలించి మంచిమార్గమునకు దీసికొనిరావలెను. అట్టి గురువుయొక్క కఠోరవచనములతో శిష్యులు తమ శరీరమును ఆత్మను ఆయన కనుకూలముగా ఆచరింపజేసి శుద్ధులు పవిత్రులు కావలెను.

తద్విజ్ఞానార్థం స గురుమేవాభి గచ్ఛేత్ ।
సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మ నిష్ఠమ్॥ (ముండక. 1-2-12)

ఆ అద్వితీయ బ్రహ్మను దెలిసికొనుటకు ముముక్షువైనవాడు (మోక్షమును కోరువాడు) శ్రద్ధతో చేతిలో సమిధలు పట్టుకొని వేదాది సకల శాస్త్రములు తెలిసినవాడును, శాస్త్రరహస్యములను యుక్తియుక్తముగా దృష్టాంతపూర్వకముగా ప్రవచించువాడును, పరమాత్మయందు నిష్ఠ కలవాడునగు సద్గురువును చేరవలెను.

మహర్షి దయానంద సరస్వతి తన యోగగురువుల విషయములో వ్రాసినది — నేను అహమ్మదాబాద్ దగ్గర దుగ్ధేశ్వర మందిరములో జ్వాలానందపురి శివానందగిరి యను వారి దగ్గర యోగవిద్యలోని రహస్య తత్త్వముల నేర్చితిని. యోగము విషయములోనే నా యిద్దరు సాధువులకు మిక్కిలి ఋణపడియున్నాను. (ఆత్మచరిత్ర)

తన విద్యాగురువైన స్వామి విరజానంద దండిని గూర్చి తఱచుగా తన గ్రంథములలో వ్రాసినది-"శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యాణాం మహావిదుషాం శ్రీయుత విరజానంద సరస్వతీస్వామినాం శిష్యేణ" — ఈ శబ్దములలో గురువునుగూర్చి ఆయనకున్న శ్రద్ధ వెల్లడియగుచున్నది.

సర్వస్యాభ్యాగతో గురుః :- పరివ్రాజకుడు, యతి, సంన్యాసి అను వారందఱికి స్వతః సిద్ధముగా గురువులు, ఇక్కడ దరిద్రుడు, బీదవాడు, బిచ్చగాడు అను వారలు గురువులు కారు, పాపము వారు దయ చూపదగినవారు. కాని అభ్యాగతుడైన సంన్యాసి దయచూపదగినవాడు కాదు. శ్రద్ధతో ఆదరింపదగినవాడు.

ఆచారహీనుడు, గుణహీనుడు, శాస్త్రజ్ఞానశూన్యుడు, మూర్ఖుడు నైన వాడు గురువు పదవాచ్యుడుకాడు.

కో వా గురుర్యో హి హితోపదేష్టా (శంకరాచార్య-ప్రశ్నోత్త 87)

గురువెవడు ? పరమాత్మ తత్త్వోపదేష్టయు, స్వయముగా ఆత్మ సాక్షాత్కారము పొందినవాడు గురువు.

గుకార స్త్వన్ధ కారః స్యాత్ రేఫ స్తస్య నివర్తకః ।
అజ్ఞాన నివర్తకత్వాత్ గురు రిత్యభిధీయతే॥

'గు' అనగా అంధకారరూప అజ్ఞానమును 'రు' తొలగించువాడు - అజ్ఞానమును పోగొట్టువాడు గురువని చెప్పబడును.

శ్లో॥ యథా చతుర్భిః కనకం పరీక్ష్యతే,
నిఘర్షణ చ్ఛేదన తాపతాడనైః ।
తథా చతుర్భిః పురుషః పరీక్ష్యతే,
త్యాగేన శీలేన గుణేన కర్మణా॥

అర్థము :- యథా=ఎట్లు, నిఘర్షణచ్ఛేదన తాపతాడనైః=ఒరపిడి చేయుట, తెగగొట్టుట, కాల్చుట, సుత్తితో కొట్టుటయను, చతుర్భిః = నాలుగు క్రియలతో, కనకం=బంగారము, పరీక్ష్యతే = పరీక్షచేయుదురో, తథా=అట్లే, త్యాగేన=త్యాగముచేతను, శీలేన = శీలముతోను, గుణేన= గుణముతోను, కర్మణా = కర్మతోను అను, చతుర్భిః = నాల్గింటితో, పురుషః=పురుషుడు, పరీక్ష్యతే=పరీక్షింపబడుచున్నాడు.

తా॥ ఒరపిడిచేయుట, ఛేదించుట, కాల్చుట, సుత్తితోకొట్టుట యను నాల్గువిధములుగా నెట్లు బంగారమును పరీక్షింతురో యట్లే త్యాగము (దానము) శీలము, గుణము, కర్మ అను నాల్గింటితో పురుషుని పరీక్షింప వలెను.

వివరణము :- మనుష్యుడనగా దానముచేయువాడు, శీలసంపన్నుడు, శుభగుణవిభూషితుడు, శ్రేష్ఠమైన యాచారములు కలవాడని చాణక్యు డనుచుండెను.

మహర్షి దయానంద సరస్వతి మనుష్యు డనగా - మననశీలుడు, తన వలె నితరుల కష్టసుఖములను, హానిలాభములను తెలిసికొనువాడు, అన్యాయకారులనుండి బలవంతుల నుండియు భయపడనివాడు, ధర్మాత్ము డైన నిర్బలుని నుండియు భయపడువాడును మనుష్యుడనెను, అంతేకాదు మఱియు సర్వసామర్థ్యముగల ధర్మాత్ములు, అనాథలు, నిర్బలులు, గుణ రహితులుగా నున్న వారిని రక్షించి యున్నతిపొందువారినిగాను, ప్రియాచరణులుగాను చేయవలెననెను. చక్రవర్తి, సనాథులు, మహాబలవంతులు, గుణవంతులైనను వారు అధర్మవర్తనులైనచో వారిని నశింపజేయుట, తలవంపు గలుగునట్లుచేయుట, అప్రియము గలుగునట్లు చేయుటయు నావశ్యకమనెను. అనగా నన్యాయకారులకు హానియు న్యాయకారులకు నున్నతి కలుగునట్లు అన్నివిధముల ప్రయత్నింపవలెను. ఈ ప్రయత్న

ములో దారుణమైన దుఃఖముప్రాప్తించినను, ప్రాణహాని కలిగినను, సూనవత్వరూప ధర్మమునుండి వేఱుకారాదు. (సత్యార్థప్రకాశము-స్వమంతవ్యామంతవ్యము)

అన్ని దానములలో ప్రాణదానము మిన్న ధర్మము, సత్యము, న్యాయము కొఱకు ప్రాణములు విడుచువాడే నిజమైన మనుష్యుడు.

'శీలం పరం భూషణమ్' మనుష్యున కన్నిటికంటె గొప్ప భూషణము శీలము, శీలములేని పురుషుడు పశువే. భర్తృహరి—

యేషాం న విద్యా న తపో న దానం
జ్ఞానం న శీలం న గుణో న ధర్మః
తే మర్త్యలోకే భువి భారభూతాః
మనుష్య రూపేణ మృగాశ్చరన్తి॥ (భర్తృ. నీతి. 12)

మనుష్యులలో విద్యయు, తపస్సు, దానమునిచ్చు భావన, జ్ఞానము, శీలము, జీవితములో సుత్తమగుణము, ధర్మముండవో అట్టివారు భూమికి భారమైన పశువులే. వారు మనుష్యరూపముతో సంచరింతురు.

మనుష్యుని కర్మద్వారాయే పరీక్షింపవలెను—వేదము—

"అకర్మా దస్యుః" — (ఋ. 10-22-8)

కర్మచేయని మనుష్యుడు దస్యువు (నాశనము కలిగించువాడు) దీని ఫలితార్థ మేమనగా మంచికర్మచేయవలెను. శుభకర్మలు చేయువాడు, ఆచారవంతుడునైన మనుష్యుడు-ఆర్యుడు-శ్రేష్ఠమనుష్యుడు.

గుణై రుత్తుంగతాం యాతి నోచ్చైరాసన సంస్థితః।
ప్రాసాద శిఖరస్థోఽపి కాకః కిం గరుడాయతే॥

మనుష్యుడు గుణముతోనే యౌన్నత్యము పొందును. ఉన్నతమైన ఆసనము మీద కూర్చుండిన మాత్రముచేతకాదు. రాజభవనము

యొక్క శిఖరముమీద కూర్చుండిన మాత్రముచేత కాకి గరుడపక్షి యగునా? (హంసయగునా?) ఎన్నడును కాదు.

శ్లో॥ తావత్ భయేషు భేతవ్యం యావద్భయమనాగతమ్।
ఆగతం తు భయం దృష్ట్వా ప్రహర్తవ్య మశంకయా॥3

అర్థము :- భయేషు=భయము విషయములో, యావత్ = ఎప్పటి వఱకు, భయం=భయము, అనాగతం=రావో, తావత్ = అప్పటివఱకు, భేతవ్యం=భయపడవలెను, ఆగతం = వచ్చినట్టి, భయం=భయమును, దృష్ట్వా=చూచి, అశంకయా = జంకులేకుండ, ప్రహర్తవ్యం = దానిని దూరముగా పోగొట్టుకొను నుపాయ మాలోచింపవలెను.

తా॥ భయము రానంత వఱకు భయమనిన భయపడవలెను. వచ్చిన భయమును జూచి శంక జంకు విడిచి యా భయమును దూరముగా పోగొట్టు నుపాయము నాలోచింపవలెను.

వివరణము :- భయము దూరముగా నున్నంతవఱకు భయమును గూర్చి భయపడవలెను. కాని భయమునకు కారణములైన ఆపద, కష్టము మొదలైనవి వచ్చి తలపైపడుటకు సిద్ధపడునపుడు భయపడుటకు బదులుగా ఆ భయకారణములను తొలగించుకొను నుపాయ మాలోచింప వలెను. భయము సంభవించినపుడు భయభీతుడు కారాదని వేదము చెప్పు చున్నది చూడుడు—

యథా ద్యౌశ్చ పృథివీ చ న బిభీతో న రిష్యత:।
ఏవా మే ప్రాణ మా బిభే:॥
యథా సూర్యశ్చ చన్ద్రశ్చ న బిభీతో న రిష్యత:।
ఏవా మే ప్రాణ మాబిభే:॥ (అథర్వ. 2-15-1, 3)

ద్యుపృథివీ లోకములు భయపడకయు, హింసింపబడకయు నుండునో, అట్లే ఓ నా ప్రాణమా! నీవును భయపడకుము. సూర్య

చంద్రు లెట్లు భయపడకయు, హింసింపబడకయు నుందురో అట్లే నా ప్రాణమా ! నీవును భయపడకుము.

శ్లో॥ ఏకోదర సముద్భూతా ఏక నక్షత్ర జాతకాః ।
న భవన్తి సమాః శీలే యథా బదరకంటకాః॥ 4

అర్థము :- ఏకోదర సముద్భూతాః = ఒకే తల్లి కడుపున పుట్టిన వారును, ఏకనక్షత్ర జాతకాః = ఒకే నక్షత్రమున బుట్టినవారును, శీలే = శీలమందు, బదరకంటకాః = రేగుముళ్లు, యథా = ఎట్లు, సమాః = సమానమైనవి, న భవన్తి = = కావో, యట్లే వారును సమానులుగారు.

తా॥ ఒకే కడుపున బుట్టిన వారుగాని. ఒకే నక్షత్రమున బుట్టిన వారుగాని శీలవిషయములో సమముగా నుండరు, రేగుముండ్లు సమముగా నొకే విధముగా నుండక వంకరటింకరగా నుంటునో యట్లే పై జెప్పబడినవారు సమానముగా నుండరు.

వివరణము :- అందఱు సమానముగా నుండరు. వేదవాక్యము—

సమౌ చిద్ధస్తౌ న సమం వివిష్టః సమ్మాతరా చిన్న సమం దుహాతే।
యమయో శ్చిన్న సమా వీర్యాణి జ్ఞాతీ చిత్సన్తౌ న సమం పృణీతః॥
(ఋ. 10-117-9)

రెండు చేతులు సమానముగా కర్మచేయలేవు. ఒక తల్లి కడుపున పుట్టిన రెంతు దూడలు సమానముగా పాలనీయవు. కవలపిల్ల లిద్దఱు సమానమైన బలశక్తులు కలవారెగా నుండరు. పుట్టుటిక మున్నట్టి యిద్దఱు మనుష్యులలో నొకరివలె రెండవవాడు దానాదులచే తృప్తిపఱపలేడు.

మఱొక వేదమంత్రములో అసమానతనుగూర్చి బాగుగా చెప్పబడినది—

అక్షణ్వన్తః కర్ణవన్తః సఖాయో మనోజవేష్వసమా బభూవుః ।
అదఘ్నాస ఉపకక్షాస ఉ త్వే హ్రదా ఇవ స్నాత్వా
ఉ త్వే దదృశే॥ (ఋ. 10-71-7)

కళ్లు, చెవులు గలిగిన స్నేహితులు జ్ఞానమునకై ప్రయత్నించు వారియొక్క మనోవేగ మొక్కటిగా నుండదు. ఒకడు పుక్కిలింతలగు నీరుగల చెఱువువలెను, మఱొకడు చంకలలోతు నీరుగల చెఱువువలెను, ఇంకొకడు మునిగి స్నానముచేయుటకు తగినంత నీరుగల చెఱువువలెను విభిన్నముగా నుందురు. వేదము స్పష్టశబ్దములతోను, ఉదాహరణముల తోను మనుష్యులలోని యసమానతను వర్ణించెను. పై శ్లోకము వేదము యొక్క యొక యంగమునకు ఛాయానువాదము మాత్రమే.

శ్లో॥ నిఃస్పృహో నాఽధికారీ స్యాన్నాకామీ మండనప్రియః।
నాఽవిదగ్ధః ప్రియం బ్రూయాత్ స్ఫుటవక్తా న
వంచకః॥ 5

అర్థము :- అధికారీ=అధికారియైనవాడు, నిఃస్పృహః=కోరికలు లేనివాడు, లోభికానివాడు, న స్యాత్ = కాలేడు, అనగా అధికారము కల వాడు లోభగుణము లేనివాడగుట కష్టము, మండనప్రియః = శృంగార మును ప్రేమించువాడు, అకామీ = కోరికలులేనివాడు (కామములేనివాడు) న=కాడు, అవిదగ్ధః=విద్వాంసుడు కానివాడు, ప్రియం = ప్రియమైన మధురమైనవచనమును, న బ్రూయాత్=పలుకలేడు, స్ఫుటవక్తా = స్పష్ట ముగా చెప్పువాడు: వంచకః=మోసగాడు, న=కాలేడు.

తా॥ అధికారము గలవాడు కోరికలేనివాడు, లోభగుణములేనివా డుగా నుండడు. అనగా అధికారము కలిగియున్నవాడు లోభములేనివాడుగా నుండుట కఠినము. శృంగారప్రియుడు కామములేనివాడుగా నుండడు.
10)]

చాతుర్యము (నేర్పు) లేనివాడు విద్వాంసుడు కానివాడు ప్రియము, మధురము నగు వచనముల మాట్లాడలేడు. అట్లే స్పష్టముగా చెప్పువాడు మోసగాడు కాడు.

ఈ శ్లోకమున కర్థము క్రింది విధముగా కూడ చెప్పవచ్చును—

కోరికలు లేనివాడు, లోభగుణము లేని మనుష్యుడు అధికారిగా నుండదలపడు. కామములేనివాడు శృంగారప్రియుడు కాడు. మూర్ఖుడు ప్రియముగా మాట్లాడలేడు. వంచకుడు స్పష్టముగా మాట్లాడలేడు.

శ్లో॥ మూర్ఖాణాం పండితా ద్వేష్యాః అధనానాః మహాధనాః।
వారాఽఽఙ్గనాః కులస్త్రీణాం సుభగానాం చ దుర్భగాః॥ 6

అర్థము :: మూర్ఖాణాం=మూర్ఖులకు, పండితాః=విద్వాంసులును, అధనానాం=ధనములేని దరిద్రులకు, మహాధనాః=మిక్కిలిధనవంతులును, కులస్త్రీణాం=కాపురముచేయు మంచికులమందలి స్త్రీలకు, వారాంగనాః = వేశ్యలును, సుభగానాం=సౌభాగ్యస్త్రీలకు (పతికలవారికి) దుర్భగాః=విధవలును లేక దుర్భగాః=అందవిహీనులు, సుభగానాం=సుందరపురుషులకును. ద్వేష్యాః=శత్రువులు, (ద్వేషింపదగినవారు)

శ్లో॥ ఆలస్యోపహతా విద్యా పరహస్తగతాః స్త్రియః।
అల్పబీజం హతంక్షేత్రం హతంసైన్యమనాయకమ్॥ 7

అర్థము :- విద్యా=విద్య, ఆలస్యోపహతా = సోమరితనముతో నష్టమగును, పరహస్తగతాః=ఇతరుల చేతులలో చిక్కిన, స్త్రియః = స్త్రీలును నష్టపోవుదురు, అల్పబీజం=కొంచెముగా విత్తనములు చల్లబడిన, క్షేత్రం=పొలము, హతం=నష్టమగును, అనాయకం=నాయకుడులేనట్టి సైన్యం=సైన్యము, హతం=నశించును.

తా॥ విద్య సోమరితనముచే నశించును భర్తను విడిచి యితరుల చేతులలోబడిన స్త్రీలు చెడిపోవుదురు. తక్కువ విత్తనములుగల పొలము నశించును. నాయకుడులేని సైన్యము నశించును.

వివరణము :- ఇతరులను జేరిన స్త్రీ నష్టపోవును—

పరహస్తా గతా నారీ లేఖినీ చైవ పుస్తకమ్।
నపున రాయాన్త్యాయాన్తి చేద్ భ్రష్టా ముష్టా చుంబితాః॥

ఇతరుల చేతిలో బడ్డ స్త్రీ, కలము, పుస్తకము తిరిగిరావు. ఒక వేళ వచ్చినను కలము చెడిపోయి, (విఱిగిపోయి చిట్లిపోయి) పుస్తకము చినిగిపోయి, స్త్రీ ముద్దులు వగైరాలు పొంది దూషితయైచేరును.

నాయకుడులేని సేన మరణించును.

అనాయకా వినశ్యన్తి నశ్యన్తి బహునాయకాః।
స్త్రీ నాయకా వినశ్యన్తి నశ్యన్తి బాలనాయకాః॥

సేనాపతి లేని సేన నష్టమగును. నాయకులెక్కువున్నను నష్ట పోవును. స్త్రీ నాయకురాలైనను బాలకుడు (మూర్ఖుడు) నాయకత్వము వహించినను నష్టము వాటిల్లును.

శ్లో॥ అభ్యాసాద్ధార్యతే విద్యా కులం శీలేన ధార్యతే।
గుణేన జ్ఞాయతే త్వార్యః కోపో నేత్రేణ గమ్యతే॥ 8

అర్థము :- అభ్యాసాత్ = నిరంతరాభ్యాసమువలన, విద్యా = విద్య, ధార్యతే=ప్రాప్తించును, కులం=కులము, శీలేన = ఉత్తమగుణ కర్మస్వభావముతో, ధార్యతే=స్థిరముగానుండును, ఆర్యఃతు=శ్రేష్ఠపురుషు డైతే, గుణేన గుణముద్వారా, జ్ఞాయతే=తెలియబడుచున్నాడు, కోపః= కోపము, నేత్రేణ=కంటిద్వారా, గమ్యతే=తెలియబడుచున్నది.

తా॥ నిరంతరాభ్యాసమువలన విద్య ధారణచేయబడును. శీలము అనగా గుణకర్మ స్వభావములచే కులము స్థిరమైనదగును. మనుష్యుడు మంచిగుణముల ద్వారా ఆర్యుడగును. కోపము కంటిద్వారా తెలియబడును.

వివరణము :- అభ్యాస మననేమి ? (చరకుడు)

భావాభ్యసన మభ్యాసః శీలనం సతతక్రియా॥

ఏదైనభావము నెల్లపుడు సేవించుటయే అభ్యాసము. దీనినే శీలనము, సతతక్రియ యనియు నందురు.

పౌనః పున్యేన కరణమభ్యాస ఇతి కథ్యతే।
పురుషార్థం స ఏవేహ తేనాస్తి న వినాగతిః॥ (యో.నిర్వా.ఉ. 67-43)

మాటిమాటికి నే కార్యము చేయుదురో యది యభ్యాసము, దాని పేరే పురుషార్థము. అది లేనిది నడకసాగదు.

అజ్ఞోఽపి తజ్జ్ఞతామేతి శనైః శైలోఽపి చూర్ణ్యతే।
బాణోఽప్యేతి మహాలక్ష్యం పశ్యాభ్యాస విజృమ్భితమ్॥
(యోగవా. నిర్వా. ఉత్త. 67-26)

అభ్యాసముయొక్క చమత్కారము చూడుడు. దీనివలన అజ్ఞాని జ్ఞానియగును. పర్వతము కూడ మెల్లమెల్లగా చూర్ణమగును. బాణము కూడ అత్యంత సూక్ష్మమైన లక్ష్యమును భేదింపగలుగును.

దుఃసాధ్యాః సిద్ధిమాయాన్తి రిపవో యాన్తి మిత్రతామ్।
విషాణ్యమృతతాం యాన్తి సన్తతాభ్యాస యోగతః॥
(యో. వా. ని. ఉ. 67-33)

నిరంతరాభ్యాసముతో దుఃసాధ్యములుకూడ సాధ్యములగును, శత్రువులు మిత్రులగుదురు. విషము అమృతముగా పరిణమించును.

ఆర్యుడు గుణములచే గుర్తింపబడును. ఎవని నార్యుడందురు ?—

న వైరముద్దీపయతి ప్రశాంతం న దర్పమారోహతి నాస్తమేతి ।
న దుర్గతోఽస్మీతి కరోత్యకార్యం తమార్యశీలం పరమాహు
రార్యాః॥ (భార. ఉద్యో. 33-117)

వైరమను నగ్నిని ప్రకోపింపచేయక శాంతముగా నుండువాడును, గర్వము (దురభిమానము) లేనివాడును, హీనత్వమును కనబఱపనివాడు, నేను ఆపదలో చిక్కుకొంటినని నీచకార్యములు చేయనివాడును, ఇట్టి శ్రేష్ఠగుణములు గలవానిని ఆర్యుడందురు.

న స్వసుఖే వై కురుతే ప్రహర్షం చాన్యస్య దుఃఖే భవతి విషాదీ ।
దత్త్వా న పశ్చాత్ కురుతేఽనుతాపం స కథ్యతే సత్పురుషార్యశీలః॥
(భార. ఉ. 33-113)

తన సుఖముతోనే ప్రసన్నుడు కాకయు, ఇతరులు దుఃఖించుట జూచి దుఃఖపడువాడును, దానముచేసి తరువాత పశ్చాత్తాపము పొందనివాడును సజ్జనులలో ఆర్యుడనబడును.

శ్లో॥ విత్తేన రక్ష్యతే ధర్మో విద్యా యోగేన రక్ష్యతే ।
మృదునా రక్ష్యతే భూపః సత్స్త్రియా రక్ష్యతే గృహమ్॥9

అర్థము:- ధర్మః=ధర్మము, విత్తేన=ధనముతో, రక్ష్యతే=రక్షింపబడుచున్నది, విద్యా=విద్య, యోగేన=యమనియమాది యోగముద్వారా, రక్ష్యతే=రక్షింపబడుచున్నది, భూపః = రాజు, మృదునా = కోమలత్వముతో మాధుర్యముతో, రక్ష్యతే = రక్షింపబడుచున్నాడు, గృహం = గృహము, సత్ స్త్రియా=మంచిస్త్రీతో, రక్ష్యతే=రక్షింపబడుచున్నది.

తా॥ ధనముతో ధర్మము రక్షింపబడును. యమనియమాది యోగముద్వారా విద్యరక్షింపబడును. కోమలతతో, మధురతతో రాజు రక్షింపబడును. సాధ్వియైన స్త్రీచేత గృహము రక్షింపబడును.

వివరణము :- ధనములేకుండ ధర్మకార్యము నిర్వహింపబడ జాలదు. చాణక్యుడు మరొకచోట—

సుఖస్య మూలం ధర్మః-ధర్మస్య మూలమర్థః॥
(చాణక్య సూత్రములు-1-2)

సుఖమునకు కారణము ధర్మము, ధర్మమునకు కారణము ధనము. ధర్మముచే ధనము ప్రాప్తించును. మరొక రిట్లు చెప్పిరి—

ధర్మాదర్థః ప్రభవతి ధర్మాత్ప్రభవతే సుఖమ్ ।
ధర్మేణ లభతే సర్వం ధర్మసార మిదం జగత్॥

ధర్మముచే ధనము ప్రాప్తించును. ధర్మముచే సుఖముకలుగును. ధర్మముచే సమస్తము చేకూరును. ఈ ప్రపంచమంతయు ధర్మముయొక్క సారమే.

వ్యాసమహర్షి —

ఊర్ధ్వబాహు విరౌమ్యేష న చ కశ్చి చ్ఛృణోతి మే ।
ధర్మాదర్థశ్చ కామశ్చ స కిమర్థం న సేవ్యతే॥ (భార.స్వర్గా 5-62)

నేను రెండు చేతులు పైకెత్తి పిలిచిపిలిచి చెప్పుచున్నాను. కాని నామాట నెవడును వినుటలేదు. ధర్మమువలన మోక్షములభించును. అర్థము కామము సిద్ధించును. కాని లోకులు ధర్మమును సేవించుటలేదు.

సద్గుణవతియగు స్త్రీచే గృహము రక్షింపబడును—

భార్యామూలం గృహస్థస్య భార్యా మూలం సుఖస్య చ ।
భార్యా ధర్మ ఫలావాప్త్యం భార్యా సంతాన హేతవే॥

శ్రేష్ఠస్త్రీ గృహమునకు మూలము. భార్యయే సుఖమునకు కారణము. భార్యవలననే ధర్మఫలము సంప్రాప్తించును. భార్యవలననే సంతానప్రాప్తియుకలుగును.

స్త్రీలే గృహమును రక్షించువారు. ఇందువలన మనుమహర్షి స్త్రీల కుపదేశించెను—

సదా ప్రహృష్టయా భావ్యం గృహకార్యేషు దక్షయా।
సుసంస్కృతోపస్కరయా వ్యయే చాముక్తహస్తయా॥
(మను. 5-157)

స్త్రీ లెల్లపుడు సుప్రసన్నలుగా నుండవలెను. గృహకార్యములను చాకచక్యముతో నిర్వహించునదిగా నుండవలెను. ఇంటిలోనివస్తువులను శుభ్రముగాజేసి, గృహపరిసరప్రదేశముల పరిశుభ్రముగానుంచవలెను. అనావశ్యకములగు ఖర్చులను చేయకుండ నుండవలెను.

శ్లో॥ అన్యథా వేదపాండిత్యం శాస్త్రమాచార మన్యథా।
అన్యథా కువచః శాన్తం లోకాః క్లిశ్యన్తి చాన్యథా॥10

అర్థము :- వేదపాండిత్యం=వేదమునందలి విద్వత్తును, అన్యథా= వ్యర్థముగా జెప్పువాడు, నిందించువాడును, శాస్త్రమాచారం = శాస్త్రమును శ్రేష్ఠమగు నాచారములను, అన్యథా=వ్యర్థముగాజెప్పి అవిషయములో వివాదము చేయువాడును, శాంతం=శాంతపురుషునిగూర్చి, అన్యథా=వ్యర్థముగానే, కువచః=చెడ్డమాటలు చెప్పువారిని, మోసపుమాటలు మూర్ఖవచనములు పలుకునట్టి, లోకాః=ప్రజలు, అన్యథా చ=వ్యర్థముగానే, క్లిశ్యన్తి= కష్టములపాలై దుఃఖపడుదురు. అనగా నట్టివారు ఆ వస్తువులనుగాని, ఆ మనుష్యులనుగాని కొంచెముకూడ చెడగొట్టలేరు.

తా॥ వేదపాండిత్యము వ్యర్థమనిచెప్పువారు, శాస్త్రము, శ్రేష్ఠాచారములు పనికిరావని చెప్పుచు వివాదము చేయువారు, శాంతపురుషుని గూర్చి మోసగాడని, మూర్ఖుడని, చెడుగా మాట్లాడువారు వ్యర్థముగానే కష్టముల పాలగుదురు, అనగా వస్తువులలోని గుణమును, మనుష్యులలోని స్వభావ

మును కొంచెము కూడ చెడగొట్టలేరు సరికదా తామే కష్టముల పాలగుదురు.

శ్లో॥ దారిద్ర్యనాశనం దానం శీలం దుర్గతినాశనమ్ ।
అజ్ఞాన నాశినీ ప్రజ్ఞా భావనా భయనాశినీ॥ 11

అర్థము :- దానం=దానము, దారిద్ర్యనాశనం = దారిద్ర్యమును బోగొట్టును, శీలం=ఉత్తమగుణకర్మస్వభావము, దుర్గతి నాశనం=దౌర్భాగ్యమును నశింపజేయును, ప్రజ్ఞా = బుద్ధి, అజ్ఞాననాశినీ = అజ్ఞానమును నాశముచేయును, భావనా=నిష్ఠ, ఈశ్వరభక్తి, భయనాశినీ = భయమును పోగొట్టును.

తా॥ దానము దారిద్ర్యమును పోగొట్టును. శీలము అనగా ఉత్తమ గుణకర్మ స్వభావములు దుర్గతిని కష్టములను, దౌర్భాగ్యమును పోగొట్టును, బుద్ధి అజ్ఞానమును బోగొట్టును. నిష్ఠ ఈశ్వరభక్తి భయమును నశింపజేయును.

వివరణము :- దానమువలన దారిద్ర్యముపోవును.

ధనం లభతే దానేన మౌనే నాజ్ఞాం విశామ్పతే ।
ఉపభోగాంశ్చ తపసా బ్రహ్మచర్యేణ జీవితమ్॥

(భార. అను. 7-14)

ఓ రాజా! దానముచేత ధనము, మౌనముతో ఇతరులను ఆజ్ఞను పరిపాలించువానినిగా జేయు శక్తి, తపస్సుచేత నానా ప్రకారములగు ఉపభోగములు, బ్రహ్మచర్యపాలనమువలన దీర్ఘాయువు ప్రాప్తించును ఈశ్వరభక్తి భయమును నశింపజేయును. పరమాత్ముని యొడిలో నున్న వానికి భయమెక్కడిది? వేదము —

యస్య ఛాయాఽమృతం యస్య మృత్యుః॥ (యజు. 25-13)

పరమాత్మని ఆశ్రయము పొందుట యన భక్తి కలిగియుండుటయే, అదియే అమృతమునకు (చావు లేమికి) కారణము.

దయానందమహర్షి ఉపాసనాఫలము నిట్లు చెప్పెను—

"ఉపాసనవలన ఆత్మబలము అధికమగును. ఉపాసకుడు పర్వతముతో సమానమైన దుఃఖము ప్రాప్తించినను గాబరాపడక యంతటిని సహింపగలిగియుండును." (సత్యా. ప్ర. 7 వను)

శ్లో॥ నాఽస్తి కామసమో వ్యాధి ర్నాఽస్తి మోహ
సమో రిపుః ।
నాఽస్తి కోపసమో వహ్ని ర్నాఽస్తి జ్ఞానాత్
పరం సుఖమ్॥ 12

అర్థము :- కామ సమః = కామముతో సమానమైన, వ్యాధిః = వ్యాధి, న = లేదు, మోహసమః = మోహముతో సమానమైన, రిపుః = శత్రువు, నాస్తి = లేదు, కోపసమః = కోపముతో సమానమైన, వహ్నిః = అగ్ని, నాస్తి = లేదు, జ్ఞానాత్ = ఆత్మజ్ఞానముకంటె, పరం = మించిన, సుఖమ్ = సుఖము, నాస్తి = లేదు.

తా॥ కామముతో సమానమైన వ్యాధి మఱొకటిలేదు. మోహముతో సమానుడైన శత్రువు మఱొకడు లేడు. కోపముతో సమానమైనది మఱొక యగ్నిలేదు. ఆత్మజ్ఞానమునకు మించిన సుఖ మింకొకటి లేదు.

వివరణము :- కామముతో సమానమైన వ్యాధి మఱొకటి లేదని యొక కవి—

దివా పశ్యతి నోలూకః కాకో నక్తం న పశ్యతి ।
అపూర్వః కోఽపి కామాన్ధో దివానక్తం న పశ్యతి॥

గుడ్లగూబ పగలు చూడలేదు, కాకి రాత్రి చూడలేదు. కామాంధు డైనవాడు రాత్రింబవళ్లు చూడలేని యొక విచిత్రజంతువు.

అయం చ సురతజ్వాలః కామాగ్నిః ప్రణయేద్ధనః ।
నరాణాం యత్ర హూయన్తే యౌవనాని ధనాని చ॥ (మృచ్ఛ.4-11)

ప్రేమ దేనికి ఇంధనమో (కట్టె), సంభోగము దేనికి జ్వాల (మంట)యో అట్టి కామరూపాగ్ని మండుచుండును. ఆ అగ్నిలో మను ష్యుడు తన యౌవనమును, ఆహుతిగా నొసర్చును.

మమ మాతా మమ పితా మమేయం గృహిణీ గృహమ్ ।
ఏతదన్యం మమత్వం యత్ స మోహ ఇతి కీర్తితః॥ (పద్మ.పు.)

నా తల్లి, నా తండ్రి, నా భార్య, నా యిల్లు-ఇట్లే యన్నియు నావి నావి యనుకొనుటయే మోహము. మోహ మనగా బుద్ధినాశమే. ఈ మోహము ధర్మమును, అర్థమును రెంటిని నష్టపఱచును, ఇందువలన మనుష్యునిలో నాస్తిక్యము కలిగి వాడు దురాచారపరుడగుచున్నాడు.

క్రోధో నాశయతే ధైర్యం క్రోధో నాశయతే శ్రుతమ్ ।
క్రోధో నాశయతే సర్వం నాస్తి క్రోధ సమో రిపుః॥

క్రోధము, ధైర్యమును, శాస్త్రజ్ఞానమును, సర్వమును నశింప జేయును. కావున క్రోధముతో సమానుడైన శత్రువు లేడు.

ఆత్మజ్ఞానమునకు మించిన సుఖములేదు—

ఆత్మజ్ఞానం పరం జ్ఞానమ్ । (భార. శాం. 329-12)

ఆత్మజ్ఞాన మన్నిటికంటె గొప్ప జ్ఞానము.

వేద మిట్లు చెప్పుచున్నది—

యస్మిన్ సర్వాణి భూతా న్యాత్మైవా భూ ద్విజానతః ।
తత్ర కో మోహః కః శోకః ఏకత్వమను పశ్యతః॥ (యజు.40-7)

సమస్త పదార్థములందు ఓతప్రోత (విడదీయుటకు వీలులేని పడుగు పేకవలె) మై లోపల బయట వ్యాపకుడై యున్న పరమాత్మను దర్శించు ఆత్మజ్ఞానియైన యుపాసకునకు మోహ శోకములుండవు.

శ్లో॥ జన్మ మృత్యూ్యాహియాత్యేకో భునక్త్యేకః శుభాఽశుభమ్ ।
నరకేషు పతత్యేక ఏకో యాతి పరాం గతిమ్॥ 13

అర్థము :- మనుష్యుడు - ఏకః హి = ఒక్కడే (ఒంటరిగానే) జన్మమృత్యూ = జన్మమును, మృత్యువును, యాతి = పొందుచున్నాడు, ఏకః=ఒక్కడే, శుభాశుభం = శుభాశుభములను (పాపపుణ్యములను) భునక్తి=అనుభవించుచున్నాడు, ఏకః = ఒక్కడే, నరకేషు = నానావిధ దుఃఖములందు, పతతి=పడుచున్నాడు, ఏకః=ఒక్కడే, పరాంగతిమ్ = మోక్షమునకు, యాతి=వెళ్లుచున్నాడు, పొందుచున్నాడు.

తా॥ మనుష్యులలో నొకడు జన్మమరణములను, మఱొకడు పాప పుణ్యములను, ఇంకొకడు కష్టపరంపరలను (దుఃఖములను) మఱి యొకడు మోక్షమును అను వానిని ఎవరికి వారే యనుభవింతురు కాని వారి కెవ్వరును తోడుండరు.

వివరణము :- మనుష్యుడు కర్మఫల మనుభవించి తీఱవలెను. వేదము—

న కిల్బిషమత్ర నాధారో అస్తి న యన్మిత్రైః సమమమాన ఏతి ।
అనూనం పాత్రం నిహితం న ఏతత్ పక్తారం పక్వః
పునరావిశాతి (అథర్వం. 12-3-48)

న్యాయకారియైన పరమేశ్వరుని న్యాయవ్యవస్థలో నే దోషము నుండదు. ఏ యాధారమునుండదు. ఏ గురుబోధయుండదు. ఏ మిత్రుల సాయమునుండదు. మనము చేసిన కర్మలకు తగిన ఫలము నంభవించును. దానిని తగ్గించుటకు హెచ్చించుటకు నెవ్వరికిని సాధ్యముకాదు. మనము

పాత్రలలో తయారుచేసికొనిన యన్న మెట్లు భోగింపసగునో యట్లే చేసిన కర్మఫలము లనుభవింపబడుటకు సిద్ధముగానుండును.

శ్లో॥ తృణం బ్రహ్మవిదః స్వర్గ స్తృణం శూరస్య జీవితమ్ ।
జితాఽక్షస్య తృణం నారీ నిఃస్పృహస్య తృణం జగత్ ॥14

అర్థము :- బ్రహ్మవిదః = బ్రహ్మజ్ఞానికి, స్వర్గః = స్వర్గము, తృణం=గడ్డిపఱకతో సమానము, శూరస్య=శౌర్యవంతునకు, జీవితం= జీవనము, తృణం=గడ్డిపఱకతో సమానము, జితాక్షస్య=ఇంద్రియములు జయించినవానికి, నారీ=స్త్రీ, తృణం=తృణప్రాయము, నిఃస్పృహస్య = కోరికలులేనివానికి, జగత్=ప్రపంచము, తృణం = గడ్డితో సమానము.

తా॥ బ్రహ్మజ్ఞానులకు స్వర్గము (సుఖము), శూరవీరునకు జీవితము, జితేంద్రియునకు స్త్రీ, కోరికలులేని వానికి ప్రపంచము, తృణప్రాయముగా నుండును. అనగా తుచ్ఛముగా భావింతురు

శ్లో॥ విద్యా మిత్రం ప్రవాసేషు భార్యా మిత్రం గృహేషు చ।
వ్యాధితస్యౌషధం మిత్రం ధర్మో మిత్రం మృతస్య చ॥ 15

అర్థము :- ప్రవాసేషు = విదేశములందు, విద్యా = విద్య, మిత్రం=స్నేహితుడు, చ=మఱియు, గృహేషు= = గృహములందు, భార్యా=భార్య, మిత్రం=స్నేహితురాలు, వ్యాధితస్య=రోగము వచ్చిన వానికి, ఔషధం=ఔషధము, మిత్రం = స్నేహితుడు, చ = మఱియు, మృతస్య=చచ్చినవానికి, ధర్మః=ధర్మము, మిత్రం=మిత్రము

తా॥ విదేశములలో నున్నపుడు విద్యయు, గృహములందున్నపుడు భార్యయు, రోగికి ఔషధము, మరణించినవానికి ధర్మము మనుష్యునకు మిత్రముగా నుండును.

వివరణము :- ప్రవాసములో నున్నపుడు మనుష్యునకు విద్య సత్యమైన మిత్రము—

కామధేనుగుణా విద్యా హ్యకాలే ఫలదాయినీ।
ప్రవాసే మాతృ సదృశీ విద్యా గుప్తం ధనం స్మృతమ్॥

విద్య కామధేనువుతో సమానమైన గుణములు గలది. సమయము కాని సమయమందును ఫలము నిచ్చును. ప్రవాసములో నున్నపుడు తల్లి వలె మేలుచేయును. విద్య దాచబడిన ధనము వంటిది. ఇంటిలో స్త్రీ మిత్రము—

అర్ధం భార్యా మనుష్యస్య భార్యా శ్రేష్ఠతమః సఖా।
భార్యా మూలం త్రివర్గస్య భార్యా మూలం తరిష్యతః॥
(భార. ఆది. 74-41)

భార్య పురుషునకు సగము శరీరము. భార్య పురుషునకు సర్వ శ్రేష్ఠ మిత్రము. ధర్మార్థకామములకు భార్య మూలము. అట్లే యీ సంసారసాగరము తరింపజేయు సాధనము భార్య.

సఖాయః ప్రవివిక్తేషు భవన్త్యేతాః ప్రియంవదాః।
పితరో ధర్మకార్యేషు భవన్త్యార్తస్య మాతరః॥ (భార.ఆది.74-43)

భార్య యేకాంత ప్రదేశమున ప్రియవచనములు చెప్పు మిత్రుని వంటిదియు, ధర్మకార్యములు చేయునపుడు తండ్రివలె మేలుకోరు నట్టి దియు, సంకటకాలమందు తల్లివలె దుఃఖముల బోగొట్టునదియు నగును. చచ్చినవానికి మిత్రునివంటిది ధర్మము—

ధనాని భూమౌ పశవశ్చ గోష్ఠే
భార్యా గృహద్వారి సఖా శ్మశానే।
దేహశ్చితాయాం పరలోకమార్గే
ధర్మానుగో గచ్ఛతి జీవ ఏకః॥

జీవితమంతయు సంపాదించిన ధనము భూమి మీదను, పెంచిన పశువులు గోశాలలోను, భార్య యింటి ద్వారమునందును, బంధుబాంధవులు స్నేహితులు శ్మశానము వఱకు వెంట నుందురు. మిక్కిలి ప్రీతితో చూచుకొన్న తన శరీరము భస్మమగు వఱకు నుండును. పరజన్మకు పోవునపుడు జీవునివెంటనంటి వచ్చునవి శుభాశుభకర్మలు మాత్రమే. తక్కిన వేవియు రావు.

నా పుత్ర హి సహాయార్థం పితా మాతా చ తిష్ఠతః।
న పుత్ర దారా న జ్ఞాతి ర్ధర్మ స్తిష్ఠతి కేవలః॥ (మనువు. 4-239)

పరలోకమున తల్లిదండ్రులు, పుత్రులు, భార్య, బంధుబాంధవులు మొదలగు వారెవ్వరు సాయపడరు అక్కడ ధర్మమును మాత్రమే వెంట నుండి సాయపడును.

మృతం శరీర ముత్సృజ్య కాష్ఠలోష్ఠ సమం క్షితౌ।
విముఖా బాంధవా యాన్తి ధర్మ స్త మను గచ్ఛతి॥ (మను. 4-241)

బంధుబాంధవులు నిర్జీవమైన శరీరమును (శవమును) కట్టెలు, మట్టిగడ్డలతో సమానముగా భూమిమీద విడిచి తమ యిండ్లకు తిరిగి పోవుదురు. అతడు చేసిన ధర్మమొక్కటే యతని వెంటనుండును.

శ్లో॥ వృథా వృష్టిః సముద్రేషు వృథా తృప్తేషు భోజనమ్।
వృథా దానం ధనాఢ్యేషు వృథా దీపో దివాఽపిచ॥ 16

అర్థము :- సముద్రేషు = సముద్రములందు, వృష్టిః = వర్షము, వృథా = వ్యర్థము, తృప్తేషు = భోజనముతో తృప్తిపొందినవారికి, భోజనం = భోజనము, వృథా = వ్యర్థము, ధనాఢ్యేషు = ధనవంతులకు, దానం = దానము చేయుట, వృథా = వ్యర్థము, చ = మఱియు, దివా = పగలు, దీపః అపి = దీపముకూడ, వృథా = వ్యర్థము.

తా॥ సముద్రములందు వర్షించుటయు, ఆకలి లేక తృప్తిపొందిన వారికి భోజనము ధనవంతులకు దానమిచ్చుట, పగలు దీపము వెలిగించుటయు వ్యర్థము

వివరణము :- ధనికులకు దానమిచ్చుట వ్యర్థము—

దరిద్రాన్ భర కౌంతేయ మా ప్రయచ్ఛేశ్వరే ధనమ్ ।
వ్యాధిత స్యౌషధం పథ్యం నీరుజస్య కిమౌషధైః॥
(హితోపదేశము 1-15)

యుధిష్ఠిర! (ధర్మరాజా!) దరిద్రులను పోషించుము ధనికులకు దానమీరాదు. రోగులకు ఔషధమిచ్చుట మేలుకాని, రోగములేని వాని కౌషధము వ్యర్థము కదా!

శ్లో॥ నాఽస్తి మేఘ సమం తోయం నాఽస్తి చాత్మ
సమం బలమ్ ।
నాఽస్తి చక్షుః సమం తేజో నాఽస్తి
ధాన్య సమం ప్రియమ్॥ 17

అర్థము :- మేఘసమం = మేఘ జలముతో సమానమైన, తోయం=నీరు, నాస్తి=లేదు, ఆత్మసమం = ఆత్మబలముతో సమానమైనది శరీరములోగాని పృథివిపైగాని మరొకటి, బలం=బలము, నాస్తి = లేదు, చక్షుః సమం = కన్నుతో సమానమైనది శరీరములో మరొక, తేజః=తేజస్సు, నాస్తి=లేదు, ధాన్యసమం=అన్నముతో సమానమైనది మరొకటి, ప్రియం=ప్రియమైనది, నాస్తి=లేదు.

తా॥ మేఘజలముతో సమానమైన శుద్ధజలములేదు. ఆత్మ బలముతో సమానమైన బలము శరీరములో కాని పృథివిలో కాని రెండవది లేదు. కన్నుతో సమానమైన తేజస్సు గల యింద్రియము శరీరములో

వుతొకటి లేదు. ధాన్యముతో (అన్నముతో) సమానమైన వస్తువు వుతొకటి లేదు.

వివరణము :- మేఘజలముతో సమానమైన శుద్ధ జలము వేరొకటి లేదు. మేఘములోని జలము భూమిలోని ఆవిరితో తయారగును. ఆవిరితో తయారైన జలమును ఇంగ్లీషులో 'డిస్టిల్డ్ వాటర్' అందురు. మేఘములో జరుగు నీ క్రియ మనుష్యులవలన జరుగునది కాక ప్రాకృతికముగా జరుగునదే. అందుచేత మేఘజలము పృథివీజలముతో కలియక గుణముకలదియు పవిత్రమైనదియు నగును. మేఘముల ద్వారా పైనుండి పడుటచే నే పాత్రలోను పడనిదగుటచే పాత్రలకు సంబంధించిన దోషము లేక పవిత్రమైన సర్వశ్రేష్ఠముగా నుండును.

శ్లో॥ అధనా ధనమిచ్ఛన్తి వాచం చైవ చతుష్పదాః।
మానవాః స్వర్గమిచ్ఛన్తి మోక్ష మిచ్ఛన్తి దేవతాః॥18

అర్థము :- అధనాః = ధనములేనివారు, ధనం = ధనమును, ఇచ్ఛన్తి = కోరుచున్నారు, చతుష్పదాః = నాలుగుకాళ్ల జంతువులు, చ = కూడ, వాచం = వాక్కునే, ఇచ్ఛన్తి = కోరుచున్నవి, మానవాః = మనుష్యులు, స్వర్గం = సుఖమును, ఇచ్ఛన్తి = కోరుచున్నారు. దేవతాః = పండితులు, జ్ఞానులు, మోక్షం = మోక్షమును, (జన్మరాహిత్యమును) ఇచ్ఛన్తి = కోరుచున్నారు.

తా॥ ధనహీనులు ధనమును కోరుచుందురు నాలుగు కాళ్ల పశువులు వాక్కును (మాట్లాడవలెనని) కోరుచున్నవి. మానవులు స్వర్గమును (సుఖమును) కోరుచుందురు దేవతలు (విద్వాంసులు) మోక్షమును కోరుచున్నారు.

శ్లో॥ సత్యేన ధార్యతే పృథ్వీ సత్యేన తపతే రవిః।
సత్యేన యాతి వాయుశ్చ సర్వం సత్యే ప్రతిష్ఠితమ్॥ 19

అర్థము :- సత్యేన=సత్యముతో, పృథ్వీ=పృథివి, ధార్యతే= ధరింపబడుచున్నది. స్థిరముగానున్నది, రవిః = సూర్యుడు, సత్యేన = సత్యముతో, తపతే=తపించుచున్నాడు, సత్యేన = సత్యముతో, వాయుః చ=గాలికూడ, వాతి=వీచుచున్నది, సర్వం=సమస్తము, సత్యే=సత్యమందే, ప్రతిష్ఠితమ్=స్థిరముగానున్నది

తా॥ సత్యమువలన పృథివి స్థిరముగా నున్నది. సూర్యుడు సత్యబలముతో తపించుచున్నాడు. సత్యము వలన వాయువు వీచుచున్నది. సమస్తము సత్యమందే స్థిరమైయున్నది.

వివరణము :- పృథివి సత్యము యొక్క ఆధారముతో నిలిచియున్నది. వేదము—

సత్యేనోత్తభితా భూమిః। (ఋ. 10-85-1)

భూమి సత్యముపై నాధారపడి స్థిరముగా నున్నది.

వేదములో మఱొకచోట పృథివి యెనిమిది స్తంభములపై నిలిచియున్నదని చెప్పబడినది ఆ యెనిమిది స్తంభములలో సత్యమొకటి—

సత్యం బృహదృత ముగ్రం దీక్షా తపో బ్రహ్మ యజ్ఞః
పృథివీం ధారయన్తి (అథ. 12-1-1)

సత్యము, విశాలత, నియమము (వ్యవస్థ) ఉగ్రత (తేజస్విత) దీక్ష, తపము, బ్రహ్మ (జ్ఞానము) యజ్ఞము (పరోపకారము) కలాకౌశలము, ఉద్యోగమునకు ఏర్పాటు—ఈ యెనిమిది పృథివిని ధరించు స్తంభములు.

మఱొక శ్లోకము చూడుము—

గోభిర్విప్రైశ్చ వేదైశ్చ సతీభిస్సత్యవాదిభిః।
అలుబ్ధైర్దానశీలైశ్చ సప్తభిర్ధార్యతే మహీ॥ (స్కాంద.మా.కు.2-71)

ఆవు, బ్రాహ్మణుడు, వేదము, పతివ్రత. సత్యవాది, లోభికాని వాడు, దానశీలుడు, శూరవీరుడు నను ఏడుగురిపై పృథివి స్థిరపడియున్నది. ఇక్కడ సత్యవాదులను పృథివి ధారకులుగా నంగీకరించెను.

సత్యము యొక్క మహిమ గొప్పది—

సత్యమేవేశ్వరో లోకే సత్యే ధర్మః సదాశ్రితః ।
సత్యమూలాని సర్వాణి సత్యాన్నాస్తి పరం పదమ్॥
(వాల్మి. రా. అయో. 109-13)

ప్రపంచములో సత్యమే యీశ్వరుడు. ఎల్లపుడు ధర్మము సత్యముపై నాధారపడియుండును. సత్యమే సర్వమునకు మూలము. సత్యమును మించిన శ్రేష్ఠమైన పదము మఱొకటిలేదు. సత్యమనగా పరమేశ్వరుడనియు నర్థముకలదు. పరమేశ్వరు డను నర్థముతీసికొన్నచో చాణక్యుడు పైన వ్రాసిన శ్లోకమున కర్థము సరిపోవును. పరమేశ్వరుడు పృథివిని ధరించెను. అతని ప్రతాపము వలన సూర్యుడు ప్రకాశించుచున్నాడు. అతని వలని భయమువలన వాయువు వీచును. సమస్తము పరమేశ్వరుని వలననే స్థితమైయున్నది.

ఉపనిషత్తులలో—

భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః ।
భయాదిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః॥ (కఠ. 6-3)

పరమేశ్వరుని భయమువలన (శాసనము, నియమము, వ్యవస్థ) అగ్ని ప్రజ్వరిల్లును. అతని భయమువలన సూర్యుడు ప్రకాశించును విద్యుత్తు వాయువు ఆయన నియమము వలన నడచుచున్నవి. ఆయన శాసనమువలన మృత్యువు పాఱిపోవును.

శ్లో॥ చలా లక్ష్మీశ్చలాః ప్రాణాశ్చలం జీవిత-యౌవనమ్ ।
చలాచలేచ సంసారే ధర్మ ఏకో హి నిశ్చలః 20

అర్థము - లక్ష్మీః = ధనసంపత్తి, చలా=చంచలమైనది (స్థిరమైనది కాదు), ప్రాణాః=ప్రాణములు, చలాః = చలన స్వభావముకలవే, జీవిత యౌవనం = జీవనము యౌవనముకూడ, చలం = అస్థిరమైనదే, సంసారే = ప్రపంచములో, చలాచలే = చలములు అచలములు, చేతనములు, జడములు, ధర్మః = ధర్మము, ఏకః - ఒక్కటే, హి = నిశ్చయముగా, నిశ్చలః=చలింపనిది. స్థిరముగా నుండునది.

తా॥ లక్ష్మి (ధనసంపత్తి) చంచలమైనది. (నశించునది) ప్రాణములు నాశస్వభావము కలవి. జీవనము యౌవనము నిశ్చలములేనివి. చరాచర ప్రపంచములో ధర్మమొక్కటే నిశ్చలమైనది.

వివరణము :- ధనము చంచలమైనది. ఋదములో—

అన్యమన్యముపతిష్ఠన్త రాయః॥ (ఋ. 10-117-5)

ధనము తిరిగెడు రథచక్రమువలె నొకదాని తరువాత నొకటి వచ్చుచు పోవుచు నుండును

యౌవనం జీవనం చిత్తం ఛాయా లక్ష్మీశ్చ స్వామితా ।
చంచలాని షడేతాని జ్ఞాత్వా ధర్మరతో భవేత్॥ (శుక్రనీతి. 1-138)

యౌవనము, జీవనము, చిత్తము, ఛాయ, లక్ష్మి, ప్రభుత్వము - ఈ యాఱును చంచలములు. ఈ విషయము గుర్తించి మనుష్యుడు ధర్మరతుడు కావలెను.

శ్లో॥ నరాణాం నాపితో ధూర్తః పక్షిణాం చైవ వాయసః ।
చతుష్పదాం శృగాలస్తు స్త్రీణాం ధూర్తా చ మాలినీ॥ 21

అర్థము :- నరాణాం = మనుష్యులలో, నాపితః = మంగలి, ధూర్తః = తెలివికలవాడు, పక్షిణాంచ = పక్షులలోను, వాయసః ఏవ = కాకియే ధూర్తః = మిక్కిలి కపటత్వము కలది, చతుష్పదాం = నాలుగుకాళ్ల జంతువు,

లలో, శృగాలః=నక్క తెలివిగలది, స్త్రీణాం=స్త్రీలలో, మాలినీ=దండలు గ్రుచ్చునది, ధూర్తా=నేర్పుగలది.

తా॥ మానవులతో మంగలి తెలివిగలవాడు. పక్షులలో కాకి తెలివిగలది. నాలుగుకాళ్ల జంతువులలో నక్క తెలివిగలది. స్త్రీలలో పూలుకట్టు స్త్రీ తెలివిగలది.

వివరణము :- మా దృష్టిలో ఈ శ్లోక మెవడో ధూర్తుడు ప్రక్షిప్తము చేసినట్లున్నది.

పంచమాధ్యాయము సమాప్తము

# షష్ఠాధ్యాయము

శ్లో॥ శ్రుత్వా ధర్మం విజానాతి శ్రుత్వా త్యజతి దుర్మతిమ్ ।
శ్రుత్వా జ్ఞాన మవాప్నోతి శ్రుత్వా
మోక్షమవాప్నుయాత్ ॥ 1

అర్థము :- మనుష్యుడు, శ్రుత్వా = వేదాదిశాస్త్రముల విని, ధర్మం = ధర్మము యొక్క రహస్యములను, విజానాతి = తెలిసికొనుచున్నాడు, శ్రుత్వా = శాస్త్రములను, విద్వాంసుల ప్రవచనములను విని, దుర్మతిం=దుర్బుద్ధిని, త్యజతి=విడుచుచున్నాడు, శ్రుత్వా=శాస్త్రములను విని జ్ఞానం = జ్ఞానవిజ్ఞానములను, అవాప్నోతి = పొందుచున్నాడు, శ్రుత్వా=వినియే, మోక్షం=మోక్షమును, అవాప్నుయాత్=పొందవలెను.

తా॥ మనుష్యుడు వేదాదిశాస్త్రములు విని ధర్మరహస్యముల నెఱుంగును. శాస్త్రములను, విద్వాంసుల ప్రవచనములను విని దుర్బుద్ధిని విడుచును. శాస్త్రములను విని జ్ఞానవిజ్ఞానములను పొందును. శాస్త్రాదుల

గురువుల ద్వారా విని ప్రపంచబంధములనుండి విడివడి మోక్షమును పొందును.

వివరణము :- మనుష్యుడు బాగుగా చదివి విద్వాంసుడగును. బాగుగా విని బహుశ్రుతుడగును. అందుచేత శాస్త్రముల వినవలెను. పర మాత్మ మనుష్యునకు రెండు చెవుల నొక నోరు నిచ్చెను. అందుచేత మనుజుడు ఎక్కువగా వినవలెను. తక్కువగా మాట్లాడవలెను.

శ్లో॥ పక్షిణాం కాకశ్చాండాలః పశూనాం చైవ కుక్కురః ।
మునీనాం కోపీ చాండాలః సర్వేషాం చైవ నిన్దకః॥ 2

అర్థము :- పక్షిణాం = పక్షులలో, కాకః = కాకి, చాండాలః = చాండాలమైనది, నీచమైనది, చ = మఱియు, పశూనాం = పశువులలో, కుక్కురః ఏవ = కుక్కయే, చాండాలః = నీచమైనది, మునీనాం = మును లలో, కోపీ = కోపించువాడు, చాండాలః = చాండాలుడు, అట్లే, సర్వేషాం = అందఱిలో, నిందకః = ఇతరులను నిందించువాడు, ఏవ = కూడ, చాండా లః = చాండాలుడే.

తా॥ పక్షులలో కాకి, పశువులలో కుక్క, మునులలో ముక్కోపి అందఱిలోను పరులను నిందించువాడును చాండాలుడు.

వివరణము :- దేనిని నిందయందురు ? 'గుణేషు దోషారోపణం, దోషేషు గుణారోపణం నిందా' - గుణములందు దోషము నారోపించు టయు, దోషములందు గుణము లారోపించుటయు నిందయగును. కాకి అన్నింటిని దినును కావునను కుక్క కక్కి దానిని మరల నాకి తినును కావునను, క్రోధము స్వయముగా నీచమైనది కావునను, యివి యన్నియు చాండాలమైనవే. మనుష్యుడు కూడ దోషములను గుణములుగా, గుణము లను దోషముగా చూచును కావున నట్టి వాడు చాండాలుడే.

శ్లో॥ భస్మనా శుధ్యతే కాంస్యం తామ్రమమ్లేన శుధ్యతి।
రజసా శుధ్యతే నారీ నదీ వేగేన శుధ్యతి॥ 3

అర్థము :- కాంస్యం = కంచుపాత్ర, భస్మనా = బూడిదతో, శుధ్యతే = శుద్ధిచేయబడుచున్నది, తామ్రం = రాగిపాత్ర, అమ్లేన = చింత పండుతో, శుధ్యతి = శుభ్రమగుచున్నది, నారీ = స్త్రీ. రజసా = రజస్వల యగుటచే, శుధ్యతే = పవిత్రయగుచున్నది, నదీ = నది, వేగేన = ప్రవాహ వేగముతో, శుధ్యతి = నిర్మలమగుచున్నది.

తా॥ కంచుపాత్ర బూడిదతోను, రాగిపాత్ర చింతపులుసుతోను, స్త్రీ రజస్వలయగుటతోను, నది తీవ్ర గమనము గలిగియు (వరద వచ్చుటచే) నిర్మలములగును.

వివరణము :- దుష్టులద్వారా దూషితయైన స్త్రీ రజస్వలయైనచో శుద్ధయగును అనగా నేకారణముచేతనైన స్త్రీ దుష్టులచే బలాత్కరింపబడి చెఱపబడి నను రజస్వలానంతరము శుద్ధయై స్వీకరింపదగును. ఉమ్మి, మలమూత్రాదులు, చెత్త చెదారముతో మలినమైనట్టిది ప్రవాహము వచ్చి నంతనే పవిత్రమగుచున్నది

శ్లో॥ భ్రమన్ సంపూజ్యతే రాజా భ్రమన్
సంపూజ్యతే ద్విజః।
భ్రమన్ సంపూజ్యతే యోగీ స్త్రీ భ్రమన్తీ వినశ్యతి॥ 4

అర్థము :- రాజా = రాజు, భ్రమన్ = తిరుగుచు, సంపూజ్యతే = పూజింపబడుచున్నాడు, ద్విజః = బ్రాహ్మణుడు, విద్వాంసుడు, భ్రమన్ = తిరుగుచు, సంపూజ్యతే = పూజింపబడుచున్నాడు, యోగీ = యోగియైన వాడు, భ్రమన్ = దేశసంచారముచేయుచు, సంపూజ్యతే = పూజింపబడు

చున్నాడు, స్త్రీ=స్త్రీ, భ్రమన్తీ=ఇటు నటు తిరుగుచున్నదై, వినశ్యతి = నశించుచున్నది. చెడిపోవుచున్నది.

తా॥ రాజు ప్రజల క్షేమాదుల నరయుటకు తిరుగుచు, విద్వాంసుడు తన విజ్ఞానమును పంచిపెట్టుటకు తిరుగుచు, యోగాభ్యాసములోని విశేషముల దెల్పుటకు యోగి తిరుగుచు పూజింపబడుదురు. అటు నిటు తిరుగుచు స్త్రీ పరులచే బలాత్కరింపబడి భ్రష్టయగును. పతితయగును.

వివరణము :- మనుమహర్షి స్త్రీ దూషితయగుటకు నారుకారణముల దెల్పెను. అందులో భ్రమణ మొకటి—

పానం దుర్జనసంసర్గః పత్యా చ విరహోఽటనమ్ ।
స్వప్నోఽన్యగేహవాసశ్చ నారీ సందూషణాని షట్॥ (మను.9-13)

మత్తును కలిగించు మాదకద్రవ్యసేవనము, దుష్టపురుష సంబంధము, పతివియోగము, మోసగాండ్రు పాఖండులునైన బాబాలు మొదలగు వారి దర్శనము కొఱకు నిటు నటు తిరుగుట, ఇతరుల యిండ్లలో నివాసము చేయుట యను నారును స్త్రీని దూషితగా జేయును

శ్లో॥ తాదృశీ జాయతే బుద్ధి ర్వ్యవసాయోఽపి తాదృశః ।
సహాయాస్తాదృశా ఏవ యాదృశీ భవితవ్యతా॥ 5

అర్థము :- యాదృశీ = ఏ విధముగా, భవితవ్యతా = కావలసియున్నదో, తాదృశీ = అట్టిదియే, బుద్ధిః=బుద్ధి, జాయతే = పుట్టును, కలుగును, వ్యవసాయోఽపి=ప్రయత్నము, ఉపాయముకూడ, తాదృశః= అట్టిదేయగును, సహాయాః=సహాయులుకూడ, తాదృశాః ఏవ = అట్టివారే లభింతురు.

తా॥ తన భవిష్యత్తు ఏమి కానున్నదో దానికి దగిన బుద్ధియే కలుగును. వ్యవసాయము (ప్రయత్నము, ఉపాయము) దానికి దగినట్లే యుండును. సాయపడునట్టిది కూడ నట్టిదే సంభవించును.

వివరణము :- మనుష్యుడు వర్తమానకాలములో పూర్వజన్మ కర్మఫలముల ననుభవించును. భాగ్యమేది యన—

పూర్వజన్మ కృతం కర్మ తద్దైవమితి కథ్యతే॥

పూర్వజన్మములో చేసిన కర్మఫలములనే అదృష్టము, భాగ్యము నందురు.

కావలసిన దేదైన నున్నచో నది జరిగియే తీరును. శ్రీరాముడు బుద్ధిమంతుడయ్యు బంగారులేడి వెంట పరుగెత్తెను—

అసంభవం హేమమృగస్య జన్మ
తథాఽపి రామో లులుభే మృగాయ।
ప్రాయః సమాపన్న విపత్తికాలే
ధియోఽపి పుంసాం మలినీ భవన్తి॥ (మహానాటకము-4-5)

బంగారులేడి యుండుట యసంభవమని యెఱింగియు శ్రీరాముడు లోభగుణము కలవాడై బంగారులేడి వెంటబడెను- దీనివలన దెలియునదే మనగా ఆపత్తికలుగవలసిన సమయమున మనుష్యులబుద్ధి మలినమై ఆలోచనాశక్తిని గోల్పోవును. లక్ష్మణుడు-ఇది మారీచుని మాయవలె నాకు తోచుచున్నదని చెప్పినను వినక శ్రీరాముడు బంగారులేడి వెంట బడుట జరుగవలసినది తప్పక జరిగియే తీరుటకాక యన్యమేమగును ?

శ్లో॥ కాలః పచతి భూతాని కాలః సంహరతే ప్రజాః।
కాలః సుప్తేషు జాగర్తి కాలో హి దురతిక్రమః॥ 6

అర్థము :- కాలః = కాలము, సమయము, భూతాని = ప్రాణులన్నిటిని, పచతి = మ్రింగుచున్నది. కాలః = కాలమే, ప్రజాః = ప్రజలనందఱిని సంహరతే = నాశముచేయుచున్నది కాలః = కాలము సుప్తేషు =

=నిద్రించుచుండ గానసగానసర్వపదార్థములునశించినను జాగర్తి=మేల్కొని యుండును, మిగిలియుండును, కాలః = కాలము దురతిక్రమః = అతిక్రమింపరానిది హి=గదా!

తా॥ కాలము (సమయము) ప్రాణులను పచనము (జీర్ణము) చేయుచున్నది. మ్రింగును. కాలమే ప్రజలను నాశముచేయును. సమస్త పదార్థములు నశించినను కాలము నిలిచియుండును. నిశ్చయముగా కాలము నెవ్వడును నుల్లంఘింపజాలడు. అతిక్రమింపలేడు.

వివరణము :- కాలమునకు సంబంధించి వేదవచనము—

కాలో అశ్వో వహతి సప్తరశ్మిః సహస్రాక్షో అజరో భూరిరేతాః।
తమారోహన్తి కవయో విపశ్చితస్తస్య చక్రా భువనాని విశ్వా॥
(అథర్వ. 19-53-1)

కాలరూపమైన గుఱ్ఱము విశ్వరూపమైన రథమును లాగుచున్నది. ఏడురోజులు లేక ఏడు ఋతువులు అనునవి ఈ గుఱ్ఱమునకు ఏడు పగ్గములు కలవు లెక్కలేనన్ని ప్రాణుల శరీరముల నశింపజేయును కాని తానెన్నడు జీర్ణముకాక మిక్కిలి బలముగలదిగానుండును. కవులు మేధావులు దానిపై నెక్కుదురు. అనగా దానిని తగినట్లుగా నమయోచితముగా నుపయోగించుకొందురు. లోకలోకాంతరములు దాని చక్రములు, అనగా కాలము ద్వారానే లోకలోకాంతరములు చక్రమువలె తిరుగుచున్నవి. — మహాభారతములో యక్షుడు ధర్మరాజు నడిగెను—

'కావార్తా' - సమాచార మేమనెను ? ధర్మరాజు సమాధానము—

అస్మిన్ మహామోహమయే కటాహే
సూర్యాగ్నినా రాత్రి దివేన్ధనేన।
మాసర్తుదర్వీ పరిఘట్టనేన
భూతాని కాలః పచతీతి వార్తా॥ (భార. వన. 313-118)

ఈ మహామోహరూపకళాయియందు (ప్రపంచములో), కాలము సమస్తప్రాణులను మానము, ఋతువుల రూపమగు తెడ్డుతో కలయ త్రిప్పుచు, సూర్యరూపాగ్నిని, రాత్రిందివము లను కట్టెలతో మండించి పచనము (వండుట) చేయుచున్నది. ఇది యే వార్తయనెను.

శ్లో॥ న పశ్యతి చ జన్మాన్ధః కామాన్ధో నైవ పశ్యతి ।
న పశ్యతి మదోన్మత్తో హ్యర్థీ దోషాన్ న పశ్యతి॥ 7

అర్థము :- జన్మాంధః = పుట్టు గ్రుడ్డి, న పశ్యతి = చూడలేడు, కామాంధః = కామాంధుడు, నైవ పశ్యతి = చూడనే చూడడు మదోన్మత్తః = మదోన్మత్తుడు, మత్తుపదార్థముల సేవించినవాడు, న పశ్యతి = చూడడు, అర్థీ = స్వార్థపరుడు, దోషాన్ = దోషములను, న పశ్యతి హి = చూడడు గదా !

తా॥ పుట్టుగ్రుడ్డి చూడలేడు. కామాంధుడు కూడ మంచిచెడ్డల చూడడు. సారాయి మొదలగు మత్తుపదార్థములు సేవించినవాడు కూడ ముందు వెనుక చూడడు. స్వార్థపరుడైన మనుష్యుడుకూడ చేయు పని లోని మంచిచెడ్డల గమనింపడు.

కామప్రాబల్యమునుగూర్చి భర్తృహరి—

కృశః కాణః ఖంజః శ్రవణరహితః పుచ్ఛవికలో
వ్రణీ పూయక్లిన్నః కృమికులశతై రావృతతనూః ।
క్షుధాక్షామో జీర్ణః పిఠరక కపాలార్పితగలః
శునీమన్వేతి శ్వా హతమపి నిహన్త్యేవ మదనః॥

(భర్తృ. శృం. 63)

ఆహారము లేక చిక్కి చిక్కియున్నను, ఒంటికంటిదైనను, కుంటిదైనను చెవి తెగినదైనను, తోకలేనిదైనను పుండుపడి చీముకారుచున్నను, పురుగులుపడిన శరీరము కలదైనను, ఆహారము లేక ముసలితనముతో కూడు

మున్న శరీరము కలదైనను, పగిలినకుండపూతిని మెడకుతగిలించుకొని కుక సంభోగము కొఱకు ఆడు కుక్క వెంటబడిపోవుచుండును. ఓహో ! ఇన్ని విధములనష్టపోయియున్నను కుక్కను ఇంకను బాధించుచున్న ఆ కామ దేవుడెంతటి వాడో కదా !

శ్లో॥ స్వయం కర్మ కరోత్యాత్మా స్వయం తత్ఫలమశ్నుతే।
స్వయం భ్రమతి సంసారే స్వయం తస్మాద్విముచ్యతే॥ 8

అర్థము :- ఆత్మా = జీవుడు, స్వయం = స్వయముగా, తానే, కర్మ=కర్మను, కరోతి = చేయుచున్నాడు, స్వయం = స్వయముగానే, తత్ఫలం=ఆ కర్మఫలమును, అశ్నుతే=అనుభవించుచున్నాడు, స్వయం= స్వయముగా తానే, సంసారే=ప్రపంచములో, భ్రమతి=వివిధ్న యోనులలో బుట్టుచున్నాడు, స్వయం=స్వయముగానే పురుషార్థమొనర్చి, తస్మాత్ = ఆ సంసారబంధనమునుండి, రాకపోక లను చక్రమునుండి, విముచ్యతే= విడువబడి మోక్షముపొందును.

తా॥ జీవుడు స్వయముగానే శుభాశుభకర్మలుచేసి స్వయముగానే శుభాశుభఫలముల ననుభవించుచున్నాడు. స్వయముగానే ప్రపంచములో వివిధ్నయోనులలో పుట్టుచు చచ్చుచు తిరుగును, స్వయముగానే యీ సంసార చక్రబంధనమునుండి విడివడి ముక్తిని పొందుచున్నాడు.

వివరణము :- మనుష్యుడు కర్మచేయుటలో స్వతంత్రుడు. కర్మ చేసిన తరువాత పరమాత్ముని వ్యవస్థచేత శుభాశుభ, పుణ్యపాపముల ననుభవించును. గంగలోకాని, యమునలోగాని, సముద్రములోకాని మునిగిస్నానముచేసినను ఆ కర్మలఫలములు అనుభవింపనిదే విడిచి పెట్టవు—

నా భుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి।
అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్॥
(బ్రహ్మవైవర్త. ప్రకృతి. 37-16)

మనుష్యుడు చేసిన శుభాశుభకర్మల ఫలితమనుభవింపకుండ కోట్ల కొలది సంవత్సరములు గడచినను విడిచిపెట్టదు. వివిన్నయోనులలో బుట్టి యనుభవించిన తరువాతనే విడిచిపెట్టును. జీవుడు తనకర్మలను బట్టియే ప్రపంచములో భిన్నయోనులందు జన్మించుచుండును. వేదములో—

ఏష దేవో అమర్త్యః పర్ణవీ రివ దీయతే।
అభి ద్రోణా న్యాసదమ్॥ (సామ. 1256)

ఈ ఆత్మ నానావిధ క్రీడల నాడుచుండును. ఇది నశింపదు. రెక్కలుగల పక్షివలె గతి కలది. ఇది యొక శరీరమును విడిచి మఱొక శరీరమునందు ప్రవేశించును. మనుష్యుడు తన పురుషార్థముతోనే సంసార బంధనమును విడిపించుకొనగలడు.

శ్లో॥ రాజా రాష్ట్రకృతం పాపం రాజ్ఞః పాపం పురోహితః।
భర్తా చ స్త్రీకృతం పాపం శిష్యపాపం గురు స్తథా॥ 9

అర్థము:- రాష్ట్రకృతం=రాష్ట్రములో చేయబడిన, పాపం=పాపమును, రాజా=రాజు, రాజ్ఞః=రాజుయొక్క, పాపం = పాపమును, పురోహితః=పురోహితుడును, చ=మఱియు, స్త్రీ కృతం=భార్యచే జేయబడిన, పాపం=పాపమును, భర్తా=భర్తయు, తథా=అట్లే, శిష్యపాపం=శిష్యుని పాపమును, గురుః=గురువు ననుభవింతురు.

తా॥ రాష్ట్రములో చేయబడిన పాపమును రాజు, రాజుచేసిన పాపమును పురోహితుడు, భార్యచేసిన పాపమును భర్తయు, శిష్యుడుచేసిన పాపము గురువు ననుభవింతురు.

వివరణము :- ఇది యెనిమిదవ శ్లోకమునకు విరుద్ధమగుటచే ప్రక్షిప్తమనవలెను. ఎనిమిదవ శ్లోకములో-జీవుడు స్వయముగా కర్మచేసి తత్ఫలితముగా స్వయముగానే యనుభవించుచున్నాడు. అట్టి తఱి రాష్ట్రములో చేసిన కర్మఫలితము రాజు ద్వారా, రాజుచేసిన కర్మఫలితము పురోహితుని ద్వారా, భార్యచేసిన కర్మఫలితము భర్తద్వారా, శిష్యుడు చేసిన కర్మఫలము గురువుద్వారా యనుభవింపజేయుట యనుచితము. మనుష్యుడు తానుచేసిన కర్మఫలితమునే యనుభవింపవలెనుగాని యితరుల కర్మఫలితముగాదు. వేదములో ప్రార్థన—

మా వ ఏనో అన్యకృతం భుజేమ। (ఋ. 6-51-7)

ఓ విద్వాంసులారా! మనము స్త్రీలచే చేయబడిన పాపకర్మఫలము ననుభవింపకుందుము గాక!

శ్లో॥ ఋణకర్తా పితా శత్రుః మాతా చ వ్యభిచారిణీ।
భార్యా రూపవతీ శత్రుః పుత్రః శత్రు రపండితః॥ 10

అర్థము :- ఋణకర్తా = అప్పులుచేయునట్టి, పితా = తండ్రి, శత్రుః = శత్రువు, చ = మఱియు, వ్యభిచారిణీ = వ్యభిచారముచేయునట్టి, మాతా = తల్లియు, రూపవతీ = అందగత్తెయైన, భార్యా = భార్యయు, శత్రుః = శత్రువులు, అట్లే, అపండితః = మూర్ఖుడైనట్టి, పుత్రః = పుత్రుడు కూడ, శత్రుః = శత్రువగుచున్నాడు.

తా॥ ఋణముచేయు తండ్రియు, వ్యభిచారిణియైన తల్లియు, అందగత్తెయగు భార్యయు, మూర్ఖుడైన కుమారుడును శత్రువులుగా పరిగణింపబడుదురు

వివరణము :- కష్టములు కలిగించువాడు శత్రువు. అప్పుల పాలైన తండ్రి కష్టములను కలిగించును. తల్లి వ్యభిచారిణియగుచో

ఆ తల్లి సంతానము దురాచారములు కలదగును. కుటుంబమర్యాదలు పవిత్రత నశించును. కురూపియైన భర్తకు రూపవతియగు భార్యయున్నచో సందఱు నామెను కుదృష్టితో చూతురు. రూపవతియైన భార్య గుణవతి కాక కఠినహృదయయగుచో శత్రువగుటలో సందేహములేదు. ప్రసిద్ధుడైన ఆంగ్లకవి 'మిల్టన్' గ్రుడ్డివాడు అతని భార్య మిక్కిలి అందగత్తె. కాని ఆమె మిక్కిలి కఠినమైన తీక్ష్ణమైన స్వభావముకలది. అతని మిత్రు డొక నాడు మిత్రమా! నీ భార్య గులాబి పుష్పమువలె చాల అందమైన దనగా నిట్టూర్చి "నేను గులాబి అందము నెఱుగనుగాని దాని ముళ్ల యనుభవము మాత్రము ప్రతిదినము నెఱుదుగుననెను మూర్ఖుడైన పుత్రుడు తన కుటుంబము యొక్క ఖ్యాతికిబదులు అపఖ్యాతి కలుగజేయును కావున నతడు శత్రువే.

శ్లో॥ లుబ్ధమర్థేన గృహ్ణీయాత్ స్తబ్ధమంజలి కర్మణా ।
మూర్ఖం ఛన్దోఽను వృత్తేన యథార్థత్వేన పండితమ్ ॥

అర్థము :- లుబ్ధం = ధనలోభిని, అర్థేన = ధనముతో, గృహ్ణీయాత్ = వశపఱచుకొనవచ్చును, స్తబ్ధం = అహంకారుని, దురభిమానుని, అంజలి కర్మణా = చేతులుజోడించి నమస్కరించియు, మూర్ఖం = మూర్ఖుడైన వానిని, ఛందోఽనువృత్తేన = వానికోరిక కనుకూలముగా పనిచేసియు, పండితం = పండితుని, యథార్థత్వేన = నిజము చెప్పుటచేతను, గృహ్ణీయాత్ = వశపఱచుకొనవలెను

తా॥ ధనమునందాసక్తిగల లోభిని ధనముద్వారా, అహంకారిని నమస్కారము ద్వారా, మూర్ఖుని అతని కోరిక ననుసరించి పనిచేసియు, బుద్ధిమంతుడైన వానిని సత్యవచనముల ద్వారా వశపఱచుకొనవలెను.

శ్లో॥ వరం న రాజ్యం న కురాజ రాజ్యం
వరం న మిత్రం న కుమిత్ర మిత్రమ్ ।

వరం న శిష్యో న కుశిష్య శిష్యో
వరం న దారా న కుదార దారాః॥ 12

అర్థము : రాజ్యం=రాజ్యము, న = లేకుండుటయే, వరం = శ్రేష్ఠము, కురాజరాజ్యం=చెడ్డరాజు రాజ్యము, న=అక్కఱలేదు, అనగా= చెడ్డరాజ్యముండుటకంటె రాజ్యము లేకుండుట మేలని యర్థము, మిత్రం= స్నేహితుడు, న = లేకుండుటయే. వరం=శ్రేష్ఠము, కుమిత్రమిత్రం = చెడ్డమిత్రునకు మిత్రుడు, న=కారాదు, శిష్యః=శిష్యుడు, న = లేకుండుటయే, వరం=శ్రేష్ఠము, కుశిష్యశిష్యః = చెడ్డశిష్యుడు శిష్యుడుగానుండుట, న=వద్దు. దారాః=భార్య, న=లేకుండుటయే. వరం=శ్రేష్ఠము, కుదార దారాః=చెడ్డభార్య భార్యయగుట, న=వద్దు.

శ్లో॥ కురాజరాజ్యేన కుతః ప్రజాసుఖం
కుమిత్ర మిత్రేణ కుతోఽస్తి నిర్వృత్తిః।
కుదార దారైశ్చ కుతో గృహే రతిః।
కుశిష్య మధ్యాపయతః కుతో యశః॥ 13

అర్థము :- కురాజరాజ్యేన = దుష్టరాజుయొక్క రాజ్యముచే, ప్రజానుఖమ్=ప్రజలకు సుఖము, కుతః=ఎక్కడిది? కుమిత్రమిత్రేణ= మోసగాడైన మిత్రుని మైత్రితో, నిర్వృత్తిః=ఆనందము, కుతఃఅస్తి = ఎక్కడున్నది? చ=మఱియు, కుదారదారైః = దుష్టస్త్రీ భార్యయైనచోః గృహే=ఇంటిలో, రతిః=ప్రీతి, కుతః=ఎక్కడిది? కుశిష్యం=మోస గాడైన శిష్యునకు, అధ్యాపయతః = బోధించువానికి, యశః = యశస్సు, కుతః=ఎట్లుండును?

తా॥ దుష్టరాజు పాలించు రాజ్యములో ప్రజలకు సుఖమెక్కడిది మోసగాడైన స్నేహితుని మైత్రివలన ఆనందమెక్కడిది? దుష్టమైన

భార్యవలన నింటిలో ప్రీతియేముండును ? చెడ్డ శిష్యునకు బోధించు అధ్యాపకునకు కీర్తియెక్కడిది ?

శ్లో॥ సింహాదేకం బకాదేకం శిక్షేచ్చత్వారి కుక్కుటాత్ ।
వాయసాత్పంచ శిక్షేచ్చ షట్ శునస్త్రీణి గర్దభాత్ ॥14

అర్థము :- మనుష్యుడు, సింహాత్=సింహమువలన, ఏకం = ఒకగుణమును, బకాత్=కొంగవలన, ఏకం=ఒకగుణమును, అట్లే, కుక్కుటాత్=కోడినుండి, చత్వారి = నాలుగును, శిక్షేత్ = నేర్చుకొనవలెను, వాయసాత్ = కాకివలన, పంచ = అయిదుగుణములు, చ = మఱియు, శునః=కుక్కనుండి, షట్ = ఆఱుగుణములు, గర్దభాత్=గాడిదనుండి, త్రీణి=మూడుగుణములు, శిక్షేత్=నేర్చుకొనవలెను. ఆయా గుణములు క్రింద వివరింపబడును.

తా॥ మనుష్యుడు సింహమునుండి యొక గుణము, కొంగనుండి యొక గుణము, కోడినుండి నాలుగు గుణములు, కాకినుండి యైదుగుణములు, కుక్కనుండి యాఱుగుణములు గాడిదనుండి మూడు గుణములు నేర్వవలెను.

శ్లో॥ ప్రభూతం కార్యమల్పం వా యన్నరః కర్తు మిచ్ఛతి ।
సర్వారమ్భేణ తత్కార్యం సింహాదేకం ప్రచక్షతే॥ 15

అర్థము :- నరః=మనుష్యుడు, యత్=ఏ, ప్రభూతం=గొప్పదీ కాని, వా=లేక, అల్పం=చిన్నదికాని,కార్యం=పనిని, కర్తుం=చేయుటకు, ఇచ్ఛతి=కోరుచున్నాడో, తత్కార్యం=ఆ పనిని, సర్వారంభేణ=శక్తి నంతయు నుపయోగించి సర్వవిధముల ప్రయత్నించి చేయవలెను. ఇది, సింహాత్=సింహమువలన, ఏకం=ఒక శిక్షణగా, ప్రచక్షతే = చెప్పబడుచున్నది.

తా॥ మనుష్యుడు తాను చేయదలచిన పని పెద్దదికాని చిన్నదికాని దానిని పూర్తిచేయుటకు సర్వశక్తి నుపయోగించి యన్నివిధముల ప్రయత్నము చేయవలెను. ఈ విషయము సింహమునుండి నేర్చుకొనవలెను.

వివరణము :- సింహము తాను పోటాడుటకు శక్తినంతయు నుపయోగించును. అది తుపాకి గుండుకెదురుగా వెళ్లగలదు. ఇట్లే మనుష్యుడు కూడ పనిచేయుటలో శక్తినంతయు నుపయోగించుచో నది సఫలమగును.

శ్లో॥ ఇంద్రియాణి చ సంయమ్య బకవత్ పండితో నరః।
దేశకాల బలం జ్ఞాత్వా సర్వకార్యాణి సాధయేత్॥ 16

అర్థము :- పండితః = బుద్ధిమంతుడైన, నరః = మనుష్యుడు, బకవత్=కొంగవలె నేకాగ్రచిత్తుడై, చ= అట్లే, ఇంద్రియాణి = ఇంద్రియములను, సంయమ్య=వశపఱచుకొని, దేశకాలబలం=దేశమును, కాలమును తనబలమును, జ్ఞాత్వా = తెలిసికొని, సర్వకార్యాణి = సమస్త కార్యములను, సాధయేత్=సాధింపవలెను.

తా॥ బుద్ధిమంతుడైన మనుష్యుడు కొంగవలె నేకాగ్రచిత్తుడై యింద్రియములను వశమునందుంచుకొని, దేశమును, కాలమును, తన బలమును తెలిసికొని సమస్తకార్యములను సాధింపవలెను.

వివరణము :- కొంగజపము ప్రసిద్ధము. శ్రీరాముడు ధ్యానమగ్నమైయున్న కొంగనుజూచి లక్ష్మణునితో—

పశ్య లక్ష్మణ పంపాయాం బకః పరమధార్మికః।
మన్దం మన్దం పదం ధత్తే జీవానాం వధశంకయా॥

ఓ లక్ష్మణ! పంపాసరోవరములో పరమధార్మికమైన కొంగను జూడుము. అది జీవహింసయగు నేమోయను శంకతో మెల్లమెల్లగా పాదములుంచుచున్నదనెను.

లక్ష్మణుడు సమాధాన మిచ్చుటకు ముందే యొక చేప యిట్లనెను—

అహో బకం ప్రశంసతే (రామ)యేనాహం నిష్కులీ కృతా।
సహవాసీ విజానీయాత్ చరిత్రం సహవాసినామ్॥

ఓహో! రామ! ఈ కొంగ నా కుటుంబమును చంపి నన్ను కుటుంబములేని దానినిగా జేసినది. అట్టి దానిని నీవు పొగడుచున్నావు. తోటివారి చరిత్ర తోటివాడే యెఱుగునని చేపయనెను.

శ్లో॥ ప్రత్యుత్థానం చ యుద్ధం చ సంవిభాగం చ బంధుషు।
స్వయ మాక్రమ్య భుక్తం చ శిక్షేచ్చత్వారి
కుక్కుటాత్॥ 17

అర్థము :- ప్రత్యుత్థానం = తగిన సమయమున మేల్కొనుట, చ=అట్లే, యుద్ధం=యుద్ధమునకు సిద్ధముగా నుండుట, చ = మరియు బంధుషు=బంధువులకు, సంవిభాగం=తగిన భాగము నిచ్చుట, చ=అట్లే స్వయం=స్వయముగా, ఆక్రమ్య = ఆక్రమించి, లాగుకొని, భుక్తం = భుజించుటయను, చత్వారి = నాలుగు గుణములు, కుక్కుటాత్ = కోడి నుండి, శిక్షేత్=నేర్చుకొనవలెను.

తా॥ తగిన సమయమున నిద్రలేచుటయు, యుద్ధమునకు సిద్ధపడి యుండుటయు, బంధువులకు రాదగిన భాగమిచ్చుటయు, స్వయముగా ఆక్రమించుకొని లాగుకొని భుజించుటయు నను ఈ నాలుగు విషయము లను కోడినుండి నేర్చుకొనవలయును.

వివరణము :- ఎప్పుడు నొకే సమయమున నిద్రలేచుట కోడి నుండి నేర్వవలెను. గడియారమైనను తప్పుగా నడచునేమో కాని కోడిమాత్రము ప్రతిదినము నొకే సమయమున మేల్కొని కూయును. వేదములో—

ఉద్యన్ సూర్య ఇవ సుప్తానాం ద్విషతాం వర్చ ఆదదే ।
(అథర్వ. 7-13-2)

ఒక వైదికవీరుడు చాటుచున్నాడు-ఉదయించుచున్న సూర్యుడు నిద్రించుచున్న సోమరుల తేజస్సును హరించునట్లు, నేను కూడ శత్రువుల తేజస్సును, బలమును లాగి తీసికొందును"అని.

సూర్యోదయము తరువాత నిద్రించు సోమరి యెందుకును పనికి రాడు. ఆతని లక్ష్మి నశించును. ఇందువలన సూర్యోదయమునకు ముందే నిద్రనుండి లేవవలెను. భారతీయ సంస్కృతిలో సూర్యోదయానంతర మును, సూర్యాస్తమయ నమయమునను నిద్రించుట పాపముగా పరిగణింప బడెను. భరతుడు కేకయరాజు (తాత)గారి యింటినుండి వచ్చినపుడు తన నిర్దోషిత్వమును వెల్లడించుటకు ఒట్టుపెట్టుకొనెను. అందులో నొకటి —

ఉభే సంధ్యే శయానస్య య త్పాపం పరికల్ప్యతే ।
తత్పాపం భవేత్ తస్య యస్యాఽఽర్యోఽను మతే గతః॥
(వాల్మీ. రా. అయో. 75-44)

ఎవరి యనుమతితో ఆర్యుడైన రాముడు వనమునకు బంపబడెనో, యాతడు ప్రాతఃసాయం సంధ్యానమయములో నిద్రించు వాని కెట్టి పాపము సంభవించునో యట్టి పాపమనుభవించును.

బంధువులకు రావలసిన భాగమీయకున్నచో ధుర్యోధనునివలె నశించును. వేదములో —

కేవలాఘో భవతి కేవలాదీ॥ (ఋ. 10-117-6)

ఒంటరిగా భుజించువాడు పాపమునే తినును.

శ్లో॥ గూఢం చ మైథునం ధార్ష్ట్యం కాలే కాలేచ సంగ్రహమ్।
అప్రమత్త మవిశ్వాసం పంచ శిక్షేచ్ఛ వాయసాత్ ॥18

అర్థము:- గూఢం = రహస్యముగా. మైథునం = మైథునము (సంభోగము) చేయుటయు, ధార్ష్ట్యం = దౌర్జన్యముచేయుటయు, చ = అట్లే, కాలే కాలే = ప్రతిసమయమునను, సంగ్రహమ్ = ప్రోగుచేయుటయు, అప్రమత్తం = ఎల్లపుడు జాగరూకతతో నుండుటయు. చ = అట్లే, అవిశ్వాసం = ఎవరిని నమ్మకుండుటయు, ఈ యైదుగుణములు, వాయసాత్ = కాకినుండి, శిక్షేత్ = నేర్చుకొనవలెను.

తా॥ రహస్యముగా మైథునము (సంభోగము) చేయుట, మొండితనము, సమయానుకూలముగ సంపాదించుట, అజాగ్రతగా నుండకుండుట, ఇతరులను నమ్మకుండుట యను నైదును కాకి నుండి నేర్చుకొన వలెను.

శ్లో॥ బహ్వాశీ స్వల్పసంతుష్టః సునిద్రో లఘుచేతనః ।
స్వామి భక్తశ్చ శూరశ్చ షడేతే శ్వానతో గుణాః॥ 19

అర్థము :- బహ్వాశీ = ఎక్కువ తినగలశక్తి, స్వల్ప సంతుష్టః = దొరకనపుడు, కొంచెముతోనే తృప్తిపడుటయు, సునిద్రః = బాగుగా నిద్రించుటయు, లఘుచేతనః = కొంచెము చప్పుడైనను నిద్రమేల్కొనుటయు, స్వామిభక్తః = యజమానునియందు భక్తి, ప్రీతి, విశ్వాసము, చ = మఱియు, శూరః = శౌర్యము, ఏతే = ఈ, షడ్ = ఆఱు, గుణాః = గుణములు, శ్వానతః = కుక్కనుండి, శిక్షేత్ = నేర్చుకొనవలెను.

తా॥ ఎక్కువ తినుశక్తియు ఎక్కువ లభింపకున్నను తక్కువదానితోనే సంతోషించుట, బాగుగా నిద్రించుట, కొంచెము ధ్వనియైనను మేల్కొనుట, స్వామిభక్తియనగా యజమానుని విషయములో నమ్మకముగా నుండుట, శౌర్యము కలిగియుండుట యను నీ యాఱును కుక్కనుండి నేర్వవలెను.

శ్లో॥ సుశ్రాన్తోఽపి వహేద్ భారం శీతోష్ణం న చ పశ్యతి।
సంతుష్టశ్చరతే నిత్యం త్రీణి శిక్షేచ్చ గర్దభాత్॥ 20

అర్థము :- సుశ్రాన్తోఽపి = బాగుగా అలసిపోయినను, భారం = బరువును, వహేత్ = మోయును, చ = అట్లే, శీతోష్ణం = చలిని, వేడిని, న పశ్యతి = చూడదు, లెక్కచేయదు, చ = మఱియు, నిత్యం = ఎల్లప్పుడును, సంతుష్టః = సంతోషించునదై, చరతే = సంచరించును, త్రీణి = ఈ మూడు గుణములు, గర్దభాత్ = గాడిదనుండి, శిక్షేత్ = నేర్వవలెను.

తా॥ అలసియున్నను భారము మోయుటయు, శీతోష్ణములను లెక్కచేయకుండుటయు, సంతోషముతో జీవనము గడపుటయను మూటిని గాడిదనుండి నేర్వవలెను.

శ్లో॥ య ఏతాన్ వింశతిగుణా నాచరిష్యతి మానవః।
కార్యాఽవస్థాసు సర్వాసు అజేయః స భవిష్యతి॥ 21

అర్థము :- యః = ఏ, మానవః = మానవుడు, ఏతాన్ = ఈ, వింశతి గుణాన్ = ఇరువది గుణములను, ఆచరిష్యతి = ఆచరించునో, సః = వాడు సర్వాసు = సమస్తమైన కార్యాఽవస్థాసు = కార్యములందు అవస్థలయందును, అజేయః = ఓటమిలేనివాడు, విజయుడు, భవిష్యతి = కాగలడు.

తా॥ మనుష్యుడీ యిరువది గుణములను ఆచరణలో పెట్టినచో సమస్తకార్యములందును, సమస్తావస్థలలోను పరాజయములేనివాడై విజయుడగును.

షష్ఠాధ్యాయము సమాప్తము

సిగ్గును, మొగమోటమును విడిచినవాడు, సుఖీ = సుఖముకలవాడు, భవేత్ = అగును.

తా॥ ధనధాన్యాదుల వ్యాపారములో అమ్మునపుడు కాని, కొను నపుడు కాని, విద్యను నేర్చుకొనునపుడు కాని ఆహారము తీసికొనునపుడు వ్యవహారము చేయునపుడు సంకోచింపక సిగ్గుపడక పనిచేయువాడు సుఖముకలవాడగును.

వివరణము :- మనుష్యులకు లజ్జ భూషణము. విశేషించి స్త్రీలకు విశేషముగా ఆభరణము వంటిది. కాని యే యే విషయములో లజ్జ పనికి రాదో శ్లోకములో చెప్పబడినది.

శ్లో॥ సంతోషామృత తృప్తానాం యత్సుఖం శాన్తచేతసామ్।
న చ తద్ ధనలుబ్ధానా మితశ్చేతశ్చ ధావతామ్॥ 3

అర్థము :- సంతోషామృత తృప్తానాం=సంతోషమనెడి యమృత ముతో తృప్తులైనట్టి, శాంతచేతసాం=శాంతస్వభావులైన వారికి,యత్=ఏ, సుఖం=సుఖమున్నదో, తత్=ఆ సుఖము, ఇతశ్చేతశ్చ = ఇటు నటు, ధావతామ్=పరుగెత్తునట్టి, ధనలుబ్ధానాం=ధనలోభులకు, న చ=లేనేలేదు.

తా॥ సంతోషమనెడు అమృతముతో తృప్తిపడినట్టి శాంతచిత్తుల కెట్టి సుఖముకలదో యట్టి సుఖము, శాంతి ఇటు నటు పరుగెత్తు ధనలోభు లకు నుండదు.

వివరణము :- పతంజలి మహర్షి యిట్లు చెప్పెను—

సంతోషా దను త్తమ సుఖలాభః। (యోగ. 2-42)

సంతోషమువలన సర్వశ్రేష్ఠమైన సుఖములు లభించును.

# సప్తమాధ్యాయము

శ్లో॥ అర్థనాశం మనస్తాపం గృహే దుశ్చరితాని చ।
వంచనం చావమానంచ మతిమాన్న ప్రకాశయేత్॥ 1

అర్థము :- అర్థనాశము = ధనము పోవుటయు, మనస్తాపం = మనస్సులోని బాధను, గృహే = ఇంటియందలి, దుశ్చరితాని = దోషములు, వంచనం = మోసగింపబడుటను, చ = మఱియు, అవమానం = అవమానమును, మతిమాన్ = బుద్ధిమంతుడైనవాడు న ప్రకాశయేత్ = వెల్లడి చేయరాదు.

తా॥ ధనము పోయినను, మనస్సునకు సంతాపము కలిగినను, ఇంటిలో దోషములున్నను, ఇతరులచే మోసగింపబడినను అవమానింపబడినను బుద్ధిమంతుడు వెల్లడిచేసికొనకూడదు.

వివరణము :- పైన జెప్పబడిన విషయములను ఇతరులకు జెప్పినచో ఎగతాళి చేయుదురుకాని సానుభూతిని చూపరు. ఇవి సొంత విషయములు కావున వీని నెంత దాచుకొనిన నంతమంచిది. వెల్లడి చేయరాదు

శ్లో॥ ధనధాన్య ప్రయోగేషు విద్యాసంగ్రహణేషు చ।
ఆహారే వ్యవహారేచ త్యక్తలజ్జః సుఖీ భవేత్॥ 2

అర్థము :- ధనధాన్య ప్రయోగేషు = ధనము, అన్నమును వ్యాపారము చేయునపుడు అమ్మట కొనుట చేయునపుడును, విద్యాసంగ్రహణేషు = విద్యను సంపాదించునపుడును, ఆహారే = భోజనవిషయములోను, చ = మఱియు, వ్యవహారే = వ్యవహారము విషయములోను, త్యక్తలజ్జః =

మఱొక కవి—

అర్థీ కరోతి దైన్యం లబ్ధార్థో గర్వమపరితోషం చ ।
నష్టధనశ్చ స శోకం సుఖమాస్తే నిఃస్పృహః పురుషః॥

యాచకుడు దైన్యమును ప్రదర్శించును. ధనవంతుడు గర్విగా నుండును. మఱియు నధికేచ్ఛ గలవాడుగా నుండును. ధననష్టముపొందిన వాడు శోకించును. నిఃస్పృహుడు (సంతోషి) సుఖముగానుండును.

శ్లో॥ సంతోషస్త్రిషు కర్తవ్యః స్వదారే భోజనే ధనే ।
త్రిషు చైవ న కర్తవ్యోఽధ్యయనే తపదానయోః॥ 4

అర్థము :- స్వదారే = తన భార్యయందును, భోజనే = భోజనమందును, ధనే=ధనమందును త్రిషు=ఈ మూటియందు, సంతోషః = సంతోషము, కర్తవ్యః=చేయదగినది, చ ఏవ=అంతేకాని, అధ్యయనే= శాస్త్రాదులు చదువుటయందును, తపదానయోః = తపస్సునందు, దానము చేయుట యందును, త్రిషు=ఈ మూటియందు, సంతోషః న కర్తవ్యః = సంతోషింపరాదు.

తా॥ తన భార్య, భోజనము, ధనము అను నీ మూటి విషయములో సంతుష్టుడు కావలెను. కాని అధ్యయనము, తపస్సు, దానము అను మూటి విషయములో సంతుష్టుడు కారాదు

వివరణము :- తన భార్యయందే సంతోషి కావలెను—

నహీదృశమనాయుష్యం లోకే కించన విద్యతే ।
యాదృశం పురుషస్యేహ పరదారోపసేవనమ్॥ (మను. 4-134)

ఈ ప్రపంచములో పరస్త్రీ సంబంధముతో సమానమైనది మనుజునకు ఆయువును క్షీణింపజేయునది మఱొకటిలేదు. అందుచే దాని నన్ని విధములు విడువవలెను.

యత్పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవః స్త్రియః ।
నాలమేకస్య తత్సర్వమితి పశ్యన్న ముహ్యతి॥ (విదుర. 7-85)

పృథివియందు ధాన్యము, యవలు, బంగారము, పశువులు, స్త్రీలు ఎన్నికలవో యవి యన్నియు నొక్క మనుష్యునకే చాలవు, అను నాలోచనగల మనుజుడు మోహములో చిక్కుకొనడు.

భోజన విషయములో సంతోషింపవలెను. హితము, మితమునైన భోజనము చేయవలెను. ఇతరుల భోజనము చూచి ఆశపడరాదు.

మనుమహర్షి —

అనారోగ్య మనాయుష్య మస్వర్గ్యం చాతి భోజనమ్ ।
అపుణ్యం లోకవిద్విష్టం తస్మాత్ తత్పరివర్జయేత్॥

అధిక భోజన మారోగ్యమును చెఱచును. ఆయువును క్షీణింప జేయును. దుఃఖమును కలిగించును. ఇహపరలోకముల నష్టపఱచును. అందుచే నధికభోజనము చేయరాదు.

తనకున్న ధనముతో సంతోషింపవలెను —

అధోఽధః పశ్యతః కస్య మహిమా నోపచీయతే ।
ఉపర్యుపరి పశ్యన్తః సర్వ ఏవ దరిద్రతి॥ (హితో. 2-2)

తనకంటె తక్కువవారిని చూచుచు నభివృద్ధికి పాటుపడని వానికి గౌరవము పెరుగదు. కాని తనకంటె నధికులైన ధనవంతులజూచి తాను తక్కువ యని తలంచువాడు దరిద్రుడే యగును. ధన విషయములో తనకంటె తక్కువ వారిని చూచి తాను ధనవంతుడనని సంతోషింప వలెను. అధ్యయన విషయములో సంతోషింపరాదు.

అజరామర వత్ప్రాజ్ఞో విద్యామర్థం చ చింతయేత్ ।
గ్రహీత ఇవ కేశేషు మృత్యునా ధర్మమాచరేత్॥

మనుష్యుడు తాను జరామరణములు లేనివాడుగా భావించి విద్యను ధనమును సంపాదింపవలెను. కాని మృత్యువు తన శిరస్సుపై వెంట్రుకలు పట్టుకొనియుండి యెప్పుడు మ్రింగునో యనుభయము గలవాడై ధర్మాచరణము చేయవలెను.

దివమారుహాత్ తపసా తపస్వీ। (అథ. 13-2-25)

తపస్వి తపస్సు ద్వారా మోక్షమును పొందును.

మనుమహర్షి —

యద్ దుస్తరం దురాపం యద్ దుర్గం యచ్చాపి దుష్కరమ్।
సర్వం తు తపసా సాధ్యం తపో హి దురతిక్రమమ్॥

(మను. 11-238)

కష్టముగా తరింపదగిన దానిని, కష్టముగా పొందదగిన దానిని కష్టముతో చేరగలిగిన దానిని, కష్టముతో చేయదగిన దానిని తపస్సుతో సిద్ధింపజేసికొనవచ్చును. తపస్సుచే నసాధ్యమైనదిలేదు.

దానము అధికముగా చేయవలెను. వేదము—

శతహస్త సమాహర సహస్రహస్త సంకిర। (అథ. 3-24-5)

ఓ మనుష్యుడా! నీవు వందహస్తములతో సంపాదించినట్లు సంపాదించి వెయ్యిహస్తములతో పంచిపెట్టినట్లు పంచుము.

వ్యాసమహర్షి —

ద్వావమ్భసి నివేష్టవ్యౌ గలే బద్ధ్వా దృఢాంశిలామ్।
ధనవన్తమదాతారం దరిద్రం చాతపస్వినమ్॥(భార.ఉద్యో.33.65)

ఒకడు ధనవంతుడయ్యు దానముచేయని లోభిని, మఱొకడు పురుషార్థమొనర్పని దరిద్రుడైన సోమరిని వీరిద్దఱి మెడలలో పెద్దబండ ఱాళ్లను కట్టి నీటిలో ముంచవలెను.

శ్లో॥ విప్రయోర్విప్రవహ్న్యోశ్చ దమ్పత్యోః స్వామి
భృత్యయోః ।
అన్తరేణ న గన్తవ్యం హలస్య వృషభస్య చ॥ 5

అర్థము :- విప్రయోః = ఇద్దఱు బ్రాహ్మణుల యొక్క, చ = మఱియు, విప్రవహ్న్యోః = బ్రాహ్మణునకు అగ్నికిని, దంపత్యోః = భార్యాభర్తలయొక్కయు, స్వామిభృత్యయోః = యజమానుడు సేవకుని యొక్కయు, హలస్య = నాగలియొక్కయు, వృషభస్య చ = ఎద్దునకును, అంతరేణ = మధ్యలో, న గంతవ్యమ్ = వెళ్లరాదు.

తా॥ ఇద్దఱు బ్రాహ్మణుల యొక్కయు, బ్రాహ్మణుడు అగ్ని యొక్కయు, దంపతుల యొక్కయు, యజమానుడు సేవకులయొక్కయు, నాగలి యెద్దుల యొక్కయు మధ్యగా వెళ్లరాదు.

శ్లో॥ పాదాభ్యాం న స్పృశే దగ్నిం గురుం
బ్రాహ్మణమేవ చ ।
నైవగాం న కుమారీం చ న వృద్ధం న శిశుం తథా॥ 6

అర్థము : అగ్నిం = అగ్నిని, గురుం = గురువును, చ = మఱియు. బ్రాహ్మణమేవ = బ్రాహ్మణుని, గాం = ఆవును, కుమారీం = పుత్రికను, వృద్ధం = వృద్ధుని, తథా = అట్లే, శిశుం = పసిబిడ్డను, పాదాభ్యాం = కాళ్లతో, న స్పృశేత్ = తాకరాదు, తన్నరాదు.

తా॥ అగ్నిని, గురువును, బ్రాహ్మణుని, ఆవును, కన్యను, వృద్ధుని, శిశువును పాదములతో తాకరాదు, (తన్నకూడదు)

వివరణము :- అగ్నిని కాళ్లతో తాకిన కాలును. గురువు, బ్రాహ్మణుడు, వృద్ధుడు పూజ్యులగుటచే తన్నరాదు. కుమారి, శిశువు

చిన్నవారైనను వీరు భావిరాష్ట్ర నిర్మాతలు కావున కాలితో తన్నరాదు. ఆవును తన్నిన వారికి వేదములో దండన విధింపబడియున్నది—

యశ్చగాం పదా స్ఫురతి ప్రత్యఙ్ సూర్యం చ మేహతి।
తస్య వృశ్చామి తే మూలం ఛాయాం కరవోఽపరమ్॥

(అథర్వ. 13-1-56)

ఆవును తన్నిన వానిని, సూర్యుని వైపుకు తిరిగి మలమూత్ర విసర్జనచేసినవానిని మరల నట్టి పనిని చేయకుండుటకై సమూలముగా నష్టపఱతును.

శ్లో॥ శకటం పంచహస్తేన దశహస్తేన వాజినమ్।
హస్తినం శతహస్తేన దేశత్యాగేన దుర్జనమ్॥ 7

అర్థము :- శకటం = బండిని, పంచహస్తేన = అయిదు చేతుల దూరముగాను, వాజినం = గుఱ్ఱమును, దశహస్తేన = పదిచేతుల దూరముగాను, హస్తినం = ఏనుగును, శతహస్తేన = వందచేతుల దూరముగాను, దుర్జనం = దుర్మార్గుని, దేశత్యాగేన = దేశమునుండి వెడలగొట్టుటతోను, విడిచిపెట్టవలెను.

తా॥ బండిని అయిదు చేతుల దూరముగాను, గుఱ్ఱమును పది చేతుల దూరముగాను, ఏనుగును వందచేతుల దూరముగాను, దుర్జనుని దేశాంతరములోను విడువవలెను.

వివరణము :- దుర్జనుడు మిక్కిలి భయంకరుడగుటచే అతని నుండి రక్షించుకొనుట కాతనిని దేశాంతరములో విడువవలెను. లేనిచో నెవ్వడును సుఖపడడు.

శ్లో॥ హ_స్తీ అంకుశ హ_స్తేన వాజీ హ_స్తేన తాడ్యతే ।
శృంగీ లగుడ హ_స్తేన ఖడ్గహ_స్తేన దుర్జనః॥ 8

అర్థము :- హ_స్తీ=ఏనుగు, అంకుశహ_స్తేన=చేతిలోని అంకుశముతోను, వాజీ=గుఱ్ఱము, హ_స్తేన=చేతిలోని కొరడాతోను, శృంగీ=కొమ్ములుగల పశువు, లగుడహ_స్తేన=చేతిలోని కఱ్ఱతోను, దుర్జనః = దుర్జనుడు, ఖడ్గహ_స్తేన=చేతితోని క_త్తితోను, తాడ్యతే=కొట్టబడును.

తా॥ ఏనుగును చేతిలోని అంకుశముతోను, గుఱ్ఱమును చేతిలోని కొరడాతోను, కొమ్ములుగల జంతువును చేతిలోని కఱ్ఱతోను, దుర్జనుని చేతిలోని ఖడ్గముతోను కొట్టి వశపఱుచుకొనవలెను.

శ్లో॥ తుష్య_న్తి భోజనే వి_ప్రా మయూరా ఘనగర్జితే ।
సాధవః పరసమ్పత్తౌ ఖలః పరవిప_త్తిషు॥ 9

అర్థము :- వి_ప్రాః=_బ్రాహ్మణులు, భోజనే = భోజనమందును, మయూరాః = నెమళ్లు, ఘనగర్జితే = మేఘముల గర్జనయందును, సాధవః=మంచివారు, పరసంపత్తౌ = ఇతరుల సంపదలయందు, ఖలః = దుర్మార్గుడు, పరవిప_త్తిషు = ఇతరుల యాపదయందును, తుష్య_న్తి = సంతోషింతురు.

తా॥ _బ్రాహ్మణులు పొట్టనిండ భోజనముచేసిన సంతోషింతురు. నెమళ్ల మేఘముల గర్జనలతో (ఉఱుము) _ప్రసన్నములై పురివిప్పి యాడును. సజ్జనులు ధనధాన్యసంపన్నులగు నితరులను జూచి సంతుష్టులగుదురు. దుష్టస్వభావము కలవారు ఇతరులు ఆపదలో నున్నచో చూచి సంతోషింతురనుటకు—

యథా పరోపకారేషు నిత్యం జాగ_ర్తి సజ్జనః ।
తథా పరాపకారేషు జాగ_ర్తి సతతం ఖలః॥

సజ్జనులు ఇతరుల కుపకారము చేయుటకు నిత్యము సిద్ధముగా నున్నట్లు దుష్టులు ఇతరులకు కీడు చేయుటకు నెల్లపుడు సిద్ధముగానుందురు.

శ్లో॥ అనులోమేన బలినం ప్రతిలోమేన దుర్జనమ్ ।
ఆత్మతుల్యబలం శత్రుం వినయేన బలేన వా॥ 10

అర్థము :- బలినం = బలవంతుడైన శత్రువును, అనులోమేన = అనుకూలమైన వ్యవహారముతోను, దుర్జనం = దుష్టుడైన శత్రువును, ప్రతిలోమేన = ప్రతికూల వ్యవహారముతోను వశపఱచుకొనవలెను, ఆత్మ తుల్య బలమ్ = తనతో సమానమైన బలముకలవానిని, శత్రుం = శత్రువును, వినయేన = వినయముతోగాని, బలేన = బలముతోగాని, వశము చేసికొనవలెను

తా॥ బలవంతుడైన శత్రువును ఆతని కనుకూలముగా వ్యవహరించుచును, దుష్టుడైన శత్రువును అతనికి ప్రతికూలముగా వ్యవహరించుచును, తనతో సమానమైన బలముగల శత్రువును వినయముతోగాని బలముతోగాని వశముచేసికొనవలెను.

శ్లో॥ బాహువీర్యం బలం రాజ్ఞో బ్రాహ్మణో బ్రహ్మవిద్బలీ।
రూప యౌవన మాధుర్యం స్త్రీణాం బలముత్తమమ్॥ 11

అర్థము :- రాజ్ఞః = రాజునకు, బలం = బలము, బాహువీర్యం = భుజబలము, బ్రహ్మవిత్ = వేదమును, ఈశ్వరుని తెలిసిన, బ్రాహ్మణః = బ్రాహ్మణుడు, బలీ = బలవంతుడు, రూపయౌవనమాధుర్యం = సౌందర్యము, యౌవనము, మాధుర్యము, స్త్రీణామ్ = స్త్రీలకు, అనుత్తమమ్ = మిక్కిలి శ్రేష్ఠమైన, బలం = బలము.

తా॥ రాజునకు భుజబలమే బలము. వేదమును నీశ్వరుని నెఱింగినవాడే బలముగల బ్రాహ్మణుడు. సౌందర్యము, యౌవనము, మధురముగా మాట్లాడుటయు స్త్రీలకు శ్రేష్ఠమైనబలము.

వివరణము :- భగవంతుడు క్షత్రియులకు వారి భుజములలో బలము నుంచెను. శ్రీకృష్ణుడు జరాసంధునితో—

క్షత్రియో బాహువీర్యస్తు। (భార. సభా. 21-51)

క్షత్రియులకు బలపరాక్రమములు వారి భుజములలో నుండును.

బ్రాహ్మణులకు బలము వారి వాక్కులలోనుండును. ఆతడు వేదము స్వాధ్యాయముచేసి (పఠించి) ఇతరులకు నమృతము త్రాగించును. స్త్రీకి బలము ఆమె రూపములోను, యౌవనములోను, మధురభాషణము నందు నుండును. చాణక్యుడు—

యస్య భార్యా సురూపాచ భర్తారమనుగామినీ।
నిత్యం మధురవక్త్రీ చ సా శ్రియో న శ్రియః శ్రియః॥
(చా. సార సంగ్రహము 2-82)

రూపవతియగు భార్యకలవాడు, అనుకూలముగా ప్రవర్తించు భార్యకలవాడు, మధురముగా మాట్లాడు భార్యకలవాడును ధనవంతుడు కాని కేవలము డబ్బు మాత్ర మున్నవాడు ధనవంతుడు కాడు.

శ్లో॥ నాఽత్యన్తం సరలైర్భావ్యం గత్వా పశ్య వనస్థలీమ్।
ఛిద్యన్తే సరలాస్తత్ర కుబ్జాస్తిష్ఠన్తి పాదపాః॥ 12

అర్థము :- అత్యన్తం=మిక్కిలి, సరలైః = సరళస్వభావముగా, న భావ్యం=ఉండరాదు, వనస్థలీం = అడవిప్రదేశమునకు, గత్వా=వెళ్లి పశ్య=చూడుము, తత్ర = ఆ అడవిలో, సరలాః = తిన్నగానుండు

వృక్షములు, ఛిద్య న్తే=నఱకబడుచున్నవి, కుబ్జాః=వంకరటింకరగానున్న, పాదపాః=చెట్లు, తిష్ఠన్తి=నిలబడియున్నవి.

తా॥ మిక్కిలి సరళస్వభావము పనికిరాదు అడవిలోనికి వెళ్లి చూచినచో నక్కడ తిన్నగానున్న చెట్లు నఱకబడుచున్నవి. వంకర టింకరగా నున్న చెట్లు నఱకబడక విడిచిపెట్టబడియుండును.

వివరణము :- మనుష్యునిలో మిక్కిలి కోమలత్వముతోబాటు తీక్ష్ణత్వము అనగా దుష్టులను దండించుశక్తి కూడ నుండవలెను.

శ్లో॥ యత్రోదకం తత్ర వసన్తి హంసాః
తథైవ శుష్కం పరివర్జయన్తి ।
న హంస తుల్యేన నరేణ భావ్యం
పునస్త్యజన్తే పునరాశ్రయన్తే॥ 13

అర్థము :- యత్ర=ఎక్కడ, ఉదకం=నీరుండునో, హంసాః = హంసలు తత్ర=అక్కడ, వసన్తి=నివసించుచున్నవి తథా = అట్లే, శుష్కం = నీరులేక యెండిన ప్రదేశమును, పరిత్యజన్తి = విడిచిపెట్టు చున్నవి నరేణ=మనుష్యుడు, హంసతుల్యేన = హంసతో సమానుడు, న భావ్యం=కారాదు, పునః=మాటిమాటికి త్యజన్తి=విడిచిపెట్టుచున్నవి, పునః = మాటిమాటికి, ఆశ్రయన్తే = ఆశ్రయించుచున్నవి. మనుష్యుడు స్వార్థపరుడు కారాదు. పరోపకారికావలెను.

తా॥ హంసలు నీరున్నచోట నివసించును. నీరెండిపోగానే యచ్చోటును విడిచివెళ్లును. మనుష్యుడు హంసవలె నుండరాదు. అవసర మైనప్పుడు దగ్గఱచేరుటయు అవసరము తీరగానే దూరమగుటయు చేయు స్వార్థపరుడు కారాదు. మనుష్యుడు స్వార్థము విడిచి పరోపకారి కావలెను.

శ్లో॥ ఉపార్జితానాం విత్తానాం త్యాగ ఏవ హి రక్షణమ్ ।
తడాగోదర సంస్థానాం పరీవాహ ఇవామ్భసామ్॥ 14

అర్థము :- ఉపార్జితానాం=సంపాదింపబడిన, విత్తానాం = ధనము నకు, త్యాగ ఏవ=త్యాగముచేయుటయే, రక్షణం హి = రక్షణము గదా, తడాకోదరసంస్థానాం=చెఱువులోనున్న, అంభసాం=నీటికి, పరీవాహః= అలుగు (బయటికి నీళ్లుపోవు తూము), ఇవ=వలె రక్షకమగును.

తా॥ సంపాదించిన ధనమునకు త్యాగమే రక్షణము. చెఱువులో నిండిన నీటిని అలుగు ద్వారా (బయటకు పోవు తూము) బయటకు పంపుటయే ఆ నీటికి రక్షణము. లేకున్న పసరువేసి చెడిపోవును.

వివరణము :- భర్తృహరి ధనమునకు మూడుగతులు చెప్పెను—

దానం భోగో నాశస్తిస్రో గతయో భవన్తి విత్తస్య ।
యో న దదాతి న భుంక్తే తస్య తృతీయా గతిర్భవతి॥
(నీతి శత. 39)

ధనమునకు దానముచేయుట, అనుభవించుట, నాశనమగుటయను మూడు స్థితులుండును. అందులో మొదటి రెండైన దానముచేయుట, అనుభవించుటయు లేని ధనము మూడవదగు నాశనము పొందును.

శ్లో॥ యస్యాఽర్థాస్తస్య మిత్రాణి యస్యాఽర్థాస్తస్య బాన్ధవాః ।
యస్యాఽర్థాః స పుమాన్ లోకే యస్యాఽర్థాః స చ జీవతి॥ 15

అర్థము :- లోకే=లోకమందు, యస్య=ఎవనికి, అర్థాః=ధనము కలదో, తస్య=అట్టివానికే, మిత్రాణి=స్నేహితులు, యస్య = ఎవనికి,

అర్థాః=ధనములు కలవో, తస్య = అతనికి, బాంధవాః = బంధువులు, యస్య=ఎవనికి, అర్థాః=ధనములు గలవో, సః=వాడే, లోకే = లోకమందు, పుమాన్=మగవాడు, చ=మఱియు, యస్య=ఎవనికి, అర్థాః = ధనములు గలవో, సః=వాడే, జీవతి=జీవించుచున్నాడు. వాడే జీవించినట్లు లెక్క.

తా॥ ధనమున్నవానికే మిత్రులు, బాంధవులు నుందురు. ధనమున్నవాడే పెద్దమనుష్యుడుగా వ్యవహరింపబడును. ధనమున్నవాని జీవితమే గొప్పజీవితము.

వివరణము :- డబ్బులేకుండ నేపనియుగాదు. డబ్బున్నవాని చెంత మిత్రులు బంధువులు చేరుదురు. ధనము పరమాత్మకాకున్నను దాని మహిమనే గానముచేయుదురు. భర్తృహరి—

యస్యాస్తి విత్తం స నరః కులీనః స పండితః
స శ్రుతవాన్ గుణజ్ఞః ।
స ఏవ వక్తా స చ దర్శనీయః సర్వే గుణాః
కాంచన మాశ్రయన్తే॥ (నీతి శ. 37)

ధనవంతుడే గొప్ప కులముగలవాడుగాను, పండితుడుగాను, శాస్త్రజ్ఞుడుగాను. గుణవంతుడుగాను, వక్తగాను, అందగాడుగాను, పరిగణింపబడును. గుణములన్నియు బంగారము నాశ్రయించియుండును. అదికలవాడే సర్వోపరి విరాజిల్లుచున్నాడు. ధనమావశ్యకమే. దానిని న్యాయమార్గమున సంపాదింపవలెను.

శ్లో॥ స్వర్గ స్థితానా మిహ జీవలోకే
చత్వారి చిహ్నాని వసన్తి దేహే ।
దాన ప్రసంగో మధురా చ వాణీ
దేవార్చనం బ్రాహ్మణ తర్పణం చ॥ 16

అర్థము :- ఇహ=ఈ, జీవలోకే = ప్రపంచమందు, స్వర్గస్థితానాం = సంతోషముగా నుండువారికి, దేహే = దేహమందు, చత్వారి= నాలుగు, చిహ్నాని=గుర్తులు, వసన్తి=ఉన్నవి, దానప్రసంగః = దాన స్వభావము, చ = అట్లే, మధురావాణీ = మధురముగా మాట్లాడుట, దేవార్చనం = విద్వాంసులకు ఆదరసత్కారములుచేయుట, చ = మఱియు, బ్రాహ్మణ తర్పణం=బ్రహ్మనిష్ఠులను తృప్తిపఱచుట యనునవి.

తా॥ ఈ ప్రపంచములో సుఖముగా నున్నవారి శరీరమందు నాలుగు చిహ్నములు (గుర్తులు) ఉన్నవి. దానస్వభావము, మధుర భాషణము, పండితుల సత్కరించుట, వేదవిద్వాంసులు బ్రహ్మనిష్ఠులైన వారిని తృప్తిపఱచుట యనునవి.

వివరణము :- ఈ ప్రపంచములో ఆదర్శగృహస్థాశ్రమములో నున్న ఆదర్శగృహస్థుని జీవితములో నాలుగు విషయములుండును. 1. వారు దానశీలురై యుందురు. వారు వందలకొలది చేతులతో సంపాదించి వేలకొలది చేతులతో దానముచేయుదురు. 2. వారు మధురముగా మాట్లాడుదురు. వారు మాట్లాడునపుడు వారి నోటినుండి పూలురాలు నట్లుండును. వారి నాలుకచివర హృదయమందును తేనె యున్నట్లుండును. 3. వారు దేవతలను అనగా తల్లిదండ్రులను, అతిథిని, ఆచార్యుని సాదరముగా సత్కరించి సంతుష్టులను జేయుదురు. 4. వేదవిద్వాంసులను, బ్రహ్మజ్ఞానము కల పండితులను భోజనము, వస్త్రాదులతో తృప్తి పఱచుదురు.

శ్లో॥ అత్యన్తకోపః కటుకా చ వాణీ
దరిద్రతా చ స్వజనేషు వైరమ్ ।
నీచప్రసంగః కులహీన సేవా
చిహ్నాని దేహే నరకస్థితానామ్॥

అర్థము :- అత్యన్తకోపః = మిక్కిలికోపము, చ = మఱియు, కటుకావాణీ=మిక్కిలి కఠినముగా మాట్లాడుట, దరిద్రతా = దారిద్ర్యము. స్వజనేషు=తన బంధువులందు, వైరం = విరోధముగానుండుట, చ = మఱియు, నీచప్రసంగః = నీచమైనవారితో కలయిక (స్నేహము), కులహీనసేవా = కులహీనులను సేవించుట, నరకస్థితానాం = నరకములో, (దుఃఖములో) నుండువారియొక్క. దేహే=దేహమందుండు, చిహ్నాని= గుర్తులు.

వివరణము :- ఏ స్త్రీ పురుషులలో పైనజెప్పిన చిహ్నము లుండునో వారు పతితులై చెడిపోయిన గృహస్థాశ్రమములో నుండి దుఃఖమనుభవించుచున్నారని తెలిసికొనవలెను.

శ్లో॥ గమ్యతే యది మృగేంద్ర మందిరం
లభ్యతే కరికపోల మౌక్తికమ్ ।
జంబుకాఽఽలయే గతే చ ప్రాప్యతే
వత్స పుచ్ఛఖర చర్మఖండనమ్॥ 18

అర్థము :- మృగేంద్ర మందిరం=సింహముండు గుహకు, గమ్యతే యది=వెళ్లినచో, కరికపోల మౌక్తికమ్=ఏనుగుల కుంభస్థలములందుండు ముత్యము, లభ్యతే=లభించును, చ=మఱియు, జంబుకాఽఽలయగతే = నక్కలుండు బొరియల దగ్గఱకు వెళ్లినచో, వత్స = దూడలయొక్క, పుచ్ఛ = తోకలు, ఖర = గిట్టలు, చర్మఖండనమ్ = చర్మముయొక్క ముక్కయు, ప్రాప్యతే=లభించును.

తా॥ మనుష్యుడెవడైన సింహము నివాసస్థానమైన గుహలోనికి వెళ్లి చూచినచో ఏనుగు మస్తకము (కుంభస్థలము) నందుండు ముత్యములు లభించును. అట్లే నక్కలుండు గుహలోనికి వెళ్లినచో నచట దూడల తోకలు, గాడిదచర్మపు ముక్కలు లభించును.

వివరణము :- గొప్పవారి స్నేహము చేయవలెను. నీచస్నేహము పనికిరాదు.

శ్లో॥ శునః పుచ్ఛమివ వ్యర్థం జీవితం విద్యయా వినా ।
న గుహ్యగోపనే శక్తం న చ దంశనివారణే॥ 19

అర్థము :- శునః = కుక్కయొక్క, పుచ్ఛం = తోక, గుహ్య గోపనే = గుప్తేంద్రియమును కప్పుటకుగాని, దంశనివారణే = దోమలు మొదలగు వానినుండి రక్షించుటకుగాని, న శక్తం = శక్తికలదికాదు (పనికిరాదు), ఇవ=అట్టి తోకవలె, విద్యయావినా=విద్యలేనట్టి, జీవితం= జీవితము, వ్యర్థం=వ్యర్థము.

తా॥ విద్యలేనివాని జీవితము కుక్కతోకవలె వ్యర్థమగును. కుక్కతోక ముడ్డిని కప్పుటకు పనికిరాదు మఱియు ఈగలు, దోమలు మొదలగు వానిని పాఱద్రోలుటకు పనికిరాదు. అట్లే మూర్ఖుడు రహస్య మును దాచలేడు, శత్రువులను ఆక్రమణ చేయలేక వ్యర్థుడునగును.

శ్లో॥ వాచః శౌచం చ మనసః శౌచమింద్రియ నిగ్రహః ।
సర్వభూతే దయా శౌచం ఏతచ్ఛౌచం పరార్థినామ్॥20

అర్థము :- వాచః=వాక్కుయొక్క, శౌచం = పవిత్రత, చ = మఱియు, మనసః=మనస్సుయొక్క, శౌచం=శుద్ధియు, ఇంద్రియ నిగ్రహః = ఇంద్రియములను వశమందుంచుకొనుటయు, సర్వభూతే దయా= సర్వప్రాణులందు దయయు, శౌచం=ధనముయొక్క, పవిత్రత, ఏతత్= ఇదియే, పరార్థినామ్ = పరోపకారులకు లేక మోక్షముకోరువారికి, శౌచం=శుద్ధిలేక పవిత్రతయగును.

వివరణము :- శౌచమనగానేమి ? వ్యాసమహర్షి - మహా. అశ్వ పర్వ. 2216 లో చెప్పినది చూడుడు—

బ్రహ్మచర్యం తపః క్షాంతి ర్మధుమాంసస్య వర్జనమ్ ।
మర్యాదాయాం స్థితశ్చైవ శమః శౌచస్యలక్షణమ్॥

తా॥ బ్రహ్మచర్యము, తపస్సు, క్షమ, మద్యమాంసముల విడు మట, మర్యాదగానుండుట, మనస్సును వశమునందుంచుకొనుట, యను నివి యన్నియు శౌచము (పవిత్రత) లక్షణములు. వ్యాసమహర్షి అందు లోనే 3238 లో శుద్ధిని అయిదు విధములుగా జెప్పెను. అందులో మనస్సు శుద్ధి, వాక్ శుద్ధియు చేర్చబడినవి—

మనః శౌచం కర్మశౌచం కులశౌచం చ భారత ।
శరీర శౌచం వాక్ శౌచం శౌచం పంచవిధం స్మృతమ్॥

తా॥ మనశ్శుద్ధి, కర్మశుద్ధి, కులశుద్ధి, శరీరశుద్ధి, వాక్శుద్ధి అను నీయైదును శుద్ధిగా జెప్పబడుచున్నవి. అక్కడే—

పంచస్వేతేషు శౌచేషు హృదిశౌచం విశిష్యతే ।
హృదయస్యతు శౌచేన స్వర్గం గచ్ఛన్తి మానవాః॥

తా॥ ఈ అయిదు శుద్ధులలో హృదయశుద్ధి సర్వశ్రేష్ఠమైనది. మనస్సుయొక్క పవిత్రతవలన మానవులు స్వర్గమును (సుఖమును) పొందుదురు.

అర్థముయొక్క పవిత్రతను గూర్చి సర్వోత్తమముగా మనుమహర్షి —

సర్వేషామేవ శౌచానా మర్థశౌచం పరం స్మృతమ్ ।
యోఽర్థే శుచిర్హి స శుచి ర్న మృద్వారి శుచిః శుచిః॥

(మను. 5-106)

పవిత్రము లన్నింటిలో ధనపవిత్రత శ్రేష్ఠమైనది. ధనసంబంధ ములో పవిత్రముగా నున్నచో అన్యాయముగా నితరుల ధనము తీసికొనడు. అదియే పవిత్రము. మట్టితో తోమి నీళ్లతో కడుగుట పవిత్రముకాదు.

శ్లో॥ పుష్పేగంధం తిలే తైలం కాష్ఠేఽగ్నిం పయసి ఘృతమ్।
ఇక్షౌ గుడం తథా దేహే పశ్యాఽఽత్మానం వివేకతః॥21

అర్థము :- పుష్పే=పుష్పమందు, గంధం=సువాసనను, తిలే = నువ్వుగింజయందు, తైలం=నూనెను, కాష్ఠే = కట్టెయందు, అగ్నిం = అగ్నిని, పయసి=పాలయందు, ఘృతం=నేతిని, ఇక్షౌ = చెఱకునందు, గుడం=బెల్లమును చూచుచున్నావో, తథా=అట్లే, దేహే = శరీరము నందు, వివేకతః = జ్ఞానమున, ఆత్మానం = జీవాత్మను, పరమాత్మను, పశ్య=చూడుము.

తా॥ పుష్పమునందు సువాసనయు, నువ్వులయందు నూనెయు, కట్టెయందు అగ్నియు, పాలలో నెయ్యి, చెఱకునందు బెల్లము, ఆలోచన ద్వారా యున్నట్లు తెలిసికొనిన విధముగా నీ శరీరములోనున్న ఆత్మను పరమాత్మనువివేకముద్వారా చూడుము. తెలిసికొనుము.

వివరణము :- మానవుడుగా పుట్టినవాడు ఆత్మదర్శనముకొఱకు ప్రబలప్రయత్నము చేయవలయును. ఉపనిషత్తు సందేశము—

ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యః మన్తవ్యః ।
నిదిధ్యాసితవ్యో మైత్రేయి॥ (బృహద్. ఉప. 2-45)

ఓ మైత్రేయి! పరమాత్మ సాక్షాత్కారము పొందవలెను. పరమాత్మ సంబంధములైన విషయములనే వినవలెను. ఆ విషయమునే చింతింపవలెను. మననచేయవలెను. ధ్యానింపవలెను. ఉపాసింపవలెను. ఆ పరమాత్మ యెక్కడ దొరుకును? హృదయమందిరమందు. ఆ పరమాత్మను బయట ప్రపంచములో వెదక నావశ్యకతములేదు. పరమాత్మను బయట వెదకువాని స్థితి యీ క్రింది విధముగా నుండును—

సంత్యజ్యహృద్గుహేశానం దేవమన్యం ప్రయాన్తి యే।
తే రత్న మభివాంఛన్తి త్యక్త్వా హస్తస్థ కౌస్తుభమ్॥
మహోపనిషద్॥ (6-20)

హృదయరూప గుహలోనున్న పరమేశ్వరుని విడిచి యితర దేవతను వెదకువాడు పిడికిలిలోని మణివిడిచిపెట్టి గాజు ముక్కకొఱకు వెదకుచున్న వాని వంటివాడగును.

మఱొక కవి—

బహిర్భ్రమతి యః కశ్చిత్ త్యక్త్వా దేహస్థ మీశ్వరమ్।
సో గృహపాయసం త్యక్త్వా భిక్షామటతి దుర్మతిః॥

శరీరములోనున్న పరమేశ్వరుని విడిచిపెట్టి బయటదేవునికొఱకు వెదకువాడు-ఇంటిలోనున్న పాయసమును విడిచిపెట్టి యితరుల యిండ్ల దగ్గఱ బిచ్చమెత్తువానివంటి మూర్ఖుడగును.

సప్తమాధ్యాయము సమాప్తము

# అష్టమాధ్యాయము

శ్లో॥ అధమా ధనమిచ్ఛన్తి ధనం మానం చ మధ్యమాః।
ఉత్తమా మాన మిచ్ఛన్తి మానో హి
మహతాం ధనమ్॥ 1

**అర్థము :-** అధమాః=అధములైన మానవులు, ధనం=ధనమును, ఇచ్ఛన్తి=కోరుచున్నారు, మధ్యమాః=మధ్యములు, ధనం=ధనమును, మానం చ = మానమును (సమ్మానమును) కూడ, ఇచ్ఛన్తి = కోరు

చున్నారు, ఉత్తమాః=ఉత్తములు, మానం=మానమును, ఇచ్ఛన్తి = కోరుచున్నారు, మహతాం=గొప్పవారికి, మానః హి = మానమే (గౌరవము) ధనమ్=ధనము.

తా॥ ధనము మాత్రము కాంక్షించు వారు అధములు. ధనమును, గౌరవమును కోరువారు మధ్యములు. కేవలము ఆదరము, సమ్మానము కోరువారు ఉత్తములు. మహాత్ములకు మానమే (ఆదరమే) ధనము.

శ్లో॥ ఇక్షురాపః పయో మూలం తామ్బూలం
ఫలమౌషధమ్ ।
భక్షయిత్వాఽపి కర్తవ్యాః స్నానదానాఽఽదికాః
క్రియాః॥ 2

అర్థము :- ఇక్షుః = చెఱకు, ఆపః=నీరు, పయః = పాలు, మూలం=దుంప, తాంబూలం=తాంబూలము, ఫలం=పండు, ఔషధం= ఔషధమును, భక్షయిత్వాఽపి=తినినను, స్నాన=స్నానమును, దాన = దానము, ఆదికాః=మొదలైనట్టి, క్రియాః = పనులు, కర్తవ్యాః = చేయదగినవే.

తా॥ చెఱకు, నీరు, పాలు, దుంపలు, తాంబూలము, పండ్లు, ఔషధము మొదలైనవి భక్షించినను స్నానము దానము, పూజ మొదలగు సత్క్రియలు చేయవలెను.

వివరణము :- శక్తిలేనివాడు, రోగి, యాత్రలోనున్నవాడు, వ్యసనములలో చిక్కుకొన్నవాడు జలాదిపానముచేసి ఓషధులు సేవించినను, సంధ్య, యజ్ఞము, పూజాపాఠము, స్నానము, దానము మొదలగు క్రియలను చేయవలెను. శుభకర్మలను విడిచిపెట్టరాదు.

శ్లో॥ దీపో భక్షయతే ధ్వాన్తం కజ్జలం చ ప్రసూయతే ।
యదన్నం భక్షయే న్నిత్యం జాయతే తాదృశీ ప్రజా॥ శి

అర్థము :- దీపః=దీపము, ధ్వాంతం = చీకటిని, భక్షయతే = తినుచున్నది. చ = మఱియు, కజ్జలం = నల్లనిమసిని, ప్రసూయతే = పుట్టించుచున్నది, అట్లే మనుష్యుడు, యదన్నం=ఎటువంటి యన్నమును, నిత్యం=ఎల్లపుడు, భక్షయేత్ = తినునో, తాదృశీప్రజా = అట్టి సంతాన మునే, జాయతే=కనును.

తా॥ దీపము (వెలుగు) చీకటిని భక్షించును. నల్లనికాటుకను ఉత్పన్నముచేయును. అట్లే మనుష్యుడు నిత్యమెట్టియన్నమును దినునో దానికి సదృశమైన సంతానమునే కనును.

ఆహార శుద్ధే సత్త్వ శుద్ధిః॥ (ఛాందోగ్య. 7-26-2)

ఆహారము శుద్ధమైనదైనచో శరీరములోని రసము రక్తము మొదలైన సప్తధాతువులు శుద్ధములై అంతఃకరణము నిర్మలమైనదగును.

సర్వేషామేవ శౌచానామన్న శౌచం విశిష్యతే॥ (బృహస్పతి)

శుద్ధులన్నింటిలో అన్నశుద్ధి విశేషమహత్త్వము కలది. శరీరము, మనస్సులయొక్క నిర్మాణము అన్నముతోనే యగును. అట్లే సంతానము కూడ నన్నముతోనే యుత్పన్నమగును. ఇందువలన శుద్ధ సాత్వికాహారము తీసికొనుటయందే ధ్యానముంచవలెను.

శ్లో॥ విత్తం దేహి గుణాన్వితేషు మతిమన్నాన్యత్ర దేహి క్వచిత్
ప్రాప్తం వారినిధేర్జలం ఘనముఖే మాధుర్యయుక్తం సదా ।

జీవాన్ స్థావరజంగమాంశ్చ సకలాన్
సంజీవ్య భూమండలమ్
భూయః పశ్య తదేవ కోటిగుణితం
గచ్ఛన్తమమ్భోనిధిమ్॥ 4

అర్థము :- మతిమన్ = బుద్ధిమంతుడా !, గుణాన్వితేషు = గుణవంతులకు, విత్తం=ధనమును, దేహి=ఇమ్ము, అన్యత్ర=గుణహీనులైన యితరులకు, క్వచిత్=ఎన్నడును న దేహి = ఈవద్దు. వారినిధేః = సముద్రముయొక్క, జలం = జలము, ఘనముఖే = మేఘముఖమును, ప్రాప్తం=పొందినదై, సదా=ఎల్లపుడును, మాధుర్యయుక్తమ్=తియ్యనిదగును చ=మఱియు. భూమండలం = భూమిపైనున్నదై, సకలాన్ = సమస్తమైన, స్థావరజంగమాన్ = జడముచేతనములైన వానిని (చరాచరములను), జీవాన్=జీవులను, సంజీవ్య=జీవింపజేసి, భూయః = మరల, తదేవ=ఆ జలమే, కోటి గుణితమ్=కోటిగుణములుకలదై, అంభోనిధిం=సముద్రమును, గచ్ఛన్తం=వెళ్లుచున్న దానిని, పశ్య=చూడుము

తా॥ బుద్ధిమంతుడా! మంచిగుణములు గల వానికే ధనమిమ్ము. ఎన్నడును గుణహీనునకు నీయరాదు. సముద్రములోని యుప్పునీరు మేఘములోజేరి తియ్యనిజలముగా మాఱును ఆ జలము భూమండలములోని చరాచరములను, జీవులను బ్రతికించి యదియే కోటిరెట్లై సముద్రములో కలియుచున్న దానిని చూడుము.

వివరణము :- మేఘము సముద్రములోని యుప్పునీటిని తీసికొని తియ్యగామార్చి యెట్లు ప్రపంచమునకు జీవనహేతువగుచున్నదో యట్లే గుణవంతుల కిచ్చిన ధనము పరోపకారకమగును. గుణహీనుల కిచ్చిన ధనము మద్యమాంసాదులకు చెడువ్యసనములకు నుపయోగింపబడి వ్యర్థమగును. అందుచే గుణవంతులకే ధనమీవలెను.

శ్లో॥ చాండాలానాం సహస్రే చ సూరిభి స్తత్త్వ దర్శిభిః ।
ఏకో హి యవనః ప్రోక్తో న నీచో యవనాత్పరః॥ 5

అర్థము :- తత్త్వదర్శిభిః = తత్త్వము నెరింగినట్టి, సూరిభిః = విద్వాంసుల ద్వారా, ప్రోక్తః = చెప్పబడినదేమన, సహస్రే చండాలానాం = వెయ్యమంది చండాలురతో ఏకః యవనః హి = ఒక్కయవనుడే (తురుష్కుడు) సమానము. యవనాత్పరః = యవనుని మించిన నీచుడు, న = ఇతరు లెవ్వడును లేడు.

తా॥ తత్త్వదర్శులైన పండితులు వేలకొలది చాండాలురకంటె నొక్క యవనుడే మిక్కిలి నీచుడని చెప్పిరి. యవనుని మించిన నీచుడు మరొకడులేడు.

శ్లో॥ తైలాఽభ్యంగే చితా ధూమే మైథునే క్షౌరకర్మణి ।
తావద్భవతి చాండాలో యావత్స్నానం
న చాఽఽచరేత్ ॥ 6

అర్థము :- తైలాభ్యంగే = ఒంటికి నూనె పులుముకొనిన తరువాత, చితాధూమే = శవదహనము పొగ తగిలిన తరువాత, మైథునే = సంభోగానంతరము, క్షౌరకర్మణి = క్షౌరముచేయించుకొనిన తరువాత. చ = మరియు, యావత్ = ఎంతకాలము, స్నానం = స్నానమును, నాచరేత్ = చేయదో, తావత్ = అంతకాలము, చాండాలః = చాండాలుడు, భవతి = అగును.

తా॥ తలంటుస్నానము చేయుటకై నలుగుపెట్టబడిన శరీరము గలవాడు శ్మశానములో శవదహన సమయమున పొగవ్యాపించిన శరీరము గలవాడు సంభోగము చేసినవాడు, క్షౌరము చేయించుకొనినవాడు, స్నానము చేయ నంతవరకు చాండాలుడుగానే వ్యవహరింపబడును.

శ్లో॥ అజీర్ణే భేషజం వారి జీర్ణే వారి బలప్రదమ్ ।
భోజనే చామృతం వారి భోజనాన్తే విషప్రదమ్॥ 7

అర్థము :- వారి = నీరు, అజీర్ణే = జీర్ణముకాని సమయమున, భేషజం = మందు, జీర్ణే = జీర్ణమగు వానికి, వారి = నీరు, బలప్రదమ్ = బలమునిచ్చును, చ = మరియు, వారి = నీరు, భోజనే = భోజనసమయమున, అమృతం = అమృతమువంటిది, భోజనాంతే = భోజనముచేసిన వెంటనే, విషప్రదమ్ = విషముతో సమానముగ హానికరమగును.

తా॥ జీర్ణము కానివానికి నీరు మందువంటిది జీర్ణమైనవానికి నీరు బలమునిచ్చును. భోజనముచేయుచు మధ్యలో నీరుత్రాగిన అమృతముతో సమానముగ గుణమునిచ్చును. భోజనానంతరమున నీరుత్రాగిన విషముతో సమానమై హానికలిగించును.

వివరణము :- జీర్ణము కానపుడు, భోజనముచేయక నీరు త్రాగినచో ఔషధమువలె నుపయోగించును. భోజనము జీర్ణమైన తరువాత అనగా భోజనానంతరము మూడుగంటల తరువాత నీరుత్రాగిన బలదాయకమగును. భోజనము చేయుచు మధ్యలో నీరుత్రాగినచో రుచిని గలిగించి అమృతముతో సమానముగ గుణమును గలిగించును. అన్నము తినగానే వెంటనే నీరుత్రాగినచో జీర్ణరసమును పలచనచేసి భోజనపదార్థమును శీఘ్రముగా జీర్ణకోశమునుండి క్రిందికి దీసికొని పోవుటచే విషముతో సమానమై హానికలిగించును.

అత్యమ్బుపానాన్న విపచ్యతేఽన్నం నిరమ్బుపానాచ్చ
స ఏవ దోషః ।
తస్మాన్నరో వహ్ని వివర్ధనాయ ముహుర్ముహుర్వారి
పిబేదభూరి॥ (క్షేమకుతూహల)

నీరెక్కువ త్రాగినచో ఆహారము సరిగా అరగదు. అసలు నీరు త్రాగకున్నచో నదే దోషము సంభవించును. ఇందువలన జఠరాగ్నిని ప్రదీప్తము చేయుటకు మనుష్యుడు భోజన మధ్యమున మాటిమాటికి కొంచెము కొంచెము నీరు త్రాగవలెను.

శ్లో॥ హతం జ్ఞానం క్రియా హీనం హతశ్చాజ్ఞానతో నరః।
హతం నిర్నాయకం సైన్యం స్త్రియో నష్టాహ్యభర్తృకాః॥ 8

అర్థము :- క్రియాహీనం = ఆచరణలేని, జ్ఞానం = జ్ఞానము, హతం = వ్యర్థము, చ = మఱియు, అజ్ఞానతః = అజ్ఞానమువలన, నరః = మనుష్యుడు, హతః = నష్టపోవును, నిర్నాయకం = నాయకుడు లేని, సైన్యం = సైన్యము, హతం = నశించును అభర్తృకాః = భర్తలులేని స్త్రియః = స్త్రీలు, హి = కూడ, నష్టాః = నష్టముపొందుదురు.

తా॥ ఆచరణలేని జ్ఞానము వ్యర్థము, అజ్ఞానముచేత మనుష్యుడు నష్టపోవును. నాయకుడులేని సైన్యము నశించును. భర్తలులేని స్త్రీలు నష్టపోవుదురు.

వివరణము :- ఆచరణలేని జ్ఞానము వ్యర్థము—

పఠకాః పాఠకాశ్చైవ యే చాన్యే శాస్త్రచింతకాః।
సర్వే వ్యసనినో మూర్ఖా యః క్రియావాన్ స పండితః॥
(మ. భార. వన. 313-110)

చదువువారు, చదివించువారు, శాస్త్రములను గూర్చి ఆలోచించువారు వీరందఱు వ్యసనపరులు, మూర్ఖులునై యున్నారు. శాస్త్రోక్త కర్తవ్యములనాచరించువాడు, జ్ఞానము నాచరణలో బెట్టువాడును పండితుడనబడును.

అజ్ఞేభ్యో గ్రన్థినః శ్రేష్ఠా గ్రన్థిభ్యో ధారిణో వరాః।
ధారిభ్యో జ్ఞానినః శ్రేష్ఠా జ్ఞానిభ్యో వ్యవసాయినః॥(మను 12-103)

మూర్ఖులకంటె చదువుకొన్నవారు శ్రేష్ఠులు. గ్రంథములు చదువు వారికంటె గ్రంథస్థ విషయములు జ్ఞాపకముంచుకొనువారు శ్రేష్ఠులు. ఆధారణచేయువారికంటె జ్ఞానులు శ్రేష్ఠులు. జ్ఞానులకంటె ఆచరణలో పెట్టువారు శ్రేష్ఠులు.

సత్యం తపో జ్ఞానమహింసతా చ విద్వత్ప్రణామంచ సుశీలతా చ।
ఏతాని యో ధార్యతే స విద్వాన్ న కేవలం యః పఠతే
స విద్వాన్॥

సత్యము, తపస్సు (ద్వంద్వ సహనము), జ్ఞానము, అహింస (వైరత్యాగము), విద్వాంసులను నమస్కరించుట, మంచిశీలము అను గుణములను కలిగియున్నవాడు విద్వాంసుడు. కేవలము చదువువాడు విద్వాంసుడు కాడు.

అజ్ఞానముచే మనుష్యుడు చంపబడును. (దెబ్బతినును) వేదము—
మజ్జన్త్యవి చేతసః। (ఋ. 9-86-5)
అజ్ఞానులు మునిగిపోవుదురు. జ్ఞానమనగానేమి?

తద్గృహం యత్ర వసతి స్తత్ భోజ్యం యేన జీవతి।
యన్ముక్తయే తదేవోక్తం జ్ఞాన మజ్ఞాన మన్యథా॥
(మార్కండేయ పురాణము).

ఉండుటకు దగినది గృహము. మనుష్యుడు జీవించుట కుపయోగ పడునది అన్నము. మోక్షమును గలిగించునది జ్ఞానము. మిగిలినదంతయు నజ్ఞానము.

నాయకుడులేని సేన చంపబడును. దీనికి వ్యాఖ్య 5 అధ్యాయము 7 వ శ్లోక విమర్శలో గలదు.

శ్లో॥ వృద్ధకాలే మృతా భార్యా బంధుహస్తే గతం ధనమ్।
భోజనం చ పరాధీనం తిస్రః పుంసాం విడమ్బనాః 9

అర్థము :- వృద్ధకాలే=వృద్ధావస్థలోనున్నపుడు, మృతా = చచ్చి పోయిన, భార్యా=భార్యయు బంధుహస్తే=బంధువులచేతిలో, గతం = చిక్కిన, ధనం = ధనము, పరాధీనం = ఇతరుల యధీనములోనున్న, భోజనం చ=భోజనమున్ను, తిస్రం=ఈ మూడును, పుంసాం = పురుషులకు, విడంబనాః=దుఃఖమును కలిగించునవి.

తా॥ వృద్ధావస్థలో భార్యమరణించుటయు, ధనము బంధుబాంధవులయు మిత్రులయు చేతులలో చిక్కుకొనుటయు, ఇతరుల యధీనములో నున్న భోజనము-ఈ మూడును మనుష్యులకు మృత్యువుతో సమానముగ దుఃఖమును గలిగించునవే.

శ్లో॥ నాగ్నిహోత్రం వినా వేదా న చ దానం వినా క్రియా।
న భావేన వినా సిద్ధిస్తస్మాద్భావో హి కారణమ్॥ 10

అర్థము :- అగ్నిహోత్రం వినా = అగ్నిహోత్రము లేకుండ (యజ్ఞముచేయకుండ), వేదాః = వేదాధ్యయనము, న = వ్యర్థము, చ=మఱియు, దానం వినా=దాన దక్షిణలులేని, క్రియా = యజ్ఞాదిక్రియ, న=నిష్ఫలము, భావేనవినా=ప్రేమ, భక్తి, శ్రద్ధలేని, సిద్ధిః = సఫలత, న=ప్రాప్తింపదు, తస్మాత్ = అందువలన, భావః హి = శ్రద్ధాభక్తులే, కారణమ్=అన్ని సిద్ధించుటకు సఫలమగుటకు మూలము.

తా॥ అగ్నిహోత్రము (యజ్ఞము) చేయకుండ వేదాధ్యయనము వ్యర్థము దానము దక్షిణను ఈయకుండ చేసిన యజ్ఞాదికర్మ నిష్ఫలము

ప్రేమ, భక్తి, శ్రద్ధలేకుండ పొందిన సిద్ధి సాఫల్యము పొందదు. అందు వలన శ్రద్ధా భక్తులే అన్నియు సిద్ధించుటకు మూలములైయున్నవి.

వివరణము :- అగ్నిహోత్రము చేయకుండ కేవలము వేదాధ్యయనము వ్యర్థము. నారదుడు యుధిష్ఠిరుని అడిగెను—

కచ్చిత్తే సఫలా వేదాః । (భార. సభా. 5-111)

నీ వేదపఠనము సఫలమేనా ?

యుధిష్ఠిరుడు నారదుని ఎదురు ప్రశ్న యడిగెను.

కథం వై సఫలా వేదాః । (భార. సభా. 5-112)

దేవర్షీ ! వేదమెట్లు సఫలములగును ?

నారదుని జవాబు—

అగ్నిహోత్ర ఫలం వేదాః । (భార. సభా. 6-113)

రాజా ! అగ్నిహోత్రముచే వేదములు సఫలములగును.

అగ్నిహోత్రము పరోపకారమునకు, శుభశ్రేష్ఠకర్మలకు ప్రతీక (చిహ్నము)యై యున్నది. వేదములు చదివి శ్రేష్ఠములు, శుభములునగు కర్మలు చేయకయు, పరోపకారము చేయకయు, పరమేశ్వరుని సాక్షాత్కారము పొందలేడు. అట్టివాని వేదపఠనము వ్యర్థము. దానము దక్షిణయు నీయని యజ్ఞకర్మ నిష్ఫలము. యక్షుడు యుధిష్ఠిరు నడిగెను.

కథం యజ్ఞో మృతం భవేత్ । (భార. వన. 313-83)

యజ్ఞ మెట్లు పనికిరానిదగును ? యుధిష్ఠిరుని సమాధానము—

మృతో యజ్ఞస్త్వదక్షిణః । (భార. వన. 313-84)

దక్షిణ యీయని యజ్ఞము నష్టమగును.

శ్లో॥ కాష్ఠపాషాణ ధాతూనాం కృత్వా భావేన సేవనమ్ ।
శ్రద్ధయా చ తయా సిద్ధ స్తస్య విష్ణుః ప్రసీదతి॥ 11

అర్థము :- కాష్ఠపాషాణ ధాతూనాం=కొయ్య తాయి లోహ ముల యొక్క, భావేన=భావనతో, చ=మఱియు, శ్రద్ధయా = శ్రద్ధతో, సేవనం=సేవనమును, కృత్వా = చేసి, తయా = ఆ భావనద్వారా మనుష్యుడు, సిద్ధః=సిద్ధుడు అగును, లేక సిద్ధిప్రాప్తించును, తస్య = ఆ భక్తునిపై, విష్ణుః=పరమేశ్వరుడు, ప్రసీదతి=ప్రసన్నుడగును.

తా॥ కొయ్య, తాయి, లోహములతో బొమ్మలుచేసి భగవంతుడను భావముతో శ్రద్ధగా సేవించినచో నాతని భావము సిద్ధించి విష్ణువాతని యెడల యనుగ్రహము కలవాడగును.

వివరణము :- భావనాశబ్దమునకు ప్రజలు సరియగు నర్థమును గ్రహించుటలేదు. భావనాశబ్దమునకు సరియగు నర్థమును గ్రహింపవలె ననిన నీ క్రింది సందర్భమును చూడుడు—

"మీరు మట్టియందు బంగారము, వెండి యను భావమును, తాతి యందు మణియను భావమును, సముద్రపు నురుగునందు ముత్యములను భావమును. నీటియందు నెయ్యి, పాలు, పెరుగు అను భావమును, దుమ్మునందు మైదా, పంచదార మొదలగు వానినిగా భావించి వాని నేల యుపయోగింపరు ? మీ రెన్నడును దుఃఖమును భావింపరు గదా? అది మీకేల కలుగుచున్నది ? మీ రెప్పుడు సుఖమునే భావింతురు గదా! అది యేల చేకూరదు ? గ్రుడ్డివాడు కన్నులున్నవని భావించి యేల చూడలేడు ? చావవలెనని యెవ్వరును భావింపరు గదా! ఏల చచ్చి చున్నారు ? కాబట్టి మీ భావన సరియైనదికాదు. దేని నెట్లు చేయవలెనో యట్లే చేయుట భావనయగును అగ్నిని అగ్నిగాను, జలమును జలము

గాను తెలిసికొనుట భావనయగును. అటులకాక అగ్నిని జలముగాను, జలము నగ్నిగాను తలంచుట అభావన యగును. (సత్యార్థ-ఏకాదశసము)

కొయ్యను రాళ్లను పూజించువారిపై పరమాత్మ ప్రసన్నత చూపడు. దయానందమహర్షిమూర్తి పూజలో పదునారు దోషములు లెక్కించిరి. అందులో నేడవ దోషము—ఎవ్వడైనను నెవడైన మతొకనితో నీవు కూర్చుండు ఆసనము మీద కాని మీ పేరున్నచోటగాని రాయి వేయుదు ననినచో నాతడు కోపించి వానిని కొట్టుటయో తిట్టుటయో చేయును. అట్లే పరమేశ్వరుని ఉపాసించుటకు దగిన హృదయమందును, ఆయన పేరు మీద రాతి మూర్తుల ధరించుచున్నారు అట్టి దుష్టబుద్ధికలవారి విషయములో పరమేశ్వరుడు నత్యము సశింపకుండ నెందుకు చేయడు? (సత్యార్థ - 11 సముల్లాసము)

శ్లో॥ న దేవో విద్యతే కాష్ఠే న పాషాణే న మృన్మయే।
భావే హి విద్యతే దేవ స్తస్మాద్ భావో హికారణమ్॥12

అర్థము : దేవః = దేవుడైన పరమేశ్వరుడు, కాష్ఠే = కొయ్య యందును, పాషాణే=రాతియందును, మృన్మయే=మట్టిమూర్తియందును, న విద్యతే = ఉండడు, దేవః = పరమేశ్వరుడు, భావే = భావమందు, విద్యతే = ఉన్నాడు, తస్మాత్ = అందువలన, భావః హి = భావనయే, కారణమ్=పరమేశ్వరుని సిద్ధికి కారణము.

తా॥ పరమేశ్వరుడు కొయ్యలోను, రాతిలోను, మట్టిలోను నుండడు. పరమేశ్వరుడు నిశ్చయముగా భావమందే యుండును. కావున భావమందే పరమేశ్వరుడు సిద్ధించును. ప్రకటమగును.

వివరణము :- పరమేశ్వరుడు కొయ్యలోను, రాతిలోను, మట్టి లోను, మూర్తులలోను లేడనిచెప్పుట తప్పు. పరమేశ్వరుడు సర్వవ్యాప

కుడై యున్నాడు. ఆయన అణువణువులోను, కణకణములోను వ్యాపించి యున్నాడు. కాని ఆయన దర్శనము హృదయమందిరమందే కలుగును. ఎల్లపుడు ఓ౩మ్ అను ప్రణవమును జపించుచు యోగాభ్యాసముచేసిన వాని హృదయములోనే ప్రకటమగును. ప్రతిదినము లక్షలకొలది జనులు గుళ్లలోనికిపెళ్లి తల పగులగొట్టుకొనుచున్నను నింతవఱ కెవ్వరికిని దర్శనము కాలేదు. వేదము చెప్పుచున్నది—

న తస్య ప్రతిమా అస్తి। (యజు. 32-3)

సర్వవ్యాపకుడు, అగోచరుడు, శబ్ద, రస, రూపాదిగుణరహితుడగు పరమేశ్వరునకు నెట్టి మూర్తియు లేదు.

శ్లో॥ శాన్తి తుల్యం తపో నాస్తి న సంతోషాత్పరం సుఖమ్।
న తృష్ణాయాః పరో వ్యాధిర్న చ ధర్మో దయాపరః॥ 13

అర్థము :- శాన్తితుల్యం=శాన్తితో సమానమైన, తపః=తపస్సు, నాస్తి=లేదు సంతోషాత్=సంతోషముకంటె, పరం=శ్రేష్ఠమైన, సుఖం=సుఖము, న=లేదు, తృష్ణాయాః = తృష్ణకంటె (ఆశకంటె) పరః = మించిన,వ్యాధిః=రోగము. న = లేదు, చ = మఱియు, దయాపరః = దయనుమించిన, ధర్మః=ధర్మము. న=లేదు.

తా॥ శాంతితో నమానమైన తపస్సు మఱొకటి లేదు. సంతోషమున కంటె మించిన శ్రేష్ఠమైన సుఖము ఇంకొకటి లేదు తృష్ణకు (ఆశకు) మించిన వ్యాధి మఱొకటి లేదు. దయను మించిన ధర్మములేదు.

వివరణము :- శాంతితో నమానమైనది తపస్సు తప్ప మఱొకటి లేదు.

సప్తద్వీపములలో, నవఖండములలో, పుల్లోకములలో కూడ శాంతితో సమానమైన సుఖము మఱొకటి లేదు. సంతోషమును మించిన సుఖము లేదు.

అన్తో నాస్తి పిపాసాయాః సంతోషః పరమం సుఖమ్ ।
తస్మాత్ సంతోషమేవేహ పరం పశ్యన్తి పండితాః॥

(భార. వన. 2 46)

ధనమందలి ఆశ తగ్గదు. అందుచేత సంతోషమే పరమసుఖము. జ్ఞానులు సంతోషమునే యన్నింటికంటె నుత్తమమైనదిగా తలంచుచున్నారు.

సంతోషో వై స్వర్గతమః సంతోషః పరమం సుఖమ్ ।
తుష్టేర్న కించిత్ పరతః సా సమ్యక్ ప్రతితిష్ఠతి॥

(భార. శాం. 21-2)

ఓ రాజా! మనుష్యుని మనస్సు సంతోషించుటయే స్వర్గప్రాప్తి కంటె గొప్పది. సంతోషమే అన్నిటికంటె మించిన సుఖము. మనస్సులో సంతోషము బాగుగా ప్రతిష్ఠితమగునో ప్రపంచములో దానికంటె మించిన దేదియు నుండదు.

తృష్ణకు మించిన వ్యాధి మఱొకటి లేదు—

జీర్యన్తే జీర్యతః కేశా దన్తా జీర్యన్తి జీర్యతః ।
చక్షుః శ్రోత్రే చ జీర్యేతే తృష్ణైకా తరుణాయతే॥

(పంచతంత్ర 5-16)

ముసలితనము రాగానే వెండ్రుకలు తెల్లబడి రాలిపోవును. దంతములు కదలి రాలిపోవును. నేత్రములు చెవులు జీర్ణములై చూడలేవు, వినలేవు. కాని తృష్ణయొక్కటే రోజు రోజుకు యౌవనము తలదగును.

దయను మించిన ధర్మములేదు—దయ ధర్మమునకు మూలము. దురభి మానము పాపమునకు మూలము. ప్రాణము పోవుచున్నను దయను విడువరాదు.

శ్లో॥ క్రోధో వైవస్వతో రాజా తృష్ణా వైతరణీ నదీ।
విద్యా కామదుఘా ధేనుః సంతోషో నందనం వనమ్॥ 14

అర్థము :- క్రోధః=క్రోధము, వైవస్వతః=యముడు, తృష్ణా= కోరిక. వైతరణీ నదీ = వైతరణి యను నది, విద్యా = విద్య, కామ దుఘః=కోర్కెల దీర్చు, ధేనుః = ఆవు, సంతోషః = సంతోషము, నందనం వనమ్=నందనవనము.

తా॥ క్రోధము సాక్షాత్తుగా యముడే. తృష్ణవైతరణీ నది. విద్య కోర్కెల నీడేర్చు ఆవు. సంతోషమే నందనవనము.

వివరణము :- క్రోధము యమరాజు—

క్రుద్ధః పాపం నరః కుర్యాత్ క్రుద్ధో హన్యాత్ గురూనపి।
క్రుద్ధః పరుషయా వాచా శ్రేయసోఽప్యవ మన్యతే॥

(భార. వన. 29-4)

తా॥ క్రోధముగల మనుష్యుడు పాపముచేయును. క్రోధి గురువు లను కూడ జంపును. కోపించినవాడు పరుషవాక్కులతో శ్రేష్ఠపురుషులను కూడ నవమానించును.

తృష్ణ వైతరణీ నది. వైతరణీ నదిని దాటుట యెంతకష్టమో కోరికను చంపుకొనుటకూడ నంతకష్టమే.

ధీరోఽప్యతి బహుజ్ఞోఽపి కులజోఽపి మహానపి ।
తృష్ణయా బధ్యతే జంతుః సింహః శృంఖలయా యథా॥

(మహోపనిషత్ 5-87)

ధీరుడైనను, విద్వాంసుడైనను, గొప్పకులమునందు పుట్టిన వాడైనను, గొప్పవాడైనను, గొలుసుతో సింహము బంధింపబడినట్లు తృష్ణతో బంధింపబడును.

విద్య కామధేనువు వంటిది. విద్యవలన సర్వము సంపన్నమగును.

విద్యా దదాతి వినయం వినయా ద్యాతి పాత్రతామ్ ।
పాత్రత్వాద్ధన మాప్నోతి ధనాద్ధర్మం తతః సుఖమ్॥

విద్యచే మనుష్యునకు వినమ్రత కలుగును. వినమ్రత వలన యోగ్యత యేర్పడును. యోగ్యతవలన ధనము ప్రాప్తించును. ధనము వలన ధర్మము, ధర్మము వలన సుఖము కలుగును.

సంతోషము నందనవనముతో సమానము. ఈ విషయము 7 అ. 3 శ్లోక విమర్శలో దెలియును.

శ్లో॥ గుణో భూషయతే రూపం శీలం భూషయతే కులమ్ ।
సిద్ధి ర్భూషయతే విద్యాం భోగో భూషయతే ధనమ్॥15

అర్థము :- గుణః=గుణము మనుష్యునకు, రూపం = సౌందర్యమును, భూషయతే = అలంకరించుచున్నది, శీలం = శీలము, కులం = కులమును, భూషయతే = అలంకరించుచున్నది, సిద్ధిః=అలౌకిక శక్తి సిద్ధించుట, విద్యాం = విద్యను, భూషయతే = అలంకరించుచున్నది, భోగః=భోగము, ధనం = ధనమును, భూషయతే=అలంకరించుచున్నది. అనగా భోగమునకు పనికిరాని ధనము వ్యర్థము. ధనమును అనుభవింప వలసినదే దాచిపెట్టరాదని భావము.

తా॥ మనుష్యునకు గుణము అందము నిచ్చును. శీలము (ప్రవర్తన) కులము నలంకరించును. సిద్ధి (అలౌకిక శక్తి ప్రాప్తి) ముక్తిని, బుద్ధిని, విద్యను అలంకరింపజేయును. భోగము (సుఖాది యనుభవము) ధనము నలంకరించును. అనగా ననుభవింపని ధనము వ్యర్థము.

వివరణము :- గుణము మనుష్యుని రూపమును శోభిల్ల జేయును—

పదం హి సర్వత్ర గుణైర్నిధీయతే। (రఘువంశ. 3-62)

గుణము లంతట తమ ప్రభావమును చూపును.

గుణేష్వేవ హి కర్తవ్యః ప్రయత్నః పురుషైః సదా।
గుణయుక్తో దరిద్రోఽపి నేశ్వరై రగుణైః సమః॥

(మృచ్ఛక. 4-22)

మనుష్యు డెప్పుడును దయా దాక్షిణ్యాది గుణములను పొందుటకు ప్రయత్నింపవలెను. ఎందుకనగా గుణముకలవాడు దరిద్రుడైనను గుణములేని ధనవంతునికంటె శ్రేష్ఠుడగును.

శీలము కులము నలంకరించును. శీలమనగా-ఉత్తమ స్వభావము ఉత్తమాచరణము, నీతిమంతుడగుట, మంచిజీవనము, శుచిత్వము, విశ్వాస పాత్రుడగుట, వైరత్యాగము దానము దయాది గుణములు కలిగియుండుట.

శీలం పరం భూషణమ్। (భర్తృహరి-నీతి. 78)

శీల మన్నింటికంటె గొప్ప భూషణము.

శీలము గలవాని యింట నలుగురు చంద్రులు ప్రకాశింతురు. సిద్ధి వలన విద్య ప్రకాశించును. సిద్ధి యనగా ముక్తి చచ్చుట పుట్టుట యను చక్రబంధమునుండి విడిపించి ముక్తిని పొందించు నట్టిదియే విద్య. 'సా విద్యా యా విముక్తయే' ఏది ముక్తిని ప్రాప్తింపజేయునో యదియే విద్య యని చెప్పబడెను. సిద్ధి యనగా వృద్ధియనియు నర్థముకలదు. వృద్ధివలన

విద్య శోభిల్లును. మనుష్యునకు బుద్ధిలేనిచో 'సాక్షరా విపరీతత్వే భవన్తి రాక్షసా ధ్రువమ్' సాక్షరా అను దానిని తల్లక్రిందులు అనగా మొదటిది చివరకు చివరిది మొదటకు మార్చిన రాక్షసయగును. కావున బుద్ధి మోక్షములు, వృద్ధికలిగినపుడే విద్యసార్థకమగును. అలౌకిక శక్తులు, యోగసిద్ధులు కూడ విద్య నలంకరించును.

ధనము దానముచేయుటచేతను, భోగించుటచేతను శోభిల్లును. కూడ బెట్టుటచేతకాదు. భామాశాహ అను రాజు తన జీవితములో సంపాదించిన దంతయు మహారాణా ప్రతాపసింహుని పాదములపై నుంచి తన దేశ సేవను వెల్లడించి తాను అజరామరుడయ్యెను.

శ్లో॥ నిర్గుణస్య హతం రూపం దుశ్శీలస్య హతం కులమ్ ।
అసిద్ధస్య హతా విద్యా అభోగేన హతం ధనమ్॥ 16

అర్థము :- నిర్గుణస్య=గుణహీనునియొక్క, రూపం=అందము, హతం = నశించును, వ్యర్థమగును, దుశ్శీలస్య = శీలహీనుని యొక్క, కులం=కులము, హతం=నిందితమగును, అసిద్ధస్య = అలౌకిక శక్తులు లేని బుద్ధిహీనునియొక్క, విద్యా=విద్య, హతా=వ్యర్థము, అభోగేన = భోగింపరాని, ధనం=ధనము, హతం=వ్యర్థము.

తా॥ గుణహీనుని సౌందర్యము వ్యర్థము. శీలములేనివాని కులము నిందితమగును. అలౌకిక శక్తులు సంపాదింపని బుద్ధిహీనుని విద్య వ్యర్థము. అనుభవమున కుపయోగపడని ధనము వ్యర్థము.

వివరణము :- అనుభవింపదగని ధనము వ్యర్థము. భర్తృహరి—

దానం భోగో నాశస్తిస్రో గతయో భవన్తి విత్తస్య ।
యో న దదాతి న భుంక్తే తస్య తృతీయా గతిర్భవతి॥
(భర్తృ. నీతి. 39)

ధనమునకు దానము, భోగము, నాశము అను మూడు గతులు కలవు. దానమున కుపయోగపడనట్టిదియు, అనుభవింపబడనట్టి ధనము మూడవదియగు నాశనమునకే యోగ్యమగును. అనగా నది నశించును.

శ్లో॥ శుచిర్భూమిగతం తోయం శుద్ధా నారీ పతివ్రతా।
శుచిః క్షేమకరో రాజా సంతోషీ బ్రాహ్మణః శుచిః॥17

అర్థము :- భూమిగతం = భూమిలోనున్న, తోయం = నీరు, శుచిః=శుద్ధమైనది, పతివ్రతా=పతివ్రతయైన, నారీ=స్త్రీ, శుద్ధా=పవిత్రయైనది, క్షేమకరః = శుభమును చేయునట్టి, రాజా=రాజు, శుచిః = పవిత్రుడు, సంతోషీ=సంతుష్టుడైనట్టి బ్రాహ్మణః=బ్రాహ్మణుడు, శుచిః = పవిత్రుడు.

తా॥ భూమిలోని నీరు, పతివ్రతయైన స్త్రీ, క్షేమమును గలిగించు రాజు, సంతోషించు బ్రాహ్మణుడు శుద్ధముగా పవిత్రులుగా నుందురు.

వివరణము :- భూమిలోనుండు నీరు పవిత్రముగా నుండును. వర్షపు నీరెక్కువ భాగము ప్రవహించి నదీనదములలోను, సముద్రములోను చేరును. కాని ఆ వర్షజలము కొంచెము మాత్రమే భూమిలో ప్రవేశించును. ఈ జలమే బావులు, చెలములు, చెఱువులందు భూమిలోని స్రోతస్సు (ప్రవాహము) ద్వారా చేరును. భూమిలో వడకట్టబడి స్రవించుటచే ఆ నీటిని శుద్ధమైన జలముగా (ఫిల్టర్ వాటర్) చెప్పుదురు. ఇందువలన భూమిలోని నీరు శుద్ధము పవిత్రమునై యున్నది.

పతివ్రతయైన స్త్రీ శుద్ధయైయుండును —

శ్లో॥ అసంతుష్టా ద్విజా నష్టాః సంతుష్టాశ్చ మహీభృతః।
స లజ్జా గణికా నష్టా నిర్లజ్జాశ్చ కులాంగనాః॥ 18

అర్థము :- అసంతుష్టాః=సంతోషింపని, ద్విజాః=బ్రాహ్మణులు, నష్టాః=నష్టము పొందుదురు, సంతుష్టాః=సంతోషించినట్టి, మహీభృతః= రాజులు, చ=కూడ నష్టపోవుదురు, సలజ్జాః = సిగ్గుగలిగినట్టి, గణికాః= వేశ్యలు, నష్టాః=నష్టపడుదురు, నిర్లజ్జాః=సిగ్గువిడిచిన, కులాంగనాః = కులస్త్రీలు చెడిపోవుదురు.

తా॥ సంతోషింపని బ్రాహ్మణులు, సంతోషించిన (తృప్తికల) రాజులు, సిగ్గుగల వేశ్యలు, సిగ్గులేని కులస్త్రీలు నష్టపోవుదురు. అనగా బ్రాహ్మణులు సంతోషముకలవారుగాను, ఉన్న రాజ్యముతో తృప్తిచెందక రాజులు రాజ్యమును విస్తరింపజేయు బుద్ధికలవారుగాను, వేశ్యలు సిగ్గు కలిగియున్న విటుల నాకర్షింపలేరు. కావున సిగ్గులేనివారుగాను, కులస్త్రీలు సిగ్గుగలిగి భర్తల నాకర్షించువారుగా నుండవలెను. తద్విపరీతమైన నష్ట పోవుదురు.

శ్లో॥ కింకులేన విశాలేన విద్యాహీనేన దేహినామ్ ।
దుష్కులీనోఽపి విద్వాంశ్చ దేవైరపి సుపూజ్యతే॥ 19

అర్థము :- విద్యాహీనేన=విద్యాహీనుడైనట్టి వానితో విశాలేన= గొప్పదైన, కులేన=కులముతో, దేహినాం = మనుష్యులకు, కిం = ఏమి ప్రయోజనము? దుష్కులీనః = నీచకులమునందు పుట్టినవాడైనను, విద్వాన్=విద్వాంసుడు, దేవైః=విద్వాంసులచేత, అపి = కూడ, సుపూజ్యతే=పూజింపబడుచున్నాడు.

తా॥ మనుష్యులకు విద్యావిహీనమైన గొప్పకులముతో నేమి ప్రయోజనము? కొంచెమైనను ప్రయోజనముండదు. నీచకులమందు పుట్టినవాడైనను-విద్యావంతుడు విద్వాంసుల ద్వారా బాగుగా పూజింప బడును.

వివరణము :- విద్యయొక్క మహత్త్వము అన్నిటికంటె మున్నత స్థితిలోనుండును. పౌరాణికుల మతానుసారము శృంగిఋషి లేడికి పుట్టినవాడైనను. అగస్త్యుడు కుండనుండి పుట్టినవాడైనను, (ఇవి మా దృష్టిలో అసంభవములు) వ్యాసుడు పల్లెవాని కూతుకు పుట్టినను, వసిష్ఠుడు ఊర్వశి యను వేశ్యకు బుట్టినను వారి విద్యవలన నందఱు వారిని పూజించుచుండిరి.

శ్లో॥ విద్వాన్ ప్రశస్యతే లోకే విద్వాన్ గచ్ఛతి గౌరవమ్ ।
విద్యయా లభ్యతే సర్వం విద్యా సర్వత్ర పూజ్యతే॥ 20

అర్థము :- లోకే=లోకమునందు విద్వాన్=విద్వాంసుడు, ప్రశస్యతే=ప్రశంసింపబడుచున్నాడు, విద్వాన్ = విద్వాంసుడే గౌరవమ్ = ఆదరసమ్మానములను, గచ్ఛతి = పొందుచున్నాడు విద్యవలననే కీర్తి, పొగడ్త కలుగుచున్నది, విద్యయా = విద్యచేత, సర్వం = సమస్తము, అనగా ధనధాన్యములు, గౌరవము. యశస్సు, పూజ, ప్రతిష్ఠ అన్నియు. లభ్యతే=పొందబడుచున్నది, విద్యా=విద్య, సర్వత్ర = అన్ని స్థానములలో, పూజ్యతే=పూజింపబడును.

తా॥ లోకములో విద్వాంసుడు పొగడబడుచున్నాడు. విద్వాంసుడు గౌరవింపబడుచున్నాడు. విద్యవలన సర్వము లభించును. విద్య యంతట పూజింపబడును.

శ్లో॥ మాంసభక్ష్యైః సురాపానైః మూర్ఖైశ్చాక్షర వర్జితైః ।
పశుభిః పురుషాకారైః భారాఽఽక్రాన్తా చ మేదినీ॥ 21

అర్థము :- మాంసభక్ష్యైః=మాంసభక్షకులతోను, సురాపానైః = మద్యముసేవించువారితోను. మూర్ఖైః = మూర్ఖులతోను, అక్షరవర్జితైః = అక్షరమురాని వారితోను, పురుషాకారైః=పురుషాకారముతోనున్న, పశుభిః

చ=పశువులతో కూడ, మేదినీ=భూమి. భారాక్రాంతా=భారముతో ఆక్ర మింపబడి అణగద్రొక్కబడుచున్నది.

తా॥ ఈ భూమి మాంసభక్షులతోను, సురాపానముచేయు వారి తోను, మూర్ఖులతోను, విద్యలేనివారితోను, మనుష్యాకారములోనున్న పశువులతో భారము మోయుచు పీడింపబడుచున్నది.

వివరణము :- మాంసాహారులలో దయయుండదు. మద్యము సేవించువారిలో సత్యముండదు. అట్లే మూర్ఖులు అక్షరమెఱుగని మను ష్యులు తమకు మేలుచేసికొనుచున్నను లోకమున కుపకారముచేయరు. అందుచేత వారందఱు భూమికి భారమైయున్నారు.

శ్లో॥ అన్నహీనో దహేద్ రాష్ట్రం మన్త్రహీనశ్చ ఋత్విజః।
యజమానం దానహీనో నాస్తి యజ్ఞసమో రిపుః॥ 22

అర్థము :- అన్నహీనః=అన్నములేనట్టి, యజ్ఞము, రాష్ట్రం = రాష్ట్రమును, దహేత్=కాల్చును, చ=మఱియు, మన్త్రహీనః = మన్త్ర ములు లేని యజ్ఞము, ఋత్విజః=ఋత్విక్కులుగా నుండువారిని, దహేత్= కాల్చును, దానహీనః=దానములేనట్టి యజ్ఞము, యజమానం = యజమా నుని, దహేత్=కాల్చును, ఇందువలన, యజ్ఞసమః=యజ్ఞముతో సమాన మైన, రిపుః=శత్రువు, నాస్తి=లేదు.

తా॥ అన్నములేని యజ్ఞము రాష్ట్రమును దహించును. మంత్ర హీనమైన యజ్ఞము ఋత్విక్కులను భస్మముచేయును. దానహీనమైన యజ్ఞము యజమానుని నశింపజేయును. ఇందువలన ప్రపంచములో యజ్ఞ ముతో సమానమైన శత్రువు లేదు.

వివరణము :- యజ్ఞము కామధేనువు, కల్పతరువు వంటిది. కాని ఆ యజ్ఞమును విధి విధానముగా జేయకున్నచో శత్రువుగా పరిణ మించును. దశరథమహారాజు——

విధిహీనస్య యజ్ఞస్య కర్తా సద్యః వినశ్యతి।
(వాల్మీ. రా. బాల. 8-18)

శాస్త్రపద్ధతిగా యజ్ఞముచేయకున్నచో వెంటనే నష్టము సంభవించును. శ్రీకృష్ణుడు—

విధిహీన మసృష్టాన్నం మంత్రహీన మదక్షిణమ్।
శ్రద్ధా విరహితం యజ్ఞం తామసం హి ప్రచక్షతే॥ (గీతా. 17-16)

శాస్త్రపద్ధతిగా లేకయు, లోకకల్యాణము కొఱకు అన్నదానము లేకయు, వేదమంత్రోచ్చారణము లేకయు, దక్షిణ యీయబడకయు నశ్రద్ధతో చేయబడిన యజ్ఞమును తామస యజ్ఞమందురు. ఇట్టి యజ్ఞము లాభకారికాదు. శాస్త్రపద్ధతిగా చేయబడిన యజ్ఞము ఈ లోకములో మనుష్యులను ధన ధాన్య సంపన్నుల జేయును. చివరకు మోక్షమునకు జేర్చును.

అష్టమాధ్యాయము సమాప్తము

# నవమాధ్యాయము

శ్లో॥ ముక్తి మిచ్ఛసి చేత్తాత విషయాన్ విషవత్ త్యజ।
క్షమాఽఽర్జవం దయా శౌచం సత్యం
పీయూషవత్ భజ॥ 1

అర్థము :- తాత=సోదరా!, ముక్తిం=ముక్తిని, ఇచ్ఛసి చేత్ = కోరుచున్నచో, విషయాన్ = విషయములను, విషవత్ = విషమువలె, త్యజ=విడువుము, క్షమా=ఓర్పును, ఆర్జవం=ఋజుత్వము సరళతను

వినమ్రత మొదలైన వానిని, దయా = దయను, శౌచం = పవిత్రతను, సత్యం = సత్యమును, పీయూషవత్ = అమృతమువలె, భజ = పొందుము.

తా॥ సోదరా! ముక్తిని కోరువాడవైనచో విషయములను విషముతో సమానమని తెలిసికొని విడిచిపెట్టుము. సహనశీలతయు, ధైర్యమును, సరళతను, వినమ్రతను, విశ్వాసమును, ఔదార్యమును, దయను, పవిత్రతను, సత్యమును అమృతము వలె పొందుము.

వివరణము :- మోక్షమునకు కావలసిన సాధనములు—

1. విషయములను విషముతో సమానములని విడిచిపెట్టుము.

మోక్షో విషయవైరస్యం బంధో వైషయికో రసః ।
ఏతావదేవ విజ్ఞానం యథేచ్ఛసి తథా కురు॥ (అష్టావక్రగీత 15-2)

విషయములందాసక్తి లేకుండుటయే మోక్షము-విషయములందభిరుచి కలిగియుండుటయే బంధనము. సంక్షేపముగా విజ్ఞానసారమిదే. కోరికననుసరించి పనిచేయుము.

విషస్య విషయాణాంచ దృశ్యతే మహదన్తరమ్ ।
ఉపభుక్తం విషం హన్తి విషయాః స్మరణాదపి॥

విషమునకు విషయములకు మిక్కిలి భేదము కనబడుచున్నది. విషయము తినినచో చంపును. కాని విషయములను స్మరించినంతనే యవి మనుష్యుని నాశము చేయును.

అపదాం కథితః పన్థా ఇన్ద్రియాణా మసం శయః ।
తజ్జయః సమ్పదాం మార్గో యేనేష్టం తేన గమ్యతామ్॥
(చాణక్య నీతిశాస్త్రమ్ 72)

ఇంద్రియనిగ్రహములేకుండ ఇష్టము వచ్చినట్లు విషయ లోలుడగుట వ్యాధులకు లెక్కలేనన్ని ఆపదలకు కష్టములకు రాజమార్గమగును. ఇంద్రియముల జయించినచో లెక్కలేనన్ని ఆరోగ్యాది సుఖములను పొందుటకు రాజమార్గమగును. వీనిలో నేది నీకు నిష్టమున్న దాని నీవనుసరింపుము.

విషాద్విషం కిం విషయాః సమస్తా దుఃఖీ సదా కో విషయానురాగీ।
ధన్యోఽస్తి కో యస్తు పరోపకారీ కః పూజనీయః శివతత్త్వ నిష్ఠః॥
(శంకరా. ప్రశ్నోత్తరీ. 13)

విషముకంటె మించిన విషముతో కూడి యున్నదేది? సమస్త విషయములను భోగించుటయే. ఎల్లపుడు దుఃఖించు వాడెవడు? ప్రపంచములో భోగములందాసక్తికలవాడు. ధన్యుడెవడు? పరోపకారముయందు చేయువాడు. పూజనీయు డెవడు? కల్యాణస్వరూపుడైన పరమాత్మ నిష్ఠకల మహాత్ముడు.

2. క్షమా=ధైర్యము, సహనశీలత, తితిక్ష. యోగవాసిష్ఠములో కూడ శమ=ధైర్యమును మోక్షమునకు ద్వారపాలకుడుగా చెప్పిరి.

మోక్షద్వారే ద్వారపాలశ్చత్వారః పరికీర్తితః।
శమో విచారః సంతోషశ్చతుర్థః సాధుసంగమః॥
(యోగ. ముము. 11-59)

మోక్షద్వారమునకు నల్వురు ద్వారపాలకులున్నట్లు చెప్పిరి. 1. శమము, క్షమా ధైర్యము 2. విచారము ఆలోచన, 3. సంతోషము, 4. సాధుసంగతి యనునాలుగు.

3. ఆర్జవం - కపటములేకుంట, సరళత, వినమ్రత, విశ్వాసము, ఔదార్యము కూడ మోక్షప్రాప్తికి మార్గమేమి?

**4.** దయ - ప్రతిప్రాణియందు దయగలిగియుండుట మోక్షప్రాప్తికి సాధనము.

5. పవిత్రత - లోపలబయట కూడ పవిత్రత కలిగియుండుట మోక్షప్రాప్తి కావశ్యకము.

అద్భిర్గాత్రాణి శుధ్యన్తి మనః సత్యేన శుధ్యతి।

విద్యా తపోభ్యాం భూతాత్మా బుద్ధి ర్జ్ఞానేన శుధ్యతి॥(మను 5-109)

జలముతో శరీరము, సత్యముతో మనస్సు బ్రహ్మవిద్య తపస్సులతో జీవాత్మ, జ్ఞానముతో బుద్ధియు శుద్ధములగును.

సత్యము కూడ మోక్షమార్గ సాధకము—

సత్యం స్వర్గస్య సోపానమ్। (భార. ఉద్యో. 33 47)

సత్యము స్వర్గమునకు మెట్లు వంటిది. మఱొక కవి—

న హి సత్యాత్పరో ధర్మో నానృతా త్పాతకం పరమ్।

సత్యమును మించిన ధర్మము, అబద్ధమునకు మించిన పాపము మఱొకటి లేదు

శ్లో॥ పరస్పరస్య మర్మాణి యే భాషన్తే నరాధమాః।
తే ఏవ విలయం యాన్తి వల్మీకోదర సర్పవత్॥ 2

అర్థము :- యే=ఎవరు, పరస్పరస్య=ఒకరికొకరు, మర్మాణి = రహస్యములను, భాషన్తే=చెప్పుకొందురో, తే=అట్టి, నరాధమాః ఏవ= నీచమానవులే, వల్మీకోదర = పుట్టలోనున్న, సర్పవత్ = సర్పమువలె, విలయం=నాశనము, యాన్తి=పొందుదురు.

తా॥ నీచమానవులు పరస్పరము ఒకరి రహస్యములు మఱొకరు వెల్లడించుకొనుచు అంతరాత్మకు దుఃఖమును కలిగించునట్లు మాట్లాడుచు పుట్టలో చిక్కుకొనిపోయిన సర్పమువలె నశింతురు.

వివరణము :- వాక్కుతో గలిగిన గాయము మిక్కిలి భయంకర మైనది. అది మానదు. విదురుడు—

రోహతే సాయకై ర్విద్ధం వనం పరశునా హతమ్ ।
వాచా దురుక్తం బీభత్సం న సంరోహతి వాక్ క్షతమ్॥

(విదుర. 2-78

బాణములచే గొట్టబడిన గాయము మానును. గొడ్డలిచే నఱకబడిన వనము చిగుర్చును. కాని పరుషవచనములచే గాయపడిన హృదయము ఎన్నడును చక్కబడదు.

కర్ణినాలీక నారాచాన్ నిర్హరన్తి శరీరతః ।
వాక్ శల్యస్తు న నిర్హర్తుం శక్యో హృది శయో హి సః

(విదుర. 2-79)

కర్ణి, నాలీకము, నారాచము అను పేర్లుగల బాణములను శరీరమునుండి వెడలింపవచ్చును. కాని కఠిన వాగ్రూప బాణములను హృదయములో నాటుకొనియుండుటచేత బయటకు తీయజాలరు.

ఇతరులకు బాధను గలిగించు కఠోరవచనములను పలుకరాదు. తన వాక్కునకు తెలుపవలెను.

హే జిహ్వే! కటుకస్నేహే మధురం కిం న భాషసే ।
మధురం వద కల్యాణీం లోకోఽయం మధురప్రియః॥

(చాణక్యసార సంగ్రహము 2-11)

కఠినముగా మధురముగా బలుకు ఓ నాలుకా! నీవు మధురముగా నేల పలుకవు ఓ కల్యాణి! నీవు మధురముగా మాట్లాడుము. ప్రపంచములోని మనుజులు మధురముగా మాటాడువారిని ప్రేమింతురు కావున మధురముగా మాట్లాడుము.

శ్లో॥ గన్ధః సువర్ణే ఫలమిక్షు దండే
నాఽకారి పుష్పం ఖలు చందనస్య ।
విద్వాన్ ధనాఢ్యశ్చ నృపశ్చిరాయుః
ధాతుః పురా కోఽపి న బుద్ధిదోఽభూత్ ॥ 3

అర్థము :- సువర్ణే=బంగారమునందు, గంధః = సువాసనయు, ఇక్షుదండే=చెఱకుగడయందు, ఫలం=పండును, చందనస్య=మంచిగంధపు చెట్టునకు, పుష్పం=పుష్పమును, నాకారిఖలు=చేయలేదుగదా ! సమకూర్ప లేదు గదా !, అట్లే, విద్వాన్=విద్వాంసుడు, ధనాఢ్యః = ధనవంతుడు, చ=మఱియు, నృపః = రాజు, చిరాయుః = దీర్ఘాయువు గల వాడుగా లేడు, పురా = పూర్వము, ధాతుః = విధాతకు పరమాత్మకు, కోఽపి = ఎవ్వడును, బుద్ధిదః=తెలియజెప్పినవాడు, నాభూత్=లేకుండెను.

తా॥ బ్రహ్మ బంగారమునకు సువాసనను, చెఱకుగడకు ఫలమును, గంధపుచెట్టుకు పుష్పమును కల్పింపలేదు. అట్లే విద్వాంసుని ధనాఢ్యుని గాను, రాజును చిరాయువుగాను సృష్టింపలేదు. ఇట్టి పని చేసిన బ్రహ్మకు పూర్వము బుద్ధిచెప్పిన వాడెవ్వడును లేకుండెను.

వివరణము :- పరమాత్మ యందారోపించిన యీ దోషములు నిరాధారము. వేదములో చూడుడు—

యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధాచ్ఛాశ్వతీభ్యః సమాభ్యః ।

(యజు. 40-8)

పరమేశ్వరుడు అనాదికాలమునుండి అనాది ప్రజలకు అనాది ప్రకృతినుండి సరియైన పదార్థములను నిర్మాణముచేసి వానిని దెలిసికొను టకు వేదవిద్యలను ప్రకాశింపజేసెను. పరమాత్మయొక్క సృష్టి రచన మిక్కిలి వైజ్ఞానికమైనది. దీనిలో తక్కువదనముకాని, దోషముకాని, పొరపాటుకాని యుండదు. చూచి ఆలోచించుడు—

బంగారములో సుగంధము లేకుండుటయే మంచిది. బంగారము నకు సుగంధమున్నచో భర్తలకు పెద్దసమస్య యయ్యెడిది. భార్యలకు భర్తలు ఏబదిగ్రాముల బంగారు నగచేయించి ధరింపచేసినచో రెండు మూడు నెలలలో ఆ వాసన హరించిపోవును. వాసనగల కర్పూరమెట్లు హరించిపోవునో యట్లే వాసనగల వస్తువులలోని వాసన హరించిపోవును. మఱొక విషయము-భార్యముక్కులకు వాసనగల బులాకి ముక్కుకు పెట్టుకొని దాని వాసన చూచుచు కూర్చున్నచో పొయ్యిమీదనున్న కూర మాడిపోవును. ఇంకొక విషయము-బంగారమునకు వాసనయున్నచో దొంగలు ఆ వాసననుబట్టి త్వరగా తేలికగా కనిపెట్టి తీసికొనిపోవుదురు.

చెఱకునందు న్యాయముగా తీపియున్నది కావున దానికి పండు అక్కఱలేదు. ఫలమున్నచో చీమలు, పక్షులు, పశువులు, కోతులు మొదలైనవి తినును. మనుష్యులకు పండ్లు వేఱుగా దొరుకును గదా!

చందన వృక్షము క్రిందినుండి పైకి అంతయు సుగంధము కలిగి యుండును. అందుచేత దానికి పుష్పమక్కఱలేదు. విద్వాంసుడు ధనాఢ్యుడు కానక్కఱలేదు. చరిత్రలో ధనాఢ్యులైన కవుల చరిత్రచూడుడు. మహాకవి మాఘుడు రహీమ్, ఆర్యజగత్తులో కృపారామ్ (స్వామి దర్శనానంద) మిక్కిలి ధనవంతులు. ధనవంతులైన విద్వాంసులు వేదప్రచారముచేయక వ్యాపారముచేయుదురు. విద్వాంసులకు యోగక్షేమములకు సరిపోవు ధనమున్నచో చాలును.

రాజులను దీర్ఘజీవులనుగా సృష్టింపలేదనుటయు సరికాదు. శ్రీరాముడు, యుధిష్ఠిరుడు మొదలైనరాజు లనేకులు చిరంజీవులే గదా! అన్యాయకారియగురాజు చిరంజీవి యగుచో ప్రజలను పీడించును. రాష్ట్రములో దురాచారము వృద్ధిచెందును. కావున నట్టిరాజు చిరంజీవి కాకుం

డుటయే మంచిది. కావున ఈవిషయముగా పరమాత్మపై మోపిననేరము (ఆక్షేపణ) సరియైనదికాదు. నిరాధారము.

శ్లో॥ సర్వౌషధీనా మమృతా ప్రధానా
సర్వేషు సౌఖ్యేష్వశనం ప్రధానమ్ ।
సర్వేన్ద్రియాణాం నయనం ప్రధానమ్
సర్వేషు గాత్రేషు శిరః ప్రధానమ్॥ 4

అర్థము :- సర్వౌషధీనాం=ఔషధములన్నింటిలోను, అమృతా= తిప్పతీగ, ప్రధానా=ముఖ్యమైనది, సర్వేషు=సమస్తమైన, సౌఖ్యేషు = సౌఖ్యములందు (సుఖమును కలిగించువానిలో) అన్నం = భోజనము, ప్రధానం=ముఖ్యమయినది, సర్వేంద్రియాణాం = జ్ఞానేంద్రియములన్నింటిలో, నయనం=కన్ను, ప్రధానం=శ్రేష్ఠమైనది, సర్వేషు=సమస్తమైన, గాత్రేషు = అంగములలో, శిరః = శిరస్సు, ప్రధానం = సర్వశ్రేష్ఠమైనది.

తా॥ ఓషధులన్నిటిలో తిప్పతీగ ప్రధానమైనది. సుఖము కలిగించు వానిలో ప్రధానమైనది భోజనము. జ్ఞానేంద్రియములలో కన్ను ప్రధానమైనది. అంగములన్నింటిలో శిరస్సు ప్రధానమైనది.

వివరణము :- అమృతమనునది రసాయనము. దీనిని తిప్పతీగ యందురు. ఇది సోమలతకు ప్రతినిధి. దీనియొక్క మహిమను చూడుడు—

మండూక పర్ణ్యాః స్వరసః ప్రయోజ్యః క్షీరేణ యష్టి
మధుకస్య చూర్ణమ్ ।
రసో గుడూచ్యాస్తు సమూలపుష్పాః కల్కః ప్రయోజ్యః
ఖలు శంఖ పుష్ప్యాః॥

ఆయుః ప్రదా న్యామయనాశనాని బలాగ్ని వర్ణస్వర వర్ధనాని ।
మేధ్యాని చైతాని రసాయనాని మేధ్యా విశేషేణ చ శంఖపుష్పీ॥
(ధన్వంతరి. రసాయనాధికార)

ప్రతిదినము ప్రాతఃకాలమున బ్రహ్మముహూర్తమునందు రసము త్రాగినను, ములహాఠీ చూర్ణము పాలతో కలిపి తీసికొనినను, లేక తిప్పతీగ రసము పానముచేసినను, లేక వ్రేళ్లతో గూడ పూలతోగూడిన శంఖపుష్పము యొక్క కల్కము సేవించినను ఆయుస్సు పెరుగును. శరీరములోని రోగములన్నియు పోవును. బలము, జఠరాగ్ని పెరుగును. స్వరము మాధుర్యము కలదగును. మేధస్సు వృద్ధియగును. విశేషముగా శంఖపుష్పి మేధస్సును వృద్ధిచేయును. అమృతశబ్దముచే ఉసిరిక, హరడ్, తులసి మొదలగువానిని గ్రహింపవచ్చును. ఇవి శ్రేష్ఠమైన యోషధులే. సుఖము లన్నింటిలో భోజనము ప్రధానమైనది. భోజనములేకుండ జీవనయాత్ర సాగదు. అన్నము మనుష్యునకు జీవనము. జ్ఞానేంద్రియములన్నిటిలో కన్ను శ్రేష్ఠమైనది. కన్నుగల వానికే ప్రపంచముకలదు. శరీరములోని యంగములన్నింటిలో శిరస్సు ప్రధానమైనది ఎందు కనగా—

1. జ్ఞానేంద్రియము లన్నియు శిరస్సులో నున్నవి.

2. యోగశాస్త్రానుసారము సహస్రదళకమలము శిరస్సులోనే యున్నది.

3. చెట్టుయొక్క పంచాంగములలో (వేరు, బోదె, కొమ్మ, రెమ్మ, ఆకు) మూలమువలె శరీరములోని షడంగములలో (శిరస్సు, మొండెము, 2 చేతులు, 2 కాళ్లు) శిరస్సు సర్వశ్రేష్ఠమైనది

శ్లో॥ దూతో న సంచరతి ఖే న చలేచ్చ వార్తా
పూర్వం న జల్పితమిదం న చ సంగమోఽస్తి।
వ్యోమ్ని స్థితం రవి శశిగ్రహణం ప్రశస్తం
జానాతి యో ద్విజవరః స కథం న విద్వాన్॥ 5

అర్థము :- ఖే=ఆకాశమందు, దూతః=దూత, న సంచరతి = తిరుగడు, చ=మఱియు, వార్తా=మాటలాడుట, న చలేత్=జరుగుటలేదు, ఇదం=ఈ విషయము, పూర్వం = మొదట, న జల్పితం = చెప్పలేదు, చ=మఱియు. సంగమః = కలయిక, నాస్తి=లేదు, వ్యోమ్ని = ఆకాశమందు, స్థితం = ఉన్నట్టి, రవి శశిగ్రహణం=సూర్యగ్రహణము, చంద్రగ్రహణమును, ప్రశస్తం=స్పష్టముగా, యః=ఏ, ద్విజవరః=బ్రాహ్మణశ్రేష్ఠుడు, జానాతి=తెలిసికొనుచున్నాడో, సః=ఆ బ్రాహ్మణుడు, కథం = ఎట్లు. విద్వాన్=విద్వాంసుడు, న=కాడు ?

తా॥ ఆకాశములో దూత సంచరింపలేదు. వార్త నడపలేదు. ముందెవ్వడును చెప్పలేదు, దేనితోను సంబంధములేదు. ఇట్టి స్థితిలో బ్రాహ్మణ శ్రేష్ఠుడు ఆకాశములో సూర్యచంద్రుల గ్రహణముల గూర్చి స్పష్టముగా తెలిసికొనుచున్నాడు. అట్టివాడు విద్వాంసు డెట్లు కాకుండును ?

వివరణము :- ఆకాశములో దూత మొదలైనవారు వెళ్ళలేదను మాట సత్యమే కాని యొకటి గమనింపవలెను. పరమేశ్వరుడు ఈ బ్రహ్మాండమునకు నియామకుడు, వ్యవస్థాపకుడు, లోకలోకాంతరములు గ్రహోపగ్రహములుకలవో వాని చలనము నిశ్చితమైయున్నది. వాని చలనములో కోట్లకొలది సంవత్సరములు గడచినను ఒక్క సెకనుకూడ తేడా యుండనంత సునిశ్చితముగా నున్నది. సూర్యచంద్రుల గమనమును లెక్కకట్టి బ్రాహ్మణులు సూర్యచంద్ర గ్రహణ మెప్పుడు జరు

గునో తెలిసికొనగలుగుచున్నారు. వారు గణితశాస్త్రమును బాగుగా నెఱిగిన విద్వాంసులగుటచే వారి మాటలలో సందేహముండదు.

శ్లో॥ విద్యార్థీ సేవకః పాన్థః క్షుధాఽఽర్తో భయకాతరః
భాండారీ ప్రతీహారీ చ సప్త సుప్తాన్ ప్రబోధయేత్ ॥ 6

అర్థము :- విద్యార్థీ=విద్యార్థియు, సేవకః=సేవకుడు పాన్థః = బాటసారి, క్షుధాఽఽర్తః=ఆకలిచే బాధపడువాడు, భయకాతరః = భయమునచే బాధపడువాడు, భాండారీ = ధనముగలవాడు, చ = మఱియు, ప్రతీహారీ=ద్వారపాలకుడు, ఈను నష్టి, సప్త=ఏడుగురిని, సుప్తాన్=నిద్రించువారిని. ప్రబోధయేత్=మేల్కొల్పవలెను.

తా॥ విద్యార్థిని సేవకుని, బాటసారిని. ఆకలిగొన్నవానిని. భయపీడితుని. ధనాగారపాలకుని. ద్వారపాలకుని. ఈ యేడుగురిని నిద్రపోకుండ చూడవలెను.

వివరణము :- విద్యార్థి నిద్రపోయినచో విద్యార్జన సాగదు. సేవకుడు నిద్రపోయిన సేవాధర్మము నిర్వహింపబడదు. బాటసారి నిద్రపోయినచో గమ్యస్థానము చేరలేడు. ఆకలిగొన్నవాడు నిద్రించినచో ఆకలిసమయమున పొట్టలో ఆమ్లయుక్త పాచకరసము బయలుదేరి జఠరములో ఒరిపిడి ప్రారంభమగును. భయపీడితునకు నిద్రరాదు. ఒకవేళ నిద్రపట్టినను పెద్దకలలను కనుచుండును. ధనాగారము కాచు భటుడు నిద్రించిన కోశాగారమును దొంగలు దోచుకొందురు. ద్వారపాలకుడు నిద్రించినచో ఇతరులు లోనప్రవేశింతురు. కావున నీ యేడుగురు నిద్రించుచున్నచో వారిని నిద్రనుండి లేపవలెను.

శ్లో॥ అహిం నృపం చ శార్దూలం కిటిం చ బాలకం తథా।
పరశ్వానం చ మూర్ఖం చ సప్త సుప్తాన్ న
బోధయేత్ ॥ 7

అర్థము : అహిం=పామును, చ=మఱియు. నృపం = రాజును, శార్దూలం=పెద్దపులిని, చ=మఱియు, కిటిం = పందిని, తథా = అట్లే, బాలకం=బాలకుని, చ = మఱియు, పరశ్వానం = ఇతరుల కుక్కను, చ=మఱియు, మూర్ఖం=మూర్ఖుని, సుప్తాన్=నిద్రించుచున్న, సప్త = ఈ యేడుగురిని, నబో ధయేత్=మేల్కొల్పరాదు.

తా॥ పామును, రాజును, పెద్దపులిని, (చిఱుతపులిని) పందిని, బాలకుని, ఇతరుల కుక్కను, మూర్ఖుని-నిద్రించుచున్న యీ యేడుగురిని నిద్రనుండి మేల్కొల్పరాదు.

వివరణము :- పైజెప్పిన యేడుగురిని మేల్కొల్పిన హాని కలుగును. పాము కఱచును. రాజు శిక్షించును. పెద్దపులి చిఱుతపులి పైనబడి చంపును. పిల్లవాడు నిద్రాభంగమగుటచే నసేపనిగా విడువకయేడ్చును. ఇతరుల కుక్కను నిద్రలేపిన కోపముతో లేచి కఱచును. మూర్ఖుడు వ్యర్థముగా తగవుపెట్టుకొనును. కావున నీ యేడుగురిని నెన్నడు మేల్కొల్పరాదు.

శ్లో॥ అర్థాఽధీతాశ్చ యైర్వేదా స్తథా శూద్రాన్న భోజినాః
తే ద్విజాః కిం కరిష్యన్తి నిర్విషా ఇవ పన్నగాః॥ 8

అర్థము :- యైః=ఏవరిచేత, వేదాః=వేదములు, అర్థాఽధీతాః = ధనముకొఱకు చదువబడినవో, చ=మఱియు, తథా = అట్లే, శూద్రాన్న భోజినాః=శూద్రుల యన్నము తిన్నవారునైన, తే=ఆ, ద్విజాః=బ్రాహ్మణులు, నిర్విషాః = విషములేని, పన్నగాః ఇవ = పాములవలె, కిం కరిష్యన్తి=ఏమిచేయగలరు?

తా॥ ధన సంపాదనకొఱకు వేదములు చదివినవారును, మూర్ఖులైనట్టి త్రాగుబోతులైనట్టి నీచులయిండ్లలో భుజించినవారు నగు బ్రాహ్మణులు విషములేని పాము లేమియు చేయలేనట్లు వారెందుకును పనికిరారు.

వివరణము :- వేదమును ధన సంపాదనకొఱకు చదువుట ధర్మముకాదు. ధర్మమెఱిగి చదువవలెను.

వ్యాకరణ మహాభాష్యములో—

బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః షడంగో వేదోఽధ్యేయో
జ్ఞేయశ్చ॥ (మహా భాష్యం పస్ప.)

బ్రాహ్మణుడు ధనప్రాప్తి ప్రయోజనమును కాంక్షింపక ఆఱు అంగ ములు గల వేదములను అధ్యయనముచేసి యందలి రహస్యముల తెలిసి కొనవలయును. వరిత్యైన బ్రాహ్మణుడు ధనోపార్జన కొఱకు వేదము చదువరు—

రత్నావత్నసా కులటాః సమీక్ష్య।
కిమార్యనార్యః కులటా భవన్తి॥ ?

ఆభరణములు ధరించిన వేశ్యలను జూచి పతివ్రతయైన స్త్రీ వేశ్య కాగలుగునా? ఎన్నడును కాదు. దయానందమహర్షి ఆర్యసమాజ నియమము లలో చక్కగా చెప్పెను. వేదము సమస్త సత్య విద్యల గ్రంథము. వేదమును చదువుటయు, చదివించుటయు, వినుటయు, వినిపించుటయు- ఆర్యులకు పరమధర్మమైయున్నది.

శ్లో॥ యస్మిన్ రుష్టే భయం నాస్తి తుష్టే నైవ
ధనాఽఽగమః।
నిగ్రహోఽనుగ్రహో నాస్తి స రుష్టః కిం కరిష్యతి॥ 9

అర్థము :- యస్మిన్=ఎవడు రుష్టే=కోపించినచో, భయం = భయము, నాస్తి=లేదో, తుష్టే=సంతోషించినచో, ధనాగమః=ధనప్రాప్తి, నైవ=లేనేలేదో, నిగ్రహః=దండించుట, అనుగ్రహః = దయచూపుట,

నాస్తి=లేదో, సః=అట్టివాడు, రుష్టః = కోపించినవాడై, కిం కరిష్యతి= ఏమిచేయగలడు ?

తా॥ ఎవడు కోపించిన భయములేదో, ఎవడు సంతోషించినను ధనమీయడో, ఎవడు దండించుటలోగాని అనుగ్రహించుటలోకాని సమర్థుడు కాడో యట్టివాడు కోపించినను నేమియు చేయలేడు.

శ్లో॥ నిర్విషేణాఽపి సర్పేణ కర్తవ్యా మహతీ ఫణా ।
విషమస్తు న చాప్యస్తు ఘటాటోపో భయంకరః॥ 10

అర్థము :- నిర్విషేణ=విషములేనట్టి, సర్పేణ = సర్పముద్వారా, అపి=కూడ, మహతీ=గొప్పదైన, ఫణా=పడగ, కర్తవ్యా = చేయదగినది (పడగవిప్పవలెను), విషం=విషము, అస్తు = ఉండుగాక, చాపి= లేక, నాస్తు=లేకుండుగాక, ఘటాటోపః = ఆడంబరము, భయంకరః = భయమును గలిగించును.

తా॥ విషములేకున్నను పాము పడగవిప్పవలెను. విషమున్నను లేకున్నను పడగవిప్పి ఆడంబరముగా నున్నచో భయంకరమగును.

శ్లో॥ ప్రాతర్ద్యూత ప్రసంగేన మధ్యాహ్నే స్త్రీ ప్రసంగతః ।
రాత్రౌ చౌర్య ప్రసంగేన కాలో గచ్ఛత్యధీ మతామ్॥11

అర్థము :- అధీమతాం = మూర్ఖులయొక్క, కాలః = కాలము, ప్రాతః = ప్రాతఃకాలము, ద్యూతప్రసంగేన = జూదమాడుటతోను, మధ్యాహ్నే = మధ్యాహ్నమందు, స్త్రీ ప్రసంగతః = స్త్రీల సహవాసము తోను, రాత్రౌ=రాత్రియందు, చౌర్య ప్రసంగేన=దొంగతనము చేయుట తోను, గచ్ఛతి=గడచును.

తా॥ మూర్ఖులయొక్క ప్రాతఃకాలము జూదముతోను, మధ్యాహ్న కాలము స్త్రీల సహవాసముతోను రాత్రికాలము దొంగతనము చేయుట తోను గడచిపోవును.

వివరణము :- కొన్ని పుస్తకములలో 'గచ్ఛత్యధీమతామ్' అను చోట 'గచ్ఛతిధీమతామ్' అని యున్నది. ఆ పాఠమును గ్రహించిన అనువాదకులు భామ్యాకాశములకు ముడిపెట్టినట్లు వ్రాసిరి. ప్రాతఃకాలము జూదమాడుటను మహాభారత కథకు, మధ్యాహ్నము స్త్రీ ప్రసంగము రామాయణకథతోను, రాత్రి చౌర్యమును భాగవతములోని కథతోను పోల్చిచెప్పిరి. 'ధీమతామ్' అను పాఠమును గ్రహించి నందువలన వచ్చిన చిక్కుడి. భాగవతరచన పదునొకండవ శతాబ్దములోనిది. చాణక్యనీతిలోనికి భాగవత కథ యెట్లు వచ్చును? ఐడ్విన్ మహోదయుడు 'గచ్ఛత్యధీ మతామ్' అను పాఠమునే గ్రహించెను. మా దృష్టిలో గూడ నదే పాఠము సముచితముగా నున్నది.

శ్లో॥ స్వహస్త గ్రథితా మాలా స్వహస్త ఘృష్టచందనమ్।
స్వహస్త లిఖితం స్తోత్రం శక్రస్యాపి శ్రియం హరేత్ ॥12

అర్థము :- స్వహస్త గ్రథితా=తనచేతితో గ్రుచ్చబడిన, మాలా= దండయు, స్వహస్త=తనచేతితో, ఘృష్ట=అరగదీయబడిన, చందనమ్= గంధము, స్వహస్త = తనచేతితో, లిఖితం = వ్రాయబడిన, స్తోత్రం = స్తోత్రము, (స్తుతియు) శక్రస్యాపి=ఇంద్రునియొక్కయు, శ్రియం = సంపదను, హరేత్=హరించును, పోగొట్టును.

తా॥ తనచేతితో గ్రుచ్చబడిన పూలదండయు, తనచేత అరగ దీయబడిన గంధమ్మును, తనచేత వ్రాయబడిన స్తోత్రము ఇంద్రుని యొక్క లక్ష్మినైనను హరించును. అనగా పూలమాలను ధరించుటచే కలుగు సంతోషముకంటె మాలగ్రుచ్చుట వలన కలిగెడు కష్టమెక్కువనియు

గంధము వలన గలిగెడు చల్లదనముకంటె గంధముచెక్క అరగదీయుట కష్టమనియు, స్తోత్రము వలన గలిగెడు సంతృప్తికంటె దాని రచనవలన కలిగెడు కష్టమెక్కువనియు భావము.

శ్లో॥ ఇక్షు దండా స్తిలాః క్షుద్రాః కాంతా
హేమ చ మేదినీ,
చన్దనం దధి తాంబూలం మర్దనం గుణవర్ధనమ్॥ 13

అర్థము :- ఇక్షుదండాః = చెఱకుగడలు, తిలాః = నువ్వులు. క్షుద్రాః = తెలివితక్కువవాళ్లు, కాంతా = స్త్రీ. హేమ = బంగారము. చ = మఱియు, మేదినీ = భూమి, చందనమ్ = గంధము. దధి = పెరుగు. తాంబూలం = తాంబూలము, మర్దనం = మర్దించుట. గుణవర్ధనమ్ = వాని గుణమును పెంచును.

తా॥ చెఱకుగడలు, నువ్వులు, స్త్రీ, బంగారము. భూమి, గంధము, పెరుగు, తాంబూలము, ఇవి యన్నియు బాగుగా మర్దింపబడినచో వాని లోని గుణము పెరుగును.

వివరణము :- ఇందులోని మర్దనశబ్దమున కనేకార్థములున్నవి. చెఱకును, నువ్వులును రసము వచ్చునట్లు ఒత్తిడిచేయుటయు, మూర్ఖుని కొట్టుటయు, స్త్రీని కుచమర్దనముచేయుటయు, బంగారమును ఒరిపిడి చేయుటయు, భూమినిదున్నుటయు, గంధమును రుద్దుటయు, పెరుగును త్రచ్చుటయు, తాంబూలమును నమలుటయు నను నర్థములో వాడబడినది. ఒక కవి—

గంధమెంత అరగదీసిన దాని గుణ మంతపెరుగును. పెరుగును మథించినకొలది వెన్నవచ్చును. అట్లే తాంబూల మెంత నమలిన అంత యెక్కువ గుణము కనబడును-అనెను.

శ్లో॥ దరిద్రతా ధీరతయా విరాజతే
కువస్త్రతా శుభ్రతయా విరాజతే ।
కదన్నతా చోష్ణతయా విరాజతే
కురూపతా శీలతయా విరాజతే॥ 14

అర్థము :- దరిద్రతా=దారిద్ర్యము, ధీరతయా = ధైర్యముతో, విరాజతే=కష్టదాయకముకాదు, కువస్త్రతా = మాసినగుడ్డ, శుభ్రతయా = మురికిలేకుండజేసినచో, విరాజతే = అందముగా నుండును, కదన్నతా = చల్దియన్నము, ఉష్ణతయా=వేడిచేయుటచే, విరాజతే = రుచిగానుండును, చ=మరియు, కురూపతా = అందవిహీనత, శీలతయా = మంచిగుణము కలిగియుండుటచే, విరాజతే=లోకుల కళ్లలోపడకుండును.

తా॥ దారిద్ర్యము సంభవించినపుడు ధైర్యముగానున్నచో కష్టము కలిగింపదు. చెడ్డవస్త్రమైనను శుభ్రముచేసినచో బాగుగానుండును. చల్ది భోజనమైనను వేడిగానున్నచో రుచిగా దోచును. అందహీనముగానున్నను శీలమున్నచో ప్రకాశించును.

నవమాధ్యాయము సమాప్తము

# దశమాధ్యాయము

శ్లో॥ ధనహీనో న హీనశ్చ ధనికః స సునిశ్చయః ।
విద్యా రత్నేన యో హీనః సహీనః సర్వవస్తుషు॥ 1

అర్థము :- ధనహీనః = ధనములేని మనుష్యుడు, హీనః = హీనుడు, దీనుడు, న=కాదు, సః = వాడు, విద్యాధనము కలవాడైనచో,

సునిశ్చయః = నిశ్చయముగా, ధనికః=ధనికుడే, యః=ఎవడు, విద్యా రత్నేన=విద్య యను రత్నముచేత, హీనః = లేనివాడో, సః = వాడు, సర్వవస్తుషు=అన్నింటిలోను, హీనః=లేనివాడే యగును.

తా॥ ధనములేకున్నను విద్యాధనమున్నచో ధనహీనుడు కాడు. నిశ్చయముగా ధనవంతుడే యగును. విద్యారూపరత్నములేనివాడు అన్ని వస్తువులు లేనివాడే యగును.

వివరణము :- విద్యయే అన్నిటికంటె గొప్పధనము—

ర్వసద్రవ్యేషు విద్యైవ ద్రవ్యమాహు రనుత్తమమ్ ।
అహార్యత్వా దనర్ఘ్యత్వా దక్షయత్వాచ్చ సర్వదా॥

విద్యా ధనమన్నిటిలోను నుత్తమధనము. దొంగలు కాజేయరు మిక్కిలి విలువగలది. ఎన్నడు నశింపనిది. వ్యయముచేయుచున్నకొలది పెరుగును కాని తరుగదు.

శ్లో॥ దృష్టిపూతం న్యసేత్ పాదం వస్త్రపూతం పిబేజ్జలమ్ ।
శాస్త్రపూతం వదేద్ వాక్యం మనః పూతం
సమాచరేత్ ॥ 2

అర్థము :- దృష్టిపూతం=నేత్రములతోచూచి, పాదం=అడుగును, న్యసేత్=ఉంచవలెను, జలం=నీటిని, వస్త్రపూతం = గుడ్డతో వడపోసిన దానిని, పిబేత్ = త్రాగవలెను, వాక్యం = వాక్యమును, శాస్త్రపూతం = శాస్త్రానుకూలమైనదానినే, వదేత్=చెప్పవలెను, మనః = మనస్సునకు, పూతం=పవిత్రముగా దోచినదానినే, సమాచరేత్=ఆచరింపవలెను.

తా॥ భూమిమీద చూచి పాదముంచవలెను గుడ్డతో వడపోసి నీరు త్రాగవలెను శాస్త్రప్రకారము శుద్ధమైన వాక్కునే పలుకవలెను

మనస్సుతో బాగుగా నాలోచించి పవిత్రమైన పనినే చేయవలెను. శ్రేష్ఠమైన దానినే యాచరింపవలెను.

వివరణము :- దారిలో గోతులు, ఇటుకలు, ఱాళ్లు, పురుగులు, పాములు, తేళ్లు మొదలగు జీవజంతువులు, అగ్ని, మలమూత్రములు, ఉమ్మి, బొచ్చు, మురుగు, మొదలగు మురికి వస్తువులుండును కావునను వాని వలన ఆరోగ్యము చెడును కావునను మార్గమున చూచి నడవవలెను. నీటిలో చిన్న చిన్న పురుగులు, గ్రుడ్లు మొదలగునవి యుండును కావున శుద్ధమైన వస్త్రముతో వడపోసి నీరు త్రాగవలెను.

అనర్గళముగ ప్రలాపముచేయక శాస్త్రానుకూలముగ హితము, మితము, కల్యాణకరములగు వచనములు పలుకవలయును.

మనస్సులో బాగుగా నాలోచించి శ్రేష్ఠములగు వ్యవహారముల చేయవలెను. ఈర్ష్యాద్వేషములు కలవాడపై యెవ్వనికి హాని కలుగజేయరాదు. అందఱికి కల్యాణకరములగు పనులు చేయవలెను.

శ్లో॥ సుఖార్థీ చేత్ త్యజే ద్విద్యాం విద్యార్థీ చ
త్యజేత్ సుఖమ్।
సుఖార్థినః కుతో విద్యా కుతో విద్యార్థినః సుఖమ్॥ 3

అర్థము :- సుఖార్థీచేత్=సుఖమును కోరువాడైనచో, విద్యాం = విద్యను, త్యజేత్=విడువవలెను, చ=మఱియు, విద్యార్థీ=విద్యకావలయునని కోరువాడు, సుఖమ్=సుఖమును, త్యజేత్ = విడువవలెను, సుఖార్థినః=సుఖముకోరువానికి, విద్యా=విద్య, కుతః = ఎక్కడిది ?, విద్యార్థినః=విద్యకోరువానికి, సుఖమ్=సుఖము, కుతః=ఎక్కడిది ?

తా॥ సుఖమును కోరువాడు విద్యకొఱకు ప్రయత్నింపరాదు. విద్యను కోరువాడు సుఖమును విడువవలెను. సుఖము కోరువానికి విద్య యెక్కడిది ? విద్యకోరువానికి సుఖమెక్కడిది ?

వివరణము :- చాణక్యుడు మరొకచోట—

సుఖార్థీచ త్యజే ద్విద్యాం విద్యార్థీ చ త్యజేత్ సుఖమ్ ।
న విద్యా సుఖయోః సన్నిస్తేజ స్తిమిరయో రివ॥

(చాణక్య రాజనీతి. 3-25)

సుఖాభిలాషియైనవాడు విద్యా ప్రాప్తికొఱకు ఆశను విడువవలెను. విద్యార్థి సుఖప్రాప్తికొఱకు కోరికను విడువవలెను. ప్రకాశమునకు అంధకారమునకు పొత్తు ఎట్లు కుదురదో యట్లే విద్యా సుఖములకు పొత్తు కుదురదు.

శ్లో॥ కవయః కిం న పశ్యన్తి కిం న కుర్వన్తి యోషితః ।
మద్యపాః కిం న జల్పన్తి కిం న భక్షన్తి వాయసాః॥ 4

అర్థము :- కవయః = కవులు, కిం = ఏమి, న పశ్యన్తి = చూడరు ? యోషితః = స్త్రీలు, కిం = ఏమి, న కుర్వన్తి = చేయలేరు ? మద్యపాః = త్రాగుబోతులు, కిం = ఏమి, న జల్పన్తి = వాగరు ? వాయసాః = కాకులు, కిం = ఏమి, న భక్షయన్తి = తినవు ?

తా॥ కవు లేమి తెలిసికొనలేరు ? స్త్రీలు ఏమి చేయలేరు ? త్రాగుబోతులు ఏమి వాగరు ? కాకులు తిననిదేమున్నది ?

వివరణము :- కవులు చూడలేనిదిలేదు. 'రవికాననిచో కవి కాంచునే కదా!' అను సూక్తికలదు. ఇట్టి దివ్యదృష్టియున్నను కుమార సంభవములో 1-3 కాళిదాసు 'ఏకో హి దోషో గుణ సన్నిపాతే నిమజ్జతీన్దోః కిరణేష్వివాంకః' అనగా చంద్రుని కిరణములతో మచ్చ కప్పబడినట్లు ఎక్కువ గుణములున్న కవిత్వములో నేదైన దోషమున్నను లెక్కలోనికి రాదని యర్థము.

ఒక కవి కాళిదాసు నెగతాళి చేయుచు నిట్లనెను—

22]

ఏకో హి దోషో గుణ సన్నిపాతే నిమజ్జతీన్దోరితి యో బభాషే।
నూనం న దృష్టం కవినాపి తేన దారిద్ర్య దోషో గుణకోటినాశీ॥

చంద్రుని కిరణములలో మచ్చకానరానట్లు గుణసమూహములో దోషము లెక్కకురాదని చెప్పిన (కవి నాపి తేన) అను శబ్దములను కవినా+అపి+తేన అని విడదీయక కవి+నాపితేన అని విడదీసి 'మంగలి కవి' అని హేళనచేసెను. కాళిదాసుకు దారిద్ర్యదోషము గుణములను చెఱచునని తెలియదవెను.

స్త్రీలు ఏమిచేయలేరు? మాత నిర్మాత యనగా సంతానమును నిర్మించుచున్నది. ఆమె సంసారమును సర్వమును చక్కదిద్దుచున్నది. తల్లి కోరినచో వీరులైన సంతానమును కనును.

హృత్సు పీతాసో యుధ్యన్తే దుర్మదాసో న సురాయామ్।
ఊధర్న నగ్నా జరన్తే॥ (ఋగ్వేదము)

త్రాగుబోతులు తమలో తాము కొట్టుకొందురు. మొండిమొలతో తిరుగుదురు. దుష్టబుద్ధిగల వారగుదురు. కావున మద్యపానము చేయరాదు.

కాకు లేమి తినవు?

కవలయతి నరకనికరం పరిహరతి మృణాలికాం ధ్వాంక్షః।
యదతోఽస్తు మా స్మయస్తే స్వభ్యస్తం సర్వదా స్వదతే॥
(యోగవా. ని. ఉ. 116 64)

కాకి తామరతూడులోని దారములను విడిచిపెట్టును. నరకముతో సమానమైన మురికివస్తువులను చుట్టుముట్టి తినును. ఈ విషయములో ఆశ్చర్యపడ నావశ్యకములేదు. ఎందుచేత నవగా నెవరికేది యభ్యాసమో యది యెంత నీచమైనదైనను దుర్గంధముతో కూడినదైనను, రుచిలేనిదైనను దానిని ఆప్యాయతతో లొట్టలువేసికొనుచు తిందురు.

శ్లో॥ రంకం కరోతి రాజానం రాజానం రంకమేవ చ।
ధనికం నిర్ధనం చైవ నిర్ధనం ధనినం విధిః॥ 5

అర్థము :- ఇది నిజము. విధిః=విధాత, పరమేశ్వరుడు, రంకం= బీదవానిని, రాజానం=రాజుగా, కరోతి = చేయుచున్నాడు, చ = అట్లే, రాజానం=రాజును, రంకమేవ=బీదవానినిగా, కరోతి = చేయుచున్నాడు, చ=మఱియు, ధనినం=ధనవంతుని, నిర్ధనం = ధనములేనివానినిగాను, చ=మఱియు, నిర్ధనం=ధనములేనివానిని, ధనినమేవ=ధనవంతునిగానే, కరోతి=చేయుచున్నాడు.

తా॥ పరమేశ్వరుడు బీదవానిని రాజుగా జేయును. అట్లే రాజును బీదవానినిగా జేయును. ఇది సత్యము.

వివరణము :- సూరదాసు ఈ శ్లోకమునకు అనువాదము స్పష్టముగా జేసెను—

పరమేశ్వరుడు కుంటివానిచేత కొండను దాటించును. గ్రుడ్డివానిని చూచునట్లు చేయును. చెవిటివానిని వినునట్లు చేయును. మూగవానిని మాట్లాడునట్లు చేయును. దరిద్రుని ధనవంతుని జేయును. పరమాత్మ దేమి చేయునో వేదములో నిట్లున్నది—

అభ్యూర్ణోతి యన్నగ్నం భిషక్తి విశ్వం యత్తురమ్।
ప్రేమన్ధః ఖ్యన్నిః శ్రోణో భూత్॥ (ఋ. 8-79-2)

పరమేశ్వరుడు బట్టలులేనట్టి మొండిమొలవానికి బట్టలిచ్చును. రోగికి నన్నివిధముల చికిత్సచేయును. గ్రుడ్డివానిని చూచునట్లు చేయును. కుంటివానిని నడచునట్లు చేయును.

వనేషు వ్యన్తరిక్షం తతాన వాజమర్వత్సు పయ ఉస్రియాసు ।
హృత్సు క్రతుం వరుణో విక్ష్వగ్నిం దివి సూర్యమదధాత్
సోమమద్రౌ॥ (యజు. 4-31)

వరణీయుడగు పరమేశ్వరుడు వనములపై ఆకాశమును వ్యాపింప జేసెను. గుఱ్ఱములలో వేగమును, ఆవులలో పాలను, హృదయములో జ్ఞానకర్మలను, ప్రజలలో ఉత్సాహాగ్నిని, ద్యులోకములో సూర్యుని, మేఘములలో అమృతమువంటి జలమును, పర్వతములపై సోమలతలు మొదలగు నోషధులను ఉండునట్లు చేసెను.

శ్లో॥ లుబ్ధానాం యాచకః శత్రు ర్మూర్ఖాణాం బోధకః రిపుః।
జారస్త్రీణాం పతిః శత్రు శ్చోరాణాం చంద్రమా రిపుః॥6

అర్థము :- లుబ్ధానాం = లోభగుణముకలవారికి, యాచకః = యాచించువాడు, శత్రుః = శత్రువు, మూర్ఖాణాం = మూర్ఖులకు, బోధకః = ఉపదేశముచేయువాడు, రిపుః = శత్రువు, జారస్త్రీణాం = వ్యభిచరించు స్త్రీలకు, పతిః = భర్త, శత్రుః = శత్రువు, చోరాణాం = దొంగలకు, చంద్రమాః = చంద్రుడు, రిపుః = శత్రువు.

తా॥ లోభగుణముగల వారికి (పిసినారులకు) యాచకుడు శత్రువు. మూర్ఖులకు సదుపదేశముచేయు బోధకుడు శత్రువు. వ్యభిచారముచేయు స్త్రీలకు భర్త శత్రువు. దొంగలకు చంద్రుడు శత్రువు.

శ్లో॥ యేషాం న విద్యా న తపో న దానం
న చాఽపి శీలం న గుణో న ధర్మః ।
తే మర్త్యలోకే భువి భారభూతాః
మనుష్య రూపేణ మృగాశ్చరన్తి

అర్థము :- యేషాం=ఎవరికి, విద్యా=విద్య, న=లేదో, తపః=తపస్సు (ద్వంద్వ సహనశక్తి), న=లేదో, దానం=దానగుణము, న=లేదో, చ=మఱియు, శీలం=దయా, నమ్రత మొదలగు, గుణః అపి=గుణము కూడ, న=లేదో, ధర్మః=ధర్మభావన, ధర్మాచరణ, న=లేదో, తే=అట్టివారు, మర్త్యలోకే=మనుజలోకమున, భువి = భూమిపై, భార భూతాః = భారభూతులై, మనుష్య రూపేణ = మనుష్యరూపముతో, మృగాః=పశువులుగా, చరన్తి=తిరుగుచున్నారు.

తా॥ విద్యలేనివారు, తపస్సు (ద్వంద్వ సహనము) లేనివారు, దానబుద్ధి లేనివారు, దయ, నమ్రత మొదలగు సద్గుణములు (శీలము లేని వారు), ధర్మ స్వభావము, ధర్మాచరణము లేనివారు, భూమికి భారభూతులై మనుష్యరూపములో తిరుగు మృగముల వంటివారు.

శ్లో॥ అన్తః సార విహీనానా ముపదేశో న జాయతే।
మలయాఽచల సంసర్గాత్ న వేణు శ్చన్దనాయతే॥ 8

అర్థము :- అన్తః సార విహీనానాం=బుద్ధిహీనులైనవారికి, ఉపదేశః=ఉపదేశించుట, న జాయతే=ఫలింపదు. మలయాఽచల = మలయ పర్వతముయొక్క, సంసర్గాత్=సంబంధమువలన, వేణుః=వెదురుచెట్టు, న చందనాయతే=సువాసన కలదికాదు.

తా॥ మనస్సులో యోగ్యతలేని బుద్ధిహీనులకు, మలినహృదయులకు చేసిన యుపదేశము ఫలింపదు. మలయపర్వతము (గంధపుచెట్లుండు చోటు) మీద నున్నను వెదురుచెట్టు గంధముకలదికాదు. గంధము చెట్టు కాదు.

వివరణము :- మలయపర్వతముపైనుండి వచ్చు గాలి సోకినచో సాధారణ వృక్షములుకూడ సువాసనకలవి యగును అనువాడుక కలదుకాని

వెదురుచెట్టు సువాసన కలది కాదు. అట్లే ఉపదేశకు డెంత గొప్పవాడై నను యోగ్యతలేని మలినహృదయుడగు మనుష్యునిపై ఆ యుపదేశకుని ప్రభావము పడదు.

శ్లో॥ యస్య నాస్తి స్వయం ప్రజ్ఞా శాస్త్రం తస్య కరోతి కిమ్।
లోచనాభ్యాం విహీనస్య దర్పణః కిం కరిష్యతి॥ 9

అర్థము :- యస్య=ఎవనికి, స్వయం = స్వయముగా, ప్రజ్ఞా = బుద్ధి, నాస్తి=లేదో, తస్య = అతనికి, శాస్త్రం = వేదాదిశాస్త్రము, కిం కరోతి=ఏమి చేయును ? లోచనాభ్యాం=కన్నులతో, విహీనస్య = లేని వానికి, దర్పణః=అద్దము, కిం కరిష్యతి=ఏమిచేయగలదు ?

తా॥ బుద్ధిలేనివానికి వేదశాస్త్రము లేమాత్ర ముపయోగపడవు. కన్నులున్నవాడే తన ముఖమును అద్దములో చూచుకొనగలడు కాని గ్రుడ్డి వాని కద్దమే ముపయోగించును ?

శ్లో॥ దుర్జనం సజ్జనం కర్తు ముపాయో న హి భూతలే ।
అపానం శతధా ధౌతం న శ్రేష్ఠ మిన్ద్రియం భవేద్॥10

అర్థము :- దుర్జనం=దుష్టుని, సజ్జనం=మంచివానినిగా, కర్తుం= చేయుటకు భూతలే=భూమిపై, ఉపాయః = ఉపాయము, నహి = లేదు గదా, అపానం=మలము విడుచు నింద్రియము (ముడ్డిని)- శతధా=అనేక విధములుగ, ధౌతం=కడిగినను, శ్రేష్ఠం = శ్రేష్ఠమైన, ఇంద్రియం = ఇంద్రియము న భవేత్=కాదు.

తా॥ భూమిలో దుర్జనుని సజ్జనునిగా జేయుట కేయుపాయము లేదు. ముడ్డి నెంత శుభ్రముగాచేసినను శ్రేష్ఠమైన యింద్రియము (ముఖము) కాదు గదా!

వివరణము :- ఈ శ్లోకములోని దృష్టాంతము విషమమైనది. ముడ్డి ముఖము కానట్లే ముఖము ముడ్డియు కాదు. కాని దుర్జనుని సజ్జనుని చేయుట కుపాయము సత్యము. తులసీదాసు —

సత్సంగము వలన మహామూర్ఖుడైన కాళిదాసు మహావిద్వాంసు డయ్యెను. రత్నాకరు డను బందిపోటుదొంగ వాల్మీకియయ్యెను. (ఈ వాల్మీకి రామాయణము రచించిన వాల్మీకి మహర్షి కాదు). మాంసము తిని మద్యము సేవించిన నాస్తికుడగు 'మున్షీరామ్' పరమ ఆస్తికుడగు శ్రద్ధానందస్వామిగా మారెను. వేశ్యాగామియైన అమీంచంద్ భక్త అమీంచంద్‌గా మారెను.

శ్లో॥ ఆత్మద్వేషాద్ భవేన్మృత్యుః పరద్వేషాద్ ధనక్షయః।
రాజద్వేషాద్ భవేన్నాశో బ్రహ్మద్వేషాత్
కులక్షయః॥ 11

అర్థము :- ఆత్మద్వేషాత్ = తన ఆత్మను ద్వేషించుటవలన, మృత్యుః = మృత్యువు, భవేత్ = అగును, పరద్వేషాత్ = ఇతరులను ద్వేషించుట వలన, ధనక్షయః = ధననాశనమగును, రాజద్వేషాత్ = రాజును ద్వేషించుట వలన, నాశః = నాశము, భవేత్ = అగును, బ్రహ్మద్వేషాత్ = బ్రాహ్మణ ద్వేషమువలన, కులక్షయః = కులము నశించును.

తా॥ ఆత్మద్వేషాత్‌కు బదులు ఆప్తద్వేషాత్ అను పాఠాంతరము కలదు. ఆప్తుడనగా దయానందమహర్షి రచించిన ఆర్యోద్దేశ్య రత్నమాలలో మోసము మొదలగు దోషములు లేనివాడు, ధర్మాత్ముడు, విద్వాంసుడు, సత్యము నుపదేశించువాడు, అందరియందు కృపాదృష్టికలవాడు, అవిద్యాన్ధకారమును నశింపజేయువాడు, అజ్ఞానుల హృదయములో విద్యారూప సూర్యప్రకాశము కలిగించువాడు యథార్థవక్తయు, ధర్మాత్ముడు,

సంపత్తి సుఖముకొఱకు ప్రయత్నించువాడు నని యున్నది. తన్ను తాను ద్వేషించుకొనువానికి మృత్యువు సంభవించును. ఇతరులను ద్వేషించి శత్రుత్వము పెంచుకొన్నచో ధనము నశించును. రాజును ద్వేషించిన వానికి నాశము కలుగును. బ్రాహ్మణుని ద్వేషించినచో కులక్షయమగును.

వివరణము :- తన్ను తాను ద్వేషించుకొనరాదు—

ఉద్ధరేదాత్మ నాత్మానం నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః॥ (గీత 6-57)

తన ఆత్మబలముతో తన ఆత్మ నుద్ధరించుకొనవలెను. ఎన్నడు తన ఆత్మను క్రింద పడవేయ జూడరాదు. ఎందుచేతననగా ఆత్మయే తన మిత్రుడు, బంధువు. ఆత్మయే శత్రువు.

శ్లో॥ వరం వనం వ్యాఘ్రగజేన్ద్ర సేవితం
ద్రుమాలయః పత్రఫలామ్బు భోజనమ్ ।
తృణేషు శయ్యా శతజీర్ణ వల్కలం
న బంధు మధ్యే ధనహీన జీవనమ్॥ 12

అర్థము :- ద్రుమాలయః = చెట్టు ఇల్లుగాను, పత్రఫలాంబు భోజనం = ఆకులు పండ్లు, నీరు భోజనముగాను, తృణేషు = గడ్డియందు, శయ్యా = పడకయు, శత = అనేకముగా, జీర్ణ = చినిగిపోయిన, వల్కలం = నారబట్టయు, వ్యాఘ్ర = పెద్దపులులతోను, గజేంద్ర = గజరాజులతోను, సేవితం = సేవింపబడుచున్న (ఉన్నటువంటి) వనం = వనము, వరం = శ్రేష్ఠమైనది, బంధుమధ్యే = బంధువుల మధ్యలో, ధనహీనజీవనమ్ = ధనములేని జీవితము, న = కాదు, అనగా బంధువుల మధ్యలో ధన హీనుడుగా బ్రతుకుటకంటె మహారణ్యములో నుండుట మేలనిభావము.

తా॥ బంధువుల మధ్యలో ధనహీనుడుగా బ్రతుకుటకంటె పెద్ద పులులు, ఏనుగులు తిరుగుకోట చెట్లక్రింద గడ్డిపఱచుకొని పడియుండి ఆకులు, పండ్లు తినుచు నదులలోని నీరు త్రాగుచు చినిగిపీలికలైన వస్త్రములు ధరించి బ్రతుకుట మంచిది.

శ్లో॥ విప్రో వృక్షస్తస్య మూలం చ సంధ్యా
వేదాః శాఖా ధర్మకర్మాణి పత్రమ్।
తస్మాన్మూలం యత్నతో రక్షణీయం
ఛిన్నే మూలే నైవ శాఖా న పత్రమ్॥ 13

అర్థము :- విప్రః = బ్రాహ్మణుడు, వృక్షః = వృక్షము, చ = మఱియు, తస్య = ఆ వృక్షమునకు, సంధ్యా = సంధ్య, ఉపాసన, పరమేశ్వరుని ఆరాధించుట, బ్రహ్మచింతన, మూలం = మొదలు, వేదాః = ఋగ్వేదాది నాలుగు వేదములు, శాఖాః = ఆ చెట్టుకొమ్మలు, ధర్మకర్మాణి = ధర్మకర్మములు, పత్రం = ఆకులు, తస్మాత్ = అందువలన, మూలం = మొదలు, యత్నతః = ప్రయత్నమువలన, రక్షణీయం = రక్షింపదగినది, ఎందువల్లననగా, మూలే = మొదలు, ఛిన్నే = నఱకబడగా, శాఖాః = కొమ్మలు, పత్రం = ఆకులును, నైవ = లేనే లేవు.

తా॥ బ్రాహ్మణుడు వృక్షము, పరమేశ్వరుని గూర్చి ధ్యానించుచు, ఉపాసించుచు, ఆరాధించుచుండుట ఆ చెట్టునకు మొదలు. ఆ చెట్టునకు వేదములు కొమ్మలు. ధర్మకార్యములు ఆకులు. అందుచేత ఆ చెట్టు మూలమును ప్రయత్నించి రక్షింపవలెను. చెట్టు మొదలే లేకున్న కొమ్మలులేవు. ఆకులు లేవు.

వివరణము :- ఈ శ్లోకములో సంధ్యయొక్క మహత్త్వము చెప్పబడినది. ప్రతి బ్రాహ్మణుడు సంధ్యచేయవలెను.

సంధ్యా యేన న విజ్ఞాతా సంధ్యా యేనానుపాసితా ।
జీవమానో భవేచ్ఛూద్రో మృతః శ్వా చైవ జాయతే॥

(దేవీ భాగ. 11-16-7)

సంధ్యా రహస్యము నెఱుగనివాడును, జీవితములో సంధ్యోపాసన చేయనివాడును బ్రతికియుండగానే శూద్రుడై మరణానంతరము కుక్కగా తయారగును.

యే న పూర్వాముపాసన్తే ద్విజాః సంధ్యాం న పశ్చిమామ్ ।
సర్వాంస్తాన్ ధార్మికో రాజా శూద్రకర్మాణి కారయేత్॥

(భార. అను. 104-19)

ఉదయ సాయంకాలములందు సంధ్యచేయని ద్విజులచేత ధార్మికుడైన రాజు సేవాకార్యములు (శూద్ర) చేయించవలెను.

నేటి స్థితి యిదీ చూడుడు—

న సంధ్యాం సంధ్యన్తే నియమిత నమాజం న కురుతే ।
న వా మౌంజీబంధం కలయతి న వా సున్నత విధిమ్॥

న రోజాం జానీతే వ్రతమపి హరేర్నైవ కురుతే ।
న కాశీ మక్కా వా శివశివ న హిందుర్న యవనః॥

నియమముగా సంధ్యచేయుట లేదు, నమాజు చేయుటలేదు. యజ్ఞోపవీతమును ధరింపలేదు, సుంతి (సున్నిత్) చేయించుకొనలేదు. గులాబిపూవు నుంచుటలేదు. హరివ్రతము చేయుటలేదు. కాశీకిగాని మక్కాకుగాని వెళ్లుటలేదు. శివశివా! వీరు హిందువులు కారు యవనులు (ముసల్మానులు) కారు.

మరొక కవి—

ఈ పూజలు, ఈ నమాజ్‌లు, గంగాస్నానము, సామూహిక

పాటలు మొదలైనవి వేఱువేఱుగా నున్నను హోటలులో అడుగుపెట్టగానే అంతా యొకటే. ఒకే కప్పు, ఒకే సాసరు, భేదము లేదు.

శ్లో॥ మాతా చ కమలా దేవీ పితా దేవో జనార్దనః।
బాంధవా విష్ణుభక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్॥ 14

అర్థము :- మాతా=తల్లి, కమలాదేవీ=లక్ష్మీదేవి, చ=మఱియు, పితా=తండ్రి, జనార్దనః దేవః = సర్వవ్యాపకుడు, ఆనందదాయకుడగు పరమేశ్వరుడు, చ=అట్లే, విష్ణుభక్తాః=పరమాత్ముని భక్తులు, బాంధవాః= బంధుబాంధవులు, అట్టి వానికి, భువనత్రయమ్=ముల్లోకములు, స్వదేశః= తన దేశముతో సమానము.

తా॥ లక్ష్మి యెవనికి తల్లియో, సర్వవ్యాపకుడు, ఆనందప్రదుడు నైన పరమేశ్వరు డెవనికి రక్షకుడో, విష్ణుభక్తులెవనికి బాంధవులో యట్టి వానికి పృథివి, అన్తరిక్షము, ద్యులోకమునను ముల్లోకములు స్వదేశము వంటివే యగును.

వివరణము :- దీనికి సరిపోవునట్టిదే యీ క్రింది శ్లోకము—

మాతా చ పృథివీ దేవీ పితా దేవో మహేశ్వరః।
బాంధవాశ్చ జగత్సర్వం స్వదేశో భువనత్రయమ్॥

పృథివి యెవనికి తల్లియో, మహేశ్వరు డెవనికి తండ్రియో, సమస్త జగత్తు నెవనికి బంధువులో యట్టి వానికి ముల్లోకములు స్వదేశ ముతో సమానమైనవే.

శ్లో॥ ఏక వృక్ష సమారూఢా నానా వర్ణాః విహంగమాః।
ప్రభాతే దిక్షు దశసు కా తత్ర పరివేదనా॥ 15

అర్థము :- నానావర్ణాః = రకరకముల రంగులుగల, విహంగమాః = పక్షులు, ఏకవృక్ష సమారూఢాః = ఒకేచెట్టు నాశ్రయించియుండును, ప్రభాతే = ప్రాతఃకాలమున, దశసు దిక్షు = పదిదిక్కులకుపోవును, తత్ర = ఆ విషయములో, పరివేదనా = దుఃఖము, కా = ఏముండును ?

తా॥ రకరకముల పక్షులు ఒకే చెట్టుపై నివసించును. తెల్లవారగానే తలకొక దిక్కుకు ఆహారమునకై యెగిరిపోవును. వానికి విడిపోవుచున్నామను దుఃఖమేముండును ?

వివరణము :- పుట్టినది గిట్టకమానదు. అందుచేత దుఃఖమేల ? శ్రీరాముడు భరతున కుపదేశించుచు—

సర్వేక్షయాన్తా నిచయాః పతనాన్తాః సముచ్ఛ్రయాః ।
సంయోగా విప్రయోగాన్తా మరణాన్తం చ జీవితమ్॥

(రామా. అయో. 105-16)

సంపాదించినదంతయు నశించును. లౌకికముగా నున్నతులకు చివరకు పతనమే. సంయోగమున కంతము వియోగము. జీవనమున కంతము మరణము.

యథా ఫలానాం పక్వానాం నాన్యత్ర పతనాద్భయమ్ ।
ఏవం నరస్య జాతస్య నాన్యత్ర మరణాద్భయమ్॥

(రామా. అయో. 105-17)

పండిన పండ్లకు పడునట్టి భయముదప్ప వేఱుభయములేదు. అట్లే పుట్టిన మనుష్యునకు మరణము వలని భయముదప్ప వేఱుభయములేదు.

యథా కాష్ఠం చ కాష్ఠం చ సమేయాతాం మహార్ణవే ।
సమేత్య తు వ్యపేయాతాం కాలమాసాద్య కంచన॥

ఏవం భార్యాశ్చ పుత్రాశ్చ జ్ఞాతయశ్చ వసూని చ ।
సమేత్య వ్యవధావన్తి ధ్రువో హ్యేషాం వినా భవః॥

(రామా. అయో. 105-26, 27)

సముద్రములో రెండుకొయ్యలు కొట్టుకొనిపోవుచు రెండును కలిసి కొనును. తరువాత కొంతసేపటికి రెండును విడిపోవును. అట్లే భార్యా పుత్రులు, బంధువాంధవులు, ధనము కలిసికొని తరువాత విడిపోవుచుండును. వాని వియోగము తప్పక జరుగవలసియున్నది.

శ్లో॥ బుద్ధిర్యస్య బలం తస్య నిర్బుద్ధేశ్చ కుతో బలమ్ ।
వనే సింహో మదోన్మత్తః శశకేన నిపాతితః॥ 16

అర్థము :- యస్య=ఎవనికి, బుద్ధిః=బుద్ధికలదో, తస్య=అతనికి, బలం=బలముండును, చ=మరియు, నిర్బుద్ధేః=బుద్ధిలేనివానికి, బలం = బలము, కుతః=ఎక్కడిది ? వనే=అడవియందు, మదోన్మత్తః = మద ముచే మత్తెక్కిన, సింహః=సింహము, శశకేన=బుద్ధిగల కుందేలుచేత, నిపాతితః=చంపబడెను.

తా॥ బుద్ధిగలవాడే బలవంతుడు, బుద్ధిహీనునకు బలమెక్కడిది ? అడవిలో మదోన్మత్తమైన సింహము బుద్ధిమంతుడైన కుందేలుచే చంప బడెను.

శ్లో॥ కా చింతా మమ జీవనే యది హరి ర్విశ్వంభరో
గీయతే
నోచే దర్భక జీవనాయ, జననీ స్తన్యం
కథం నిర్మయేత్ ।

ఇత్యాలోచ్య ముహుర్ముహుర్యదుపతే
లక్ష్మీపతే కేవలం
త్వత్పాదామ్బుజ సేవనేన సతతం కాలో
మయా నీయతే॥ 17

అర్థము :- మమ = నాకు, జీవనే = జీవించు విషయమున, కా చింతా = దిగులేమున్నది? విశ్వంభరః = ప్రపంచమును భరించునట్టి, హరిః = దుఃఖముల హరించు పరమేశ్వరుడు, గీయతే యది = గానము చేయబడుచున్నచో దిగులేమున్నది? నోచేత్ = పరమేశ్వరుడు దుఃఖమును పోగొట్టి పోషింపనిచో, అర్భకజీవనస్య = పసిబిడ్డ జీవించుటకు, జననీ = తల్లి, స్తన్యం = స్తనమందుపాలను, కథం = ఎట్లు, నిర్మయేత్ = నిర్మింప గలదు? ఇతి = అని, యదుపతే = మనుష్యుల రక్షకుడవగు, లక్ష్మీపతే = చరాచర జగత్తునంతటను వ్యాపించిన పరమేశ్వరా!, ముహుర్ముహుః = మాటిమాటికి, ఆలోచ్య = ఆలోచించి, కేవలం = కేవలముగా, త్వత్ = నీయొక్క, పాదాంబుజ = పద్మములవంటి పాదములను, సేవనేన = సేవించుటచేత, సతతం = ఎల్లపుడు, మయా = నాచేత, కాలః = కాలము, నీయతే = గడపబడుచున్నది.

తా॥ దుఃఖములను హరించి ప్రపంచమును భరించి పోషించువానిగా చెప్పబడుచున్నాడు. పరమేశ్వరుడు ప్రపంచమునకు పాలకుడు కాకున్నచో పిల్లలు జీవించుటకు తల్లి స్తనములలోనికి పాలెట్లువచ్చును? ఓ ప్రభూ! చరాచర జగత్తునంతట వ్యాపకుడవగు పరమేశ్వరా! మాటి మాటికి నిట్లాలోచించి నీ పాదపద్మముల సేవించుటలోనే కాలము గడపుదును.

వివరణము :- యదుశబ్దము నిఘంటువు 2-3 లో మనుష్యనామములలో పఠింపబడినది. ఇందువలన యదుపతి కర్థము మనుష్య

లకు ప్రభువు లేక ప్రజాపతి యని చెప్పబడినది. లక్ష్మీపతి కర్థము విష్ణువు. ముల్లోకములలో వ్యాపించి యుండుటచే పరమేశ్వరుడు విష్ణువన బడును. పరమాత్మ నిరాకారుడు. ఉపనిషత్తులో—

అపాణి పాదో జవనో గ్రహీతా పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః।
న వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా తమాహురగ్ర్యం పురుషం
మహాన్తమ్॥ (శ్వేతా. 3-19)

పరమేశ్వరుడు చేతులులేకున్నను బ్రహ్మాండమును పట్టుకొను చున్నాడు. పాదములు లేకున్నను శీఘ్రముగా వెళ్లును. కన్నులులేకున్నను సర్వమును గాంచును. చెవులు లేకున్నను వినును. తెలిసికొనదగిన దానిని సర్వము నెఱుంగును. కాని ఆయన నెఱుంగు వాడెవ్వడునులేడు. అట్టి వానినే ఆదిమహాపురుషుడందురు. పరమాత్మకు పాదములు లేవు కదా! ఆయన పాదపద్మముల కెట్లు సేవచేయుదురు ? అను ప్రశ్నకలదు. ఆ ప్రశ్నకు సమాధానము వేదములో చెప్పబడియున్నది—'యస్య భూమిః ప్రమా' (అథర్వ. 10-4-32) భూమియే పరమేశ్వరునకు పాదములు. భూమిపైనున్న భక్తులగు ప్రజలకు పరోపకార రూపసేవలో తన సమ యమును గడపుచుండును.

శ్లో॥ గీర్వాణ వాణీషు విశిష్టబుద్ధి
స్తథాపి భాషాన్తర లోలుపోఽహమ్॥
యథా సురాణా మమృతే స్థితేఽపి
స్వర్గాంగనానా మధరాసవే రుచిః॥ 18

అర్థము :- నీతిశాస్త్ర ధురంధరుడగు విద్వాంసుడైన చాణక్యుడు చెప్పుచున్నాడు — గీర్వాణవాణీషు = దేవభాషయైన సంస్కృతభాష యందు, విశిష్టబుద్ధిః = విశేషబుద్ధికలవాడను, తథాఽపి = అయినప్పటికి,

అహం=నేను, భాషాంతరలోలుపః = ఇతరభాషయందును లోభగుణము గలవాడను, యథా=ఎట్లు, సురాణాం=దేవతలకు, అమృతే=అమృతము, స్థితేఽపి = ఉన్నను స్వర్గాంగనానాం = స్వర్గమందలి స్త్రీలయొక్క, అధరాసవే=క్రిందిపెదవియందలి ఆసవము (రసమును)నందు, రుచిః = ఇచ్ఛకలవారై యున్నారు.

తా॥ నీతిశాస్త్ర ధురంధరుడైన విద్వాంసుడగు చాణక్యుడు చెప్పు చున్నాడు—నేను సంస్కృతభాషయందు విశిష్టబుద్ధికలవాడనైనను, దేవతల కమృతమున్నను దానితో తృప్తిచెందక అప్సరలయొక్క అధరామృత మును (క్రింది పెదవిని చప్పరించుట) క్రోలుటకు కోరికకలవారైనట్లు ఇతర భాషలయందు కోరికగలవాడనై యున్నాను.

శ్లో॥ అన్నాద్దశగుణం పిష్టం పిష్టాద్దశగుణం పయః ।
పయసోఽష్టగుణంమాంసంమాంసాద్దశగుణంఘృతమ్॥19

అర్థము :- అన్నాత్ = అన్నముకంటె, పిష్టం = పిండి, దశ గుణం=పదిరెట్లు గుణముకలది, పిష్టాత్=పిండికంటె, పయః = పాలు, దశగుణం = పదిరెట్లు శక్తికలది, పయసః = పాలకంటె, మాంసం = మాంసము, అష్టగుణం=ఎనిమిదిరెట్లు శక్తికలది, మాంసాత్=మాంసము కంటె, దశగుణం=పదిరెట్లు, ఘృతం=నెయ్యిశక్తికలది

తా॥ అన్నములోకంటె పిండిలో పదిరెట్లు గుణముకలదు. పిండిలోకంటె పాలలో పదిరెట్లు గుణముకలదు. పాలలోకంటె మాంస ములో నెనిమిదిరెట్లు గుణముకలదు. మాంసములోకంటె పదిరెట్లు నేతిలో గుణముకలదు.

వివరణము :- చాణక్యుడు ఇక్కడ మాంసము తిను విధానము చెప్పలేదు. వస్తువుల వర్ణన మాత్రమే చేసిరి. ధార్మిక, సామాజిక,

నైతిక, శారీరిక, మానసిక, వృద్ధికోన్నత దృష్టికోణములో మాంసము తినరాదు. మాంసాహారముతో నిక్కలి దోషములు—

యోఽత్తి యస్య యదా మాంసముభయోః పశ్యతాన్తరమ్ ।
ఏకస్య క్షణికా ప్రీతిరన్యః ప్రాణైర్విముచ్యతే॥ (హితో. 1-67)

ఒక ప్రాణి మరొక ప్రాణియొక్క మాంసము తినినచో ఆ రెండు ప్రాణులలో నున్న భేదము చూడుడు. తినునట్టి ప్రాణికి క్షణకాలము తృప్తియుండును. తినబడు ప్రాణి శాశ్వతముగా ప్రాణముల కోల్పోవును.

శ్లో॥ శాకేన రోగావర్ధన్తే పయసా వర్ధతే తనుః ।
ఘృతేన వర్ధతే వీర్యం మాంసాన్మాంసం ప్రవర్ధతే॥ 2)

అర్థము :- శాకేన = శాకము (ఆకులు, కాయలు, దుంపలు) కూరలతో, రోగాః = రోగములు, వర్ధన్తే = పెరుగును, పయసా = పాలతో, తనుః = శరీరము, వర్ధతే = వృద్ధిపొందును, ఘృతేన = నేతితో, వీర్యం = వీర్యము, వర్ధతే = వృద్ధిపొందును, మాంసాత్ = మాంసమువలన, మాంసం = మాంసము, ప్రవర్ధతే = పెరుగును.

తా॥ కూరలతో రోగములు పాలతో శరీరము, నేతితో వీర్యము, మాంసముతో మాంసము అభివృద్ధిపొందును.

వివరణము - శాకము (ఆకు అలము మొదలగు కూరగాయలు) వలన రోగములు పెరుగును. కూరగాయలు నిల్వయున్నచో త్వరగా క్రుళ్లిపోవును. అవి జీవజంతువులు (పురుగులు) వాని గ్రుడ్లతో వ్యాప్తములై యుండును. అపవిత్ర స్థానములతో మలమూత్రాది యుక్తములగు జలధారలతో పెరుగును. అందుచేత వట్టి కూరగాయలు తిన్నచో జ్వరము, కలరా, విరేచనము మొదలైన రోగము లావరించును.

పాలతో శరీరము పెరుగునని వేదము—

యూయం గావో మేదయథా కృశం చిదశ్రీరం చిత్కృణుథా
సుప్రతీకమ్॥ (ఋ. 6-28-6)

ఓ ఆవులారా! మీరు బలహీనులైన మనుష్యులకు సంతోషమును బలమును గలిగించుటకు తియ్యని నిల్వలేని పాలనిచ్చి శోభాహీనపురుషుని సౌందర్యవంతుని మంచి ఆకారముగల వానినిగా తయారుచేయుదురు.

నేతితో ఓర్యము వృద్ధిచెందును. నెయ్యి బలమును శక్తిని నిచ్చి ఆయుస్సును పెంచును. మాంసముతో మాంసము వృద్ధియగును. మాంసము వలన శరీరములోని ధాతువు లభివృద్ధిచెందును. కాని మాంసమే అధికముగా వృద్ధిచెందును. ఇక్కడ కూడ చాణక్యుడు మాంసము తినుమని చెప్పలేదు. మాంసభక్షణ విషయములో చాణక్యుని స్పష్టాభిప్రాయము చూడుడు—

చతుస్సాగర పర్యన్తాం యో దద్యాత్పృథివీ మిమామ్।
న ఖాదేచ్చాఽపి యో మాంసం తుల్యమేతద్ విదుర్బుధాః॥
(చాణక్యసారసంగ్రహ 3-93)

నాలుగు సముద్రములపర్యంతమున్న భూమిని దానముచేసిన నెంత పుణ్యమువచ్చునో యంత పుణ్యము మాంసము తినని మనుష్యునకు సంప్రాప్తించును. అని విద్వాంసులు చెప్పుదురు.

మాంసభక్షణతో శరీరములోని మాంసము వృద్ధియగును. కాని శక్తిక్షీణించును. బుద్ధినశించును. మాంసభక్షకుడు భూతకాలములో వర్తమానకాలములో భవిష్యత్కాలములో నెన్నడు యోగికాలేడు. మాంసాహారికి ఆత్మికోన్నతి కలుగదు. మాంసము మనుష్యభోజనముకాదు. మనుష్యుని శరీరము చూచినచో ఈ విషయము స్పష్టముకాగలదు.

1) పుట్టిన సమయమున మాంసాహారులైన ప్రాణుల కన్నులు మూసికొనియుండును. కాని మనుష్యుల పిల్లల కన్నులు తెఱచికొని యుండును.

2) మాంసాహారులకు చెమటరాదు. దానికి భిన్నముగా శాకాహారులకు చెమటకలుగును

3) మైథునసమయములో మాంసాహారులు లంకెవేసికొనును. గంటలకొలది మైథునము జరుగును. మనుష్యులు లంకెవేసికొనరు. 5, 6 నిముషములలో మైథునక్రియ పూర్తియగును.

4) మాంసాహారులు చీల్చితినుటకు తగినట్లు కోరలుండును. దానికి పంజాకూడ నుండును. శాకాహారుల దంతనిర్మాణము అట్లుండదు. కోరలుండవు.

5) మాంసాహారులు నీరు నాలుకతో నాకి చప్పరించును. శాకాహారులు పీల్చిత్రాగును.

6) మాంసాహారుల ఆహారనాళము 3½ అడుగుల పొడవుండును. శాకాహారుల ఆహారనాళము 20 అడుగులుండును. అందువలననే మాంసాహారులు ఎముకలు కొరికి తినినను చావవు.

7) ప్రాణులన్నియు పుట్టగానే తమ స్వాభావిక భోజనవస్తువులను తిననారంభించును. సింహము, తోడేలు, కుక్క, పిల్లి మొదలైనవి మిక్కిలి చిఱుప్రాయముననే మాంసము తిననారంభించును కాని మనుష్యుని సంతతి ముందు పాలు, తరువాత పెరిగి పండ్లు అన్నము మొదలగునవి తినును. ఏ పిల్లవాడును తన రుచికొఱకు మాంసము తినడు.

8) డాక్టర్లందఱు ఈ విషయములో నేకాభిప్రాయము కలిగియున్నారు. మనుష్య జీవనము వానరజీవనము పోలికకలిగియున్నవి. కోతి మాంసాహారికాదు. మనుష్యు డెట్లు మాంసాహారి యగును ?

9) మాంసాహారులకు దూరమునుండియే మాంసము వాసన తెలియును. అందుచే నవి వెంటనే యచ్చటకు వెళ్లును. చిఱుతపులి, కుక్క, పిల్లి మొదలైనవి మాంసము వాసనచే నది యెక్కడనున్నదో వెంటనే తెలిసికొనగలవు. మనుష్యులకు పండ్లు, వంట మొదలగువాని వాసన తెలియును. పచ్చిమాంసము వాసన తెలియదు. మాంసము యొక్క దుర్గంధమును మానవుడు పేవగించుకొనును.

దశమాధ్యాయము సమాప్తము

# ఏకాదశాధ్యాయము

శ్లో॥ దాతృత్వం ప్రియవక్తృత్వం ధీరత్వ ముచితజ్ఞతా ।
అభ్యాసేన న లభ్యన్తే చత్వారః సహజా గుణాః॥ 1

అర్థము :- దాతృత్వం = దానముచేయు స్వభావము, ప్రియ వక్తృత్వం = మధురముగా మాట్లాడుట, ధీరత్వం = శౌర్యము, వీరత్వము, ఉచితజ్ఞతా = ఉచితానుచితజ్ఞానము, పాండిత్యము, అనునవి, అభ్యాసేన = అభ్యసించుటచేత, న లభ్యన్తే = పొందబడవు, చత్వారః = ఈ నాలుగు, గుణాః = గుణములు, సహజాః = స్వాభావికమైనవి, సహజమైనవి.

తా॥ దానముచేయు స్వభావము, మధురముగా మాట్లాడుట, శౌర్యము పరాక్రమము, ఉచితానుచితములు నెఱుంగుట, పాండిత్యము అనునవి అభ్యాసము వలన లభింపవు. ఈ నాలుగు గుణములు స్వాభావికములు.

వివరణము :- నిరంతరాభ్యాసమువలన మానవుడు అనేక గుణములను పొందగలడు. కాని యన్ని గుణములను పొందలేడు. కొన్ని

స్వాభావిక గుణములుండును. పై శ్లోకములోని నిట్టి స్వాభావికగుణముల వర్ణనగలదు. ఇట్లే మరొక ఆలోచనాపరుడు చెప్పెను—

శతేషు జాయతే శూరః సహస్రేషు చ పండితః ।
వక్తా దశసహస్రేషు దాతా భవతి వా న వా॥

వందలకొలది మనుష్యులలో నొకడు శూరుడైనవాడు, వేలకొలది మనుష్యులలో నొకడు పండితుడు, పదివేలలో నొకడు వక్తయు పుట్ట వచ్చునుగాని దాతృత్వముకలవాడుండునా లేదా యనునది సందేహము.

దానం ప్రియవాక్య సహితం జ్ఞానమగర్వం క్షమాన్వితం శౌర్యమ్।
విత్తం త్యాగనియుక్తం దుర్లభమేతచ్చతుర్భద్రమ్॥

మధురవచనములతో దానమిచ్చుటయు అహంకారములేని జ్ఞానము, ఓర్పుగల శౌర్యము, త్యాగముతో కూడిన ధనము అను శ్రేష్ఠగుణములు దుర్లభములు.

శ్లో॥ ఆత్మవర్గం పరిత్యజ్య పరవర్గం సమాశ్రయేత్ ।
స్వయమేవ లయం యాతి యథా రాజాఽన్య ధర్మతః॥ 2

అర్థము :- ఎవడు, ఆత్మవర్గం = తన సముదాయమును, పరిత్యజ్య = విడిచి, పరవర్గం = ఇతర సమూహమును, సమాశ్రయేత్ = ఆశ్రయించునో వాడు, స్వయమేవ = తనంతటతానే, యథా = ఎట్లు, రాజా = రాజు, అన్యధర్మతః = అన్యధర్మమును నవలంబించుటవలన, లయం = నాశమును, యాతి = పొందునో యట్లు, ఈ శ్లోకములో రాజా = రాజు, అత్యధర్మతః = మిక్కిలి యధర్మమువలన నశించునని పాఠాంతరము కలదు.

తా॥ తన సముదాయమును విడిచి యితర సముదాయమును (సమూహము) నాశ్రయించినవాడు తనంతటానే నాశము పొందును. రాజు

అన్యధర్మమను నాశ్రయించిన నష్టముపొందును. కొన్ని గ్రంథములలో అన్యధర్మతః బదులు 'అత్యధర్మతః' అను పాఠముకలదు. దాని ప్రకారము రాజు మిక్కిలి అధర్మపరుడైనచో నష్టపడును.

వివరణము :- బృహస్పతి కూడ నిట్లే చెప్పెను—

యస్య న జ్ఞాయతే శీలం న కులం న చ సంశ్రయః ।
న తేన సంగతిం కుర్యాదిత్యువాచ బృహస్పతిః॥
(పంచతంత్ర. 4-27)

ఎవనికి కులము, శీలము, ఆశ్రయ మనునవి తెలియవో యతనితో సాంగత్యము చేయరాదు. అని బృహస్పతి చెప్పెను.

శ్లో॥ హస్తీ స్థూలతనుః స చాంకుశవశః కిం హస్తి
మాత్రోఽంకుశో
దీపే ప్రజ్వలితే ప్రణశ్యతి తమః కిం దీపమాత్రం
తమః ।
వజ్రేణాపి హతాః పతన్తి గిరయః కిం
వజ్రమాత్రో గిరిస్
తేజో యస్య విరాజతే స బలవాన్ స్థూలేషు కః
ప్రత్యయః॥ 3

అర్థము :- హస్తీ = గజరాజు, స్థూలతనుః = లావు, పొడవు, ఎత్తుగల శరీరము గలది, స చ = అదియు, అంకుశవశః = అంకుశమునకు వశమగును, అంకుశః = అంకుశము (ఏనుగులను భయపెట్టు వస్తువు) హస్తిమాత్రః = ఏనుగు పరిమాణము కలదియా, కిం = ఏమి ? దీపః = దీపము, ప్రజ్వలితః = మండుచుండగా, తమః = చీకటి, ప్రణశ్యతి =

నశించును, తమః=చీకటి, దీపమాత్రం = దీపముతో సమానమా, కిం = ఏమి, వజ్రేణ=వజ్రముతో, హతాః=పగులగొట్టబడు, గిరయః అపి = పర్వతములు కూడ, పతన్తి = పడుచున్నవి, గిరిః = పర్వతము, వజ్ర మాత్రః=వజ్రమంతవేనా, కిం=ఏమి? యస్య = ఎవనికి, తేజః = తేజస్సు, విరాజతే = ప్రకాశించుచుండునో, సః = అతడే, బలవాన్ = బలవంతుడు, స్థూలేషు = లావుగానున్నవానియందు, కః ప్రత్యయః = ఏమి నమ్మకము?

తా॥ గజరాజు స్థూలమైన శరీరము గలది. అయినను నది అంకు శమునకు వశమగును. అయినను అంకుశము ఏనుగుతో సమానమగునా? దీపమును వెలిగింప గానే చీకటిపోవును. కాని చీకటితో పోల్చిన దీపమెంత? వజ్రముచే కొట్టబడి పర్వతములు చూర్ణములై పడుచున్నవి? కాని పర్వతములు వజ్రమువలె చిన్నవికాగలవా? దేనికి తేజస్సుగల దోయదియే బలము గలది. బాహ్యాకారము గొప్పగానున్నంత మాత్రమున నదీ గొప్పది యని విశ్వసింపవగదు.

వివరణము :- తేజోవంతులలోని తేజస్సు ప్రకటమగుటకు శరీరము లావుకానక్కఱలేదు. సన్నని శరీరము కలవైనను నవి తమ పరాక్రమమును ప్రదర్శింపగలవు. లావుగా నుండుట బలముకాదు, దుర్బలత్వమునకు చిహ్నము. వైద్యశాస్త్రములో లావుగానుండుటకంటె సన్నగానుండుటయే మేలనెను.

'స్థౌల్యకార్శ్యే వరం కార్శ్యమ్' (చరకుడు) లావుగా నుండుట కంటె సన్నగానుండుట మేలనెను.

'కృశః స్థూలాత్తు పూజితః' (సుశ్రుతుడు) స్థూలముగా నుండుట కంటె చిక్కియుండుట మేలనెను.

శ్లో॥ కలౌ దశ సహస్రేషు హరి స్త్యజతి మేదినీమ్ ।
తదర్ధం జాహ్నవీతోయం తదర్ధం గ్రామదేవతా॥ 4

అర్థము :- కలౌ = కలియుగమందు, దశసహస్రేషు = పదివేల సంవత్సరముల గడచిన తరువాత, హరిః = విష్ణువు, సర్వవ్యాపకుడగు పరమాత్మ, మేదినీం = భూమిని, త్యజతి = విడిచిపెట్టును, తదర్ధం = అందులో సగము అనగా అయిదువేల సంవత్సరముల యనంతరము, జాహ్నవీతోయం=గంగాజలము పృథివిని విడుచును. తదర్ధం=అందులో సగము రెండున్నరవేల సంవత్సరముల యనంతరము, గ్రామదేవతా = గ్రామదేవత, గ్రామమును విడిచిపెట్టును.

తా॥ కలియుగములో పదివేల సంవత్సరముల యనంతరము హరి (విష్ణువు) భూమిని విడిచిపెట్టును. అయిదువేల సంవత్సరములు గడవ గానే గంగాజలము విడిచిపెట్టును. రెండువేల అయిదువందల సంవత్సర ములు గడచిన తరువాత గ్రామదేవత విడిచిపెట్టిపోవును.

వివరణము :- ఈ శ్లోకము నిశ్చయముగా ప్రక్షిప్తము. కారణము బుద్ధిమంతుడైన చాణక్య డిట్టి తలతోకలేని యర్థరహితమైన శ్లోకము వ్రాయడు. విష్ణువనగా చరాచరజగత్తులో నంతట లోపల బయట వ్యాపించియున్న బ్రహ్మతత్త్వము అట్టి తత్త్వ మెన్నడును పృథివిని విడిచియుండదు. జ్యోతిశ్శాస్త్ర గణితమునుబట్టి కలియుగకాలము అయిదు వేల సంవత్సరములకంటె నెక్కువకాలము గడచినది. కాని గంగ భూమిని విడిచివెళ్లలేదు. వెనుక నెట్లు ప్రవహించినదో యిప్పుడు నట్లే ప్రవహించుచున్నది. గ్రామదేవత లేనేలేదు. కావున విడిచివెళ్లు ప్రశ్నయే లేదు. మూర్ఖత్వము గలిగి ప్రత్యక్ష విరుద్ధముగా నున్నది కావున నీ శ్లోకము ప్రక్షిప్తమే యగును.

శ్లో॥ గృహేఽఽసక్తస్య నో విద్యా నో దయా మాంసభోజినః।
ద్రవ్యలుబ్ధస్య నో సత్యం స్త్రైణస్య న పవిత్రతా॥ 5

అర్థము :- గృహాసక్తస్య=ఇంటియందు ఆసక్తి, మోహము, మమ కారము, ఉండువానికి, విద్యా=విద్య, నో=ప్రాప్తింపదు, మాంసభోజినః= మాంసము భుజించువానికి, దయా = దయ, నో = ఉండనే యుండదు, ద్రవ్యలుబ్ధస్య = ద్రవ్యమునందు లోభగుణము కలవానికి, సత్యం = సత్యము, నో = ఉండనే యుండదు, స్త్రైణస్య = వ్యభిచారియైనవానికి, పవిత్రతా=పవిత్రత, న=ఉండుటకు వీలులేదు.

తా॥ గృహసంబంధ విషయములందలి ఆసక్తి మోహములలో చిక్కుకొన్నవానికి విద్యాప్రాప్తికలుగదు. మాంసము భుజించువానికి దయ యుండదు. ద్రవ్యమునందు లోభగుణము కలవాని దగ్గఱ సత్యముండదు. దురాచారి, వ్యభిచారి, భోగవిలాసియైనవాడు పవిత్రుడుగా నుండలేడు.

వివరణము :- గృహసంబంధాసక్తి కలవానికి విద్యాప్రాప్తి కలుగదు. విద్యార్థిలక్షణములలో గృహత్యాగ మొకటి—

కాకచేష్టో బకో ధ్యానీ శ్వాన నిద్ర స్తథైవ చ।
అల్పాహారీ గృహత్యాగీ విద్యార్థీ పంచలక్షణః॥

కాకివలె చేష్టలుచేయుచు, కొంగవలె ధ్యాననిమగ్నుడై, కొంచెము ధ్వనియైనను నిద్రలేచు కుక్కవలె నిద్రకలవాడై, అల్పాహారియు, గృహ త్యాగియు విద్యార్థి కావలెను. ఈ యైదు విద్యార్థి లక్షణములు. మాంసము భుజించువానికి దయయుండదు. ప్రాణులను హింసించినపుడే మాంసము లభించును. జీవహింసలేనిదే మాంసభక్షణ జరుగదు కావున వారిలో దయాభావముండదు. ఒకా నొక కవి—

న హి మాంసం తృణాత్కాష్ఠాదుపలాద్వాఽపి జాయతే।
హత్వా జంతుం తతో మాంసం తస్మాద్ దోషస్తు భక్షణే॥

మాంసము గడ్డినుండికాని, కట్టెలనుండికాని, రాళ్లనుండికాని లభింపదు. జంతువును చంపినప్పుడే మాంసము లభించును. కావున మాంసభక్షణలో దోషమున్నది.

ధనమునందు లోభగుణముగలవారిలో సత్యముండదు. ధన లోభముచే నధికముగా ధనము సంపాదించి మోసముచేయుటకు అబద్ధమాడును. వ్యభిచారులు కులము, శీలము, రంగు, రూపము మొదలగువానిని చూడరు కావున వారిలో పవిత్రతయుండదు. ఇట్టి శ్లోకముతో సమానమైన మరొక శ్లోకము—

మద్యపస్య కుతః సత్యం దయా మాంసాశినః కుతః।
కామినశ్చ కుతో విద్యా నిర్ధనస్య కుతః సుఖమ్॥

(జనవర్మ వివేకము)

శ్లో॥ న దుర్జనః సాధుదశాముపైతి
బహుప్రకారైరపి శిక్ష్యమాణః
ఆమూలసిక్తః పయసా ఘృతేన
న నిమ్బవృక్షో మధురత్వమేతి॥ 6

అర్థము :- దుర్జనః = దుర్జనుడు, బహుప్రకారైః = అనేకవిధములు, శిక్ష్యమాణః అపి = నేర్పబడినవాడైనను, సాధుదశాం = మంచిస్థితిని, సజ్జనత్వమును, న ఉపైతి = పొందలేడు, నింబవృక్షః = వేపచెట్టు, పయసా = పాలతోను, ఘృతేన = నేతితోను, ఆమూలసిక్తః = మొదలంట తడుపబడిన దైనను, మధురత్వం = తియ్యందనము, న ఏతి = పొందలేదు.

తా॥ అనేకవిధముల వ్రాయుట, చదువుట మొదలగు పనులద్వారా శిక్షణయిచ్చినను దుర్జనుడు సజ్జనుడు కాలేడు. పాలతోను, నేతితోను మొదలగుట తడిపినను వేపచేదును విడిచి మాధుర్యముపొందదు.

వివరణము :- స్వభావమును మార్చుట కఠినము—

మధునా సించయేన్నిత్యం నిమ్బః కిం మధురాయతే ?
జాతిస్వభావ దోషోఽయం కటుకత్వం న ముంచతి॥

వేపచెట్టును తేనెతో తడిపినను దానిలోని చేదుపోదు. జాతిస్వభావమైన చేదుతనము ఏమిచేసినను విడిచిపోదు.

యశ్చ నిమ్బం పరశునా యశ్చైనం మధుసర్పిషా ।
యశ్చైనం గంధమాల్యాద్యైః సర్వస్య కటురేవ సః॥

(అరుణపత్తుడు)

గొడ్డలితో నఱికినవానికి, తేనెతో నేతితో తడిపినవానికి, సుగంధ పూలమాలను ధరింపజేసిన వానికి అందఱకు వేప చేదుగానేయుండును కాని మరొకవిధముగా నుండదు. అది సహజగుణము.

ఆమ్రం ఛిత్త్వా కుఠారేణ నిమ్బం పరిచరేత్తు కః ।
యశ్చైనం పయసా సించేన్నైవాస్య మధురో భవేత్॥

(రామా. అయో. 35-16)

మామిడిచెట్టును కొట్టివేసి దాని స్థానమున నెవడు వేపచెట్టును నాటును ? ఆ వేపచెట్టును పాలతో తడిపినను దానిలో మాధుర్యముచేరదు. తియ్యనిపండ్లనీయదు.

ద్విషా భజ్యేయ మప్యేవం న నమేయం తు కస్యచిత్ ।
ఏష మే సహజో దోషః స్వభావో దురతిక్రమః॥

(రామా. యుద్ధ. 36-11)

రావణుడు మాల్యవంతునితో ననుచున్నాడు — నన్ను రెండు ముక్కలుగా చీల్చినను నేనెవ్వనికి తలవంచను. ఇది నా స్వాభావిక దోషము. స్వభావము మారునది కాదు.

స్వభావో నోపదేశేన శక్యతే కర్తుమన్యథా ।
సుతప్తమపి పానీయం పునర్గచ్ఛతి శీతతామ్॥ (పంచతంత్ర 1-280)

ఎవ్వడును ఎవ్వని స్వభావమును మార్చలేడు. బాగుగా కాగబెట్టిన నీరు కొంతసేపటికి తిరిగి చల్లబడును గదా!

శ్లో॥ అన్తర్గతమలో దుష్టస్తీర్థస్నానశతైరపి ।
న శుధ్యతి యథా భాండం సురాయా దాహితం
చ సత్॥ 7

అర్థము :- అన్తర్గతమలః = అంతఃకరణములోని మలము (పాప వాసనలతో నిండినది), దుష్టః = దుష్టమైనది, ఇట్టి మనుష్యుడు, తీర్థస్నానశతైః = వందలకొలదిసార్లు స్నానముచేసినను, అపి = కూడ, న శుధ్యతి = పవిత్రము కాదు, యథా = ఎట్లనగా, సురాయాః = మద్యము యొక్క, భాండం = పాత్ర, దాహితం = కాల్చబడినను, చ = కూడ, న = పవిత్రమైనది కాదు.

తా॥ పాపవాసనలతో నిండిన మలినమగు నంతఃకరణము దుష్టమైనదై వందలకొలది తీర్థములలో స్నానముచేసినను, సారాయి తయారు చేసిన పాత్రను దహింపజేసినను దానిలోని చెడువాసన పోనట్లు అంతఃకరణములోని మాలిన్యముపోయి శుద్ధముకాదు.

వివరణము :- తీర్థములలో స్నానముచేసినంతమాత్రమున అంతఃకరణము పవిత్రముకాదు—

నిత్యకర్మ పరిత్యాగా న్స్నానే సంసర్గ దోషతః ।
వ్యర్థం తీర్థాగమనం పాపమేవావశిష్యతే॥
క్షాలయన్తి హి తీర్థాని సర్వథా దేహజం మలమ్ ।
మానసం క్షాలితుం తాని న సమర్థాని వై నృప॥
శక్తాని యది చేతాని గంగాతీర నివాసినః ।
మునయో ద్రోహ సంయుక్తా కథం స్యుర్భావితేశ్వరాః॥

(దేవి భాగ. 6-12-22, 23, 24)

సత్యభాషణము తీర్థము. క్షమ (ఓర్పు) తీర్థము. ఇంద్రియ నిగ్రహము తీర్థము. ప్రాణులన్నింటిపై దయకలిగియుండుట తీర్థము. కోమలత్వము తీర్థము. జ్ఞానము తీర్థము. తపస్సు తీర్థము. ఈ యేడును తీర్థములుగా చెప్పబడినవి. ప్రాణులన్నింటియందు దయగలిగియుండుట యను తీర్థములో స్నానముచేయుటచేత మనస్సు పవిత్రమగును. నీళ్లలో మునిగినంతమాత్రమున స్నానముకాదు. నిజముగా స్నానముచేసిన వాడెవడనగా నిర్మలమైన అంతఃకరణము కలవాడే. దయానందమహర్షి తీర్థమననేమో యీ క్రింది విధముగా చెప్పెను—

వేదాది సత్యశాస్త్ర పఠనము, ధార్మిక విద్వాంసుల కలయిక, పరోపకారము, ధర్మానుష్ఠానము, యోగాభ్యాసము, వైరములేకుండుట, మోసములేకుండుట, సత్యభాషణము, సత్యమును గౌరవించుట, సత్యమునే చేయుట, బ్రహ్మచర్యము, ఆచార్యులకు, అతిథులకు, పితరులకు సేవచేయుట, పరమేశ్వర స్తుతిప్రార్థనోపాసనలు శాంతి, ఇంద్రియ నిగ్రహము, సుశీలత. ధర్మయుక్త పురుషార్థము, జ్ఞానవిజ్ఞానములు మొదలగు శుభగుణకర్మలు దుఃఖములనుండి తరింపజేయును. కావున ఇవి యన్నియు తీర్థములు.

జలములు స్థలములు తీర్థములు కావు. వేనిచేత జనులు తరింపబడుదురో యవి తీర్థములు. మనుష్యు లేమి చేసి వేనిద్వారా దుఃఖముల

నుండి తప్పించుకొందురో యవి తీర్థములు. జలస్థలములు తరింప జేయు నవి కావు. అవి ముంచి చంపివేయును. వీనికి బదులు నావ మొదలగు వానిని తీర్థములనవచ్చును. అవి సముద్రాదులను తరింపజేయ సమర్థము లగును. (సత్యార్థ ప్రకాశము-ఏకాదశ సముల్లాసము)

శ్లో॥ న వేత్తి యో యస్య గుణప్రకర్షం।
స తం సదా నిన్దతి నాత్ర చిత్రమ్ ॥
యథా కిరాతీ కరికుమ్భ జాతా
ముక్తాః పరిత్యజ్య బిభర్తి గుంజాః॥ 8

అర్థము :- యః=ఎవడు, యస్య=ఎవనియొక్క, గుణప్రకర్షం=గుణాధిక్యతను, న వేత్తి=తెలిసికొనడో, సః=వాడు, సదా=ఎల్లప్పుడు, తం=అతనిని, నిందతి=నిందించుచున్నాడు, అత్ర = ఇక్కడ, చిత్రం న = ఆశ్చర్యములేదు. యథా=ఎట్లు, కిరాతీ=కిరాతునిభార్య, కరికుంభ జాతాః=ఏనుగు కుంభస్థలమందుపుట్టినట్టి, ముక్తాః = ముత్యములను, పరిత్యజ్య = విడిచి, గుంజాః = గురిగింజల దండను, బిభర్తి = ధరించు చున్నది.

ఈ శ్లోకము కొంచెము పాఠభేదముతో సత్యార్థప్రకాశము 11వ సముల్లాసములో నున్నది.

తా॥ ఎవ్వడైనను ఎవనియొక్క గుణముల గొప్పతనము నెఱుగడో వాడు తానెఱుగని వానియొక్క గుణములను తక్కువచేసి నిందించును. అందులో చిత్రములేదు. వేటకాని భార్య ఏనుగుయొక్క కుంభ స్థలమందలి ముత్యములను దండగాచేసి ధరింపక గురిగింజలను దండ గ్రుచ్చి ధరించును.

వివరణము :- మనుష్యజన్మ దుర్లభము. మనుష్య జీవితము ధర్మార్థకామమోక్షము లను నాల్గింటిని సిద్ధింపజేయుట కుపయోగపడును. విద్వాంసులైనవారు ధార్మికులైన సత్పురుషుల సాంగత్యము చేయువారు, యోగియు, పురుషార్థియు, జితేంద్రియుడునై ధర్మార్థకామమోక్షముల సాధించి యీ లోకములో పరలోకములో నెల్లపుడు నానందముగా నుండును. మూర్ఖుడైనవాడు అమూల్యమైన మానవజీవితమును విషయ లోలుడై నష్టముచేసికొనును.

శ్లో॥ యస్తు సంవత్సరం పూర్ణం నిత్యం మౌనేన భుంజతి ।
యుగ కోటి సహస్రం తు స్వర్గలోకే మహీయతే॥ 9

అర్థం :- యః = ఏ మనుష్యుడు, తు = అయితే, సంవత్సరం పూర్ణం=ఒక సంవత్సరము పూర్తిగా, నిత్యం = ఎల్లప్పుడు. మౌనేన= మౌనముతోనుండి మెదలకుండ మాట్లాడకయుండి, భుంజతి=భోజనము చేయుచుండునో, తు=వాడైతే నిఃసందేహముగా, యుగకోటిసహస్రం = వెయ్యికోట్ల యుగముల వరకు, స్వర్గలోకే = స్వర్గలోకమందు, మహీ యతే=గౌరవముగా, ఆదరముగా సమ్మానింపబడును

తా॥ ఒక సంవత్సరము నిత్యము మౌనముగానుండి భుజించు చుండువాడు నిస్సందేహముగా ఒక వేయికోట్ల యుగముల వరకు స్వర్గ ములో గౌరవాదరముల పొందును.

వివరణము :- ఈ శ్లోకము నిశ్చయముగా ప్రక్షిప్తమే. నీతి మంతుడు, విద్వాంసుడు, బుద్ధిమంతుడునైన చాణక్య డిట్టి వ్రాతల వ్రాయడు. నిజముగా నొక సంవత్సరముపాటు మౌనముగానుండి భుజించు వానికి వేయికోట్ల యుగములు స్వర్గప్రాప్తికలుగుచో ఈ యమ నియమ ములు, జపతపములు, యోగాభ్యాసము, సత్సంగము, స్వాధ్యాయము మొదలైన వాని వలన నేమి యావశ్యకముండును ?

శ్లో॥ కామం క్రోధం తథా లోభం స్వాదం శృంగారకౌతుకే।
అతి నిద్రాఽతి సేవే చ విద్యార్థీ హ్యష్ట వర్జయేత్॥ 10

అర్థము :- కామం = కామము (విషయభోగేచ్ఛ) క్రోధం = క్రోధము, తథా=అట్లే, లోభం = లోభగుణము (పరిశ్రమ చేయకుండ పదార్థము పొందవలెనను కోరిక), స్వాదం=రుచికరపదార్థముల తినవలెనను కోరిక శృంగారకౌతుకే = అందమైన దుస్తులధారణ, తమాషా చేయుట, మనస్సును సంతోషపెట్టుటకు చీట్లు లేక, పచ్చీసు, చదరంగము మొదలైనవి ఆడుట, చ=మరియు, అతినిద్రాతిసేవే = మిక్కిలి నిద్రించుట, మిక్కిలిసేవించుట, ముఖస్తుతి చేయుట అను నీ యెనిమిదింటిని, విద్యార్థి, హి =నిశ్చయముగా, వర్జయేత్=విడిచిపెట్టవలెను.

తా॥ విషయముల భోగించుకోరిక, క్రోధము, లోభము (కష్టపడకుండ పదార్థముల పొందుకోరిక) స్వాదుపదార్థముల తినుకోరిక, శృంగారము (అలంకారము) మనస్సును సంతోషపెట్టుటకు ఆడు ఆటలు అధికముగా నిద్రించుట, అధికముగా సేవించుట, ముఖస్తుతిచేయుట యను నెనిమిదింటిని విద్యార్థి విడువవలెను.

వివరణము :- కామక్రోధ లోభములు విద్యాభ్యాసమునకు విఘ్నములు. గీతలో వీనిని నరకద్వారములు దుఃఖమునకు పతనమునకు ద్వారము లనెను—

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః।
కామః క్రోధ స్తథా లోభః తస్మాదేత త్త్రయం త్యజేత్॥
(గీత. 16-21)

కామక్రోధ లోభములు మూడును నరకద్వారములు. ఆత్మను నష్టపఱచును. అందుచే నీ మూటిని త్యజింపవలెను.

లోభమువిషయములో మరొకటి —

యశో యశస్వినాం శుద్ధం శ్లాఘ్యా యే గుణినాం గుణాః ।
లోభః స్వల్పోఽపి తాన్ హన్తి శ్విత్రో రూపమివేప్సితమ్॥
(యోగవాసిష్ఠము)

యశోవంతుల యొక్క నిర్మలయశస్సును, గుణవంతులయొక్క పొగడదగిన గుణములను లోభగుణము స్వల్పముగానున్నను వానిని నష్టపఱచును. కుష్ఠరోగము తాఁకిన మన్మరూపవంతుల ప్రియమైన రూపమును నష్టపఱచును గదా!

రుచులయందు అభిలాషగలవానికి చదువునందభిరుచి తగ్గును. వస్త్రులధరించి యలంకారమునందు ప్రీతిగలవారికి, సంభోగేచ్ఛకల విద్యార్థికి విద్యప్రాప్తింపదు. రకరకముల ఆటపాటలలో నిమగ్నుడైనవానికి కూడ చదువురాదు. మిక్కిలి నిద్రించుటయు, మిక్కిలి సేవించుటయు అధ్యయనమునకు ఆటంకములగును. కావున విద్యార్థి యీ యెనిమిది దుర్గుణముల విడువవలెను—

శ్లో॥ అకృష్ట ఫలమూలేన వనవాస రతః సదా ।
కురుతేఽహరహః శ్రాద్ధమృషి విప్రః స ఉచ్యతే॥ 11

అర్థము :- అకృష్టఫలమూలేన = కృషిచేయకయే లభించు పండ్లతో, దుంపలతో, జీవనము గడపువాడు, సదా = ఎల్లపుడు, వనవాస రతః = వనవాసమునందు ప్రీతిగలవాడు, అహరహః = ప్రతిదినము, శ్రాద్ధం = శ్రాద్ధమును, కురుతే = చేయుచున్నాడు, సః = అట్టివాడైన, విప్రః = బ్రాహ్మణుడు, ఋషిః = ఋషి అని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా॥ విత్తకుండనే భూమినుండి ఫలించినట్టి కందమూలాదుల తిని జీవనము గడపువాడును, ఎల్లపుడు వనమునందే యుండదలచినవాడును,

ప్రతిదినము శ్రాద్ధము పెట్టువాడునగు బ్రాహ్మణుడు ఋషియనియు చెప్పబడును.

వివరణము :- ప్రతిదినము శ్రాద్ధమునుగూర్చి-పౌరాణికులు చచ్చిపోయినవారికి పెట్టు శ్రాద్ధము కాదిది. పౌరాణికులు పెట్టుశ్రాద్ధము సంవత్సరములో 15 రోజులుండును. అవి చచ్చినవారికి చేరనే చేరవు. ఇక్కడ ప్రతిదినము చేయు శ్రాద్ధముచూడుడు. శ్రాద్ధమనగా శ్రద్ధతో చేయబడు క్రియ. అరణ్యములో కందమూలముల తినుచు బ్రాహ్మణులు స్వయముగా చేయు పంచమహాయజ్ఞములు. పరమేశ్వరుని గూర్చి చేయు సంధ్య బ్రహ్మయజ్ఞమనియు, వేదాధ్యయనము, దేవయజ్ఞము (అగ్నిహోత్రము) పితృయజ్ఞము, అతిథియజ్ఞము, బలివైశ్వదేవయజ్ఞము నాచరించుటయే శ్రాద్ధము.

శ్లో॥ ఏకాహారేణ సంతుష్టః షడ్కర్మనిరతః సదా ।
ఋతుకాలాభిగామీ చ స విప్రో ద్విజ ఉచ్యతే॥ 12

అర్థము :- ఏకాహారేణ=రోజుకొకసారి భోజనముతో, సంతుష్టః= సంతోషించినవాడును, సదా=ఎల్లప్పుడు, షట్కర్మనిరతః = ఆరు కర్మల యందు దీక్షకలవాడు, చ=మరియు, ఋతుకాలాభిగామీ = ఋతుకాలము నందే స్త్రీ సంగమముచేయువాడునైన, సః=ఆ, విప్రః = బ్రాహ్మణుడు, ద్విజః=ద్విజుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా॥ రోజు కొక్కసారి భోజనముతోనే సంతుష్టుడును, ఆరు కర్మలు నియమముగా జేయువాడు, ఋతుకాలగామియు నగు బ్రాహ్మణుడు ద్విజుడని చెప్పబడును.

వివరణము :- బ్రాహ్మణునకు ఆరుకర్మలు నియమింపబడినవి—

అధ్యాపనమధ్యయనం యజనం యాజనం తథా ।
దానం ప్రతిగ్రహం చైవ బ్రాహ్మణానామకల్పయత్॥

(మను. 1-88)

వేదములు చదువుట, చదివించుట, యజ్ఞముచేయుట, చేయించుట, దానమిచ్చుట, దానముపుచ్చుకొనుట అను నారుకర్మలు బ్రాహ్మణుడు చేయవలెను. అవి చేసినవాడే బ్రాహ్మణుడు.

ఋతుగామి :- స్త్రీలకు స్వాభావిక ఋతుకాలము 16 రాత్రులు. వానిలో మొదటి నాలుగురోజులు రజోదర్శనమగుటవలన నిందితములు (పనికిరావు) ఆ నాలుగు రోజులలో సమాగమముచేసిన వ్యర్థము, మరియు రోగకారణము కూడ. 11, 13 రాత్రులు నిందితములు. మిగిలిన 10 రాత్రులు సంగమమునకు శ్రేష్ఠములు, సంతానము కావలసినవారు ఆ పది రాత్రులలో సంగమము చేయవలెను. ఆవిధముగా ప్రవర్తించినవాడే ఋతుగామి యనబడును. అట్టివాడు గృహస్థుడైనను బ్రహ్మచారియే యగును.

శ్లో॥ లౌకికే కర్మణి రతః పశూనాం పరిపాలకః ।
వాణిజ్యకృషి కర్తా యః స విప్రో వైశ్య ఉచ్యతే॥ 13

అర్థము :- యః=ఎవడు, లౌకికే = సాంసారికమైన, కర్మణి = పనియందు, రతః=ప్రీతికలవాడో, పశూనాం = పశువులయొక్క, పరిపాలకః=రక్షకుడో, వాణిజ్య = వ్యాపారము, కృషి = వ్యవసాయము, కర్తాచ=చేయుచున్నాడో, సః=ఆ, విప్రః = బ్రాహ్మణుడు, వైశ్యః = వైశ్యుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా॥ సాంసారిక కర్మలయందు నిమగ్నుడై పశుపోషణచేయుచు. వ్యాపారము, కర్షకవృత్తి (పొలముపని వ్యవసాయము) చేయు బ్రాహ్మణుడు వైశ్యుడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ లాక్షాది తైలనీలానాం కుసుమ్భ మధు సర్పిషామ్ ।
విక్రేతా మద్యమాంసానాం స విప్రః శూద్ర ఉచ్యతే॥ 14

అర్థము :- లాక్షాదితైలనీలానాం = నల్లనిలక్క, నూనెలను, కుసుమ్భమధుసర్పిషామ్ = ఎఱ్ఱనివి తేనె, నెయ్యిని, మద్యమాంసానాం = మద్య మాంసములను, విక్రేతా = అమ్మునట్టి, సః = ఆ, విప్రః = బ్రాహ్మణుడు, శూద్రః = శూద్రుడుగా, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా॥ లక్క, నూనె, నీలవర్ణముగలవి, కుంకుమ, తేనె, నెయ్యి, మద్యము, మాంసము-అమ్ము బ్రాహ్మణుడు శూద్రుడని చెప్పబడును.

శ్లో॥ పరకార్య విహన్తా చ దామ్భికః స్వార్థసాధకః ।
ఛలీ ద్వేషీ మృదుః క్రూరః విప్రో మార్జార ఉచ్యతే॥ 15

అర్థము :- పరకార్య విహన్తా = ఇతరుల పని చెడగొట్టువాడు, దామ్భికః = మూర్ఖుడు, డాంబికుడు స్వార్థసాధకః = ఎట్లైనను, స్వార్థమును సాధించువాడు, ఛలీ = మోసగాడు, ద్వేషీ = ద్వేషించువాడు, మృదుః = పైకి మృదువుగా కనబడుచు, క్రూరః = లోపలక్రూరస్వభావముగలవాడునైన, విప్రః = బ్రాహ్మణుడు, మార్జారః = పిల్లివంటివాడుగా, ఉచ్యతే = చెప్పబడు చున్నాడు.

తా॥ ఇతరుల కార్యము చెడగొట్టువాడు, డంబాచారముగలవాడు, స్వార్థము సాధించువాడు, మోసగించువాడు, ఇతరుల యున్నతి సహింప లేనివాడు, పైకి మృదుస్వభావుడుగా నుండి లోపల క్రూరస్వభావముగల వాడునైన బ్రాహ్మణుడు పిల్లియని చెప్పబడును.

శ్లో॥ వాపీ కూప తడాగానామారామ సురవేశ్మనామ్ ।
ఉచ్ఛేదనే నిరాఽఽశంకః స విప్రో మ్లేచ్ఛ ఉచ్యతే॥ 16

అర్థము :- వాపీకూప తటాకానాం = దిగుడుబావి, బావి, చెఱువు యొక్కయు, ఆరామసురవేశ్మనాం = ఉద్యానవనము, దేవాలయముల యొక్కయు, ఉచ్ఛేదనే = నాశనము చేయుటలో, నిరాశంకః = జంకులేనట్టి, సః = ఆ, విప్రః = బ్రాహ్మణుడు, మ్లేచ్ఛః = మ్లేచ్ఛుడని (పీడుడు, క్రూరుడు), ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా॥ దిగుడుబావి, బావి, చెఱువు, ఉద్యానవనము, దేవాలయము మొదలగు వానిని నిశ్శంకముగా నాశనము చేయు బ్రాహ్మణుడు మ్లేచ్ఛుడని చెప్పబడును.

వివరణము :- ఆరామ మనగా ఆడుకొనుతోట, విహరించు ఉద్యానము, పూలను పండ్లనిచ్చుతోటను ఉపవనము ఆరామము అందురు.

శ్లో॥ దేవద్రవ్యం గురుద్రవ్యం పరదారాఽభి మర్శనమ్ ।
నిర్వాహః సర్వభూతేషు విప్రశ్చాండాల ఉచ్యతే॥ 17

అర్థము :- దేవద్రవ్యం = విద్వాంసుల ద్రవ్యము, గురుద్రవ్యం = గురువుల ద్రవ్యము, పరదారాభిమర్శనమ్ = ఇతరుల భార్యలతో, సంభోగము, సర్వభూతేషు = అన్ని ప్రాణులయందు, నిర్వాహః = జీవనము గడపునట్టి, విప్రః = బ్రాహ్మణుడు, చాండాలః = చాండాలుడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

తా॥ విద్వాంసుల ద్రవ్యమును, గురువు ద్రవ్యమును, కాజేయువాడును, పరస్త్రీ సమాగమము చేయువాడును, ప్రాణులన్నింటిని తాను జీవించుట కుపయోగించునట్టి బ్రాహ్మణుడు చాండాలుడుగా చెప్పబడును.

శ్లో॥ దేయం భోజ్యధనం సదా సుకృతిభిర్నో సంచితవ్యం కదా
శ్రీకర్ణస్య బలేశ్చ విక్రమపతేరద్యాపి కీర్తిః స్థితా ।

అస్మాకం మధు దానభోగ రహితం నష్టం చిరాత్సంచితం
నిర్వాణాదితి పాణిపాదయుగలే ఘర్షన్త్యహో మక్షికాః॥ 18

అర్థము :- సుకృతిభిః = పుణ్యాత్ములచే, భోజ్యధనః = అనుభవింప దగిన ధనము, సదా = ఎల్లపుడు, దేయం = ఈదగినదే, కదా = ఎన్నడును, నో సంచితవ్యం = కూడబెట్టదగినదికాదు, ఎందుకనగా దానముచ్చుటచేతనే, శ్రీకర్ణస్య = దానవీర కర్ణుని యొక్కయు, బలేః = బలి యొక్కయు, చ = మరియు, విక్రమపతేః = విక్రమాదిత్యుని యొక్కయు, కీర్తిః = యశస్సు, అద్యాపి = ఇప్పటికిగూడ, స్థితా = నిలిచియున్నది, అస్మాకం = మా యొక్క, మధు = తేనె, దానభోగరహితం = దానముచేయుటకు ననుభవించుటకు పనికిరానిది, చిరాత్సంచితం = చాలకాలమునుండి సంపాదింపబడినట్టిదియగు తేనె, నిర్వాణాత్ = నాశనమగుచున్నది, ఇతి = అని, మక్షికాః = తేనెటీగలు, పాణిపాదయుగలే = చేతులు, పాదముల జంటను, ఘర్షన్తి = రుద్దుకొనుచున్నవి, అహో ! = ఆశ్చర్యము.

తా॥ పుణ్యాత్ములు అనుభవించుటకు దగిన ధనము ఎల్లపుడు దానముచేయుటకు సిద్ధముగా నుంచవలెను. ఎన్నడును కూడబెట్టదలప రాదు. దానముచేసినందువలననే కర్ణుడు, బలిచక్రవర్తి, విక్రమాదిత్యుడు మొదలగువారి కీర్తి నేటికిని ప్రసిద్ధముగా నున్నది. దానముచేయకయు అనుభవింపకయు మనము కూడబెట్టిన తేనె నష్టమైపోవుచున్నదేయని తేనెటీగలు పశ్చాత్తాప పడుచున్నవా యన్నట్లు కాళ్లుచేతులు పరస్పరము రుద్దుచున్నవి.

ఏకాదశాధ్యాయము సమాప్తము

# ద్వాదశాధ్యాయము

శ్లో॥ సానందం సదనం సుతాశ్చ సుధియః కాన్తా ప్రియాలాపినీ
సుధనం సన్మిత్రం స్వయోషితి రతిః స్వాఽఽజ్ఞాపరాః
సేవకాః।
ఆతిథ్యం శివపూజనం ప్రతిదినం మిష్టాన్నపానం గృహే
సాధోః సంగముపాసతే చ సతతం ధన్యో
గృహస్థాఽఽశ్రమః॥ 1

అర్థము :- సానందం=ఆనందము కలిగించు. సదనం = ఇల్లు. సుతాః = బిడ్డలు. సుధియః = మంచిబుద్ధిమంతులును. చ = మరియు, కాంతా=భార్య. ప్రియాలాపినీ=మధురముగా మాట్లాడునదియు, సుధనం = మంచిపద్ధతితో సంపాదించిన ధనము, సన్మిత్రం = మంచిమిత్రుడు. స్వయోషితి రతిః=తన భార్యయందు ప్రేమయు. సేవకాః = సేవకులు. స్వాజ్ఞాపరాః=తనయాజ్ఞను పాలించువారును. ఆతిథ్యం=అతిథిసత్కారము. శివపూజనః = కల్యాణకారకుడగు పరమేశ్వరోపాసనయు, ప్రతిదినం = ప్రతిదినము. గృహే = ఇంటియందు. మిష్టాన్నపానం = మధురమైన భోజనము, సాధోః=సాధుపురుషుని. సంగం = కూడిక, చ = కూడ, సతతం = ఎల్లప్పుడు నుండునో యట్టి. గృహస్థాశ్రమము. ధన్యః = ధన్యమైనది.

తా॥ నివసించు గృహము ఆనందముతో నోలలాడుచుండవలయును. బిడ్డలు బుద్ధిమంతులు కావలెను. భార్య ప్రియముగా మాట్లాడునదిగా నుండవలెను. ధనము న్యాయార్జితము కావలెను. మిత్రుడు మంచివాడుగా నుండవలెను. తన భార్యయందే యనురాగముండవలెను. సేవకులు తన యాజ్ఞను పాలించువారుగా నుండవలెను. అతిథులను సత్కా

సింపవలెను. కల్యాణకరుడగు పరమేశ్వరు నుపాసింపవలెను. రుచికర మైన అన్నపానాదు లుండవలెను. ఎల్లప్పుడు సజ్జనసాంగత్యముండవలెను. ఈ విధముగానున్నచో గృహస్థజీవితము ధన్యమగును.

వివరణము :- ఈ శ్లోకమునకు వ్యాఖ్య మేము వ్రాసిన 'ఆదర్శ పరివారము' అను గ్రంథములో చూడుడు—

శ్లో॥ ఆర్తేషు విప్రేషు దయాన్వితశ్చ
యత్ శ్రద్ధయా స్వల్పముపైతి దానమ్ ।
అనన్త పారం సముపైతి రాజన్
యద్దీయతే తన్న లభేద్ ద్విజేభ్యః॥ 2

అర్థము :- దయాన్వితః = దయాపరు, చ = మఱియు కరుణా పూర్ణుడైన మనుష్యుడు, ఆర్తేషు = దుఃఖితులైన, విప్రేషు = బ్రాహ్మణులకు, శ్రద్ధయా = శ్రద్ధతో, స్వల్పం = అల్పమైన, దానం = దానమును, ఉపైతి = ఇచ్చుచున్నాడో, రాజన్ = ఓ రాజా ! ద్విజేభ్యః = బ్రాహ్మణులకు, యత్ = ఎంత, దీయతే = ఈబడుచున్నదో, తత్ = అంతమాత్రమే, న లభతే = లభింపదు, మఱియు పరమాత్మని దయవలన, అనంతపారం = అంతులేనిదై, సముపైతి = లభించును.

తా॥ దయగలవారు పీడితులైన బ్రాహ్మణులకు శ్రద్ధతో నిచ్చిన దానము స్వల్పమైనను ఓ రాజా! పరమాత్మని దయవలన నిచ్చిన దాతకు అనంతధనము చేకూరును.

వివరణము - దీనులకు దానమీవలెను వేదములో—

పృణీయాదిన్నాధమానాయ తవ్యాన్ ద్రాఘీయాంస
మనుపశ్యేత్ పన్థామ్ ।
ఓ హి వర్తన్తే రథ్యేవ చక్రాఽన్య మన్యముపతిష్ఠన్తి రాయః॥
(ఋ. 10-117-5)

ధనసంపన్నులైన మనుష్యులు దుఃఖితులు పీడితులైనవారికి తప్పక సాయము చేయవలయును. వారి దీర్ఘదృష్టితో పనిచేయవలెను. సుఖ దుఃఖములు అందరికి కలుగును. ధనసంపదలున్నవని గర్వముకాని విశ్వాసముకాని కలిగియుండరాదు. ధనము చక్రములవలె తిరుగు చుండును. నే డొకరి దగ్గఱ రేపు మఱొకరి దగ్గఱనుండును.

ఒక విత్తనము నాటిన దానివలన వందలకొలఁది వేలకొలఁది ఫలించును. అట్లే చేసిన దానము కొంచెమైనను దాని ప్రతిఫలము అంతియేకాక వందలకొలఁది వేలకొలఁది రెట్లు తిరిగి లభించును. ఈబడిన దానము వ్యర్థముకాదు. దానిఫలము తప్పకయుండును.

శ్లో॥ దాక్షిణ్యం స్వజనే దయా పరిజనే శాఠ్యం సదా దుర్జనే
ప్రీతిః సాధుజనే స్మయః ఖలజనే విద్వజ్జనే చార్జవమ్ ।
శౌర్యం శత్రుజనే క్షమా గురుజనే నారీజనే ధృష్టతా
ఇత్థం యే పురుషాః కలాసు కుశలా స్తేష్వేవ లోకస్థితిః॥ 3

అర్థము :- స్వజనే = తనవారియందు, దాక్షిణ్యం = సజ్జనత, నమ్రతయు, పరజనే=ఇతరులపై, దయా=దయయు, దుర్జనే=చెడ్డవారి యందు, సదా=ఎల్లపుడు, శాఠ్యం=దుష్టత్వము, సాధుజనే = మంచివారి యందు, ప్రీతిః=ప్రేమయు, ఖలజనే=దుష్టులయందు, స్మయః = చిఱు నవ్వు, చ=మఱియు, విద్వజ్జనే=విద్వాంసులయందు, ఆర్జవం = ఋజు త్వము (సరళత), శత్రుజనే=శత్రువులయందు, శౌర్యం=శౌర్యపరాక్ర మములు, గురుజనే=తల్లిదండ్రులు ఆచార్యులు మొదలగు పెద్దలయెడ, క్షమా=సహనశీలత, నారీజనే=స్త్రీలయెడ, ధృష్టతా=విశ్వాసము, ఇత్థం= ఈవిధముగా, యే=ఏ, పురుషాః=పురుషులు, కలాసు=పైన చెప్పిన విష

యములలో, కుశలాః = నేర్పరులో. తేష్వేవ = అట్టివారిపైననే, లోక స్థితిః = ప్రపంచ స్థితియుండును.

తా॥ తన బంధువాంధవులతో మంచిగా సత్ప్రవర్తనగా మెలగుట, ఇతరులపై దయచూపుట, దుర్జనుల విషయములో దౌష్ట్యము, సాధుజనుల యెడ ప్రేమ, దుష్టులపై అధికారము, బలముచూపుట, విద్వాంసులతో సరళముగా ప్రవర్తించుట, శత్రువుల విషయములో శౌర్యముజూపుట, తల్లిదండ్రులు, పెద్దలు గురువులు మొదలగువారి సంబంధములో సహనము కలిగియుండుట, స్త్రీలయెడ విశ్వాసము, ఈవిధముగా కలిగియున్నచో వారిని నేర్పరులు కుశలురు నందురు. అట్టివారిపైనే లోకస్థితి ఆధారపడి యున్నది.

వివరణము :- వేదములో పృథివిని ధరించువానిని గూర్చి యిట్లున్నది—

సత్యం బృహదృతముగ్రం దీక్షా తపో బ్రహ్మ యజ్ఞః
పృథివీం ధారయన్తి ।
సానో భూతస్య భవ్యస్య పత్న్యురుం లోకం పృథివీ
నః కృణోతు॥ (అథర్వ. 12-1-1)

సత్యము, మహత్త్వాకాంక్ష, న్యాయముతోగూడిన వ్యవహారము, క్షాత్రశక్తి, దీక్ష, తపస్సు ఆత్మజ్ఞానము, అభివృద్ధి ప్రయత్నము, విద్వాంసుల సత్కారము అను నెనిమిది గుణములు పృథివిని ధరించుచున్నవి. భూతభవిష్యత్కాలములలో మనల రక్షించు భూమాత మనకు విస్తృత మైన ప్రకాశమును స్థానమును కలిగించును గాక! — ఈ యెనిమిది గుణములలో ఋతము అనగా న్యాయయుక్త వ్యవహారము చాణక్యుడు వ్రాసిన శ్లోకమంతయు వేదమంత్రములోని యొక పాదమునకు మాత్రమే వ్యాఖ్యయైయున్నది.

మహాకారీట పృథివిని ధరించునవి ఏడు గుణములుగా లెక్కింప బడినవి —

గోభిర్విప్రైశ్చ వేదైశ్చ సతీభిః సత్యవాదిభిః ।
అలుబ్ధైర్దానశీలైశ్చ సప్తభిర్ధార్యతే మహీ॥

(స్కంద మాహే. కౌమా. 2-71)

గోవులు, విప్రులు తపస్వులైన బ్రాహ్మణులు, వేదములు (స్వరయుక్త వేదరక్షణ), పతివ్రతలగు స్త్రీలు, సత్యవాదులు, లోభగుణము లేనివారు, దానశీలురు-అను ఏ యేడుగురిపై పృథివి స్థిరపడియున్నది.

శ్లో॥ హస్తౌ దాన వివర్జితౌ శ్రుతిపుటౌ సారస్వత ద్రోహిణౌ
నేత్రే సాధు విలోకనేన రహితే పాదౌ న తీర్థం గతౌ ।
అన్యాయార్జిత విత్తపూర్ణముదరం గర్వేణ తుంగం శిరో
రేరే జమ్బుక ముంచ ముంచ సహసా నీచం
సునింద్యం వపుః॥ 4

అర్థము :- హస్తౌ = చేతులు, దానవివర్జితే = దానముచేయనివి, శ్రుతిపుటౌ = చెవిదొప్పలు, సారస్వతద్రోహిణౌ = వేదశాస్త్రములు వినక ద్రోహములుచేసినవి, నేత్రే = నేత్రములు, సాధువిలోకనేన = సజ్జనసందర్శనము, రహితే = లేనివి, పాదౌ = పాదములు, తీర్థం న గతౌ = తీర్థమునకు అనగా తల్లితండ్రి గురువు అతిథి అనువారి సేవకొఱకు వారి దగ్గఱకు వెళ్లనివి, ఉదరం = పొట్ట, అన్యాయార్జిత విత్తపూర్ణమ్ = అన్యాయముగా సంపాదించిన ధనముతో నిండినది, శిరః = శిరస్సు, గర్వేణ = గర్వముతో, తుంగం = ఎత్తైనది, రేరేజంబుక ! = ఓరీ నక్కవంటి నీచుడా ! సహసా = శీఘ్రముగ వపుః = శరీరమును, సునింద్యం = బాగుగా నిందింపదగిన దానిని, నీచం = నీచమైనదానిని, ముంచముంచ = విడువువిడువు.

తా॥ చేతులు దానముచేయలేదు. చెవులు వేదాదిశాస్త్రములు వినక ద్రోహముచేసినవి. నేత్రములు సజ్జనపురుషుల చూడలేదు. పాదములు తీర్థములకు (తల్లిదండ్రులు, ఆచార్యుడు, అతిథి మొదలైనవారి సేవ చేయుటకు సమీపమునకు) వెళ్లలేదు. పొట్ట అన్యాయార్జిత ధనముతో నిండియున్నది. శిరస్సు గర్వముతో నెత్తుగానున్నది. నక్కరూపములో నున్న మనుష్యుడా! నీ విట్టి నీచమైన శరీరమును శీఘ్రముగా వదలుము. అనగా పై విధముగా బ్రతుకుటకంటె చచ్చుటమేలని యర్థము.

వివరణము :- ఈ శ్లోకార్థమునకు సంబంధించిన కథ కలదు—

ఒక మనుష్యశవము అడవిలో పడియున్నది. దానిని తినుట కొక్క నక్క సమీపించి ముందుగా ఆ శవము చేతులు తినదలచి చేతులను సమీపింపగా నెవరో ఈ క్రింది విధముగా చెప్పెను. ఓ నక్కా! ఈతని చేతులెన్నడును దానముచేసి యెఱుగవు. కావున తినదగవనెను. అప్పుడా నక్క చేతులువదలి చెవులను తినబోపగా-ఈ చెవులు ఏనాడును వేదాది శాస్త్రములు వినలేదు కావున ముట్టతగనివని వినబడెను. అప్పుడు నక్క నేత్రముల దినబోవ ఈ నేత్రము లెన్నడును సాధువుల దర్శనము చేసినవి కావు కావున తినరావని వినినట్లయ్యెను. అప్పుడు నక్క కాళ్లు తినదలచి సమీపింప ఆ కాళ్లు ఏనాడును తీర్థములకు వెళ్లియెఱుగవు. కావున తినుటకు యోగ్యములు కావని వినబడెను. అంతట నక్క తన పొట్టనిండ ఆ శవముయొక్క పొట్టనుచీల్చి తిన దలంప-ఈ పొట్ట యన్యాయార్జితముతో పెరిగినది కావున భక్షింపతగదని వినబడెను. ఇప్పుడు నక్క శిరస్సును తినదలపగా నా వ్యక్తి యొ శిరస్సు గర్వముతో మిట్టిపడుచున్నది కావున తినయోగ్యము కాదనుచు ఓ నక్కా! యీ యత్యంత నీచమగు శరీరమును తినునట్టి ప్రయత్నమును శీఘ్రముగా విడువుమనెను.

శ్లో॥ పత్రం నైవ యదా కరీరవిటపే దోషో వసన్తస్య కిం
నోలూకోఽప్యవ లోకతే యది దివా
సూర్యస్య కిం దూషణమ్।
వర్షా నైవ పతన్తి చాతకముఖే మేఘస్య కిం దూషణం
యత్పూర్వం విధినా లలాటలిఖితం
తన్మార్జితుం కః క్షమః॥ 5

అర్థము :- యదా=ఎప్పుడు, కరీరవిటపే=ఇసుకపట్టులో నుండు పొదపెట్టునందు, పత్రం = ఆకులు, నైవ = మొలవకున్నచో, వసంతస్య కిం=వసంత ఋతువు దోషమా? ఉలూకః అపి=గుడ్లగూబ, దివా = పగలు, న అవలోక్యతే యది = చూడకున్నచో, సూర్యస్య = సూర్యునకు, దూషణం కిం=దూషణమా యేమి? చాతకముఖే = చాతక పక్షి నోటిలో, వర్షా=వర్షజలము, న పతన్తి=పడకున్నచో, మేఘస్య = మేఘముయొక్క, దూషణం కిం = దోషమాయేమి? యత్ = ఏది, పూర్వం=మొదట, విధినా=బ్రహ్మచేత, లలాటలిఖితం=నుదుటియందు వ్రాయబడినదో, తత్ = దానిని, మార్జితుం = తుడుచుటకు, కః = ఎవడు, క్షమః=సమర్థుడు?

తా॥ ఇసుకప్రదేశములో నుండెడు ఒక పొదకు ఆకులుండవు. ఆకులుండకపోవుట వసంతఋతువు యొక్క దోషముకాదు. గుడ్లగూబ పగలు చూడలేదు. (వెలుతురు) ఆ దోషము సూర్యునిది కాదు. చాతక పక్షి నోటిలో వర్షపునీరు పడకపోవుట మేఘముయొక్క దోషముకాదు. పరమేశ్వరు డెవరికెట్లు జరుగవలయునో ముందే వారి వారి నుదుటియందు వ్రాయును. దానిని తుడిచి యితరవిధముగా మార్చుట కెవ్వరును సమర్థుడు కాడు.

వివరణము :- పురుషార్థము ద్వారా భాగ్యమును మార్చుటకవకాశ మున్నదని దయానందుడు స్వమంతవ్యామంతవ్యములో చెప్పెను పురుషా ర్థము ప్రారబ్ధముకంటె గొప్పది. ఎవడైనను సంచితమును ప్రారబ్ధముగా మార్చును. ఎవడైనను బాగుచేయ దలచిన బాగుచేయును. చెడగొట్ట దలచిన చెడగొట్టును. అందువలన ప్రారబ్ధముకంటె పురుషార్థము గొప్పది.

శ్లో॥ సత్సంగాత్ భవతి హి సాధుతా ఖలానాం

సాధూనాం న హి ఖలసంగమాత్ ఖలత్వమ్ ।

ఆమోదం కుసుమభవం మృదేవ ధత్తే

మృద్గంధం న హి కుసుమాని ధారయన్తి॥ 9

అర్థము :- సత్సంగాత్ = సజ్జనసంగమమువలన, ఖలానాం = దుర్జనులకు, సాధుతా = సాధుత్వము, భవతి హి = కలుగును కదా? సాధూ నాం = సాధువులకు, ఖలసంగమాత్ = దుర్జనసాంగత్యమువలన, ఖలత్వం = దుష్టత్వము, న హి = కలుగదు గదా !, కుసుమభవం = పూలలో బుట్టిన, ఆమోదం = సుగంధమును, మృదేవ = మట్టియే, ధత్తే = ధరించుచున్నది, మృద్గంధం = మట్టివాసనను, కుసుమాని = పూలు. నధారయన్తి = ధరింపవు గదా !

తా॥ దుర్జనులకు మంచివారియొక్క సత్సంగమువలన సాధు త్వము కలుగును. కాని సాధువులకు దుర్జనుల సంబంధమువలన దుష్ట త్వము కలుగదు. పూలవాసన మట్టికి కలుగునుకాని, మట్టివాసన పూలకు రాదు.

వివరణము :- సత్సంగ మహిమ గొప్పది-భర్తృహరి—

జాడ్యం ధియో హరతి సించతి వాచి సత్యం

మానోన్నతిం దిశతి పాప మపాకరోతి ।

చేతః ప్రసాదయతి దిశు తనోతి కీర్తిం
సత్సంగతిః కథయ కిన్న కరోతి పుంసామ్॥
(భర్తృ. నీతి. 22)

సత్సంగతివలన బుద్ధిలోని జాడ్యము (జడత్వము) పోవును. వాక్కునందు సత్యమును నింపును. గౌరవమును పెంచును. పాపమును పోగొట్టును. మనస్సును సంతోషపెట్టును. దిక్కులందు కీర్తిని వ్యాపింప జేయును. సజ్జనసాంగత్యమువలన కలుగని మంచియేమున్నదో చెప్పుము. తులసీదాసు—

సజ్జనసంగతిచే దుర్జనుడు సజ్జనుడగును. పెట్లు ఈ మాట సత్యమో ఆట్లే దుష్టులసాంగత్యముతో శ్రేష్ఠుడు పతనమగును. భీష్ముడు విద్వాంసు డైనను దుర్యోధనుని సంగతివలన విరాట్ మహారాజుయొక్క ఆవులను తీసికొనివచ్చుటకు వెళ్లెను.

శ్లో॥ సాధూనాం దర్శనం పుణ్యం తీర్థభూతా హి సాధవః।
కాలేన ఫలతే తీర్థం సద్యః సాధు సమాగమః॥ 7

అర్థము :- సాధూనాం = సజ్జనులయొక్క, దర్శనం = చూపు, పుణ్యం=పుణ్యమైనది, హి = ఎందుకనగా, సాధవః = సాధువులు తీర్థ భూతాః=సాక్షాత్తుగ తీర్థములవంటివారు (తరింపజేయువారు) తీర్థం = తీర్థమయితే, కాలేన=సమయమువచ్చినపుడు, ఫలతే = ఫలమునిచ్చును, కాని, సాధుసమాగమః=సాధువుల సంగమము, సద్యః = వెంటనే మనో రథముల నెరవేర్చును.

తా॥ సజ్జనదర్శనము పుణ్యము నిచ్చును. సజ్జనులు తీర్థములవంటి వారు (తరింపజేయువారు). తీర్థములు సమయము ప్రాప్తించినపుడే

ఫలముల నిచ్చును కాని సాధుసమాగమము వెంటనే కోర్కెల నీడేర్చును.

వివరణము :- సత్యమైన సాధువుల మహిమ యెట్టిదో చూడుడు—

చందనం శీతలం లోకే చందనాదపి చంద్రమాః।
చంద్ర చందనయోర్మధ్యే శీతలా సాధుసంగతిః॥

ప్రపంచములో చందనము (మంచిగంధము) శీతలమైనది. చందనముకంటె కూడ చంద్రుడు మిక్కిలి చల్లగానుండును. చందనము, చంద్రులకంటెకూడ సజ్జనసాంగత్యము మిక్కిలి శీతలము శాంతిప్రదము నైయున్నది.

నహ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః।
తే పునన్త్యురుకాలేన దర్శనాదేవ సాధవః॥ (భాగవత. 10-84-11)

నీరుగలచోట్లు తీర్థములు కావు. మట్టితో, రాతితో తయారుచేయబడిన బొమ్మలు దేవతలు కాదు. ఆ తీర్థములు మొదలైనవి చాల ఆలస్యముగా పవిత్రముచేయును. (మా ఆలోచనలో నవి జీవితాంతము వరకు పవిత్రముచేయలేవు) కాని సాధువులు దర్శనమాత్రముచేతనే పవిత్రము చేయుదురు.

శ్లో॥ విప్రాఽస్మి న్నగరే మహాన్ కథయ కస్తాల ద్రుమాణాం గణః
కోదాతా రజకో దదాతి వసనం ప్రాతర్గృహీత్వా నిశి।
కో దక్షః పరదార విత్తహరణే సర్వోఽపి దక్షో జనః
కస్మాజ్జీవసి హే సఖే విషకృమి న్యాయేన జీవామ్యహమ్॥ 8

అర్థము :- విప్ర=బ్రాహ్మణుడా! అస్మిన్=ఈ, నగరే = నగరమునం. కః=ఎవడు, మహాన్ = గొప్పవాడు? తాలద్రుమాణాం గణః = తాడిచెట్ల సమూహము. దాతా=దాత. కః=ఎవడు? రజకః=చాకలివాడు. వాడు, వసనం=వస్త్రమును. ప్రాతః = ప్రాతఃకాలమున, గృహీత్వా = తీసికొనిపెళ్లి, నిశి = రాత్రియందు, దదాతి = ఇచ్చుచున్నాడు. పరదారవిత్తహరణే=ఇతర స్త్రీలను ధనమును కాజేయుటలో, దక్షః=సమర్థుడు. కః = ఎవడు? సర్వోపిజనః = ప్రతిమనుజుడుకూడ, దక్షః=సమర్థుడే. హే సఖే = ఓ మిత్రమా! కస్మాత్ = ఎందువలన, జీవసి = జీవించుచున్నావు? అహం=నేను, విషకృమిన్యాయేన=విషముతో నున్న పురుగు చావనట్లు, జీవామి=జీవించుచున్నాను.

తా॥ ఒక బాటసారి యొక నగరమునకు చేరి యొక బ్రాహ్మణు నడిగెను—ఓ బ్రాహ్మణుడా! ఈ నగరములో గొప్ప వాడెవడు? విప్రుడు సమాధానమిచ్చెను. తాడిచెట్ల సమూహము. దానశీలు డెవడు? రజకుడు (చాకలి) ఉదయము వస్త్రములను దీసికొనిపెళ్లి తిరిగి రాత్రియందు తీసికొనివచ్చి యిచ్చును. పరదారవిత్తముల గ్రహించుటలో దక్షుడు (చతురుడు) ఎవడు? పరులధనమును భార్యలను గ్రహించుటలో నందఱును సమర్థులే. ఈ స్థితిలో నిచ్చట నెట్లు జీవించుచున్నావు? ఓ మిత్రుడా! నేను విషములో నుండు పురుగువలె (ఆ పురుగు విషములోనే పుట్టి విషములోనే చచ్చును) ఈ గ్రామములోని వారితోనే కలిసిబ్రతుకుచున్నాను.

శ్లో॥ న విప్రపాదోదక కర్దమాని
న వేదశాస్త్ర ధ్వని గర్జితాని।
స్వాహా స్వధాకార వివర్జితాని
శ్మశాన తుల్యాని గృహాణి తాని॥ 9

అర్థము :- ఏ యిండ్లలో, విప్రపాదోదక కర్దమాని=బ్రాహ్మణుల పాదములు కడుగుటవలన పడిన నీటితో బురదకావో, వేదశాస్త్రధ్వని = వేదముల యొక్కయు, శాస్త్రముల యొక్కయు ధ్వనులచే, గర్జితాని=ఘోషిల్లునవి, న=కావో, స్వాహా=యజ్ఞము చేయునపుడు మంత్రము చివర అనుస్వాహా అను శబ్దము, స్వధాకార=తల్లిదండ్రులు మొదలగు పెద్దలకు పెట్టుచున్న భోజనముచేయుచున్న సమయమున నుచ్చరించు శబ్దముల ధ్వని, వివర్జితాని=లేనట్టి, తాని=ఆ, గృహాణి = గృహములు, శ్మశాన తుల్యాని=వల్లకాటితో సమానమైనవి.

తా॥ బ్రాహ్మణులు పాదములు కడిగిన నీరు పాఱనట్టివి, వేదశాస్త్ర పాఠపఠనధ్వనులచే ఘోషిల్లనట్టివి, యజ్ఞమంత్రముల చివర పలికెడు స్వాహా అను శబ్దములు, పితరుల కిబడిన భోజనమును పొగడునట్టి శబ్దములు (స్వధ) లేనట్టివియగు గృహములు శ్మశానభూమి (వల్లకాడు)తో సమానములు.

వివరణము :- స్వర్గముతో సమానమైన గృహమేది? ఈ శ్లోకములో కొంచెము మార్పుచేసినచో స్వర్గముతో సమానముగా గృహములు భాసించును—

న విప్రపాదోక కర్దమాని
　　న వేదశాస్త్ర ధ్వని గర్జితాని।
స్వాహా స్వధాకార నిరన్తరాణి
　　స్వర్గాని తుల్యాని గృహాణి తాని॥

బ్రాహ్మణుల పాదములు కడిగిన నీరుపాఱినవి, వేదశాస్త్ర పాఠ పఠనముల ధ్వనిచే ప్రతిధ్వనించునవి, యజ్ఞముచేయునపుడు పితరులకు భోజనాదు లిచ్చునపుడు తీసికొనుడు భుజింపుడు అని చేయు స్వాహా స్వధా ధ్వనులుగల గృహములు స్వర్గముతో సమానమైనవిగా గ్రహింపవలెను.

శ్లో॥ సత్యం మాతా పితా జ్ఞానం ధర్మో భ్రాతా దయా స్వసా।
శాంతిః పత్నీ క్షమా పుత్రః షడేతే మమ బాన్ధవాః॥ 10

అర్థము :- ఒక యోగి తన్నుగూర్చి చెప్పిన పరిచయవాక్యములు- సత్యం=సత్యము, మాతా=తల్లి, జ్ఞానం = జ్ఞానము, పితా = తండ్రి, ధర్మః=ధర్మము, భ్రాతా=సోదరుడు, దయా=దయ, స్వసా = సోదరి, శాన్తిః=శాంతి, పత్నీ=భార్య, క్షమా=సహనము, పుత్రః = పుత్రుడు, ఏతేషట్=ఈ ఆరుగురు, మమ=నాయొక్క, బాంధవాః=బంధువులు.

తా॥ నాకు సత్యము తల్లి, జ్ఞానము తండ్రి, ధర్మము సోదరుడు, దయ సోదరి, శాంతి భార్య, సహనము (క్షమ) కొడుకు ఈ ఆరుగురు నాకు బంధువులు.

శ్లో॥ అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః।
నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యోధర్మసంగ్రహః॥ 11

అర్థము :- శరీరాణి=శరీరములు, అనిత్యాని=నాశస్వభావముగలవి, విభవః = ధనసంపత్తి నైవశాశ్వతః = ఎల్లప్పుడుండునది కానేకాదు, మృత్యుః=మరణము, నిత్యం=ఎల్లప్పుడు, సన్నిహితః=అంటిపెట్టుకొని యున్నది. కావున, ధర్మసంగ్రహః = ధర్మమునుకూడబెట్టుట (ధర్మాచరణము) కర్తవ్యః=చేయదగినది.

తా॥ శరీరములనిత్యములనియు, సంపదలు శాశ్వతములు కావనియు, మృత్యువెల్లప్పుడు వెన్నంటి యున్నదని తెలిసికొని ధర్మ సంగ్రహము చేయవలెను.

వివరణము :- శరీరము నశించు స్వభావము కలదని వేదము —
తవ శరీరం పతయిష్ణ్వర్వన్॥ (యజు. 29-22)

ఓ జీవాత్మ! నీ శరీరము నశించునది.

ధనము శాశ్వతముకాదు. లక్ష్మి చంచలమైనది. ఈ ధనమునే డిచ్చట నుండును. జీవు పరలోకమునకు పోవును. మృత్యువు ఎల్లప్పుడును తలపై ననే యుండును. ఎప్పుడు మ్రింగునో తెలియదు. అందుచే—

అజరామరవత్ప్రాజ్ఞో విద్యామర్థం చ చింతయేత్ ।
గృహీత ఇవ కేశేషు మృత్యునా ధర్మమాచరేత్॥
(చాణక్య నీతిశాస్త్రము)

బుద్ధిమంతుడైన మనుష్యుడు ముసలితనము, మరణములేనివాడుగా విద్యను, ధనమును సంపాదింపవలెను. కాని మృత్యువు జుట్టుపట్టుకొని యుండి యెప్పుడు మ్రింగునో యను సందేహముతో ఎల్లపుడు ధర్మము నాచరింపవలెను. శుక్రాచార్యుడు—

స్థితో మృత్యుముఖే చాహం క్షణమాయుర్మమాస్తి న ।
ఇతి మత్వా దానధర్మౌ యథేష్టౌ తు సమాచరేత్॥
(శుక్ర. 3-208)

నేను మృత్యుముఖమందున్నాను. నాకు క్షణమైనను ఆయువులేదని తలంచి యథేష్టముగా దానధర్మము లాచరింపవలెను.

మృతం శరీరముత్సృజ్య కాష్ఠలోష్ఠ సమం క్షితౌ ।
విముఖా బాంధవా యాన్తి ధర్మస్తమనుగచ్ఛతి॥ (మను. 4-241)

బంధుబాంధవులు నిర్జీవమైన శరీరమును కట్టెలతో రాళ్లతో సమాన ముగా దలచి భూమిమీదవిడిచి తిరిగిపోవుదురు. (దానితో కూడ నెవ్వరు వెళ్లరు) మనుష్యుడు చేసిన ధర్మమొక్కటే అతనివెంట వెళ్లును. కాబట్టి ధర్మ సంచయము చేయవలెను.

శ్లో॥ ఆమన్త్రణోత్సవా విప్రా గావో నవతృణోత్సవాః।
పత్యుత్సాహయుతా నార్యః అహం కృష్ణరణోత్సవః॥ 12

అర్థము :- విప్రాః=బ్రాహ్మణులు ఆమంత్రణోత్సవాః = భోజనాహ్వానముకొఱకు నుత్సాహపడుచుందురు, గావః=ఆవులు, నవతృణోత్సవాః=లేతపచ్చిగడ్డికొఱకు ఉత్సాహపడుచుండును, నార్యః=స్త్రీలు, పత్యుత్సాహయుతాః=భర్తనుకలిగియుండుటకు నుత్సాహపడుచుందురు, అహం= నేను, కృష్ణరణోత్సవః = భయంకరయుద్ధము కొఱకు నుత్సాహపడుచుందును.

తా॥ బ్రాహ్మణులు భోజనప్రియులై పిలుపుకొఱకు ఎదురు చూచుదురు. ఆవులు లేతగడ్డి కొఱకు ఉత్సాహము కలిగియుండును. స్త్రీలు భర్తలయుత్సాహముతో నుత్సాహముకలవారగుదురు. నేను భయంకర యుద్ధముచేయుట యనిన నుత్సాహముగానుందును.

శ్లో॥ మాతృవత్ పరదారాంశ్చ పరద్రవ్యాణి లోష్టవత్।
ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి స పశ్యతి॥ 13

అర్థము -: పరదారాన్ = ఇతరుల భార్యలను, మాతృవత్ = తల్లులవలెను, పరద్రవ్యాణి=ఇతరుల ద్రవ్యమును, లోష్టవత్ = మట్టి వలెను, సర్వభూతాని=అన్నిప్రాణులను, ఆత్మవత్=తనవలెను, యః= ఎవడు, పశ్యతి=చూచుచున్నాడో, సః=వాడు, పశ్యతి = యథార్థభావమును చూచుచున్నాడు.

తా॥ పరస్త్రీలను తల్లులవలెను, పరధనమును మట్టిగడ్డవలెను, సమస్తప్రాణులను తనవలెను, ఎవడు చూచునో వాడు యథార్థముగా చూచువాడగును.

వివరణము :- ఇతరుల ధనమును పరస్త్రీలను కుదృష్టితో చూడ రాదు —

పరాన్నం పరవస్త్రంచ పరశయ్యాం పరస్త్రియః ।
పరవేశ్మ నివాసం చ దూరతః పరివర్జయేత్॥

(వృద్ధచాణక్య. 3-5)

ఇతరుల యన్నమును, ఇతరుల వస్త్రమును ఇతరుల పడకను, ఇతర స్త్రీలను. ఇతరుల యిండ్లలో నివసించుట అను వానిని దూరముగా విడువవలెను. అన్ని ప్రాణులను తన ఆత్మతో సమానముగ తలంప వలెను. వేదము —

యస్తు సర్వాణి భూతాన్యాత్మన్నేవాను పశ్యతి ।
సర్వభూతేషు చాత్మానం తతో న విచికిత్సతి॥ (యజు. 40-6)

విద్వాంసుడైనవాడు విద్య, యోగాభ్యాసము, ధర్మాచరణమునకు తరువాత పరమాత్మయందే సమస్త చరాచరజగత్తును చూచును. సుఖ దుఃఖములు, లాభనష్టములు అనునవి తనకువలెనే యన్ని ప్రాణులకున్న వని తెలిసికొనును, ఈ విధముగా తెలిసికొని సందేహరహితుడగును. దేనిని సేవగించుకొనుటకాని ద్వేషించుటకాని చేయడు.

శ్లో॥ ధర్మే తత్పరతా ముఖే మధురతా దానే సముత్సాహతా
మిత్రేఽవంచకతా గురౌ వినయతా చిత్తేఽతి గంభీరతా।
ఆచారే శుచితా గుణే రసికతా శాస్త్రేషు విజ్ఞానతా
రూపే సుందరతా శివే భజనతా సత్స్వేవసందృశ్యతే॥14

అర్థము :- ధర్మే = ధర్మమునందు, తత్పరతా = ఆసక్తియు, ముఖే = నోటిలో, మధురతా = మధురసంభాషణము, దానే = దానముచేయుట యందు, సముత్సాహతా = మిక్కిలి యుత్సాహము, మిత్రే = స్నేహితుని

యందు, అవంచకతా = మోసములేకుండుట. గురౌ = గురువునందు. వినయతా = నమ్రతయు. చిత్తే = మనస్సునందు, అతిగంభీరతా = మిక్కిలి గాంభీర్యము, ఆచారే = ఆచారమందు. శుచితా = శుచిత్వము, గుణే = గుణమునందు, రసికతా = గుణగ్రహణము, శాస్త్రేషు = శాస్త్రములందు, విజ్ఞానతా = విశేషజ్ఞానము, రూపే = రూపమునందు, సుందరతా = సౌందర్యము, శివే = పరమేశ్వరునియందు, భజనతా = భక్తికలిగియుండుటయు, సత్సుయేవ = సత్పురుషులలోనే, సందృశ్యతే = చూడబడుచున్నది.

తా॥ ధర్మమునందాసక్తియు, నోటితో మధురభాషణము, దానము చేయుటలో మిక్కిలి యుత్సాహము, మిత్రునియందు మోసములేకుండుట, గురువుదగ్గఱ వినమ్రుడైయుండుట, అంతఃకరణములో మిక్కిలి గాంభీర్యము, ఆచారమునందు పవిత్రత, గుణములను గ్రహించుట, శాస్త్రము లందు విశేషజ్ఞానము, రూపమునందు సౌందర్యము, పరమేశ్వరునియందు భక్తియను నవి సజ్జనులయందే కనబడుచున్నవి.

శ్లో॥ కాష్ఠం కల్పతరుః సుమేరురచలశ్చింతామణిః ప్రస్తరః
సూర్యస్తీవ్రకరః శశీక్షయకరః క్షారో హి వారాం
నిధిః ।
కామో నష్టతనుర్బలిర్దితిసుతో నిత్యం పశుః కామగా
నైతాంస్తే తులయామి భో రఘుపతే కస్యోపమా
దీయతే॥ 15

అర్థము :- కల్పతరుః = కల్పవృక్షము, కాష్ఠం = కొయ్య, సుమేరుః = మేరుపర్వతము, అచలః = కదలని కొండ, చింతామణిః = చింతామణి, ప్రస్తరః = ఱాయి, సూర్యః = సూర్యుడు, తీవ్రకరః = తీక్ష్ణకిరణములు గలవాడు, శశీ = చంద్రుడు, క్షయకరః = క్షీణించుకిరణములుగలవాడు,

వారాం నిధిః=సముద్రుడు, హి=నిశ్చయముగా, క్షారః = ఉప్పునివాడు, కామః=మన్మథుడు, నష్టతనుః=శరీరములేనివాడు, బలిః = బలిచక్రవర్తి, దితి సుతః=దైత్యుడు, (రాక్షసుడు) కామగౌః=కామధేనువు, నిత్యం=ఎల్లప్పుడు, పశుః=పశువే, ఏతాన్=వీనిని, తే = నీకు, నతులయామి = పోల్చలేను, భో రఘుపతే=ఓ రఘుపతీ! నీకు, కస్య = ఎవని యొక్క, ఉపమా = పోలిక, దీయతే =ఈయబడవలెను. నీకుపోలిక యేదియులేదని భావము.

తా॥ కల్పవృక్షము కట్టె, మేరుపర్వతము కదలనికొండ, కోర్కెల నిచ్చు చింతామణి రాయి, సూర్యుడు తీవ్రకిరణుడు, చంద్రుడు క్షీణించు వాడు సముద్రము ఉప్పునీది మన్మథుడు శరీరములేనివాడు, బలిరాక్షసుడు, కామధేనువు పశువు, ఓ రఘుమహారాజా! వీనిలో నేవియు నీతో సరి పోల్చుటకు తగవు.

శ్లో॥ వినయం రాజపుత్రేభ్యః పండితేభ్యః సుభాషితమ్ ।
అనృతం ద్యూతకారేభ్యః స్త్రీభ్యః శిక్షేచ్చకైతవమ్॥16

అర్థము :- రాజపుత్రేభ్యః=రాజపుత్రులనుండి, వినయం = వినయము, పండితేభ్యః=పండితులవలన, సుభాషితం = శ్రేష్ఠముగా ప్రియముగా మాట్లాడుటను, ద్యూతకారేభ్యః = జూదగాళ్లనుండి, అనృతం = అబద్ధమాడుటను, స్త్రీభ్యః=స్త్రీలవలన, కైతవం = మోసమును, చ = కూడ, శిక్షేత్ = నేర్చుకొనవలెను.

తా॥ రాజపుత్రులనుండి వినయము, వండితులనుండి సుభాషితము (మంచిమాట) జూదమాడువారినుండి అబద్ధము, స్త్రీలనుండి మోసము చేయు విద్యను నేర్వవలెను.

శ్లో॥ అనాలోక్య వ్యయం కర్తా హ్యనాథః కలహప్రియః ।
ఆతురః సర్వక్షేత్రేషు నరః శీఘ్రం వినశ్యతి॥ 17

అర్థము :- అనాలోక్య=చూడకుండ (అనగా ధనమున్నదో లేదో ఆలోచించకుండ, మంచిచెడ్డ తెలియకుండ) వ్యయం=ఖర్చును కర్తా= చేయువాడు, అనాథః హి=సహాయకులు లేక ఎవ్వరులేకుండనే, కలహ ప్రియః = ఇతరులతో దెబ్బలాడదలచినవాడు, సర్వక్షేత్రేషు = సమస్త వర్ణ స్త్రీలతో సంభోగముచేయుట కొరకు, ఆతురః = ఉత్సాహముతో తొందరపడువాడునైన, నరః = మనుష్యుడు, శీఘ్రం = తొందరగానే. వినశ్యతి=నశింపగలడు.

తా:- ఆలోచన లేకుండ అడ్డగోలుగా ధనము వ్యయముచేయు వాడు, ఎవ్వరు సహాయములేనివాడు, కలహించుట యందాసక్తి కలవాడు, మంచిచెడ్డ గుర్తింపక సర్వవర్ణముల స్త్రీలతో సంభోగము చేయగోరువాడు నైన పురుషుడు శీఘ్రముగా నశించును.

వివరణము :- ఆదాయవ్యయములు తెలిసికొనకుండ వ్యర్థముగా ఖర్చుచేయువాడు దుర్దశపాలౌను. అన్నివర్ణముల స్త్రీలతో సంభోగము చేయ గోరువాడు నాశనమగుటకు కారణము—

పరదారా న గంతవ్యాః సర్వవర్ణేషు కర్హిచిత్ ।
నహీదృశమనాయుష్యం త్రిషులోకేషు విద్యతే ॥

ఎవ్వడును ఏ వర్ణమునకు చెందినవాడైనను పరస్త్రీలతో సంభోగము చేయరాదు. ముల్లోకములలో పరస్త్రీలతో చేయు సంభోగముకంటె మించినట్టి ఆయుస్సును క్షీణింపజేయు దోషము మరొకటిలేదు. వాల్మీకి మనుష్యుని నశింపజేయునట్టి మూడు దోషములను చెప్పియున్నాడు. అందులో నొకటి పరస్త్రీ సంభోగము చేయుట—

పరస్వానాం చ హరణం పరదారాభిమర్శనమ్ ।
సుహృదామతి శంకా చ త్రయో దోషాః క్షయావహాః ॥

(రామా. యుద్ధ 87-23)

ఇతరుల ధనము కాజేయుటయు, పరస్త్రీలతో సంబంధము (వ్యభిచరించుట), తన మేలుకోరు స్నేహితుని విశ్వసింపకుండుట యను మూడు దోషములు వినాశకారులు

శ్లో॥ నాహారం చింతయేత్ ప్రాజ్ఞో ధర్మమేకం హి చింతయేత్ ।

ఆహారో హి మనుష్యాణాం జన్మనా సహ జాయతే॥18

అర్థము:- ప్రాజ్ఞః = బుద్ధిమంతుడు, ఆహారం = ఆహార విషయములో, న చింతయేత్ = ఆలోచింపరాదు, ఏకం = ఒక్కటైన, ధర్మం హి = ధర్మము గూర్చి మాత్రమే, చింతయేత్ = ఆలోచింపవలెను, హి = ఎందువల్లననగా, మనుష్యాణాం = మనుష్యులకు, ఆహారః = ఆహారము, జన్మనా సహ = పుట్టుకలతో కూడ జాయతే = కలుగుచున్నది.

తా॥ బుద్ధిమంతుడు భోజనము విషయములో చింతింపవలసిన పని లేదు. ధర్మమును గూర్చియే ఆలోచింపవలెను. మనుష్యుల కాహారము పుట్టుకతోబాటే యుత్పన్నమైయున్నది.

వివరణము :- మనుష్యుడు ఆహారమును గూర్చి ఆలోచింపవక్కఱలేదు. ఎందుచేతననగా పరమాత్మ ప్రతిజ్ఞమాడుచు —

అహం దాశేషు విభజామి భోజనమ్ । (ఋ. 10-48-1)

ఆత్మసమర్పణ చేయువారికి నేను భోజన మిచ్చుచున్నాను. మఱియు—

ఈశావాస్య మిదం సర్వమ్ । (యజు. 40-1)

ఈ చరాచర జగత్తునకు పరమాత్మయే స్థానము ధరించుచున్నాడు. ఓ భక్తుడా! నీవు ఆయనపై విశ్వాసముంచుము. ఆయనయే యీ బ్రహ్మాండమును ధరించియున్నాడు. అట్టి పరమాత్మ నిన్ను ధరింపడా? వినుము—

దంతములు లేని పిల్లలకు పాలు ఇచ్చెను. దంతములున్నవారికి అన్నమీయడా? జీవులకు నీటితో స్థలముపై నివసించు క్షేమము చేయువాడు నీ క్షేమము కోరడా? మనుష్యుడు ధర్మమును గూర్చియే ఆలోచింపవలెను—

సుఖార్థాః సర్వభూతానాం మతాః సర్వాః ప్రవృత్తయః ।
సుఖంచ న వినా ధర్మాత్తస్మాద్ధర్మపరో భవేత్॥ (శుక్రనీతి 3-1)

సర్వప్రాణులు చేయు పనులు అన్నియు తమ సుఖముకొఱకే చేయబడుచున్నవి. ధర్మములేకుండ సుఖముకలుగదు. కావున మనుష్యుడు ధర్మపరాయణుడు కావలయును.

శ్లో॥ జలబిందు నిపాతేన క్రమశః పూర్యతే ఘటః ।
స హేతుః సర్వవిద్యానాం ధర్మస్య చ ధనస్య చ॥ 19

అర్థము :- క్రమశః=క్రమముగా, జలబిందునిపాతేన=నీటిచుక్కలు పడుచుండుటచే, ఘటః=కుండ, పూర్యతే = నిండింపబడును, సర్వవిద్యానాం=విద్యలన్నింటికి, ధర్మస్య = ధర్మమునకు, ధనస్య చ=ధనమునకు కూడ సః=అదియే (మెల్లమెల్లగా, కొంచెము కొంచెము కూడ బెట్టుటయే) హేతుః = =కారణము.

తా॥ ఒక్కొక్క నీటిబిందువు పడుటచే క్రమముగా కుండ నిండును. అట్లే మెల్లమెల్లగా కొంచెము కొంచెము కూడబెట్టుటచే విద్యయు, ధర్మము, ధనము పూర్తిగా చేకూరును.

వివరణము :- మెల్లమెల్లగా అభ్యసించుటచే సమస్తము చేకూరును.

శనై రర్థాః శనైః పన్థాః శనైః పర్వత మారుహేత్ ।
శనైర్విద్యా చ ధర్మశ్చ వ్యాయామశ్చ శనైః శనైః॥
(వృద్ధ చాణక్య 6-14)

ధనసంపాదనము, మార్గమున నడచుటయు, పర్వతమెక్కుటయు, విద్యను, ధర్మమును సంపాదించుటయు, వ్యాయామము నెమ్మది నెమ్మదిగా చేయవలెను.

క్షణశః కణశశ్చైవ విద్యామర్థంచ సాధయేత్ ।
న త్యాజ్యౌ తు క్షణకణౌ నిత్యం విద్యాధనార్థినా॥(శుక్ర. 3-176)

విద్య నభ్యసింపదలచినవారు ప్రతిక్షణమును, ధనము సంపాదింప దలచినవారు ప్రతి చిన్న ధనభాగమును (పైస) విడిచిపెట్టరాదు. విద్యార్థి ఒక్కక్షణమైనను; ధనార్థి ఒక్కపైసనైనను కొంచెమేకదా యని విడువక శ్రద్ధతీసికొనవలెను.

శ్లో॥ వయసః పరిణామేఽపి యః ఖలః ఖల ఏవ సః ।
సుపక్వమపి మాధుర్యం నోపయాతీన్ద్రవారుణమ్॥ 20

అర్థము :- వయసః=వయసుయొక్క, పరిణామేఽపి=పరిణామమందును (వయసు మీరినను) యః=ఎవడు, ఖలః=దుష్టుడో, సః = వాడు, ఖలఏవ=నిశ్చయముగా దుష్టుడే, సుపక్వమపి = బాగుగా పండినదైనను, ఇంద్రవారుణం=పిచ్చిపుచ్చకాయ. మాధుర్యం = తీపిని, నోపయాతి=పొందదు.

తా॥ వయసు మీరినను దుష్టుడు దుష్టుడేయగును. ఎట్లనగా పిచ్చిపుచ్చకాయ యెంతపండినను చేదుగానే యుండునుగాని తియ్యగానుండదు గదా!

వివరణము :- స్వభావమును మార్చుట మిక్కిలి కష్టము—

యః స్వభావో హి యస్యాస్తి స నిత్యం దురతిక్రమః ।
శ్వా యది క్రియతే రాజా స కిం నాశ్నాత్యుపానహమ్॥
(హితో. 3-6)

చేని దేది స్వభావమో యది యెల్లప్పుడు నుండును. విడిచిపోదు. కుక్కను రాజుగా చేసి సింహాసనముపై కూర్చుండబెట్టినను చెప్పు తిను స్వభావమును విడువదు గదా !

నాలికా గతమపి కుటిలం న భవతి సరలం శునః పుచ్ఛమ్॥
తద్వత్ ఖలజన హృదయం బోధితమపి నైవ యాతి మాధుర్యమ్॥

కుక్కతోక తిన్నగానుండవలెనని వెదురుబద్దలువేసి కట్టినను ఆ బద్దలు విప్పగానే తిరిగి తోకవంకరగానేయుండును. అట్లే దుర్మార్గున కెంత బోధించినను దౌష్ట్యము పోయి సౌజన్యము రాదు.

పండ్రెండవ యధ్యాయము సమాప్తము

## త్రయోదశాధ్యాయము

శ్లో॥ ముహూర్తమపి జీవేత నరః శుక్లేన కర్మణా।
న కల్పమపి కష్టేన లోకద్వయ విరోధినా॥ 1

అర్థము :- శుక్లేన=శ్రేష్ఠమైన, కర్మణా = కర్మతో, నరః = మనుష్యుడు ముహూర్తమపి=ఒక ముహూర్తకాలము జీవేత = జీవించినను సత్తమమే, కష్టేన=దుష్టము, అశుభము, పాపకర్మలు చేయుచున్న, లోకద్వయ విరోధినా = ఇహలోక పరలోకములకు విరోధియగువాడు, కల్పమపి=ఒక కల్పకాలము జీవించినను. న=ఉత్తమము కాదు.

తా॥ మనుష్యుడు పుణ్యకర్మలు చేయుచు ముహూర్తము (48 నిముషములు) జీవించినను శ్రేష్ఠమే యగును. ఈ లోకమునకు పరలోకమునకు (లోకద్వయము) పాపకర్మలు చేయుచు విరోధియైనవాడు ఒక కల్పకాలము (కొన్నియుగములు) జీవించుట వ్యర్థము.

వివరణము :- శ్రేష్ఠకర్మచేయుచు కొలదికాలము జీవించినను ఉత్తమేయగును—

ముహూర్తం జ్వలితం శ్రేయో న చ ధూమాయితం చిరమ్ ।
(భార. ఉద్యో. 133-15)

అగ్ని యొక ముహూర్త సమయము మండినను శ్రేష్ఠముకాని పొగను వ్యాపింపజేయు నట్టిది యెక్కువకాలమున్నను ప్రయోజనము లేదు.

దానే తపసి సత్యే చ యస్య నోచ్చరితం యశః!
విద్యాయాం అర్థలాభే వా మాతురుచ్చార ఏవ సః॥
(భార. ఉద్యో. 133-23)

దానము, తపస్సు, సత్యభాషణము, విద్య, ధనోపార్జనము మొదలగు వాని విషయములో నెవని కీర్తి యంతటను గానము చేయబడదో వాడు తన తల్లికి పుత్రుడు కాడు. మలమూత్రముల వంటివాడే యగును.

యజ్జీవ్యతే క్షణమపి ప్రథితం మనుష్యైర్
విజ్ఞాన విక్రమ యశోభిరభగ్నమానమ్ ।
తన్నామ జీవితమిహ ప్రవదన్తి సన్తః
కాకోఽపి జీవతి చిరాయ బలిం చ భుంక్తే॥
(చాణక్య రాజనీతి 8-34)

ఎవడు విజ్ఞానము, పరాక్రమము, కీర్తితో యుక్తుడగునో యట్టి వాడు లోకములో ప్రసిద్ధుడగును. అట్టివాడు ఒక్కక్షణము జీవించినను ఆతనిని సజ్జనులు కొనియాడుదురు. అటులకాక యెంగిలి మెతుకులు తినుచు బ్రతుకునట్టి కాకివలె బహుకాలము బ్రతికినవాని నెవరు తలంతురు.

శ్లో॥ గతే శోకో న కర్తవ్యో భవిష్యం నైవ చింతయేత్ ।
వర్తమానేన కాలేన ప్రవర్తన్తే విచక్షణాః॥ 2

అర్థము :- గతే=కడచిపోయినదానిగూర్చి, శోకః = శోకము, న కర్తవ్యః = చేయరాదు, భవిష్యం = జరుగబోవు దానినిగూర్చి, నైవ చింతయేత్=చింతింపనే కూడదు, విచక్షణాః=బుద్ధిమంతులు, వర్తమానేన= జరుగుచున్న, కాలేన = కాలానుసారముగ, ప్రవర్తన్తే = పనియందు ప్రవర్తించుచున్నారు.

తా॥ గడచిన దానికి వగవదనిలేదు. భవిష్యత్తును గూర్చియు నాలోచింపబనిలేదు. బుద్ధిమంతులు వర్తమానకాలము ననుసరించియే ప్రవర్తింతురు. భూతభవిష్యత్తుల నాలోచింపరు.

వివరణము :- గడచిపోయిన దానిగూర్చి చింతింపిన ప్రయోజనము లేదు—

శోకో నాశయతే ధైర్యం శోకో నాశయతే శ్రుతమ్ ।
శోకో నాశయతే సర్వం నాస్తి శోక సమో రిపుః॥
(రామా. అయో 62-15)

శోకము ధైర్యమును, శాస్త్రజ్ఞానమును, సర్వమును నష్టపరచును. శోకముతో సమానమైన శత్రువు మఱొకటిలేదు. లాంగ్ ఫెలో ఏమను చున్నాడో చూడుడు

భవిష్యత్తు ఎంతసుందరమైనదైనను దానియందు విశ్వాసముంచ కూడదు. జరిగిపోయిన దానిని గూర్చి ఆలోచింపరాదు. ఏది చేయవలెనో దానినిగూర్చి తనయందు పరమాత్మయందు విశ్వాసముంచి వర్తమాన కాలములో చేయుము.

శ్లో॥ స్వభావేన హి తుష్యన్తి దేవాః సత్పురుషాః పితా ।
జ్ఞాతయః స్వన్నపానాభ్యాం వాక్యదానేన పండితాః॥ 3

అర్థము :- దేవాః = విద్వాంసులు, సత్పురుషాః = శ్రేష్ఠపురుషులు. పితా = తండ్రి పినతండ్రులు, స్వభావేన హి = స్వభావముచేతనే, స్వతస్సిద్ధము గానే, సహజముగానే తుష్యన్తి = సంతోషింతురు, జ్ఞాతయః = బంధువాంధవులు, స్వన్నపానాభ్యాం = మంచి అన్నపానాదులతోను, అన్నే, పండితాః = పండితులు, వాక్యప్రదానేన = మధురభాషణముతో ప్రసన్నలగుదురు.

తా॥ విద్వాంసులు, సత్పురుషులు, తండ్రి పినతండ్రులు స్వభావము చేతనే సహజముగానే సంతుష్టులగుదురు. జ్ఞాతులు మంచి అన్నపానాదులతోను, పండితులు మధురభాషణముతోను ప్రసన్నులగుదురు.

శ్లో॥ అహోబత విచిత్రాణి చరితాని మహాఽఽత్మనామ్ ।
లక్ష్మీం తృణాయ మన్యన్తే తద్భారేణ నమన్తి చ॥ 4

అర్థము :- అహోబత ! = ఆశ్చర్యముగదా. మహాఽఽత్మనాం = గొప్పవారియొక్క, చరితాని = చరిత్రలు, విచిత్రాణి = విచిత్రములుగా నుండును, వారు, లక్ష్మీం = సంపత్తిని, తృణాయ = గడ్డిపరకవలె, మన్యన్తే = తలంచుచున్నారు, చ = మఱియు, తత్ = ఆ ధనము యొక్క, భారేణ = భారముతో, నమన్తి = వంగుచున్నారు. అనగా ధనవంతుల మని విఱ్ఱవీగక వినమ్రులగుచున్నారు.

తా॥ మహాత్ములయొక్క చరిత్రలు విచిత్రముగానుండును. వారు ధనసంపత్తిని గడ్డిపరకగా చూచుదురు. అటులకాక ధనమున్నచో దాని భారముచేత (అధిక ధనవంతులైనచో) విఱ్ఱవీగక వినమ్రులై యుందురు.

వివరణము :- నిజముగా మహాపురుషుల చరిత్ర విచిత్రముగా నుండును—

వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి ।
లోకోత్తరాణాం చేతాంసి కో ను విజ్ఞాతు మర్హతి॥
(ఉత్తర రామ చరిత 2-7)

మహాపురుషుల హృదయములు వజ్రముకంటె కఠినముగాను. పూలకంటె మృదువుగా నుండును. అట్టి గొప్పవారి మనోభావముల నెఱుంగుటకు నెవడు సమర్థుడగును?

మఱొకటి చూడుడు—

సంపత్సు మహతాం చిత్తం భవత్యుత్పల కోమలమ్ ।
ఆపత్సు చ మహాశైల శిలా సంఘాత కర్కశమ్॥

మహాపురుషుల చిత్తము సంపదలు కలిగియున్నపుడు గర్వముతో కఠినముగా నుండక నల్లకలువవలె మృదువుగానుండును. ఆపదలు సంభవించినపుడు గొప్ప పర్వతములందలి ఱాళ్లవలె కఠినముగా నుండును. వెంచేలుపడడు.

విత్తే త్యాగః క్షమా శక్తే దుఃఖే దైన్య విహీనతా ।
నిర్దమ్భతా సదాచారే స్వభావోఽయం మహాత్మనామ్॥

ధనమున్నపుడు దానముచేయుట, శక్తియున్నపుడు ఓర్పు కలిగియుండుట, దుఃఖము సంభవించినను దైన్యము పొందకుండుట, సదాచారియైనను డాంభికముగా నుండకుండుట యనునవి మహాత్ములకు సహజములు.

శ్లో॥ యస్య స్నేహో భయం తస్య స్నేహో దుఃఖస్య
భాజనమ్ ।
స్నేహ మూలాని దుఃఖాని తాని త్యక్త్వా వసేత్సుఖమ్॥5

అర్థము :- యస్య = ఎవనికి నెవనితో, స్నేహః = స్నేహమున్నదో, తస్య=అతని కాతనితోనే, భయం = భయముకూడ నున్నది, స్నేహః=స్నేహము, ప్రీతి, దుఃఖస్య=దుఃఖమునకు, భాజనం = ఆధారము, దుఃఖాని=దుఃఖములు, స్నేహమూలాని=స్నేహమే మూలముగా గలవి, తాని=ఆ స్నేహబంధములను, త్యక్త్వా=విడిచి, సుఖం = సుఖముగా, వసేత్=ఉండవలెను.

తా॥ ఎవని విషయములో ప్రేమయుండునో యతని వలననే భయముండును. ప్రీతి దుఃఖమునకు ఆధారము. స్నేహమే (ప్రీతియే) అన్ని దుఃఖములకు కారణము. అట్టి స్నేహబంధమును విడిచినచో సుఖముగా జీవింపవచ్చును.

వివరణము :- స్నేహము దుఃఖముల కన్నింటికి మూలము. స్నేహము (నూనె)తో దీపము వత్తి వెలుగును. స్నేహ (నూనె) మూలముగా నువ్వులను గానుగలోవేసి త్రిప్పుదురు. అట్లే స్నేహమూలముగా మనుజుడు సంసారచక్రములోపడి నలిగిపోవుచున్నాడు.

స్నేహేన తిలవత్సర్వం సర్గచక్రే నిపీడ్యతే ।
తిలపీడైరివాక్రమ్య క్లేశై రజ్ఞాన సంభవైః॥
(భార. శాంతి. 174-24)

నూనె వ్యాపారము చేయువారు (తెలకవారు) నూనె కొఱకు నువ్వులు గానుగలోవేసి యెట్లు నలగగొట్టుదురో యట్లే స్నేహకారణముగా ప్రజలు అజ్ఞానమువలన కలిగిన క్లేశముద్వారా సృష్టి చక్రములో పడి నలిగిపోవుదురు.

శ్లో॥ అనాగత విధాతా చ ప్రత్యుత్పన్నమతి స్తథా ।
ద్వావేతౌ సుఖమేధేతే యద్భవిష్యో వినశ్యతి॥ 6

అర్థము :- అనాగత విధాతా = రాబోవు దుఃఖమునకు ప్రతీకార మును ముందే ఆలోచించువాడు. చ = మఱియు. తథా = అట్లే. ప్రత్యుత్పన్నమతిః = ఆపద సంభవించినప్పుడు వెంటనే దానిని పోగొట్టుకొనుట కుపాయమాలోచించు వాడును. ఏతౌ ద్వౌ = ఈ యిద్దఱును సుఖం = సుఖమును. ఏధేతే = వృద్ధిచేసికొందురు. తథా = అట్లే. యద్భవిష్యః = నా భాగ్యములో నెట్లు కానున్నదో యట్లే జరుగు ననుకొనువాడు, వినశ్యతి = నశనము పొందును.

తా॥ రాబోవు ఆపదను గుర్తించి ప్రతీకారమునకు ముందే యుపాయము నాలోచించువాడును, ఆపద సంభవింపగానే దానిని తప్పించుకొనుటకు ఉపాయము నాలోచించువాడు నీ యిద్దఱు సుఖమును పొందుదురు. ఆవిధముగా ఆలోచింపక ప్రయత్నింపక యేది యెట్లు జరుగునో యది యట్లే జరుగునులే యని పురుషప్రయత్నముచేయక దైవముపై భారమువేయువాడు మూడు చేపల కథలోని 'యద్భవిష్య' అను చేపవలె నశించును. దీనివలన మనుష్యుడు మోహవశమున లోకానుభవము లేక ప్రయత్నముచేయక యేదికావలెనో యది జరుగునులే యని గోళ్లుగిల్లుకొను వాడు ఆపదలపాలౌ నను నీతి వెల్లడియగును.

శ్లో॥ రాజ్ఞి ధర్మిణి ధర్మిష్ఠాః పాపే పాపాః సమే సమాః।
రాజాన మనువర్తన్తే యథా రాజా తథా ప్రజాః॥ 7

అర్థము -: రాజ్ఞి = రాజు, ధర్మిణి = ధర్మాత్ముడైనచో. ధర్మిష్ఠాః = ధర్మాత్ములుగాను, పాపే = పాపియైనచో. పాపాః = పాపులుగాను, సమే = ఉదాసీనుడుగానున్నచో, సమాః = ఉదాసీనులుగాను, రాజానం = రాజును, అనువర్తన్తే = అనుసరించియుందురు, రాజా = రాజు, యథా = ఎట్లో, ప్రజాః = ప్రజలు, తథా = అట్లే యుందురు.

తా॥ రాజు ధర్మాత్ముడైన ప్రజలు ధర్మాత్ములు, రాజు పాపియైన ప్రజలు పాపులు, రాజు ఉదాసీనుడైనచో ప్రజలు ఉదాసీనులు నగుదురు. రాజెట్లో ప్రజలు నట్లే యుందురు.

వివరణము :- రాజు దుర్బలుడు, శాసించుట కసమర్థుడు, పాపాచారుడు, భ్రష్టాచారము కలవాడు నైనచో, శాసించు నధికారగణము ప్రజలను దోచుకొనుట కవకాశము లభించును—

రాజా రాక్షసరూపేణ వ్యాఘ్రరూపేణ మంత్రిణః ।
సేవకాః శ్వానరూపేణ యథా రాజా తథా ప్రజాః॥

రాజు రాక్షసుడుగా నున్నచో మంత్రులు పెద్దపులులుగా నుందురు. సేవకులు కుక్కలవలె తయారగుదురు. రాజెట్లుండునో ప్రజలు నట్లే యుందురు. దీనికి వ్యతిరేకముగా శాసకుడు బలవంతుడు పాలించుటలో సమర్థుడు ధార్మికుడునైనచో క్రిందివారు కూడ తమ పనులు బాగుగా నిర్వహింతురు.

శ్రీకృష్ణుడు గీతలో చెప్పినదేమనగా—

యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః ।
స యత్ ప్రమాణం కురుతే లోక స్తదను వర్తతే॥ (గీత. 3-21)

శ్రేష్ఠ పురుషు డెట్లు ఆచరించునో సాధారణ మనుష్యులు కూడ నట్లే వ్యవహరింతురు. మహాపురుషులు ఏమాటను ప్రమాణముగా నంగీకరింతురో దానినే తక్కినవారనుకరింతురు.

మహాభారతములో—

రాజమూలా మహాబాహో యోగక్షేమ సువృష్టయః ।
ప్రజాసు వ్యాధయశ్చైవ మరణం చ భయానిచ॥

(భార. శాంతి. 141-9)

ఓ మహాబాహూ! ప్రజలయొక్క యోగక్షేమములు (పొందని దానిని పొందుటయు, పొందిన దానిని రక్షించుటయు), పృథివిపై సువృష్టి (అవశ్యకమైనప్పుడు వర్షించుట), వ్యాధి, మృత్యువు, భయము మొదలగు వాని కన్నిటికి రాజే మూలకారణము.

రాజదోషై ర్విపద్యన్తే ప్రజా హ్యవిధి పాలితాః ।
అసద్వృత్తే హి నృపతావకాలే మ్రియతే జనాః॥

(రామా. ఉత్తర. 73-16)

రాజుయొక్క దోషము వలన ప్రజాపరిపాలన శాస్త్రప్రకారము సరిగా నుండ నపుడు ప్రజలు ఆపదల పాలౌదురు. రాజు దురాచార పరుడై నందువలననే ప్రజల కకాలమృత్యువు సంభవించును-ఆత్రేయుడు అగ్నివేశునితో చెప్పెను—

యదా వై దేశనగర నిగమ జనపద ప్రధానా ధర్మ ముత్క్రమ్యా ధర్మేణ ప్రజాం వర్తయన్తి తదా శ్రితోపాశ్రితాః పౌరజన పదా వ్యవహా రోప జీవినశ్చ తమధర్మ మభివర్ధయన్తి॥ (చరక. విమాన 3-20)

దేశము, నగరము, నిగమము (కార్పొరేషన్) జనపదము (జిల్లా) లలోని ప్రధానులు ధర్మముల విడిచి అధర్మముగా ప్రజలతో వ్యవహరించి నచో ఆ అధ్యక్షు నాశ్రయించిన ఉపాశ్రయించినట్టి కర్మచారుల (పని నిర్వహించు ఉద్యోగులు) నౌకరులు, నగరములలోని గ్రామములలోని ప్రజలు అదే విధముగా వ్యాపారమును అధర్మమును నధికముగా వృద్ధి చేయుదురు.

శ్లో॥ జీవన్తం మృతవన్మన్యే దేహినం ధర్మవర్జితమ్ ।
మృతో ధర్మేణ సంయుక్తో దీర్ఘజీవీ న సంశయః॥ 8

అర్థము :- ధర్మవర్జితం=ధర్మహీనుడైన, దేహినం = శరీరధారి యైన మనుష్యుని, జీవన్తం=జీవించుచున్నను (నేను చాణక్యుడు) మృతవత్=చచ్చినవానితో సమానునిగ, మన్యే=తలంచుచున్నాను ధర్మేణ= ధర్మముతో, సంయుక్తః=కూడుకొన్నవాడు, మృతః=చచ్చిపోయినను, దీర్ఘజీవీ=దీర్ఘజీవియే, న సంశయః=సంశయములేదు, కారణము అతని కీర్తి యెల్లప్పుడు అమరముగా నుండును.

తా॥ ధర్మవిహీనముగా దేహధారియైన మనుష్యుడు జీవించుచున్నను నేను (చాణక్యుడు) అధర్మహీనుని చచ్చినవానితో సమానునిగా తలంతును. ధర్మయుక్తుడైనవాడు చనిపోయినను దీర్ఘజీవియే యగును. సంశయములేదు.

వివరణము :- ధార్మికుడవు కమ్ము. అగ్ని ధర్మము - కాల్చుట, ఉష్ణము, అగ్నిలో ఈ గుణములు లేకపోయినచో ఆ అగ్నియే యుండదు. దాని నప్పుడు బూడిదగాతీసి పెంటకుప్పపై (ఎరువు దిబ్బ) పోయుదురు. అదే విధముగా మనుష్యునిలో నుండ వలసిన మానవత్వము మొదలగు ధర్మములు లేకున్నచో వాడు చచ్చినవానితో సమానుడే —

మనుర్భవ - ఓ మానవా! మనుష్యుడవు కమ్ము.

(ఋ. 10-53-6)

అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః ।
నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యో ధర్మ సంగ్రహః

శరీరములు నశించును. ధన సంపద శాశ్వతము కాదు. నిత్యమైన మృత్యువు దగ్గఱలోనున్నది. కావున ధర్మసంగ్రహము చేయవలెను.

ధర్మో మాతా పితా చైవ ధర్మో బంధుః సుహృత్తథా ।
ధర్మః స్వర్గస్య సోపానం ధర్మాత్ స్వర్గమవాప్యతే॥

ధర్మమే తల్లి, తండ్రి, బంధువు, స్నేహితుడు, స్వర్గమునకు మెట్టు, ధర్మము వలననే స్వర్గము లభించును.

శ్లో॥ ధర్మార్థ కామమోక్షాణాం యస్యైకోఽపి న విద్యతే।
అజాగల స్తనస్యేవ తస్య జన్మ నిరర్థకమ్॥ 9

అర్థము :- ధర్మార్థ కామమోక్షాణాం = ధర్మార్థ కామమోక్షములలో, యస్య = ఎవనికి, ఏకోఽపి = ఒక్కటికూడ, న విద్యతే = ఉండదో, తస్య = అట్టివానియొక్క, జన్మ = జన్మ, అజాగల స్తనవత్ = మేక మెడ క్రింద వ్రేలాడు స్తనములవలె, నిరర్థకమ్ = వ్యర్థము. (వానినుండి ఒక్క చుక్క కూడ పాలురావు)

తా॥ ధర్మార్థ కామమోక్షములను నల్గింటిలో నొక్కటైనను లేని వాడు మేకమెడక్రింద వ్రేలాడు స్తనములవలె వ్యర్థమైన జన్మకలవాడగును.

వివరణము :- ధర్మార్థ కామమోక్షములు అనునవి చతుర్విధ పురుషార్థములు. మనుష్యుడు ధర్మపూర్వకముగ సంపాదించి ఆ పవిత్ర ధనముతో ధర్మబద్ధముగా కోర్కెలు తీర్చుకొనవలెను. ఈవిధముగా గృహస్థధర్మము పాలించుచు చివరకు జీవితమునకు పరమలక్ష్యమైన మోక్షమును కోరదలచవలెను. మనుష్యుడీ నాలుగు పురుషార్థముల సాధించుటకు ప్రయత్నము చేయుచు నాలుగు లేక మూడు లేక రెండు చివర కొక్క పురుషార్థమైనను పొందవలెను.

ధార్మికుడవై ధర్మము నాచరింపుము. బాలకుడైన హకీకతరాయ్‌వలె ధర్మము కొఱకు తను, మన, ధనముల నర్పింపవలెను. ధార్మికుడు కావలె నన్నచో అర్థమును సంపాదించి కుబేరుడ వగుము. ఆవశ్యకమైనపుడు భామాశాహ్‌వలె తన సంపూర్ణ ధనమును, ధర్మమును జాతిని, సంస్కృతిని

సభ్యతను రక్షించుటకు ఖర్చుపెట్టుము, లేనిచో నీ కిష్టమైన కోర్కెల ననుభవింపుము. ఆదర్శ గృహస్థుడవగుము, సమాజమునకు నీకు ప్రతినిధిగా మంచి నాగరికుడగు ఉత్తమ సంతాన మర్పింపుము. ఈ మూటిలోనే పురుషార్థమును సాధింపలేకున్న మోక్షప్రాప్తికొఱకు ప్రబలముగా పురుషార్థము చేయుము, ఈ జన్మములోనే మోక్షప్రాప్తి కొఱకు దగిన ప్రయత్నము చేయుము. మనుష్యు డీ జన్మలోనే యీ నాల్గింటిలో నొక్క దానినైనను సాధింపలేకున్నచో వాని జన్మము వ్యర్థము.

శ్లో॥ దహ్యమానాః సుతీవ్రేణ నీచాః పరయశోఽగ్నినా।
అశక్తా స్తత్పదం గన్తుం తతో నిందాం ప్రకుర్వతే॥ 10

అర్థము :- నీచాః = నీచులు, పరయశః = ఇతరుల కీర్తియను, సుతీవ్రేణ=మిక్కిలి తీవ్రమగు, అగ్నినా = అగ్నితో, దహ్యమానాః = కాల్చబడుచున్నవారై, తత్పదం=అట్టి స్థానమును, గంతుం = చేరుటకు, పొందుటకు, అశక్తాః=శక్తిలేనివారై, తతః=తరువాత, నిందాం=నిందించుటను, ప్రకుర్వతే=ప్రారంభించి చేయుదురు.

తా॥ నీచులు ఇతరుల యశస్సును జూచి తీవ్రాగ్నిచే కాల్చబడినవారై ఓర్వలేక యితరులకున్న యున్నతిని పొందదలచి మిక్కిలి ప్రయత్నించి పొందుట కశక్తులై యా గుణవంతుని నిందించుటకు ప్రారంభింతురు.

వివరణము :- నీచులన నెవరు? భవిష్యపురాణములో జెప్పబడిన నీచలక్షణము—

వదత్యన్య త్కరోత్యన్యత్ గురుదేవాగ్రతో యతః।
స నీచ ఇతి విజ్ఞేయో హ్యనాచార స్తథా పరః॥

(భవిష్యః. మధ్యమ. ప్రథమ భాగ 5-68)

గురువు, తల్లి, తండ్రి, ఆచార్యుడు, మరియు విద్వాంసుల యెదుట నొకటి చెప్పి మరొకటి చేయుట మరాపాప పడదగు వానిని నీచునిగా తెలిసికొనవలెను.

నిందయననేమి ? మహార్షి దయానంద సరస్వతి నిందాస్తుతుల నిర్వ చించిన విధము - గుణేషు దోషారోపణ మసూయా అథవా దోషేషు గుణారోపణ యసూయా - తథా గుణేషు గుణారోపణం, దోషేషు దోషారోపణం చ స్తుతిః - అనగా గుణములను దోషములనుటయు, దోషము లను గుణములనుటయు నిందయనియు; గుణములను గుణములనుటయు, దోషములను దోషములనుటయు స్తుతి యనెను. అనగా మిధ్యాభాషణము నిందయు, సత్యభాషణము స్తుతియునగును. (సత్యార్థ చతుర్దసము) నీచులు వృద్ధి చెందుచున్న ఇతరుల కీర్తిని జూచి సహింపలేక యిష్టము వచ్చిన దోషము నారోపింతురు.

శ్లో॥ బంధాయ విషయాఽఽసక్తం ముక్త్యై నిర్విషయం మనః।
మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః॥11

అర్థము :- మనుష్యాణాం=మనుష్యులకు, మనఃఏవ = మనస్సే, బంధమోక్షయోః=బంధనమునకు మోక్షమునకు, కారణం = కారణము, విషయాసక్తం = రూప, రస, గంధాది విషయములందు ఆసక్తమైన, మనః=మనస్సు, బంధాయ=బంధనము కొఱకును, నిర్విషయం=విషయా సక్తముకాని, మనః=మనస్సు, ముక్త్యై=ముక్తి కొఱకు హేతువగును.

తా॥ మనుష్యులయొక్క బంధనమునకుగాని, మోక్షమునకుగాని మనస్సే కారణము. రూప, రస, గంధాది విషయములందు తగుల్కొనిన మనస్సు మనుష్యుని బంధనమునకు కారణము. అట్లే విషయరహితమైన మనస్సు మోక్షప్రాప్తికి కారణమగును.

వివరణము :- మనస్సే బంధనమునకు మోక్షమునకు కారణమై యున్నది. కావున మనస్సును జయించుటకు ప్రయత్నింపవలెను.

హస్తం హస్తేన సంపీడ్య దన్తైర్దన్తాన్ విచూర్ణ్యచ ।
అంగాన్యంగైః సమాక్రమ్య జయేదాదౌ స్వకం మనః॥

(ముక్తికోపనిషత్ 2-42)

హస్తమును హస్తముతో మెలిపెట్టియు, దన్తములను దన్తములతో పటపట కొఱికియు. అంగములను అంగములతో నాక్రమించి తన మనస్సును మొదట జయింపవలెను. మనస్సు నెట్లు వశముచేసికొనవలయునో ముక్తికోపనిషత్తులో —

అధ్యాత్మ విద్యాధిగమః సాధు సంగతి రేవ చ ।
వాసనా సంగపరిత్యాగః ప్రాణస్పంద నిరోధనమ్
ఏతాస్తు యుక్తయః పుష్టాః సన్తి చిత్తజయే కిల॥

(ముక్తికోప. 2-44, 45)

అధ్యాత్మిక విద్యాభ్యాసము, శ్రేష్ఠపురుషుల కలయిక, విషయము లందాసక్తి విడుచుట, ప్రాణాయామము ఈ నాలుగుయుక్తులు మనస్సును జయించుటకు సమర్థములైనవి.

సంసారమనెడు బావినుండి బయటపడుటకు మనస్సును మేల్కొల్పుడు—

పతితః పశురపి కూపే నిః సర్తుం చరణచాలనం కురుతే ।
ధిక్ త్వాం చిత్త భవాబ్ధే రిచ్ఛామపి నో బిభర్షి నిః సర్తుమ్॥

బావిలోపడిన పశువైనను దానినుండి బయటపడుటకు కాళ్లాడించుచు ప్రయత్నించును. కాని ఓ చిత్తమా! నీకు ధిక్కారము. నీవు భవసాగరము నుండి బయటపడుటకు ఇచ్ఛయు చూపుటలేదు.

మనః కుత్రోద్యోగః సపది వద మే గమ్యపదవీం
నరే వా నార్యాం వా గమన మభియత్రా వ్యవసితమ్ ।
యత స్తే క్లీబత్వం ప్రతిపద మహో హాస్యపదవీం
జనస్తోమే మాగా స్త్వమనుసర హే బ్రహ్మపదవీమ్॥

ఓ మనస్సా! ఎక్కడకు వెళ్లుటకు సిద్ధపడుచున్నావు? కొంచెము చెప్పుము ఎక్కడకు వెళ్లుచున్నావో. నీ దృష్టి యే మనుష్యునిపైననైన పడినదా? లేక యే నాయికపైననైన ముగ్ధమైనదా? కాని నీవు ఈ రెండు చోట్లకు వెళ్లుట తగదు. నీవు నపుంసక లింగమువు. నీవు వెళ్లినచో నవ్వులపాలగుదువు. నీవు మనుష్యుల గుంపులోనికి వెళ్లవద్దు. నీవు బ్రహ్మ దగ్గఱకువెళ్లు. ఎందుకనగా బ్రహ్మశబ్దము కూడ నపుంసకమే. అక్కడ నీకు బాగుగా కాలము గడచును. నపుంసకునితో నపుంసకునకు బాగుగా కుదురును. భావమేమనగా విషయవాసనలను విడిచి బ్రహ్మ యందు లగ్నము కమ్ము.

శ్లో॥ దేహాభిమానే గలితే విజ్ఞాతే పరమాత్మని ।
యత్రయత్ర మనో యాతి తత్ర తత్ర సమాధయః॥ 12

అర్థము :- దేహాభిమానే = దేహమునందభిమానము, గలితే = పోయిన తరువాత, పరమాత్మని = పరమాత్మయందు నిష్ఠ, విజ్ఞాతే = తెలియబడిన తరువాత, యత్ర యత్ర = ఎక్కడెక్కడకు, మనః = మనస్సు, యాతి=వెళ్లునో, తత్ర తత్ర = అట్టిచోట్లలో, సమాధయః = సమాధుల దెలిసికొనవలెను.

తా॥ దేహాభిమానము నశించిన తరువాత తాను పరమాత్మయందున్నట్లు దెలిసికొనినచో మనస్సెక్కడెక్కడకు బోవునో యక్కడక్కడ సమాధిలభించును.

వివరణము :- దేహము నందభిమానము వదలుడు. ఈ శరీరము క్షణభంగురము. నీటిబుడగవంటిది—

శరీరమామాదపి మృన్మయాద్ ఘటాదిదం తు నిఃసారతమం మతం మమ।
చిరం హి తిష్ఠేద్ విధివద్ ధృతో ఘటః సముచ్చయోఽయం సుధృతోఽపి భిద్యతే॥

ఈ శరీరములో కొంచెమైనను బలములేదు. దీనిలో వ్యాధులు, ముసలితనము, మృత్యురూపమైన శత్రువులు చుట్టుముట్టియున్నారు. ఈ శరీరము పచ్చిమట్టికుండతో సమానముగా క్షణభంగురమైనది. నాయుద్దేశ్యములో శరీరము మట్టికుండకంటెకూడ నిఃసారమైనది. కుండను సరియైన పద్ధతిలో జాగ్రతగా వాడుకొన్నచో చాలరోజులుండును. కాని యీ శరీరమును ఎంత జాగ్రతగా జూచినను చెడిపోవును. నిలువదు. ఈ శరీర మనిత్యమని తెలిసికొని పరమాత్మయందు నిష్ఠకలవాని మనస్సు ఎక్కడకు వెళ్లినను నక్కడ సమాధిసిద్ధించును.

శ్లో॥ ఈప్సితం మనసః సర్వం కస్య సంపద్యతే సుఖమ్।
దైవాఽఽయత్తం యతః సర్వం తస్మాత్సంతోష మాశ్రయేత్॥ 13

అర్థము:- మనసః=మనస్సుచే ఈప్సితం=కోరబడినది, సర్వం=సర్వము, సుఖం=సుఖము, కస్య=ఎవనికి, సంపద్యతే=ప్రాప్తించును, యతః=ఎందువల్లననగా, సర్వం=సమస్తము, దైవాఽఽయత్తం = దైవాధీనములో నున్నది, తస్మాత్=అందువలన, సంతోషం=సంతోషమును, ఆశ్రయేత్=ఆశ్రయింపవలెను.

తా॥ అందఱియొక్క అన్ని కోర్కెలు పూర్ణముగా నెఱవేఱవు. ఎందుకనగా సమస్తము దైవాధీనములో నున్నది. అందుచేత సంతోషము కలిగియుండుటయే శ్రేయస్కరము.

వివరణము :- సంతోషమే సుఖమునకు మూలము. అందుచేత సంతోషము కలిగియుండవలెను—

సంతోషాదనుత్తమ సుఖలాభః । (యోగ. ద. 2-42)

సంతోషమువలన మిక్కిలి యుత్తమ సుఖము లభించును. దీనిని మించిన సుఖము లేదు.

మనుమహర్షి —

సంతోషం పరమాస్థాయ సుఖార్థీ సంయతో భవేత్ ।
సంతోషమూలం హి సుఖం దుఃఖమూలం విపర్యయః॥
(మను. 4-12)

సుఖమును కోరువారు సంతోషమును సాయము తీసికొని తనంతట తాను సంయమములో నుండవలెను. ఎందుకనగా సంతోషమే సుఖమునకు మూలము. సంతోషముగా లేకుండుటయే దుఃఖమునకు కారణము,

అసంతోషం పరం దుఃఖం సంతోషం పరమం సుఖమ్,
సుఖార్థీ పురుషస్తస్మాత్ సంతుష్టః సతతం భవేత్॥ (గౌతమను)

సంతోషము లేకుండుటయే మిక్కిలి దుఃఖము. సంతోషముగా నుండుటయే పరమసుఖము. సుఖము కోరువాడెల్లపుడు సంతోషముగా నుండవలెను.

శ్లో॥ యథా ధేను సహస్రేషు వత్సో గచ్ఛతి మాతరమ్ ।
తథా యచ్చ కృతం కర్మ కర్తారమను గచ్ఛతి॥ 14

అర్థము :- ధేను సహస్రేషు=వేలకొలది యావులలో, వత్సః= దూడ, మాతరం=తల్లిని, యథా=ఎట్లు, గచ్ఛతి=చేరుచున్నదో, తథా= అట్లే, యత్=ఏది, కృతం=చేయబడిన, కర్మ చ=కర్మకూడ కర్తారం= చేసిన వానిని, అను గచ్ఛతి=అనుసరించి వెళ్లును.

తా॥ వేలకొలది ఆవులలో తన తల్లిని ఆవుదూడ వెదకిచేరునట్లు, చేసిన కర్మఫలితము కర్మచేసినవానిని వచ్చి చేరును అనగా చేసిన కర్మ ఫలితమును తప్పక అనుభవింపవలెను.

వివరణము :- మనుష్యు డెట్టి కర్మచేయునో యట్టి ఫలమునే యనుభవించును. వ్యాసమహర్షి—

శుభేన కర్మణా సౌఖ్యం దుఃఖం పాపేన కర్మణా।
కృతం ఫలతి సర్వత్ర నాకృతం భుజ్యతే క్వచిత్॥

(భార. అను. 6-10)

శుభకర్మచేసిన సుఖము, పాపకర్మచేసిన దుఃఖము కలుగును. తానుచేసిన కర్మఫలితము తప్పక ఫలించును. చేయనిదే కర్మఫలితము రాదు.

సుశీఘ్రమపి ధావంతం విధాన మనుధావతి।
శేతే సహ శయానేన యేన యేన యథా కృతమ్॥

ఉపతిష్ఠతి తిష్ఠన్తం గచ్ఛన్త మనుగచ్ఛతి।
కరోతి కుర్వతః కర్మచ్ఛాయేవాను విధీయతే॥

(భార. శాంతి. 181-8, 9)

ఎవడే యే కర్మచేయునో ఆ కర్మలఫలితము వానివెంట నుండును. కర్మచేసినవాడు వేగముగా పరుగెత్తినచో ఆకర్మయు నంతవేగముగా నతని ననుసరించును. కర్మచేసినవాడు నిద్రించినచో అతని కర్మఫల మచ్చట

నిద్రించును. వాడు నిలబడిన కర్మకూడ నిలబడును. మనుష్యుడు నడచినచో కర్మ వెంటనడచును. ఇంతియె కాదు, ఎవడైనను కర్మచేయుట పూర్తియైనను కర్మసంస్కారము అతని వెంటనుండి విడువదు. నీడవలె వెంటనే యుండును.

పక్తారం పక్వః పునరా విశాతి॥ (అథర్వ 12-3-48)

వండునట్టివానికి ఆ వంట లభించును. అనగా మనుజుడు చేసిన కర్మకు తగిన ఫలితమును పొందునని భావము.

శ్లో॥ అనవస్థిత కార్యస్య న జనే న వనే సుఖమ్ ।
జనే దహతి సంసర్గో వనే సంగవివర్జనమ్॥ 15

అర్థము :- అనవస్థిత కార్యస్య = అస్థిర చిత్తముతో పనిచేసిన వానికి, జనే=జనముందుగాని, వనే=వనమందుగాని, సుఖం న=సుఖము లేదు, జనే = జనమందు, సంసర్గః = కలయిక, సమ్మర్దము, దహతి = దహించును, వనే = వనమందు, సంగవివర్జనం = ఒంటరితనము దుఃఖమును గలిగించును.

తా॥ స్థిరచిత్తము లేకుండ కర్మచేయువానికి జనసమాజములోగాని వనములోగాని సుఖము లభింపదు. ఎందువల్లననగా మానవ సమాజముతో నతనికి సంబంధముండదు. కావున సుఖముండదు. వనములో ఒంటరిగా నుండును కావునను సుఖముండదు. అట్టివాని కెచటను సుఖముండదు.

శ్లో॥ యథా ఖాత్వా ఖనిత్రేణ భూతలే వారి విందతి ।
తథా గురుగతాం విద్యాం శుశ్రూషు రధిగచ్ఛతి॥ 16

అర్థము :- యథా=ఎట్లు, ఖనిత్రేణ = పలుగుతో, ఖనిత్వా = త్రవ్వి, భూతలే=భూమియందలి, వారి=నీరు, విందతి=పొందుచున్నాడో,

తథా=అట్లే, గురుగతాం = గురువు దగ్గఱనున్న, విద్యాం = విద్యను, శుశ్రూషుః=శుశ్రూషచేయువాడు, అధిగచ్ఛతి=పొందుచున్నాడు.

తా॥ భూమిని పలుగుతో పాఱలతో త్రవ్వి జలమును పొందునట్లు గురువుగారి దగ్గఱనున్న విద్యను ఆయనకు శుశ్రూషచేసి పొందవలెను.

వివరణము :- విద్యను పొందు నుపాయములలో మొదటిది గురువులను సేవించుట—

గురు శుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేన వా ।
అథవా విద్యయా విద్యా చతుర్థం నోప లభ్యతే॥
(చాణక్యసార సంగ్రహ 1-36)

గురువులనుండి విద్యను పొందవలెనని మూడు మార్గములు గలవు. 1, గురువును సేవించుట 2. పుష్కలమైన ధనమిచ్చుట 3. విద్య నిచ్చి విద్యను పుచ్చుకొనుట. ఈ మూడు విధములు దప్ప నాల్గవ మార్గములేదు.

శ్లో॥ కర్మాయత్తం ఫలం పుంసాం బుద్ధిః కర్మానుసారిణీ ।
తథాపి సుధియశ్చాఽఽర్యాః సువిచార్యైవ కుర్వతే॥ 17

అర్థము :- ఫలం = కర్మఫలము, కర్మాయత్తం = కర్మాధీనమై యుండును, పుంసాం = మనుష్యులయొక్క, బుద్ధిః = బుద్ధి, కర్మానుసారిణీ=కర్మ ననుసరించియే నడచును, తథాఽపి = అయినప్పటికి, సుధయః=విద్వాంసులు, చ=మఱియు, ఆర్యాః=సజ్జనశ్రేష్ఠులు, సువిచార్య ఏవ=బాగుగా నాలోచించియే, కుర్వతే=పనులు చేయుదురు.

తా॥ కర్మఫలము కర్మాధీనమైయుండును. మనుష్యుల బుద్ధి కర్మ ననుసరించియుండును. అట్లయ్యును విద్వాంసులు, సజ్జనులు బాగుగా నాలోచించియే పనులు చేయుచుందురు.

వివరణము :- ప్రతివిషయము బాగుగా నాలోచించియు, వెనుక ముందు చూచియు, హాని లాభముల లెక్కకట్టియు చేయవలయును.

సహసా విదధీత న క్రియా మవివేకః పరమాపదాం పదమ్ ।
వృణుతే హి విమృశ్యకారిణం గుణలుబ్ధాః స్వయమేవ సంపదః॥
(కిరాతార్జు. 2-30)

ఆలోచింపక తొందరపడి యేపని చేయరాదు. అజ్ఞానము ఆపదలకు స్థానము. గుణముల నాశ్రయించియుండు సంపదలు బాగుగా నాలోచించి చేయువానిని వరించును గదా! ఈ విషయము తెలిసిన సజ్జనులు ప్రతికర్మను ఆలోచించియే చేయుచుందురు.

శ్లో॥ ఏకాక్షర ప్రదాతారం యో గురుం నాభివన్దతి ।
శ్వానయోనిశతం భుక్త్వా చాండాలేష్వభిజాయతే॥ 18

అర్థము:- యః=ఎవడు, ఏకాక్షర ప్రదాతారం = ఒక్క యక్షర జ్ఞానమునైనను ఇచ్చినట్టి (అక్షరమనగా నాశములేని పరమేశ్వర జ్ఞానమును) గురుం = గురువును, నాభివందతి = నమస్కారముచేయడో, వాడు, శ్వానయోనిశతం=వందపర్యాయములు కుక్క జన్మము, భుక్త్వా= అనుభవించి, చాండాలేషు = చాండాలురయందు, అభిజాయతే = పుట్టుచున్నాడు.

తా॥ ఓమ్ అను అక్షరమును నేర్పిన గురువునైనను లేక అవినాశియైన పరమేశ్వరుని గూర్చిన జ్ఞానము నిచ్చు గురువును కాని పాదాభివందనముచేసి సత్కరింపనివాడు వందసార్లు కుక్కగా బుట్టి తరువాత చాండాలురలో జన్మించును.

వివరణము :- గురువును నిందింపకయు, గురువును నిందించుటను వినక దూరముగా నుండవలెను—

గురోర్యత్ర పరివాదో నిన్దావాఽపి ప్రవర్తతే।
కర్ణౌ తత్ర పిధాతవ్యౌ గన్తవ్యం వా తతోఽన్యతః॥

(మను. 2-200)

గురువునందున్న దోషములుకాని లేని దోషములు కాని చెప్పు నప్పుడు చెవులు మూసికొనవలెను. లేదా యచ్చోటునుండి దూరముగా వెళ్ల వలెను. 18వ శ్లోకములోని రెండవ భాగము వైదికసిద్ధాన్తమునకు విరుద్ధము. ఒక జన్మలోచేసిన కర్మఫలము అనేక యోనులలో గలుగదు. మనుష్యునకు సత్త్వరజస్తమస్సు అనుగుణముల హెచ్చు తగ్గులపై నాధార పడి ఉత్తమ, మధ్యమ, అధమములు, లేక మనుష్య, తిర్యక్, స్థావర ములు మొదలగు యోనులలో జన్మలభించును. కేవల మొక కర్మచేత కాదు. ప్రాణశూన్యము (అర్థరహితము) అతిశయోక్తి పూర్ణమగుటచే ఉత్తరార్ధము సిద్ధాన్త విరుద్ధము.

శ్లో॥ యుగాన్తే ప్రచలతే మేరుః కల్పాన్తే సప్తసాగరాః।
సాధవః ప్రతిపన్నార్థాన్ న చలన్తి కదాచన॥ 19

అర్థము :- యుగాన్తే=యుగముయొక్క యంతమున, మేరుః = మేరుపర్వతము, ప్రచలతే=కదలును, కల్పాన్తే=కల్పముయొక్క యంతమున, సప్తసాగరాః=ఏడు సముద్రములు, హద్దులుమీఱును, సాధవః = సజ్జనులు, ప్రతిపన్నార్థాన్=తాముచేయబూనిన కార్యములను, కదాచన = ఎన్నడును, నవిచలన్తి=పూర్తిచేయక విడిచిపెట్టరు, చలింపరు.

తా:- యుగాన్తములో మేరుపర్వతము కదలును. కల్పాన్తమందు సప్తసముద్రములు హద్దుదాటును. కాని సాధుపురుషులు తాము చేపట్టిన కార్యములనుండి చేసిన ప్రతిజ్ఞలనుండి విముఖులుకారు. అతిక్రమింపరు.

వివరణము :- సజ్జనులు తాముచేసిన ప్రతిజ్ఞను విడువరు —

ఉదయతి యది భానుః పశ్చిమే దిగ్విభాగే
ప్రచలతి యది మేరుః శీతతాం యాతి వహ్నిః ।
వికసతి యది పద్మం పర్వతాగ్రే శిలాయాం
న భవతి పునరుక్తం భాషితం సజ్జనానామ్॥

సూర్యుడు పశ్చిమదిక్కున ఉదయించినను. మేరుపర్వతము చలించినను. అగ్ని కాలక చల్లగానున్నను. పర్వతశిఖరమున రాతిపై పద్మము వికసించినను అనగా అసంభవములైనవి సంభవములైనను సజ్జనులు ఆడిన మాట తప్పరు. మాఱుమాటలాడరు. అంతేకాదు సజ్జనులు చేపట్టిన కార్యమును కూడ త్యజింపరు.

ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్నవిహతా విరమన్తి మధ్యాః ।
విఘ్నైః పునః పునరపి ప్రతిహన్యమానాః
ప్రారభ్య చోత్తమజనా న పరిత్యజన్తి॥ (భర్తృ. నీతి. 26)

నీచులు (అధమ శ్రేణికి చెందినవారు) పనిచేయుటకు విఘ్నము లేర్పడునేమోయను భయముతోనే పనిని చేయుటకు ప్రారంభింపరు. మధ్యమశ్రేణికి జెందినవారు పని ప్రారంభించి అడ్డంకులు (విఘ్నములు) కలుగగానే ప్రారంభించిన పనిని మానివేయుదురు. ఉత్తమశ్రేణికి చెందిన పురుషులు మాటిమాటికి అడుగడుగునను విఘ్నములు కలుగుచున్నను ప్రారంభించిన పనిని పూర్తిచేయువఱకు విడిచిపెట్టరు.

త్రయోదశాధ్యాయము సమాప్తము

# చతుర్దశాధ్యాయము

శ్లో॥ పృథివ్యాం త్రీణి రత్నాని జలమన్నం సుభాషితమ్ ।
మూఢైః పాషాణఖండేషు రత్నసంజ్ఞా విధీయతే॥ 1

అర్థము :- పృథివ్యాం=భూమియందు, త్రీణి=మూడు, రత్నాని=రత్నములు, జలం=నీరు, అన్నం = అన్నము, సుభాషితమ్ = ప్రియ వాక్యము లేక నీతివాక్యము అనునవి కలవు, మూఢైః=మూఢులద్వారా, పాషాణఖండేషు=రాతిముక్కలయందు, రత్నసంజ్ఞా=రత్నములను పేరు, విధీయతే=ఈబడుచున్నది.

తా॥ భూమిపై నీరు, అన్నము, సుభాషితము (మంచిమాట) అను మూడు రత్నములు గలవు. ఆ విషయమెఱుగని మూఢులు రాతిముక్కలను రత్నములని చెప్పుచున్నారు.

వివరణము :- జలము జీవనమగుటచే రత్నము—

పానీయం ప్రాణినాం ప్రాణాః విశ్వమేవ చ తన్మయమ్ ।
న హి తోయాద్వినా వృత్తిః స్వస్థస్య వ్యాధితస్య వా॥
(అష్టాంగ సంగ్రహము)

జలము జీవసృష్టికి ప్రాణము. సమస్త ప్రపంచము జలమయమై యున్నది. ఆరోగ్యవంతులకుగాని రోగులకుగాని నీరు లేకుండ ప్రాణము నిలువదు.

అపాం సంస్పర్శనాత్ స్నానాత్ పానాత్ దర్శనతోఽపి వా !
మనుష్యాః సిద్ధిమాయాన్తి బాహ్యాభ్యన్తరశాలినః॥
(పద్మపురాణము)

ఆవశ్యకమును బట్టి చల్లని లేక వేడిజలము యొక్క స్పర్శతో, స్నానముతో, త్రాగుటచే నల్లే నీటిని చూచుటచేత కూడ లోపల బయట

కూడ శుద్ధులై మనుష్యులు తమ రోగమును నివారణాది కార్యములలో సిద్ధిపొందుదురు. అన్నముకూడ రత్నమే. అన్నముయొక్క ప్రశంస —

అన్నం వై ప్రాణినాం ప్రాణా అన్నమోజో బలం సుఖమ్ ।
ఏతస్మాత్ కారణాత్ సద్భిరన్నదః ప్రాణదః స్మృతః॥
(భవిష్య. ఉత్తర. 169-30)

అన్నము ప్రాణులకు జీవనమైయున్నది. అన్నమే ఓజస్సు, బలము, సుఖముకూడ. ఇందువలన అన్నదాతలను ప్రాణదాతలని సజ్జనులు చెప్పుచుందురు. సుభాషితములలో —

ద్రాక్షమ్లానముఖీ జాతా శర్కరాచాశ్మతాం గతా ।
సుభాషితరసస్యాగ్రే సుధా భీతా దివం గతా॥

సుభాషితరసమున కెదుట ద్రాక్షముడుచుకొన్నది. పంచదార రాయి వలె గట్టిపడినది. అమృతము భయపడినదై స్వర్గమునకు వెళ్లెను.

శ్లో॥ ఆత్మాపరాధ వృక్షస్య ఫలాన్యేతాని దేహినామ్ ।
దారిద్ర్య రోగ దుఃఖాని బంధన వ్యసనాని చ॥ 2

అర్థము :- దారిద్ర్యరోగ దుఃఖాని = దారిద్ర్యము, శారీరక మానసిక రోగము. దుఃఖము, చ = మఱియు, బంధనవ్యసనాని = బంధనము, ఆపదలు అను, ఏతాని = ఇవి యన్నియు, దేహినాం = దేహముకలవారికి. ఆత్మాపరాధవృక్షస్య = తన పాపరూప వృక్షముయొక్క, ఫలాని = పండ్లుగానున్నవి.

తా॥ తనయొక్క అపరాధము లనెడు వృక్షమునకు దారిద్ర్యము, రోగము దుఃఖము, బంధనము ఆపదలనునవి ప్రతి దేహధారికి ఫలములు.

వివరణము :- పూర్వజన్మలో జేసిన పాపఫలములు వర్తమాన జన్మములో రోగము, దుఃఖము మొదలగు రూపములలో సంప్రాప్తింపును—

వ్యాధి ర్విత్తనాశః ప్రియవిరహో దుర్భగత్వముద్వేగః ।
సర్వత్రాశాభంగః స్ఫుటం భవతి హ్యకృత పుణ్యస్య॥
(శార్ఙ్గధర పద్ధతి)

రోగము, ధననాశము, ప్రియవ్యక్తి వియోగము, కురూపత్వ, చిత్తముయొక్క ఉద్వేగము, సమస్తకార్యములందు నిరాశ (అంతట నిష్ఫలత) ఇవి యన్నియు పూర్వజన్మమున పుణ్యము చేయని వానికి సంభవించును.

కర్మణా హి శరీరేషు రోగాః శరీరమానసాః ।
శరా ఇవ పతన్తీహ విముక్తా దృఢధన్విభిః॥ (సుభాషితావళి)

సిద్ధహస్తుడైన ధనుర్ధారిచేత విడువబడిన బాణము తిన్నగావెళ్లి లక్ష్యమును తాకినట్లు పూర్వజన్మలో చేయబడిన పాపకర్మలు పరిణామ స్వభావమున శారీరిక మానసిక రోగములుగా మనుష్యుని శరీరముపై నపే విధముగా నాక్రమించును.

యదన్ధ్యంగాః కుష్ఠినశ్చాన్ధాః పంగవశ్చ దరిద్రిణః ।
పూర్వోపార్జిత పాపస్య ఫలమశ్నన్తి దేహినః॥
(భోజ ప్రబంధము 199)

అంగహీనులు, కుష్ఠువారు, గ్రుడ్డివారు, దరిద్రులు వాస్తవముగా వారు పూర్వజన్మలో చేసిన పాపకర్మఫలముల ననుభవించుచున్నారు.

పూర్వజన్మ కృతం పాపం వ్యాధి రూపేణ బాధతే ,
తచ్ఛాన్తి రౌషధైర్దానైర్జప హోమార్చనాదిభిః॥

(స్మృతిరత్నాకరము)

పూర్వజన్మలో చేసిన పాపకర్మల ఫలము వ్యాధిరూపమున పీడించు చున్నది. అది శాంతించుటకు ఔషధములు, దానము, తపస్సు, జపము, హోమము, పూజాపాఠాదుల ద్వారా కృషిచేయవలెను. పూర్వజన్మములో చేసిన పాపపుణ్యములే ఈ జన్మములో ఉత్తమ, మధ్యమ, నీచశరీరము లను, బుద్ధి మొదలగు పదార్థములను ఇచ్చును. మరొక విధమునగాదు. (మహర్షి దయానందసరస్వతి-ఋగ్వేదాది భాష్యభూమిక-పూర్వజన్మ)

శ్లో॥ పునర్విత్తం పునర్మిత్రం పునర్భార్యా పునర్మహీ ।
ఏతత్సర్వం పునర్లభ్యం న శరీరం పునః పునః॥ 3

అర్థము :- విత్తంపునః = నష్టమైన ధనము మరల లభించును. మిత్రం పునః=ఒక మిత్రుడు పోయినను మరొక మిత్రుడు చేరును లేక విడిపోయిన మిత్రుడు మరలచేరును. భార్యాపునః = భార్యపోయినచో మరొక వివాహము ద్వారా భార్యలభించును, మహీపునః = భూసంపత్తి, దేశము, రాజ్యముపోయిన తిరిగి లభించును, ఏతత్సర్వం=ఇదియంతయును పునఃలభ్యం=తిరిగి లభించును, కాని, శరీరమ్ = మానవశరీరము, పునః పునః=మాటిమాటికి, న=రాదు.

తా॥ ధనము పోయినచో తిరిగి సంపాదింపవచ్చును. మిత్రు డొకడు దూరమైనచో మరల కలియవచ్చును లేదా మరొక మిత్రుని చేర వచ్చును. అట్లే భార్యదూరమై తిరిగిరావచ్చును లేదా మరొక వివాహము ద్వారా మరొక భార్యను పొందవచ్చును. పొలము అమ్ముకొని మరల కొనవచ్చును. అట్లే దేశము, రాజ్యము పోయిన తిరిగి సంపాదింప

వచ్చును. ఇవి యన్నియు తిరిగి లభించునుగాని శరీరము పోయిన తిరిగిరాదు.

వివరణము :- మానవజన్మ దుర్లభము—

దుర్లభం త్రయ మేవైతత్ దేవానుగ్రహ హేతుకమ్ ।
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః॥
(వివేకచూడామణి 3)

మనుష్యత్వము, ముముక్షుత్వము, మహాపురుష సత్సంగము అను మూడును దుర్లభములు. ఇవి ప్రభువు యొక్క దయవలననే ప్రాప్తించును.

శ్లో॥ బహూనామం చైవ సత్త్వానాం సమవాయో రిపుంజయః ।
వర్షధారాధరో మేఘ స్తృణైరపి నివార్యతే॥

అర్థము :- చ+ఏవ = చైవ=నిశ్చయముగానే, బహూనాం = ఎక్కువమైన, సత్త్వానాం = మనుష్యుల యొక్క, సమవాయః = సము వాయము, రిపుంజయః=శత్రువులను జయించును, వర్షధారాధరః = వర్ష ధారల ధరించు, మేఘః=మేఘము, తృణైరపి = గడ్డిని కప్పుటచేతనే, నివార్యతే=అడ్డగింపబడుచున్నది, అనగా గడ్డిచేకప్పబడిన పూరియిండ్లలో వర్షముకురియదు.

తా॥ గడ్డిపరకల సమూహము పూరిపాకలలోనికి వర్షము రాకుండ చేసినట్లు ఎక్కువమందిగల మనుష్య సమూహము శత్రువులను జయింప గలదు.

వివరణము :- ఐకమత్యముగా కలిసియుండుట గొప్పబలము —

బహూనా మల్పసారాణాం సమవాయో దురత్యయః ।
తృణైర్విధీయతే రజ్జుర్బధ్యన్తే తేన దన్తినః ॥
(భోజప్రబంధ-145)

దుర్బలమైన బహుసంఖ్యాక సమూహమునుగూడ నతిక్రమించుట మిక్కిలి కష్టము చినచిన్న తుంపులతో పేనబడిన త్రాళ్ళతో నేనుగులు బంధింపబడు చున్నవిగదా!

వేద సందేశము—

మిథో విఘ్నానా ఉపయన్తు మృత్యుమ్- (అథర్వ. 6-32-3)
పరస్పరము కొట్టుకొనువారు మృత్యువును పొందుదురు.—

వేదమాత ఆదేశము—

సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవోమనాంసి జానతామ్
(ఋ. 10-191-2)

మీరందఱు కలిసినడువుడు మీరందఱు కలిసిచెప్పుడు. మీయందఱి మనస్సు ఒకటిగా నుండుగాక!

శ్లో॥ జలే తైలం ఖలేగుహ్యం పాత్రే దానం మనాగపి ।
ప్రాజ్ఞే శాస్త్రం స్వయం యాతి విస్తారం వస్తుశక్తితః॥5

అర్థము :- జలే=నీటియందు, తైలం=నూనెయు, ఖలే=దుర్జనుని యందు, గుహ్యం=రహస్యము, పాత్రే=యోగ్యునియందు, దానం=దానము, ప్రాజ్ఞే=బుద్ధిమంతునియందు, శాస్త్రం=శాస్త్రము, మనాగపి=కొంచెమైనను, వస్తుశక్తితః = ఆయా వస్తువుల శక్తివలన, స్వయం=స్వయముగా, విస్తారం=విస్తరించుటను, యాతి=పొందుచున్నది. అనగా నవి వాని శక్తివలననే కొంచెమైనను తమంతతాము వ్యాపించును.

తా॥ నీటిలోబడ్డ నూనె, దుష్టునకు జెప్పిన రహస్యము, యోగ్యున కిచ్చినదానము, బుద్ధిమంతునకు జెప్పిన శాస్త్రము ఇవి కొంచెమైనను వానిలోనున్న సహజశక్తితో నధికముగా విస్తరించును.

వివరణము :- నీటిలో నూనెచుక్క వేసిన ఆ నీటిలో నంతటను వ్యాపించును. అది నూనెలోని సహజశక్తి. నీటిలో నేతిచుక్క వేసిన గడ్డకట్టును. అది దానిగుణము. అట్లే దుర్జనునకు రహస్యము చెప్పినచో వాడు ఆ రహస్య విషయమును అందఱకు చెప్పి చాటును. అది వాని స్వభావము. ఒక వికలుని విషయములో చెప్పిన దానిని చూడుడు—

విషధరతోఽప్యతి విషమః ఖలఇతి నమృషావద న్తి విద్వాంసః ।
యదయం నకులద్వేషీ సకులద్వేషీ పునః పిశునః ॥

తా॥ దుర్మార్గుడు పాముకంటె భయంకరుడు. అని విద్వాంసులు చెప్పుమాట యసత్యముకాదు. సర్పము ముంగిసను మాత్రమే ద్వేషించును. తన కులమునుగాదు. దుష్టుడు తన కులమునుగూడ ద్వేషించును. తన కులమును ద్వేషించు దుర్మార్గుడు ఇతరుల రహస్యముల నేల దాచును ?— యోగ్యులకిచ్చిన దానము కొంచెమైనను ఆ యోగ్యునిద్వారా దాత ప్రసిద్ధుడగును.— బుద్ధిమంతుల కిచ్చిన జ్ఞానము కొంచెమైనను నది విస్తరించును. మహర్షి దయానంద సరస్వతి కిచ్చిన జ్ఞానదాన మెంత విస్తరించినది? ఆయన కీర్తి యీదేశమందేకాక విదేశములందును వ్యాపించి యున్నది.

శ్లో॥ ధర్మాఽఽఖ్యానే శ్మశానే చ రోగిణాం
యా మతిర్భవేత్ ।
సా సర్వదైవ తిష్ఠేచ్చేత్ కో న ముచ్యేత బంధనాత్ ॥6

అర్థము :- ధర్మాఽఽఖ్యానే = ధర్మసంబంధ కథలను వినునపుడును, శ్మశానే=శ్మశాన భూమియందు శవదహనము చూచినపుడును, రోగిణాం=రోగులకు, యా=ఏ, మతిః = బుద్ధి, భవేత్ = ఉండునో, కలుగునో, సా=ఆబుద్ధి, సర్వదైవ=ఎల్లప్పుడును, తిష్ఠేచ్చేత్=ఉండునో,

కః=ఎవడు, బంధనాత్ = ఈ సంసార బంధనముసుండి, నముచ్యేత = విడువబడడు. ఎవడీ సంసార బంధనము విడువడు ?

తా॥ ధర్మసంబంధములైన కథలు విన్నప్పుడు, శ్మశానములో శవ దహనమును చూచినపుడు, రోగముతో బాధపడునపుడు మానవున కేబుద్ధి యుండునో యాబుద్ధి యెల్లపుడు నున్నచో ఎవడీ సంసార బంధనమునుండి ముక్తుడుకాడు ?

వివరణము :- ధర్మసంబంధములగు కథలు విన్నపుడు మనుష్యునిలో సహజముగానే మార్పు కలుగును. కాని యది క్షణికము. వ్యాసుని వాక్యము చూడుడు—

ఊర్ధ్వబాహు ర్విరౌమ్యేష న చ కశ్చిచ్ఛృణోతి మే ।
ధర్మాదర్థశ్చ కామశ్చ న కిమర్థం న సేవ్యతే ॥
(భార. స్వర్గా. 5-62)

నేను రెండుచేతులెత్తి పిలిచి పిలిచి చెప్పుచున్నాను. కాని నామాట నెవ్వడు వినుటలేదు. ధర్మాచరణమువలన మోక్షము లభించును. అర్థకామములుకూడ సిద్ధించును. కాని లోకులేల దానిని సేవింపరు? శ్మశానములో మృతదేహముల అగ్నిలో భస్మము చేయుదురు. అ మండుచున్న శవమును చూచునపుడు ఈ ప్రపంచము క్షణభంగురమని తోచును. దీనివలన స్వభావములో కొంతమార్పు కలుగును. అ మార్పు కూడ క్షణకాలమే యుండును. దీనినే శ్మశానవైరాగ్య మందురు.

రోగగ్రస్తుడైన మనుష్యునిలో ఈశ్వరభక్తి దగుటకును, రోగ విముక్తియైన తరువాత మరల రోగము రాకుండుటకు ప్రయత్నముచేయు బుద్ధి పుట్టును.— ఈ మనోవృత్తులు ఎల్లపుడు నున్నచో ఎవడు సంసార బంధనమునుండి విడివడడు ? కాని మనుష్యుడు కథలు, ఉపన్యాసములు

విని దానివలన కలిగిన జ్ఞానమును విినచోటనే విడుచును. శ్మశానము నుండి వెనుతిరుగగానే వ్యాపారమునకు సంబంధించిన విషయములు ఆలోచింప మొదలిడును. ఆరోగ్యవంతుడు కాగానే మనుష్యుడు ఈశ్వరుని, వైద్యుని మఱచిపోవును.

శ్లో॥ ఉత్పన్న పశ్చాత్తాపస్య బుద్ధిర్భవతి యాదృశీ ।
తాదృశీ యది పూర్వం స్యాత్ కస్య న
స్యాన్మహోదయః ॥ 7

అర్థము :- ఉత్పన్న పశ్చాత్తాపస్య=అశుభములు, నిందితములగు కర్మలు చేసిన తరువాత తపించువానికి, యాదృశీ=ఎటువంటి, బుద్ధిః= బుద్ధి, భవతి=ఉండునో, తాదృశీ=అటువంటి బుద్ధి, పూర్వం = ముందే, స్యాత్ యది=ఉన్నచో, కస్య=ఎవనికి, మహోదయః = మోక్షము, నస్యాత్=కలుగదు ?

తా॥ అశుభములు, నిందితములగు కర్మలు చేసిన తరువాత పశ్చాత్తాపపడు మనుష్యున కెట్టిబుద్ధి కలుగునో యాబుద్ధి ముందే కలిగినచో నట్టివానికేల మోక్షము కలుగదు ?

వివరణము :- పశ్చాత్తాపము శుద్ధికి హేతువు. దీనివలన మనోమాలిన్యము పోవును. ఈ బుద్ధి పాపకర్మ చేయక ముందే యున్నచో నెవరికి మోక్షప్రాప్తి కలుగదు ? తప్పక కలుగును.

శ్లో॥ దానే తపసి శౌర్యే వా విజ్ఞానే వినయే నయే ।
విస్మయో నహి కర్తవ్యో బహురత్నా వసుంధరా ॥ 8

అర్థము:- దానే=దానశీలతలోను, తపః=తపస్సు ననుష్ఠించుటలోను, శౌర్యే=శౌర్యమునందును, విజ్ఞానే=విజ్ఞానమందును, వినయే= వినయమందును, నయే = నీతికలిగి యుండుటలోను, విస్మయః = అధి

మానము, న కర్తవ్యః = చేయరాదు, హి = ఎందువల్లననగా, వసుంధరా = భూమి, బహురత్నా = బహురత్నములు గలది.

తా॥ దానశీలతయందు, తపోనుష్ఠానమందు, శౌర్యమునందు, విజ్ఞానమందు, వినయమునందు నీతికలిగి యుండుటయందు, అభిమానపడరాదు. పృథివి నానాప్రకారములగు రత్నములతో నిండియున్నది అనగా దానశీలత, తపస్సు, మొదలైనవి యొకటికంటె నొకటి మించి పురుషునిలో గనపడుచున్నవి.

వివరము: నేను గొప్ప దాతను, నేను గొప్ప తపోవంతుడను, నే నందరికంటె గొప్ప శూర వీరుడను. అని యెవ్వడును అభిమానపడరాదు. ఎందుచేతననగా పృథివి నవరత్నములతో నిండియున్నది. ఒకసారి భోజరాజు తనతో సమానుడైన దాత లేడని గర్వపడెను. దానిని తెలిసికొనిన ముఖ్యమంత్రి విక్రమాదిత్యుని దాతృత్వ పుస్తకము చూపెను. భోజుడు దానిలో నొక పుటలో మహారాజైన విక్రమాదిత్యుడు నీరు త్రాగదలచి యిట్లనెను—

స్వచ్ఛం సజ్జన చిత్తవల్లఘుతరం దీనార్తివచ్ఛీతలం
పుత్రాలింగన వత్తథైవ మధురం తద్బాల్య సంజల్పవత్ ।
ఏలోశీరలవంగ చందనలసత్కర్పూర కస్తూరికా
జాతీపాటలి కేతకైః సురభితం పానీయ మానీయతామ్ ॥

సజ్జనుల చిత్తమువలె స్వచ్ఛమైనట్టియు, దీనునివ్యథవలె తేలికమైనట్టియు, పుత్రుని ఆలింగనముతో సమానముగా శీతలముగా నున్నట్టియు, కుమారుని వచ్చీరాని మాటలవలె మధురమైనట్టియు, ఏలక, వట్టివేరు, లవంగము, చందనము, కర్పూరము, కస్తూరి, జాజి, పాటలపుష్పి అను పువ్వు, మొగలి, మొదలగు వానితో సువాసనగల జలమును తెమ్మనెను. అది విని భటుడు—

వక్త్రాంభోజం సరస్వత్యధివసతి సదా శోణ ఏవాధరస్తే
బాహుః కాకుత్స్థ వీర్య స్మృతి కరణ పటుర్దక్షిణస్తే సముద్రః ।
వాహిన్యః పార్శ్వమేతా క్షణమపి భవతో నైవ ముంచంత్యభీక్ష్ణం
స్వచ్ఛే చిత్తే కుతో౽భూత్ కథయ నరపతే తే౽ంబుపానాభిలాషః ॥

ఓ రాజా! నీ ముఖకమలమందు సరస్వతి (వాణి, నది) నివసించు చున్నది. నీ క్రిందిపెదవి యెల్లపుడు శోణము (ఎఱుపు, నది) గా నుండును. శ్రీరాముని పరాక్రమమును జ్ఞప్తిచేయుటకు నీ కుడిభుజము దానముచేయుటకు సువర్ణముద్రతో నిండియున్నది. (ముద్రా సహిత సముద్ర) అయియున్నది. ఈ వాహినులు (సేనలు, నదులు) నిన్ను విడిచి క్షణమైన నుండవు. సరస్వతీనది, శోణనదము మఱియు సముద్రజలముతో నిర్మలమైయున్న నీ హృదయములో నీరుత్రాగు కోరిక యెట్లు కలిగెను? విక్రమాదిత్యుడు—

అష్టౌ హాటక కోటయస్త్రినవతి ర్ముక్తాఫలానాం తులాః
పంచాశన్మధుగంధ మత్తమధుపాః క్రోధోద్ధతాః సింధురాః ।
అశ్వానామయుతం ప్రపంచచతురం దాసీగణానాంశతం
దత్తం పాండ్యనృపేణ యౌతకమిదం వైతాలికాయార్ప్యతామ్ ॥
(భోజ. 229-231)

ఎనిమిదికోట్ల పలముల (పలమనగా సుమారు 40 గ్రాములు) బంగారము, 93 తులముల ముత్యములు, తేనెతోను గంధముతోను మత్తెక్కిన తేనెటీగలు గలిగి క్రోధముతో గర్వించియున్న 500 యేనుగులు, పదివేల గుఱ్ఱములు, వందమంది వ్యవహార దక్షతగల దాసీలు మొదలగునవన్నియు పాండ్యరాజైన విక్రమాదిత్యుడు బహుమతిగా వైతాలికునకు (చారణుడు-మేలుకొలుపువాడు) ప్రదానముచేసెను. ఇవియన్నియు నిప్పు

యుండవలయును. ఈ వివరణము చదివి భోజమహారాజుయొక్క గర్వము పోయెను —

శ్లో॥ దూరస్థోఽపి న దూరస్థః యో యస్య మనసి స్థితః ।
యో యస్య హృదయే నాస్తి సమీపస్థోఽపి దూరతః ॥9

అర్థము :- యః = ఎవడు, యస్య = ఎవనియొక్క, మనసి = మనస్సునందు, స్థితః = ఉన్నాడో వాడు, దూరస్థోఽపి = దూరముగానున్నను, దూరస్థః న = దూరస్థుడు కాడు, యః = ఎవడు, యస్య = ఎవనియొక్క, హృదయే = హృదయమందు, నాస్తి = లేడో వాడు, సమీపస్థోఽపి = సమీపములోనున్నను, దూరతః = దూరమునందున్నవాడే.

తా॥ ఎవడు ఎవని మనస్సులో స్థిరముగా నుండునో యతడు దూరముగానున్నను దూరముగా నున్నవాడు కాడు. ఎవడు దగ్గరగా నున్నను హృదయములో లేనిచో వాడు దూరస్థుడే యగును.

వివరణము :- భార్య పుట్టింటిలో నున్నను ఎల్లప్పుడు భర్తనే ధ్యానించు చుండును. ఈ విధముగా భర్త దూరముగానున్నను మిక్కిలి దగ్గరలో నున్నట్లే యగును. జీవునకు ధ్యానమెట్లు దగ్గరగానుండునో పరమేశ్వరు డంత సమీపములో నుండును. అయినను పరమేశ్వరునికొరకు ప్రేమలేదు శ్రద్ధలేదు. ఆయనను పొందవలెనను తపనలేదు. ప్రీతిలేదు. అట్టి మనుష్యునకు పరమేశ్వరుడు మిక్కిలి దూరమున నుండును — వేదములో —

తద్దూరే తద్వన్తికే — (యజు. 40-5)

ఆ పరమాత్మ యోగులుకానివారికి, విద్వాంసులు కానివారికి దూరముగా నున్నాడు. ధర్మాత్ములకు, విద్వాంసులకు, యోగులకు దగ్గరగా నున్నాడు.

శ్లో॥ యస్య చాప్రియ మిచ్ఛేత తస్య బ్రూయాత్ సదా ప్రియమ్ ।
వ్యాధో మృగవధం కర్తుం గీతం గాయతి సుస్వరమ్॥10

అర్థము:- చ=నిశ్చయముగ, యస్య=ఎవనియొక్క, అప్రియం=చెడును, ఇచ్ఛేత=కోరునో, తస్య=అతనికి, సదా=ఎప్పుడును, ప్రియం=మధురముగా, బ్రూయాత్=చెప్పవలెను, వ్యాధః=బోయవాడు, మృగవధం=లేడిని చంపుటను, కర్తుం = చేయుటకు, సుస్వరం=మధురస్వరముగా, గీతం=పాటను, గాయతి=పాడుచున్నాడు.

తా॥ ఎవరినిగూర్చి కీడుచేయ దలచుచున్నారో అతని కెల్లపుడు ప్రియవచనమునే చెప్పవలెను. బోయవాడు లేడిని చంపుటకు మంచిస్వరముతో పాటపాడును. ఆ స్వరమునకు లోబడి లేడి సమీపించి మరణించును.

వివరణ :- ఇతరులకు హానిచేయదలచినపుడు వారితో మంచిగా వ్యవహరించుచు మధురముగా సంభాషణ చేయవలెను. సమీపించిన వానిని సమయముచూచి నశింప జేయవలెను.

వహేదమిత్రం స్కంధేన యావత్కాలస్య పర్యయః ।
తతః ప్రత్యాగతే కాలే భిన్ద్యాత్ ఘటమివాశ్మని ॥
(భార. ఆది. 139-21)

తనకు దగిన సమయము లభించనంతవఱకు శత్రువును తన భుజస్కంధముపై మోయవలెను. అతని కాదర సత్కారములు చేయవలెను. అనుకూల సమయము దొరకగానే ఱాతిపై కుండను పగులగొట్టినట్లు నశింపజేయవలెను.

శ్లో॥ అత్యాసన్నా వినాశాయ దూరస్థా న ఫలప్రదాః ।
సేవితవ్యం మధ్యభాగేన రాజా వహ్నిర్గురుః స్త్రియః॥11

అర్థము :- రాజా=రాజు, వహ్నిః=అగ్నియు, గురుః=గురువు, స్త్రియః = స్త్రీలు, వీరందఱిని, మధ్యభాగే = మధ్యావస్థలోనుండి, సేవితవ్యమ్ = సేవింపవలెను. (వీరికి మిక్కిలి దగ్గఱగాగాని, మిక్కిలి దూరముగాగాని యుండరాదు) ఎందుకనగా—అత్యాసన్నాః = మిక్కిలి దగ్గఱనున్నచో, వినాశాయ=వినాశమునకు కారణమగుదురు. దూరస్థాః= దూరముగా నున్నచో, న ఫలప్రదాః=ప్రయోజన ముండదు.

తా॥ రాజు, అగ్ని, గురువు, స్త్రీలు అనువారిని అత్యంత సమీపమునకాక, అతిదూరమునకాక మధ్యభాగములో నుంచి సేవింపవలెను. మిక్కిలి సమీపమున నున్నచో నాశనమునకు కారకులగుదురు. మిక్కిలి దూరముగా నున్నచో నుపయోగపడదు. కావున మధ్యభాగములోనుంచి లాభము పొందవలెను.

వివరణము :- రాజుతో నెట్లు వ్యవహరింపవలెనో మహాభారతములో—

సమవేశం న కుర్వీత నోచ్చైః సంనిహితో వసేత్ ।
న మంత్రం బహుధా కుర్యాదేవం రాజ్ఞః ప్రియో భవేత్ ॥
(భార. విరాట. 4-48)

రాజుతో సమానముగా వేషమును, ఆభరణములను ధరింపరాదు. ఆతనికి మిక్కిలి దగ్గఱ నుండరాదు. ఆతనియెదుట ఉన్నతాసనముపై కూర్చుండరాదు. రాజు తనతో చెప్పిన రహస్యము నితరులకు జెప్పరాదు. ఇట్లు చేసినమనుజుడు రాజునకు ప్రియుడగును.

అగ్ని సంబంధములో చెప్పబడిన దానిని చూడుడు— అగ్ని మంచి సేవకుడు మఱియు చెడ్డయజమానుడునూ డ. అందుచేత దానిని మధ్య

వస్తలో సేవింపవలెను. (వాడుకొనవలెను)— శిష్యుడు గురువుయొక్క పడకనుకాని ఆసనమునుకాని, ప్రయాణముచేయు వాహనమునుగాని, చెప్పులుకాని, లేక త్రాగు పదార్థములనుకాని, స్నానార్థముంచిన జలమును గాని తనకొఱకు ఉపయోగింపరాదు. గురువుగారి యెదుట కాళ్ళుచేతులు చాచుకొని కూర్చుండరాదు. చాపల్యముతో నుండరాదు. వారిని సేవించుచు యోగాభ్యాసి కావలెను.—

స్త్రీ పురుష సంబంధమును గూర్చి—

అగ్నికుండ సమానారీ ఘృత కుమ్భ సమో నరః ।
సంసర్గేణ విలీయేత తస్మాత్తాం పరివర్జయేత్ ॥
(అవధూతగీత 8-24)

స్త్రీ అగ్నికుండము వంటిది. పురుషుడు పేరుకొన్న (పేరునేయి) నేయివంటివాడు. వారి సంసర్గమువలన పురుషునియొక్క వీర్యరూపమగు నెయ్యి ద్రవించును. అందుచేత ఉన్నతిని కోరునట్టి పురుషుడు స్త్రీని విడిచిపెట్టవలెను. వారియం దత్యంతముగా నాసక్తియుంచరాదు.

శ్లో॥ అగ్నిరాపః స్త్రియో మూర్ఖాః సర్పా రాజకులాని చ ।
నిత్యం యత్నేన సేవ్యానిసద్యః ప్రాణ హరాణి షట్ ॥12

అర్థము :- అగ్నిః = అగ్ని, ఆపః = నీరు, స్త్రియః = స్త్రీలు, మూర్ఖాః=మూర్ఖులు, సర్పాః=పాములు, రాజకులాని చ= రాజపరివారము కూడ, నిత్యం=ఎల్లపుడు, యత్నేన=ప్రయత్నపూర్వకముగ సావధానముతో, సేవ్యాని=సేవింపదగినవి, షట్ =ఈఆరును, సద్యః=వెంటనే, ప్రాణహరాణి=ప్రాణములను హరించును.

తా॥ అగ్ని, నీరు, స్త్రీలు, మూర్ఖులు, సర్పములు, రాజపరివారము ప్రయత్నపూర్వకముగ నిత్యము సేవింపవలెను. ఈయారును వెంటనే ప్రాణములను హరించునవికూడ.

వివరణము :- అగ్నికణము అజాగ్రత్తవలన పడరానిచోట పడినచో మహావినాశముచేయును. జలము జీవనము కాని అనుచితముగా గాని, అజాగ్రత్తగాగాని యుపయోగించిన ప్రాణముల హరించును. ఈతరాని వాడు నీటిలో దిగినచో మరణించును.—స్త్రీ పురుషునకు శ్రేష్ఠతమమైన స్నేహితురాలు. ఆమెతో నియమము నుల్లంఘించి యనుభవించిన మృత్యువు నాహ్వానించుటయే యగును —

మూర్ఖుడు సిద్ధమగు కార్యముల చెడగొట్టును. అతని మూర్ఖతవలన క్రొత్త క్రొత్త ఆపదలను తెచ్చును. మూర్ఖుడు తాను నష్టపడుటయేకాక తనస్నేహితులకుకూడ హాని తెచ్చును. అందువలన నతనితో చాల జాగ్రత్తగా వ్యవహరింపవలెను.—సర్పము—విషధారియగును. అది కోపించి నచో కాటు వేయును.—రాజకులము—రాజు కోపించిన కారాగారములో పడవేయును. సేవాకార్యములలో దూరముగా నుంచును. దేశమునుండి వెడలగొట్టును. అందుచేత నతనితో సావధానముగా ప్రవర్తించుచు వ్యవహరింపవలెను.

శ్లో॥ స జీవతి గుణా యస్య యస్య ధర్మః స జీవతి ।
గుణధర్మవిహీనస్య జీవితం నిష్ప్రయోజనమ్ ॥ 13

అర్థము :- ఈ ప్రపంచంలో సహజముగా, సః=వాడే, జీవతి= జీవించుచున్నాడు, యస్య=ఎవనిలో, గుణాః=గుణములున్నవో, లేక, యస్య=ఎవని జీవితములో, ధర్మః=ధర్మమున్నదో, సః=వాడు, జీవతి =జీవించుచున్నాడు, గుణధర్మ విహీనస్య=గుణములు ధర్మము లేనివాని, జీవితం=జీవితము, నిష్ప్రయోజనమ్=నిష్ఫలము, వ్యర్థము.

తా॥ ఈ ప్రపంచములో నెవనికి గుణములున్నవో వాడు జీవించిన వాడు. ఎవని జీవనములో ధర్మముకలదో వాడు జీవించినవాడు. గుణములు ధర్మము లేనివాని జీవితము ప్రయోజనము లేనిదగును.

వివరణము :- ప్రపంచములో గుణములకే ఆదరము కలదు—

సర్వత్ర గుణవానేవ చకాస్తి ప్రథితో నరః ।
మణి మూర్ధ్ని గలే బాహౌ పాదపీఠేఽపి శోభతే ॥

మణిశిరస్సు నందున్నను, మెడలోనున్నను, బాహువుపైనున్నను, పాదపీఠమునందున్నను నెట్లు ప్రకాశించునో యట్లే గుణవంతుడైనవాడు అన్నిచోట్ల ప్రకాశింపగలడు.

శూరాశ్చ కృతవిద్యాశ్చ రూపవత్యశ్చ యోషితః ।
యత్ర యత్ర గమిష్యన్తి తత్ర తత్ర కృతాదరాః ॥

శూరులు, వీరులు, విద్వాంసులు, అందకత్తెలైన స్త్రీలు ఎక్కడకు వెళ్ళినను ఆదరింపబడుదురు. మఱొకకవి—మనుష్యు డీ పార్థివ శరీరమును విడిచివెళ్ళినను అతని గుణములవలన నేర్పడిన యశశ్శరీరము అతని మరణానంతరముకూడ జీవించియుండును. మర్యాదాపురుషోత్తముడైన రాముడు, యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు, వాల్మీకి మహర్షి, వ్యాసమహర్షి, దయానందమహర్షి తమగుణములచే జీవించియేయున్నారు. ధార్మికులైనవారి జీవితముకూడ మంచిదే. ధర్మహీనుడైనవాడు పశువుతో సమానుడు—

ఆహార నిద్రా భయ మైథునం చ సమానమేతత్ పశుభిర్నరాణామ్।
ధర్మో హి తేషామధికో విశేషో ధర్మేణ హీనాః పశుభిః సమానాః॥
(హితో. 1-25)

తినుట, నిద్రించుట భయపడుట, బిడ్డలకనుట యను నాలుగును మనుష్యులకు పశువులకు సమానమే. మనుష్యులలో ధర్మమను గుణము విశేషముగా నుండును. అట్టి ధర్మములేని మనుష్యులు పశువులతో సమానులు.

శ్లో॥ యదీచ్ఛసి వశీకర్తుం జగదేకేన కర్మణా ।
పరాపవాదసస్యేభ్యో గాం చరన్తీం నివారయ ॥ 14

అర్థము :- జగత్ = జగత్తును, ఏకేన=ఒక్కచే, కర్మణా = కర్మతో, వశీకర్తుం=వశముచేసికొనుటకు, ఇచ్ఛసియది=కోరుచున్నచో, పరాపవాద సస్యేభ్యః=ఇతరులను నిందించుటయను పైరునుండి, చరన్తీం = మేయుచున్న, మాట్లాడుచున్న, గాం = ఆవును, నాలుకను వాటిని నివారయ=అడ్డగింపుము, వశము చేసికొనుము.

తా॥ ఒకే కర్మతో జగత్తును వశము చేసికొనవలెనను కోరిక యున్నచో నితరులను నిందించుటయను పొలములో మేయుచున్న గోవు వంటి నాలుకను వశపటుచుకొనుము. ఇతరులచేలో మేయుచున్న ఆవును మరల్చినట్లు ఇతరులను నిందించు నాలుకను వశపఱచుకొనవలెను.

వివరణము :- ప్రపంచమును వశము చేసికొనదలచినచో నెవ్వరిని నిందింపరాదు నిందించుటచే నెవ్వడును ప్రసన్నుడుకాడు. నిందయనగా నేమి ? మహర్షి దయానంద సరస్వతి నిందానిర్వచన మిట్లు చేసెను—

మిథ్యాజ్ఞానము. మిథ్యాభాషణము, అసత్యము చెప్పుటలో పట్టుదలకలిగి, గుణములవదలి అవగుణములు కలిగియుండుట నింద యనబడును. వేదమాత—

మానిందత । (ఋ. 4-5-2) నిందింపవద్దు. నిందించుటయనునది దుష్టులు, మూర్ఖులునైనవారి స్వభావము. కావున నెవరికివారు దీనినుండి రక్షించుకొనవలెను.

శ్లో॥ ప్రస్తావసదృశం వాక్యం ప్రభావసదృశం ప్రియమ్ ।
ఆత్మశక్తి సమం కోపం యో జానాతి స పండితః॥ 15

అర్థము:- యః=ఏది, ప్రస్తావసదృశ్యం=సందర్భమున కనుకూల ముగనుండునట్లు, వాక్యం=మాట్లాడుటయు, ప్రభావ సదృశం=తన గొప్ప దనమునకు దగినట్లు, ప్రియం=మధురముగా మాట్లాడుటయు, ఆత్మశక్తి సమం= తన శక్తికి తగినట్లు, కోపం=కోపించుటయు, జానాతి=తెలిసి కొనుచున్నాడో, సః=వాడు, పండితః=పండితుడు.

తా॥ సందర్భాను సారముగా మాట్లాడుటయు, తన శ్రేష్ఠత కను కూలముగ మధురభాషణ చేయుటయు, తన శక్త్యనుసారము కోపముకలిగి యుండుటయు ననువానిని తెలిసికొనినవాడే పండితుడు.

వివరణము :- ప్రసంగానుకూలముగ మాట్లాడుటను గూర్చి 'డబ్ల్యు టెంపిల్' అనువాడు మాటలాడుటలో మొదటి అంశము సత్యము, రెండవది తెలిసికొని "మాటలాడుట, మూడవది సుందరముగా, వినోదముగా నుండుట, నాల్గవది వాక్చాతుర్యము" అనెను. తన గొప్పతనమునకు తగినట్లు మాట్లాడవలెను. మధురముగా నుండవలెను. ముఖస్తుతి చేయవద్దు. అబద్ధ ప్రశంసలు చేయవద్దు. అసత్యము చెప్పవద్దు. తన శ్రేష్ఠతకు అనుకూల ముగా ప్రియము, సత్యము, హితకరము, మధురముగా చతురముగా నుండునట్లు మాట్లాడవలెను. శక్తికిమించిన క్రోధ ముండరాదు. క్రోధము బుద్ధి ప్రకాశమును ఆర్పును. క్రోధము క్రోధముకలవారిని కాల్చును. కాని క్రోధము తన శక్తికి లోబడియుండవచ్చును. ఆ క్రోధమువలన నితరులకు మేలు కలుగవలెను. అది మన్యువు.

ఒకడిట్లు చెప్పెను— ఏ క్రోధమువలన తన కుటుంబము, ఇష్ట మిత్రులు, ఇతరుల ప్రవర్తన బాగుపడుట, ఈశ్వరునియందు పూజ్యబుద్ధి కలుగుట, దయ, ఉదారత, పరోపకార ప్రవృత్తియు కలుగునో యట్టి క్రోధము చెడ్డదికాదు.

శ్లో॥ ఏక ఏవ పదార్థస్తు త్రిధా భవతి వీక్షితః ।
కుణపః కామినీ మాంసం యోగిభిః కామిభిః శ్వభిః ॥16

అర్థము :- ఏకఏవ=ఒక్కటే, పదార్థస్తు = పదార్థమైతే (స్త్రీ శరీరము), యోగిభిః=యోగులతోను, కామిభిః=కాముకులతోను, శ్వభిః =కుక్కలతోను, వీక్షితః=చూడబడినదై, త్రిధా = మూడువిధములుగా, భవతి=అగుచున్నది, కుణపః = శవముగా (యోగి దానిని అతి నిందిత శవముగా చూచును), కామినీ=సుందర స్త్రీగా (కాముకుడైన పురుషుడు అందమైన స్త్రీగా జూచును) మాంసం=మాంసపుముద్దగా, (కుక్క మాంస పిండముగా) ఇట్లు మూడు విధములుగా జూడబడుచున్నది.

తా॥ ఒకే పదార్థము మూడు రకములుగా చూడబడుచున్నది. స్త్రీ శరీరము యోగులచేత శవముగాను, కామముగల వారిచేత కామినిగాను, కుక్కలచేత మాంసముముద్దగాను ఇట్లు మూడు విధములుగా చూడబడు చున్నది. దృష్టినిబట్టి సృష్టి కనబడును.

శ్లో॥ సుసిద్ధ మౌషధం ధర్మం గృహచ్ఛిద్రం చ మైథునమ్ ।
కుభుక్తం కుశ్రుతం చైవ మతిమాన్న ప్రకాశయేత్ ॥17

అర్థము :- మతిమాన్=బుద్ధిమంతుడు, సుసిద్ధం = ఉత్తమ పద్ధతిలో తయారుచేయబడిన, ఔషధం=ఔషధమును, ధర్మమ్=తానుజేసిన దాన, జప, తపాది ధర్మకార్యములను, గృహచ్ఛిద్రం = ఇంటిలోనున్న దోషములను, చ=మరియు, మైథునం=స్త్రీ సంభోగమును, కుభుక్తం= చెడ్డ భోజనమును, చ=మరియు, కుశ్రుతం=విన్న చెడ్డమాటలను, ఏవ =కూడ, న ప్రకాశయేత్=ఎన్నడు నెవ్వనికి చెప్పరాదు.

తా॥ బుద్ధిమంతుడు ఉత్తమ పద్ధతిలో తయారుచేయబడిన ఔషధ మును, తాను చేయుదానము, జపము, తపము మొదలగు ధర్మకార్యము

లను, ఇంటిలోనున్న దోషములను, స్త్రీ సంభోగమును, చెడ్డ భోజనమును, వినిన నిందావాక్యములను ఎవ్వడును నెన్నడును వెల్లడింపరాదు.

వివరణము :- ఇవి యన్నియు వ్యక్తికి సంబంధించిన కర్మలు కావున రహస్యముగా నుంచుట యుత్తమము, సిద్ధౌషధమును గూర్చి విన్నవాడు తనకు కావలెనని కోరును. ఈకున్నచో శత్రువగును లేదా నిందించును. దాన, జప, తపములగూర్చి చెప్పుకొన్నచో నవి తరిగి పోవును. మఱియు మనుష్యునిలో అభిమానము పెరుగును. ఇంటిలోని దోషములు వెల్లడింపుకొన్నచో లాభములేదు సరికదా విన్నవారి దృష్టిలో తేలికయై నవ్వులపాలు కావలసివచ్చును. స్త్రీ సంభోగము రహస్యముగా చేయుక్రియ. చెడు భోజనము, నిందావాక్యముల వెల్లడించుటచే తనకు అపయశస్సు కలుగును.

శ్లో॥ తావన్మౌనేన నీయన్తే కోకిలై శ్చైవ వాసరాః ।
యావత్సర్వ జనానంద దాయినీ వాక్ప్రవర్తతే ॥ 18

అర్థము:- యావత్ = ఎంతకాలమువఱకు, సర్వజనానందదాయినీ = సర్వజనుల కానందమునిచ్చు, వాక్ = వసంతఋతువు, ప్రవర్తతే = వచ్చునో, తావత్ = అంతవఱకు, కోకిలైః = కోయిలలతో, వాసరాః = రోజులు, మౌనేన = మౌనముతో, నీయంతే = కదపబడుచున్నవి.

తా॥ సర్వ జనానందకరమగు తన వాక్కును వసంతఋతువు వచ్చు వఱకు కోయిలలు రోజులన్నింటిని మౌనముగా గడపును.

వివరణము :- ఈ శ్లోకమునకు అర్థము వ్రాయుటలో టీకాకారు లందఱు పొరపాటుపడిరి. కొన్ని అనువాదములకు నమూనా చూడుడు—

1. జనులందఱకు ఆనందము నిచ్చువాక్కు ప్రారంభము కానంత వఱకు కోయిల మౌనముగా నుండును.

2. కోయిల అందఱకు ఆనందము నిచ్చువాక్కు చెప్పుటలో సామర్థ్యము కలుగనంత వఱకు మౌనముగా నుండును.

3. కోయిల వాక్కుచే ప్రజలు ప్రసన్నులు కానంతవఱకు మౌనముగా నుండును. తరువాత తన వాక్కును మధురముగా తయారుచేసికొని అన్నిచోట్లను ప్రతిధ్వనింప జేయును.

ఈ యనువాదములన్నియు సత్యార్థమునకు చాల దూరముగా నున్నవి. కోయిలకు మొదట వాక్కు కఠినముగా నుండునా? తరువాత మధురమగునా? కోయిల సహజముగానే మధురముగా కూయును.

ఇక్కడ వాక్ శబ్దమున కర్థము వసంతఋతువు. కోయిల కూత వసంతఋతువులోనే వినబడును. తక్కిన ఋతువులలో మౌనముగా నుండును. గోదురుకప్ప బెకబెక లాడునపుడు కోయిల మౌనముగా నుండును. ఈ విధముగా బుద్ధిమంతుడు మౌనముగా నుండి సమయము వచ్చినపుడు మాత్రమే ప్రియముగా హితముగా మధుర వచనముల పలుకవలెను.

శ్లో॥ ధర్మం ధనం చ ధాన్యం చ గురోర్వచన మౌషధమ్।
సుగృహీతం చ కర్తవ్య మన్యథా తు న జీవతి ॥ 19

అర్థము :- ధర్మం=ధర్మాచరణము, ధనం=ధనార్జనము, చ=అట్లే, ధాన్యం=నానావిధ ధాన్యసంచయము, చ=మఱియు, గురోః=గురువుయొక్క, వచనం=వచనపాలనము చ=అట్లే, ఔషధం = నానా విధములగు నోషధుల సేవించుటయు, సుగృహీతం = శాస్త్రపద్ధతిగ ప్రయత్నించుట, కర్తవ్యం=చేయదగినది, అన్యథా=అటుల కాకున్నచో, తు=నిశ్చయముగా, న జీవతి=మనుష్యుడు సరిగా జీవింపలేదు.

తా॥ ధర్మాచరణము, ధనార్జనము, ధాన్యము మొదలగు అన్ని పదార్థములను సంపాదించుట, గురువు వచనముల పాలించుటయు విస్తే నానావిధములగు నోషధులను సేవించుటయును వానిని ప్రయత్నపూర్వక ముగా చేయవలెను. ఈ విధముగా జేయకున్నచో మనుష్యుడు బాగుగా జీవింపలేడు.

వివరణము :- ధర్మాచరణము విషయములో చూడుడు—

ధర్మదానకృతం సౌఖ్య మధర్మాత్ దుఃఖసమ్భవమ్ ।
తస్మాద్ధర్మం సుఖార్థాయ కుర్యాత్ పాపం వివర్జయేత్ ॥
(స్కందపురాణము)

ధర్మము, దానములవలన సుఖము, అధర్మమువలన దుఃఖము ప్రాప్తించును. అందుచేత సుఖప్రాప్తికొఱకు మానవుడు ధర్మము నాచరించుచు పాపమును విడువవలెను. ధనోపార్జన విషయములో—

ధనైర్నిష్కులీనాః కులీనాభవన్తి
ధనైరాపదం మానవా నిస్తరన్తి ।
ధనేభ్యః పరో బాంధవో నాస్తి లోకే
ధనాన్యర్జయధ్వం ధనాన్యర్జయధ్వమ్ ॥(నీతిసారము)

ధనమున్నచో కులహీనుడు గొప్పకులమువాడగును. ధనముద్వారా మనుష్యుడు ఆపదలనుండి తప్పించుకొనగలడు. ప్రపంచములో ధనము కంటె మించిన స్నేహితుడులేడు. ఇందువలన ధనమును సంపాదింపుము. ధాన్యసంగ్రహ విషయములో వేదవచనము—

అన్నస్య కీలాల ఉపహూతో గృహేషు నః ॥ (యజు. 3-43)

తినదగిన యుత్తమమగు అన్నాది పదార్థములతో మన యిండ్లు నిండియుండవలయును. గురువచనపాలనము— గురువు యొక్క యుచిత

వచనములను పాలించుటవలన శిష్యునకు కల్యాణము చేకూరును. అందు చేత గురువచనములను శ్రద్ధాపూర్వకముగ పాలింపవలెను.

ఓషధుల సంగ్రహము (ప్రోగు) చేయుట—

అచింత్యో హి మణిమంత్రౌషధీనాం ప్రభావః ।

(దశకుమార చరితము)

మణి, మంత్రము, ఓషధుల ప్రభావమును మనమూహింపలేము. రోగ నివృత్తికొఱకు ముందుగానే ఓషధులను ప్రోగుచేసి యుంచుకొన వలయును.

శ్లో॥ త్యజ దుర్జన సంసర్గం భజ సాధు సమాగమమ్ ।
కురు పుణ్యమహోరాత్రం స్మర నిత్య మనిత్యతామ్॥ 20

అర్థము :- ఓ మానవా! నీవు, దుర్జనసంసర్గం= దుర్జన స్నేహమును, త్యజ = విడువుము. సాధు సమాగమం = సజ్జన స్నేహమును, భజ=పొందుము, చేయుము, అహోరాత్రం=రాత్రింబవళ్ళు, పుణ్యం= శుభకార్యములను, కురు=చేయుము, నిత్యం = ఎల్లపుడు, అనిత్యతాం= ప్రపంచముయొక్క అనిత్యతను, స్మర=తలంచుము.

తా॥ ఓ మానవా! నీవు దుష్టుల స్నేహము విడువుము. సజ్జన స్నేహము పొందుము. రాత్రింబవళ్ళు శుభకర్మలు చేయుము. ఎల్లపుడు ఈ ప్రపంచ మనిత్యమని తలంచుచు పరమేశ్వరుని స్మరింపుము.

వివరణము :- ఓ మానవా! నీవు దుర్జన స్నేహమువిడిచి సజ్జన సాంగత్యము చేయుము.—

యది సత్సంగ నిరతో భవిష్యసి భవిష్యసి ।
అథ దుర్జన సంసర్గే పతిష్యసి పతిష్యసి ॥

సజ్జనుల సాంగత్యముసం దానక్తికలిగి ప్రవర్తించువాడు ఉన్నతు డగును. అటులకాక దుర్జనుల సాంగత్యము చేసినచో పతితులగుదురు. ప్రపంచము ననిత్యముగా దెలిసికొని భగవంతుని స్మరింపుము.

వేదము—

వాయురనిల మమృత మథేదం భస్మాంతగ్ం శరీరమ్ ।

ఓ౩మ్ క్రతో స్మర క్లిబే స్మర కృతగ్ం స్మర॥ (యజు. 40-15)

ఆత్మ అభౌతికము. అందుచే మరణింపదు. ఈ శరీరము భస్మముతో నంతమగును. కావున కర్మముచేయు స్వభావముగల జీవా! నీవు ఓ౩మ్ నామముగల పరమాత్మను స్మరింపుము. నీ సామర్థ్యమును (పరాక్రమహీనతను) స్మరింపుము. మఱియు నీవు చేసిన కర్మల స్మరింపుము. నీవుచేయు కర్మలగూర్చి పర్యాలోచనము చేయుము.

చతుర్దశాధ్యాయము సమాప్తము.

# పంచదశాధ్యాయము

శ్లో॥ యస్య చిత్తం ద్రవీభూతం కృపయా సర్వజంతుషు ।
తస్య జ్ఞానేన మోక్షేణ కిం జటాభస్మలేపనైః ॥ 1

అర్థము :- యస్య=ఎవనియొక్క, చిత్తం=హృదయము, సర్వజంతుషు=అన్నిప్రాణులయందు, కృపయా = దయతో, ద్రవీభూతం= ద్రవించునో, కఱగునో, తస్య = అతనికి, జ్ఞానేన = జ్ఞానముతోగాని, మోక్షేణ = మోక్షప్రాప్తికి ఉపాయముల ననుష్ఠించుటతోను, జటాభస్మలేపనైః=జడలు పెంచుకొని శరీరమునింద బూడిద పూసికొనుటతోడను, కిం=ఏమి ప్రయోజనము ?

తా॥ ఎవని యొక్క హృదయము సమస్త ప్రాణులయందు దయతో ద్రవించునో అతనికి జ్ఞానప్రాప్తి వలన మోక్షప్రాప్తి కలుగును. అటుల కాక జడలు ధరించి శరీరమునిండ బూడిద పులుముకొన్నచో నేమి ప్రయోజనము కలుగును?

వివరణము :- ప్రతి ప్రాణియందు దయకలిగి యుండుటయే మానవునకు పరమధర్మము. ప్రతి మనుజుడు ఇట్టి భావనయే కలిగి యుండవలెను.—

న త్వహం కామయే రాజ్యం న స్వర్గం నాపునర్భవమ్ ।
కామయే దుఃఖతప్తానాం ప్రాణినామార్తినాశనమ్ ॥

నాకు రాజ్యమునం దిచ్ఛలేదు. స్వర్గమునందుకాని మోక్షమునందు కాని యిచ్ఛలేదు. నాకు కేవలము పీడిత ప్రాణులకున్న దుఃఖమును కష్టములను దూరముచేయుట యందే కోరికకలదు. ఈ ద్రవీభూతభావము మిక్కిలి మహత్త్వముకలది. దయ రెండురకములుగా నుండును. నిష్క్రియదయ, సక్రియదయ. నిష్క్రియదయలో మనుష్యుడు దుఃఖమును, సానుభూతిని ప్రకటించును. అంతకంటెమించి యేమియుచేయడు. ఇది దుర్బలులైన వారికి సంబంధించిన దయ- ఎక్కువమంది యిట్టివారే యుందురు. సక్రియ దయగలవారు ఇతరుల దుఃఖముచూచి ద్రవీభూతులై దుఃఖితుల దుఃఖమును దూరము చేయుటకు తనశక్తి సామర్థ్యముల నన్నింటిని సమర్పింతురు. ఇట్టి దయాలురు జ్ఞానముతోను, మోక్షముతోను, జడల ధరించుటతోను, భస్మము పులుముకొనుటతోను నెట్టి ప్రయోజనమును పొందలేరు.

శ్లో॥ ఏక మేవాక్షరం యస్తు గురుః శిష్యం ప్రబోధయేత్ ।
పృథివ్యాం నాస్తి తద్ద్రవ్యం యద్దత్వా చానృణీ భవేత్ ॥ 2

అర్థము :- యః=ఏ, గురుస్తు=గురువైతే, శిష్యం=తన శిష్యుని గూర్చి, ఏకం=అద్వితీయమైన, అక్షరంఏవ=వినాశరహితమైన ఓం శబ్దవాచ్యుడగు పరమేశ్వరునే, ప్రబోధయేత్ = పూర్ణబోధచేయునో, పృథివ్యామ్=భూమిమీద, తత్=అటువంటి, ద్రవ్యం = ద్రవ్యము ధనము, నాస్తి=లేదు, యత్ = దేనిని, దత్వా = గురువునకిచ్చి శిష్యుడు, చ= నిజముగా, అనృణీ = ఋణములేనివాడు, భవేత్ = అగునో—అట్టి ధనములేదు.

తా॥ గురువు శిష్యునకు అద్వితీయము, వినాశరహితమగు ఓం అను పరమేశ్వరుని ముఖ్యనామమును బాగుగా బోధించును. అట్టి గురువునకు ఋణము తీర్చుకోదగిన పదార్థమిచ్చి ఋణ విముక్తిని బొందుటకు సరిపోయినది యేదియులేదు.

వివరణము :- పరమేశ్వరుని గూర్చి సరిగా బోధించువారు దుర్లభముగా నుందురు. పరమాత్మనుగూర్చి బాగుగా బోధించు గురువుయొక్క ఋణము తీర్చుకొనుట యసంభవము.

శ్లో॥ ఖలానాం కంటకానాం చ ద్వివిధైవ ప్రతిక్రియా ।
ఉపానాన్ముఖభంగో వా దూరతో వా విసర్జనమ్ ॥ 3

అర్థము :- ఖలానాం=దుష్టులకు, చ=మఱియు, కంటకానాం = ముండ్లకు, ప్రతిక్రియా=ఉపాయము, ద్వివిధైవ=రెండువిధములే, దుష్టులను, ముండ్లనుకూడ, ఉపానాత్=చెప్పుతో, ముఖభంగో వా = దుష్టుని ముఖముమీద కొట్టుట, ముల్లుముక్కు విఱుగకొట్టుటయో, వా = లేక, దూరతః=దూరముగా, విసర్జనమ్=విడుచుటయో చేయవలెను.

తా॥ దుర్మార్గులకు, ముండ్లకు చేయదగిన ప్రతిక్రియ రెండు విధములుగా నుండును. ఒకటి ముఖమున చెప్పుతో కొట్టుటయు, రెండవది దూరముగా విడిచిపెట్టుటయు.

వివరణము :-దుర్జన సాంగత్యము మంచిదికాదు.

దుర్జనేన సమం సఖ్యం వైరంచాపి న కారయేత్ ।
ఉష్ణో దహతి చాంగారః శీతః కృష్ణాయతే కరమ్ ॥
(హితో. 1-81)

దుర్జనులతో స్నేహముకాని వైరముకాని పనికిరాదు. ఆ రెండు విధములవలనను అనిష్టమే ప్రాప్తించును. మండుచున్న బొగ్గును అంటుకొనిన కాల్చును. నీళ్ళతో తడిపి చల్లబడచినచో ఆ బొగ్గు తాకిన చేతిని మసి నల్లగా జేయును

శ్లో॥ కుచైలినం దంతమలోపసృష్టం
బహ్వాశినం నిష్ఠురభాషిణం చ ।
సూర్యోదయే చాస్తమితే శయానం
విముంచతి శ్రీర్యది చక్రపాణిః ॥ 4

అర్థము :- కుచైలినం=మలిన వస్త్రధారిని, దంతమలోపసృష్టం=పాచినపళ్ళవానిని, బహ్వాశినం=మిక్కిలి భుజించువానిని, చ = అట్లే, నిష్ఠురభాషిణం=కటువుగా, కఠినముగా మాట్లాడువానిని, సూర్యోదయే=సూర్యోదయ సమయమునను, చ=మఱియు, అస్తమయే = అస్తమించు సమయమునను,శయానం=నిద్రించువానిని,యది చక్రపాణిః=విష్ణువైనను, శ్రీః=లక్ష్మి, ఆరోగ్యము, సౌందర్యము, శోభ, విముంచతి = విడిచి పెట్టును.

తా॥ మలిన వస్త్రముల ధరించినవానిని, పాచిపళ్ళవానిని, మిక్కిలి తిండిపోతును, కఠినముగా మాట్లాడువానిని, సూర్యోదయమగునపుడు, సూర్యాస్తమయమగునపుడు నిద్రించువానిని లక్ష్మి, ఆరోగ్యము, సౌందర్యము, శోభ విడిచిపెట్టును. విష్ణువైనను తప్పించుకొనలేడు.

వివరణము :- (1) వస్త్రముల సంబంధము శరీరముతో నుండును. మైల వస్త్రములవలన ఆరోగ్యము చెడును. మనస్సుకూడ దూషితమగును.

(2) దంతములను శుభ్రపఱచుకున్నచో దంతములపైన దంతముల మధ్య పాచిచేరి క్రుళ్లి చిన్నచిన్న పురుగులు పుట్టును. దంతములు పుచ్చిపోవును ఆ దంతములలోని చెడు పదార్థము ఆహార పానీయముల ద్వారా పొట్టలోనికి వెళ్లి రక్తములో కలిసి యనేక రోగములు కలుగును.

(3) పొట్టకుమించి తినినచో లక్ష్మి విడిచిపెట్టును. ఎక్కువ తినుటచే ఆరోగ్యము చెడును. మనుమహర్షి—

అనారోగ్య మనాయుష్య మస్వర్గ్య చాతిభోజనమ్ ।
అపుణ్యం లోక విద్విష్టం తస్మాత్తత్పరివర్జయేత్ ॥
(మను. 2-57)

అధికముగా భుజించుటచే ఆరోగ్యము, ఆయువు, స్వర్గము (సుఖము-పుణ్యము) క్షీణించి లోకనింద కలుగును. అందుచే నధికముగా భుజింపరాదు.

(4) కఠినముగా మాట్లాడుచున్నచో నెవ్వరును ప్రేమింపరు. కఠినముగా, తీక్ష్ణముగా, ఇష్టముకాని రీతిగా మాట్లాడుటవలన ఆయువు క్షీణించును. వేదము—

ఉగ్రం వచో అపావధీః । (సామ. 3-53)
ఓ మానవా ! నీవు కఠినముగా మాట్లాడవద్దు.

(5) సూర్యోదయము తర్వాత సూర్యాస్తమయమునకు ముందు నిద్రించుచున్నచో తేజస్సు క్షీణించి ఆయువు తగ్గిపోవును. అందువలన చాణక్యుడు మహాకవోట—

న హి కర్మాణి చత్వారి సంధ్యాకాలే ప్రయోజయేత్ ।
ఆహారం మైథునం నిద్రాం తథా స్వాధ్యాయ మేవ చ ॥
(చాణక్యసార సంగ్రహము 1-5)

భోజనము, మైథునము నిద్రించుట, స్వాధ్యాయము అను నాలుగును సంధ్యాసమయమున చేయరాదు. శ్రీ అనుదాని కర్థము లనేకములు గలవు. అందులో ధనసంపత్తి యొకటి. సురిన వస్త్రములు మొదలైన వానితో గూడిన వ్యక్తి లక్ష్మిని కోల్పోవును. ఆరోగ్య రూపలక్ష్మి కూడ లేనివాడగును. 'ధనమాయుర్నిరామయమ్' రోగములేని జీవనమే ధనము.

శ్లో॥ త్యజన్తి మిత్రాణి ధనైర్విహీనం
దారాశ్చ భృత్యాశ్చ సుహృజ్జనాశ్చ ।
అపి చార్థవన్తం పునరాశ్రయన్తే
అర్థో హి లోకే పురుషస్య బంధుః ॥ 5

అర్థము :- ధనైః = ధనములతో, విహీనం = లేనివానిని మిత్రాణి = స్నేహితులు, దారాశ్చ = భార్యయు, భృత్యాశ్చ = సేవకులును, సుహృజ్జనాశ్చ = స్నేహితులు (మంచిహృదయము గలవారు), చ = బంధు బాంధవులు, త్యజన్తి = విడుతురు, చ = మరియు, అర్థవన్తం = ధనము కలవాడైన, తం = అతనిని, పునః = తిరిగి, ఆశ్రయన్తే = ఆశ్రయించి చేరుదురు, లోకే = లోకమందు, అర్థోహి = ధనమే, పురుషస్య = పురుషునకు, బంధుః = బంధువు.

తా॥ మిత్రులు, భార్యయు, అట్లే యింటిలోనుండు నితరస్త్రీలు, భృత్యులు, సేవకులు, స్నేహితులు, బంధు బాంధవులు ధనములేనివానిని విడిచిపెట్టుదురు. అట్లే ధనము గలిగినంతనే విడిచినవారందరు తిరిగి వానిని చేరుదురు. ధనమే మనుష్యునకు లోకములో బంధువు.

వివరణము :-ధనవిహీను నందఱు విడిచిపెట్టుదురు.

శుక్రాచార్యుడు—

అస్తియావత్తు న ధన స్తావత్సర్వైస్తు సేవ్యతే ।
నిర్ధన స్త్యజ్యతే భార్యాపుత్రాద్యైః సగుణోప్యతః ॥
(శుక్ర. 3-177)

ధనమున్నంతకాల మాతని నందఱు సేవింతురు. గుణవంతు డైనను ధనహీనుడైనచో భార్యా పుత్రులుకూడ విడిచిపెట్టుదురు. ప్రపంచ ములోని వ్యవహారములు సాగించుటకు ధనమావశ్యము. అందువలన విద్య, సేవ, శూర వీరత, కృషి, వ్యాపారము, సంగీతము చేతి కళలు మొదలైన వానిద్వారా ధనము నంపాదింపవలెను. ధనికులదగ్గఱ గుణవం తులుకూడ సేవకులవలె పడియుందురు.

శ్లో॥ అన్యాయోపార్జితం ద్రవ్యం దశవర్షాణి తిష్ఠతి ।
ప్రాప్తే చైకాదశే వర్షే సమూలం తద్వినశ్యతి ॥ 6

అర్థము :- అన్యాయోపార్జితం = అన్యాయముగా కూడబెట్టిన, ద్రవ్యం=ద్రవ్యము ధనము, దశవర్షాణి=పది సంవత్సరములు, తిష్ఠతి= నిలబడును, చ=మఱియు, ఏకాదశే=పదునొకండవ,వర్షే=సంవత్సరము, ప్రాప్తే=రాగానే, తద్=ఆధనము, సమూలం = మొత్తము, వినశ్యతి= నశించును.

తా॥ అన్యాయముగా సంపాదించిన ధనము పది సంవత్సరము లుండును. పదునొకండవ సంవత్సరమురాగానే సమూలముగా(మొత్తము) నశించును.

వివరణము :- అన్యాయార్జిత ధనము సమూలముగా నశించును—

మనుమహర్షి—

అధర్మేణైధతే తావత్తతో భద్రాణి పశ్యతి ।
తతః సపత్నాన్ జయంతి సమూలస్తు వినశ్యతి ॥
(మను. 4–174)

మనుష్యుడు అధర్మముగా అనగా అన్యాయముగా ధర్మము విడిచి గొంతులుకోసిన సంపాదించిన ధనముతో మొదట ఉన్నతి పొందును. బంగళాలు, ధనధాన్యములు, నౌకరులు, బంధు బాంధవులు, మొదలగు వానితో సుఖముగా నుండును. తరువాత శత్రువులనుగూడ జయించును. కాని చివరకు ఇల్లు వాకిళ్ళు, పొలముపుత్రులు, ధనము ధాన్యము మొదలగునవన్నియు నశించును. వేదము—

అగ్నినా రయిమశ్నవత్ పోషమేవ దివే దివే ।
యశసం వీరవత్తమమ్ ॥ (ఋ. 1-1-3)

మనుష్యుడు ఈశ్వరుని ఉపాసనద్వారా తన పురుషార్థముద్వారా ప్రతిదినము పుష్టినిచ్చు నట్టియు, నిరంతర మభివృద్ధి నిచ్చుచు కీర్తిని కలిగించుచు, కోర్కెల దీర్చునట్టి ధనమును పొందును. భక్తుడు ప్రభువును ప్రార్థన చేయుచున్నాడు—

యా మా లక్ష్మీః పతయాలూరజుష్టాభి చస్కంద వన్దనేవ వృక్షమ్।
అన్యత్రాస్మత్ సవితస్తామితో ధా హిరణ్యహస్తో వసు నో రరాణః॥
(అథర్వ. 7-115-2)

దురాచారములలో పడవేయునట్టియు, సేవింపదగనట్టియు ధన సంపత్తి నన్నంటుకొని యున్నది. మారేడుచెట్టుపై వంటుకొనియుండి దానికి సుఖమిచ్చునట్లు ఓ సృష్టికర్తవైన దేవ! ఆ అదుపాముపంటి లక్ష్మిని మానుండి దూరము చేయుము. సువర్ణాది ధన సంపన్న! నీవు మాకు నుత్తమ ధనము నిమ్ము. మేము విశ్వాసముతో ధనము సంపాదింపవలెను. అధర్మముతో సంపాదించిన ధనము బహుకాలము నిలువదు.

శ్లో॥ అయుక్తం స్వామినో యుక్తం యుక్తం నీచస్య
దూషణమ్ ।
అమృతం రాహవే మృత్యు ర్విషం శంకర భూషణమ్॥7

అర్థము :- స్వామినః = సమర్థుడైన మనుష్యునకు, అయుక్తం = అయోగ్యమైనదియు, లేక అనుచితకార్యము కూడ, యుక్తం = ఉచితమైనదేయగును, నీచస్య = నీచునకు, యుక్తం = ఉచితమైనకార్యము కూడ, దూషణం = దోషయుక్త మగును, రాహవే = రాహువునకు, అమృతం = అమృతము, మృత్యుః = మృత్యువయ్యెను, విషం = సముద్ర మథనమున కలిగిన విషము, శంకరభూషణమ్ = శంకరునకు కంఠాభరణ మయ్యెను.

తా॥ సమర్థుడైన మనుష్యునకు అయోగ్యమైనదికూడ యోగ్యమైనదగును. యోగ్యమైనదికూడ నీచునకు దోషయుక్తమగును. రాహువునకు అమృతము మృత్యువయ్యెను. విషము శంకరుని కంఠమునకు భూషణమయ్యెను.

వివరణము :- ఈ శ్లోకము పురాణ కథకు సంకేతముగా నున్నది. ఈ శ్లోకము మా ఆలోచన ప్రకారము నిశ్చయముగా ప్రక్షిప్తమే.

శ్లో॥ తద్భోజనం యద్ ద్విజభుక్త శేషం
తత్సౌహృదం యత్క్రియతే పరస్మిన్ ।
సా ప్రాజ్ఞతా యా న కరోతి పాపం
దంభం వినా యః క్రియతే స ధర్మః ॥ 8

అర్థము :- యత్ = ఏది. ద్విజభుక్త శేషం = బ్రాహ్మణులు తినగా మిగిలినదో, తత్ = అది, భోజనమ్ = భోజనము, పరస్మిన్ = ఇతరునియందు, యత్ = ఏది, క్రియతే = చేయబడునో, తత్ = అది, సౌహృదం =

స్నేహము, యా = ఏది, పాపం = పాపమును, నకరోతి = చేయదో, సా = అది, ప్రాజ్ఞతా = బుద్ధిమత్త, యః = ఏది, దంభం = డాంబికము, వినా = లేకుండ, క్రియతే = చేయబడునో, సః = అది, ధర్మః = ధర్మము.

తా॥ బ్రాహ్మణులు భుజింపగా మిగిలియున్న యన్నమే భోజనము ఇతరులపై జూపబడు ప్రేమ, స్నేహమే సౌహృదము (స్నేహము). ప్రాజ్ఞత (బుద్ధికలిగి యుండుట) యనగా పాపకార్యము చేయకుండుట. ఆడంబరములేకుండచేయు ధర్మము (పేరుకొఱకు చేయునదికాక) మోసము లేనిదియు ధర్మమగును

వివరణము :- బ్రాహ్మణులు భుజించిన తరువాత మిగిలినదే భోజనము—

విఘసాశీ భవేన్నిత్యం నిత్యం వాఽమృత భోజనః ।
విఘసో భుక్త శేషం తు యజ్ఞశేషం తథాఽమృతమ్ ॥
మను. 2-285)

గృహస్థుడు విఘసాశనుడు కాని లేక అమృత భోజనుడు కాని కావలయును, బ్రాహ్మణులు భుజింపగా మిగిలిన భోజనము విఘసమనియు, పంచయజ్ఞానంతరము మిగిలినదానిని అమృత మనియు నందురు.

శ్లో॥ మణిర్లుంఠతి పాదాగ్రే కాచః శిరసి ధార్యతే ।
క్రయ విక్రయ వేలాయాం కాచః కాచో మణిర్మణిః॥9

అర్థము :- మణిః = మణి, పాదాగ్రే = పాదమునకు ముందుభాగమున, లుంఠతి = ప్రేలాడుచుండును, కాచః = గాజు, శిరసి = శిరస్సుమీద, ధార్యతే = ధరింపబడుచున్నది, క్రయ విక్రయ వేలాయాం = ఆ వస్తువులు కొనునపుడు అమ్మునపుడు, కాచః = గాజు, కాచః = గాజే, మణిః = మణే,

మణిః = మణియే. దేనివిలువదానిదే. రత్నము ఆభరణముగా కాలి కున్నను దాని విలువ దానికుండును. అట్లే గాజు తలమీద నున్నను దానివిలువ దానికే యుండును.

తా॥ పాదము చివర మణి (రత్నము) వ్రేలాడుచుండును. గాజు, పూస శిరస్సుపై నేదోయొక రూపమున నుండును. ఆ రెంటిని (రత్నము గాజుపూసను) కొనునప్పుడుగాని అమ్మునపుడుకాని గాజుపూస గాజుపూపే రత్నము రత్నమే. అనగా దేనివెల దానిదే. ఒకదానివెల మఱొకదానికి రాదు.

శ్లో॥ అనంత శాస్త్రం బహులాశ్చ విద్యాః
అల్పశ్చ కాలో బహువిఘ్నతా చ ।
యత్సారభూతం తదుపాసనీయం
హంసో యథా క్షీరమివాంబు మధ్యాత్ ॥ 10

అర్థము :- అనంతశాస్త్రం = వేదాది ధర్మశాస్త్రము లనంతములు, చ = మఱియు, విద్యాః = విద్యలు, బహులాః = ఎక్కువ, చ = నిశ్చయముగా, కాలః = సమయము, అల్పః = తక్కువ, చ = మఱియు, విఘ్నతా, = విఘ్నము, బహు = ఎక్కువ, యత్ = ఏది, సారభూతం = సారమో, తత్త్వమో, తత్ = అదీ, ఉపాసనీయమ్ = గ్రహింపదగినదీ, యథా = ఎట్లు హంసః = హంస, అంబుమధ్యాత్ = నీటిమధ్యనుండి, క్షీరం = క్షీరమును గ్రహించునో అట్లు గ్రహింపవలెను.

తా॥ వేదాది ధర్మశాస్త్రములు అనంతములు. విద్యలు చాల గలవు. సమయము తక్కువ. విఘ్నములు (అవాంతరములు) ఎక్కువ. అందువలన శాస్త్రములలోని సారమేదో దానినే గ్రహింపవలెను. హంస నీటితో

కలిసియున్న పాలనెట్లు విడదీసి గ్రహింతునో యట్లే శాస్త్ర సారమును గ్రహింపవలెను.

వివరణము :- వేదములు, బ్రాహ్మణములు, అరణ్యకములు, ఉపని షత్తులు స్మృతులు శ్రౌతసూత్రములు, గృహ్య సూత్రములు, ఇతిహాస ములు మొదలగునవి అనంతములు. కొందరి మతములో నాలుగే విద్యలు—

ఆన్వీక్షికీ త్రయీ వార్తా దండనీతిశ్చ శాశ్వతీ ।
విద్యాశ్చతస్ర ఏవైతా యోగక్షేమాయ దేహినామ్ ॥

(కామందకీయ 2-2)

తర్కశాస్త్రము, వేదత్రయీ విద్య, వ్యవసాయము, పశుపోషణ, శాశ్వతమైన దండనీతి యను నాలుగు విద్యలు మనుష్యుల యోగక్షేమముల కుపయోగపడును. మనుమహర్షి ఆత్మ విద్యను గూడ వీనితో కలిపెను. (మను. 7-43)

సాధారణముగా 14 విద్యల నంగీకరింతురు. నాలుగు వేదములు, ఆరు వేదాంగములు (శిక్ష,కల్పము, వ్యాకరణము ఛందస్సు,జ్యోతిషము, నిరుక్తము), ధర్మము, మీమాంస, తర్కము (న్యాయశాస్త్రము) పురాణ ములు (ఇతిహాస గ్రంథములు) సమయము తక్కువ. జీవితము అల్పము. కార్యము విశాలమైనది. జీవనము అల్పము. సమయము పూర్ణముగా కాక తక్కువగా నున్నది.

శ్లో॥ దూరాగతం పథి శ్రాంతం వృథా చ గృహ
మాగతమ్ ।
అనర్చయిత్వా యో భుంక్తే స వై చాండాల ఉచ్యతే॥11

అర్థము :- దూరాగమనం= దూరమునుండి నడచివచ్చువానిని పథిశ్రాంతం=మార్గమున నడచి అలసినవానిని, చ=మరియు, వృథా=

కారణము లేకుండ, స్వార్థముకొఱకుకాక, గృహం=ఇంటికి, ఆగతం=వచ్చినవానిని, అనర్చయిత్వా=పూజింపక, యః=ఏ గృహస్థుడు, ఘంత్తే=ఘణించునో, సః=వాడు, వై=నిశ్చయముగా, చాండాలః = చండాలుడని, ఉచ్యతే=చెప్పబడుచున్నాడు.

తా॥ దూరమునుండి నడచి అలసిపోయి అకారణముగా నింటికి వచ్చిన వారిని ఆదరాభిమానములతో సత్కరింపక ఘణించినవాడు చాండాలుడని చెప్పబడును.

వివరణము :- ఇంటికి వచ్చిన యతిథిని సత్కరింపవలెను.

సంప్రాప్తాయ త్వతిథయే ప్రదద్యాదాసనోదకే ।
అన్నం చైవ యథాశక్తి సత్కృత్య విధిపూర్వకమ్ ॥
(మను. 3-99)

ఇంటికి వచ్చిన యతిథికి కాళ్ళ కడుగుకొనుటకు నీరు, కూర్చుండుటకు ఆసనము, శక్త్యనుసారము రుచికరమైన భోజనము శాస్త్రాను సారము ఈయవలెను.

ఏ కొంచె మైనను నీకున్నను

తృణాని భూమి రుదకం వాక్ చతుర్థీం చ సూనృతా ।
ఏతాన్యపి సతాం గేహే నోచ్ఛిద్యన్తే కదాచన ॥ (మను. 3-10)

గడ్డితో తయారుచేసిన ఆసనము పడుకొనుటకు, భూమి కూర్చుండుటకు, కాళ్ళ కడుగుకొనుటకు, త్రాగుటకు నీరు, మధుర వచనము అను నాలుగు సజ్జనుల గృహములలో నెల్లపుడు నుండును. అన్నాదులు లేనపుడు వైవానిద్వారా అతిథులను సత్కరింపవలెను.

శ్లో॥ పఠన్తి చతురో వేదాన్ ధర్మశాస్త్రాణ్యనేకశః ।
ఆత్మానం నైవ జానన్తి దర్వీపాక రసం యథా ॥ 12

అర్థము :- చతురః = నాలుగు, వేదాన్ = వేదములను, అనేకశః = అనేకములైన, ధర్మశాస్త్రాణి = ధర్మశాస్త్రములను, పఠన్తి = చదువు చున్నారు. ఆత్మను. పరమాత్మను. నైవజానన్తి = ఎఱుగనే యెఱుగరు. దర్వీ = తెడ్డు. యథా = ఎట్లు. పాకరసం = పాకము (వంట) లోని రుచిని యెఱుగదోయట్లు.

తా॥ ఋగ్వేదాది నాలుగు వేదములను, అనేకములగు ధర్మశాస్త్రము లను పఠించినను ఆత్మ మఱియు పరమాత్మ జ్ఞానములేనివారు—కూర చట్టిలో తిరుగు తెడ్డుకు కూరరుచి తెలియక వ్యర్థమైనట్లుగా వ్యర్థు లగుదురు.

వివరణము :- సమస్త వేదములలో ధర్మశాస్త్రములలో పరమాత్మను గూర్చియే యుండును. వేదాది శాస్త్రములు ఆత్మ పరమాత్మ జ్ఞానముతో నిండియుండును. శాస్త్రములన్నియు బ్రహ్మను దెలిసికొనుటకు పిలిచి పిలిచి చెప్పుచున్నవి. వేద మిట్లనుచున్నది—

యస్తన్న వేద కిమృచా కరిష్యతి (ఋ. 1-164-39)

సర్వోత్పాదకుడైన పరమేశ్వరుని తెలియనివానికి వేద పఠనముతో నేమి ప్రయోజనము ?

శ్లో॥ ధన్యా ద్విజమయీ నౌకా విపరీతా భవార్ణవే ।
తరన్త్యధోగతాః సర్వే ఉపరిస్థాః పతంత్యధః ॥ 13

అర్థము :- ద్విజమయీ = బ్రాహ్మణరూపమగు, నౌకా = నౌక, ధన్యా = ధన్యమైనది, భవార్ణవే = సంసారమను సముద్రములో, విపరీతాః = వ్యతిరేక పద్ధతిలో, అధోగతాః = క్రిందనున్నవారు, సర్వే = అందఱు,

తరంతి=దాటి ఒడ్డుకు చేరుచున్నారు. ఉపరిష్ఠాః = అనావకుపైన నున్న వారు, అధః=క్రిందికి, పతన్తి=పడుచున్నారు. అనగా బ్రాహ్మణులతో నమ్రతగా మెలగువారు భవసాగరమునుండి తరింతురనియు, గర్వముతో బ్రాహ్మణులను లెక్కచేయనివారు నావపైనుండి క్రిందికి పడిపోయి సంసార సాగరములో మునుగుదురని తాత్పర్యము.

తా॥ బ్రాహ్మణరూప నౌక సంసారరూప సాగరములో విపరీత పద్ధతిలో నడచుచు ధన్యమైనది. విపరీతముగా నడచుటయేమి ? ఆ నౌకకు క్రింది భాగములో నుండువారు అందఱు సంసార సాగరమునుండి తరింతురు. కాని ఆ నావకు పైననుండువారు క్రిందకు పడిపోవుదురు. అనగా బ్రాహ్మణులతోకూడ నమ్రభావముతో వ్యవహరించువారు తరింతురు. నమ్రభావములేక అభిమానముతో అవమానము చేయువారు పతనమగుదురు.

వివరణము :- ధర్మాత్ముడు, నీతిజ్ఞుడునైన విదురుడు ధృతరాష్ట్రునకు వినాశమును సూచించు 8 లక్షణములను చెప్పెను—

అష్టౌ పూర్వ నిమిత్తాని నరస్య వినశిష్యతః ।
బ్రాహ్మణాన్ ప్రథమం ద్వేష్టి బ్రాహ్మణైశ్చ విరుధ్యతే ॥
బ్రాహ్మణస్వాని చాదత్తే బ్రాహ్మణాంశ్చ జిఘాంసతి ।
రమతే నిందయా చైషాం ప్రశంసాం నాభినందతి ॥
నైతాన్ స్మరతి కృత్యేషు యాచిత శ్చాభ్య సూయతి ।
ఏతాన్ దోషాన్నరః ప్రాజ్ఞో బుధ్యేద్ బుద్ధ్వా విసర్జయేత్ ॥
(భార. విదుర. 1-98,99-100)

వినాశముపొందు పురుషునిలో నీ క్రింది యెనిమిది లక్షణములు కనబడును. 1) వాడు బ్రాహ్మణులను ద్వేషింప మొదలిడును, 2)

బ్రాహ్మణులతో విరోధించును. 3) బ్రాహ్మణుల ధనమును గుంజును. 4) బ్రాహ్మణులకు శారీరక దండనకాని నష్టపఱచుటకుగాని కోరును. 5) బ్రాహ్మణులను నిందించుట సుఖముగా భావించును. 6) బ్రాహ్మణ ప్రశంసచే ప్రసన్నుడుకాడు. 7) ఉత్సవాదులలో బ్రాహ్మణులను లెక్క చేయడు. వారితో సంప్రదించడు. వారిని పిలువడు. 8) బ్రాహ్మణుల నుండి ఏమియు కోరడు. వారిని హీనముగా జూచును. బుద్ధిమంతు డీ దోషముల దెలిసికొని వీనిని విడిచి పెట్టవలెను.

శ్లో॥ అయమమృతనిధానం నాయకోఽప్యౌషధీనాం
అమృతమయ శరీరః కాంతియుక్తోఽపి చంద్రః ।
భవతి విగతరశ్మి ర్మండలం ప్రాప్య భానోః
పరసదననివిష్టః కో లఘుత్వం న యాతి ॥ 14

అర్థము:- అయం=ఈ, చంద్రః=చంద్రుడు, అమృత నిధానం=అమృత భండారము, ఓషధీనాం=ఓషధులకు, నాయకః=అధిపతి, అపి=కూడ, అమృతమయ శరీరః=ఈతని శరీరము అమృతమయము, కాంతి యుక్తః అపి=కాంతికలదైనను, చంద్రుడు పగటి యందును, అమావాస్య నాడును, భానోః=సూర్యుని యొక్క, మండలం=మండలమును, ప్రాప్య =పొంది, విగతరశ్మిః=కాంతివిహీనుడు, భవతి=అగుచున్నాడు, పరసదన నివిష్టః=ఇతరుల యిండ్లలో నున్నవాడు, కః = ఎవడు, లఘుత్వం = తేలికను, న యాతి=పొందడు? తేలికకాడు? ఇతరుల యిండ్లలో నున్నచో గౌరవము పోయి తేలిక యగుదురు.

తా॥ ఈ చంద్రుడు అమృత భండారము. ఓషధుల కధిపతి. ఈతని శరీరము అమృతమయము. మఱియు కాంతియుక్తమైనది. ఇట్టి చంద్రుడు పగటియందు అమావాస్యనాడు సూర్యుని మండలమును పొంది కాంతి

విహీనుడై తేజస్సును కోల్పోవును. ఇతరుల యిండ్లలోనికి వెళ్ళినవాడు ఎవడు తేలికకాడు ? ఇతరుల యిండ్లలో తలదాచుకొనువాడు తేలికగా చూడబడును.

వివరణము :- ఇతరుల యిండ్లకు చేరినవాని ఘనత తగ్గిపోవును—

గంగ యెంతదూరము ప్రవహించినను, ఎంత యుపయోగకారి యైనను, ఎంత మహత్త్వము కలదైనను సముద్రమును చేరగానే తన వ్యక్తిత్వమును కోల్పోవు చున్నదిగదా !

శ్లో॥ అలిరయం నలినీదల మధ్యగః
కమలినీ మకరంద మదాలసః ।
విధివశా త్పరదేశ ముపాగతః
కుటజపుష్పరసం బహు మన్యతే ॥ 15

అర్థము :- అయం = ఈ, అలిః = తుమ్మెద, నలినీదల మధ్యగః = పద్మదళముల మధ్యలో నున్నదై, కమలినీ = పద్మములోని, మకరంద = తేనెయొక్క, మదాలసః = మదముతో సోమరియై విధివశాత్ = దైవవశమున, పరదేశం = ఇతర స్థలమునకు, ఉపాగతః = వెళ్ళినదై, కుటజ పుష్పరసం = కుటజ (కరీర) పుష్పరసమునే, బహు = ఎక్కువగా, మన్యతే = తలంచుచున్నది. ఆ పుష్పములో మధువుగాని, గంధముకాని యుండదు.

తా॥ తుమ్మెద పద్మమునందుచేరి యందలి పుప్పొడి రసమును (తేనెను) త్రాగి మత్తెక్కి యుండును. అదే తుమ్మెద విధివశమున పద్మమును విడిచి పొదలోచేరి యందలి పుష్పములలో సుగంధముకాని, తేనెకాని లేకున్నను దానినే గొప్పగా దలచి కాలము గడపుచున్నది.

శ్లో॥ పీతః క్రుద్ధేన తాత శ్చరణ తలహతో వల్లభో యేన రోషాద్

ఆబాల్యాద్విప్రవర్యైః స్వవదనవివరే ధార్యతే
వైరిణీ మే ।
గేహం మే ఛేదయంతి ప్రతిదివస ముమాకాన్త
పూజా నిమిత్తం
తస్మాత్ఖిన్నా సదాహం ద్విజకుల నిలయం
నాథ యుక్తం త్యజామి ॥ 16

అర్థము :- లక్ష్మి విష్ణువుతో చెప్పుచున్నది— యేనక్రుద్ధేన = కుపితుడగు అగస్త్యునిచేత, తాతః = మా తండ్రియగు సముద్రుడు, పీతః = త్రాగబడెనో, విప్రవరుడగు భృగువు — రోషాత్ = రోషమువలన, వల్లభః = నా ప్రాణప్రియుడగు విష్ణువును, చరణతలహతః = తన్నెనో, విప్రవర్యైః = శ్రేష్ఠబ్రాహ్మణులద్వారా, ఆబాల్యాత్ = చిన్నతనము నుండి, స్వవదనవివరే = తమ ముఖమను కన్నమునందు, మే = నాయొక్క, వైరిణీ = శత్రువైన సరస్వతి, ధార్యతే = ధరింపబడు చున్నదో, ప్రతిదివసం = ప్రతిదినము ఉమాకాంత పూజానిమిత్తం = పార్వతి భర్తయగు శివపూజ కొఱకు, మే = నాయొక్క, గేహం = ఇల్లైన పద్మమును, ఛేదయంతి = కోయుచున్నారు, నాథ ! = ఓ నాథుడా! తస్మాత్ = అందువలన, ఖిన్నా = దుఃఖితురాలనై, అహం = నేను, ద్విజకుల నిలయం = బ్రాహ్మణుల యింటిని, సదా = ఎల్లప్పుడు, యుక్తం = దానికి తగినట్లుగా, త్యజామి = విడుచుచున్నాను. అనగా బ్రాహ్మణులు నిర్ధనులని భావము. విద్వాంసు లందఱు నిర్ధనులు (ధనములేనివారు) కారు. చాలమంది విద్వాంసులు గొప్ప ధనవంతులును గలరు.

తా॥ లక్ష్మి విష్ణువుతో చెప్పుచున్నది. నాథ! అగస్త్య మహర్షి కోపముతో నా తండ్రియైన సముద్రుని త్రాగి క్రమింగెను. విప్రశ్రేష్ఠుడైన భృగుమహర్షి నాభర్తయైన విష్ణువును కోపముతో తన్నెను. చిన్నతనము

నుండియు నా శత్రువైన సరస్వతిని బ్రాహ్మణబాలురు తమ నోటిలో ధరించుచున్నారు. శివుని పూజకొఱకు బ్రాహ్మణులు నా నివాసమైన పద్మము లను నిత్యము కోయుచున్నారు. అందుచేత దుఃఖముపొందిన నేను ఎల్లపుడు బ్రాహ్మణులను విడిచియే యుందును.

వివరణము :- సముద్రమును త్రాగుటయు, విష్ణువును తన్నుట మొదలైనవి గప్పాలు (కోతలు). విద్వాంసులు నిర్ధనులుగా నుండుటను కావ్యభాషలో మనోహరముగా జెప్పెను. కాని విద్వాంసు లందఱు నిర్ధనులుకారు. అనేక విద్వాంసులు ధనవంతులును గలరు.

శ్లో॥ బన్ధనాని ఖలు సన్తి బహూని
ప్రేమరజ్జు దృఢబన్ధన మన్యత్ ।
దారుభేద నిపుణోఽపి షడంఘ్రిర్
నిష్క్రియో భవతి పంకజకోశే ॥ 17

అర్థము :- బంధనాని = బంధనములు, ఖలు = నిశ్చయముగా, బహూని=చాల, సన్తి=కలవు, కాని ప్రేమరజ్జు దృఢబంధనం = ప్రేమ యను త్రాటితో కట్టబడిన బంధనము. అన్యత్ = మఱొకటి ఆశ్చర్య కరమైనది ఉన్నది, దారుభేద నిపుణః = కొయ్యను భేదించు శక్తిగలది, అపి=అయిననుకూడ, షడంఘ్రిః=తుమ్మెద, పంకజకోశే=పద్మములో బంధింపబడి, నిష్క్రియః=ఏమియు చేయలేనిది, భవతి = అగుచున్నదీ. కమలముతో మిక్కిలి స్నేహముకలది కావున సామర్థ్యముండియు దానిని భేదించుటలేదు.

వివరణము :- ప్రేమ బంధములో చిక్కుకొని తుమ్మెద అశక్తయై పద్మములో నుండిపోయెను. దాని నొకకవి మనోహరముగా వర్ణించెను—

రాత్రిర్గమిష్యతి భవిష్యతి సుప్రభాతం
భాస్వానుదేష్యతి హసిష్యతి పంకజశ్రీః ।
ఇత్థం విచింతయతి కోశగతే ద్విరేఫే
హా హంత హంత నళినీం గజ ఉజ్జహార ॥

తా॥ సాయంకాల మొక తుమ్మెద పద్మములోని తేనె త్రాగు చుండగా నది ముడుచుకొనెను. అందులో చిక్కుకొన్న తుమ్మెద రాత్రి గడవగానే తెల్లవారును. సూర్యుడుదయించును. పద్మము వికసించును. నేను ఎగిరి లేచి పోవుదును. అని యనుకొను చున్నంతలో పాపము సరస్సులో నేనుగు దిగి ఆ పద్మమును పీకి నమిలెను. కావున ఓ మానవా! ప్రేమించుము కాని మోహములో చిక్కుకొనకుము. మోహములో చిక్కుకొన్నచో నీవును తుమ్మెదవలె నశింతువు.

శ్లో॥ ఛిన్నోఽపి చందన తరుర్న జహాతి గంధం
వృద్ధోఽపి వారణపతి ర్న జహాతి లీలామ్ ।
యంత్రార్పితో మధురతాం న జహాతి చేక్షుః
క్షీణోఽపి న త్యజతి శీలగుణాన్ కులీనః ॥ 18

అర్థము :- చందనతరుః = గంధపుచెట్టు, ఛిన్నోఽపి = ఛేదింపబడి నను, గంధం = సువాసనను, నజహాతి = విడువదు, వారణపతిః = గజరాజు వృద్ధోఽపి = ముసలిదైనను, లీలాం = కామక్రీడను, న జహాతి = విడువదు, ఇక్షుః = చెఱకు, యంత్రార్పితః = యంత్రములో గానుగలో వేయబడినను, మధురతాం = తియ్యదనమును, న జహాతి = విడువదు, కులీనః = గొప్ప కులమున బుట్టినవాడు, క్షీణోఽపి = క్షీణదశ పొందినను, శీలగుణాన్ = దయాదాక్షిణ్యము మొదలగు గుణములను, నత్యజతి = విడిచిపెట్టడు.

తా॥ మంచి గంధపుచెట్టును నఱకినను దానివాసనపోదు. ఏనుగు ముసలిదైనను కామక్రీడను విడువదు. చెఱకుగడను యంత్రములోవేసి నలుగగొట్టినను తీపిదనముపోదు. గొప్పకులమునందు పుట్టినవాడు దారిద్ర్యము సంభవించినను దయ, దాక్షిణ్యము మొదలగు సద్గుణములను విడువడు.

వివరణము :- ఈ భావముతో సమానమైన మఱొక శ్లోకమును చూడుడు—

ఘృష్టం ఘృష్టం పునరపి పునశ్చందనం చారుగంధమ్
ఛిన్నం ఛిన్నం పునరపి పునః స్వాదు చైవేక్షుకాండమ్ ।
దగ్ధం దగ్ధం పునరపి పునః కాంచనం కాంతవర్ణం
ప్రాణాన్తేఽపి ప్రకృతి ర్వికృతి ర్జాయతే నోత్తమానామ్ ॥

(హనుమన్నాటకము 5-8)

తా॥ చందనము నెంత యరగదీసిన నంత యధికముగ సువాసన వచ్చును. చెఱకు నెంత చితుకకొట్టుట లేక నములుట చేయుదురో యంత తీపి యెక్కువగా నుండును. పైనుండి నఱకగా నఱకగా క్రిందిముక్కలో తీపి యెక్కువగా నుండును. బంగారమును కాల్చినకొలది మలినముపోయి మిక్కిలి మెఱయును. ఈ విధముగా ఉత్తమ పురుషులు ప్రాణాంతము వఱకుకూడ నెందుకుండరు.? వారి స్వభావములో మార్పురాదు.

పంచదశాధ్యాయము సమాప్తము.

# షోడశాధ్యాయము

శ్లో॥ న ధ్యాతం పదమీశ్వరస్య విధివత్సంసార విచ్ఛిత్తయే
స్వర్గద్వారకపాట పాటన పటుర్ధర్మోఽపి నోపార్జితః ।
నారీపీన పయోధరోరు యుగలం స్వప్నేఽపి నాలింగితం
మాతుః కేవల మేవ యౌవన వనచ్ఛేదే
కుఠారా వయమ్ ॥ 1

అర్థము :- మరణశయ్యపై పడియున్న వృద్ధుడు పశ్చాత్తాపపడుట చూడుడు— నా జీవితములో నెన్నడును, సంసారవిచ్ఛిత్తయే = సంసార బంధమును ఛేదించుటకు, (మోక్షప్రాప్తికొఱకు) విధివత్ = యోగాభ్యాస పూర్వకముగ, ఈశ్వరస్య = ఈశ్వరునియొక్క, పదం = ప్రాప్తవ్య స్వరూపమును, నధ్యాతం=ధ్యానము చేయలేదు, స్వర్గద్వారకపాటపాటన పటుః=స్వర్గద్వారముయొక్క తలుపులు తెఱచుటకు సమర్థమైన,ధర్మోఽపి =ధర్మముకూడ, నోపార్జితః=సంపాదింపబడలేదు, స్వప్నేఽపి=కలలో నైనను, నారీ=స్త్రీయొక్క, పీన=బలిసిన, పయోధర=స్తనములు, ఉరు యుగలమ్=పెద్దజంట, నలింగితం=ఆలింగనము (కౌగిలింత) చేయబడ లేదు వయం=మేము, మాతుః=తల్లియొక్క, యౌవనవన = యౌవన మనెడు వనమును, ఛేదే = ఛేదించుటయందు, కేవలం = మాత్రము, కుఠారాఃఏవ=గొడ్డళ్ళవంటి వారముగా సిద్ధమైతిమి.

తా॥ మరణశయ్యపై పడియున్న యొక వృద్ధుని పశ్చాత్తాప మిదీ నేను నా జీవితములో నెన్నడును ఈ సంసారమును వలనుండి తప్పించు కొనుటకు (మోక్షముకొఱకు) యోగాభ్యాస పూర్వకముగ ఈశ్వరుని పొందుటకు తగిన ధ్యానము చేయలేదు. స్వర్గద్వారముయొక్క తలుపులు

తెలియుటకు దగిన ధర్మమును గూడ సంపాదింపలేదు. కలలోగూడ స్త్రీయొక్క పెద్ద పెద్ద స్తనములను, కౌగలింపలేదు. మేమందఱము తల్లుల యొక్క యౌవనమను వృక్షమును నఱకునట్టి గొడ్డళ్లగా మాత్రమే యున్నాము.

వివరణము :-మనుష్యజన్మ పొందినందుకు మూడుపనులు చేయవలెను—

1) ఈ సంసారమను సాగరమును తరించుటకు, మోక్ష ప్రాప్తి కొఱకు పరమేశ్వరునియందు భక్తికలిగి యుండవలెను సచ్చిదానంద స్వరూపుడైన పరమేశ్వరుని ఓంమ్ అను నామమును జపించుచు ధ్యానింపవలెను.

2) స్వర్గద్వారముల తెఱపించు ధర్మసంచయము చేయవలెను. ధర్మములో రెండు లోకములు తయారగును—

యతోఽభ్యుదయ నిఃశ్రేయస సిద్ధిః స ధర్మః ॥

(వైశేషిక 1-1-2)

ఏనియమముల పాటించి యనుష్ఠించినచో నిహపరలోకముల యభీష్టసిద్ధి కలుగునో యదియే ధర్మము.

3) గృహస్థ ధర్మమును పాటించుచు ధనమును సంపాదించి కోర్కెలదీర్చు కొనవలయును. తన దేశమును మంచి నాగరికత కలదానినిగా చేయవలెను. భక్తిలేనివాడు, ధర్మప్రవర్తన లేనివాడు, కామముల తీర్చుకొననివాడునైన మనుష్యుడు తల్లియొక్క యౌవనరూప వృక్షమును ఛేదించుట కుపయోగపడు గొడ్డలివంటి వాడగును.

శ్లో॥ జల్పన్తి సార్ధ మన్యేన పశ్యన్త్యన్యం సవిభ్రమాః ।
హృదయే చిన్తయన్త్యన్యం న స్త్రీణా మేకతో రతిః॥ 2

అర్థము :- కులటలు (వ్యభిచారిణులు), అన్యేన = ఇతరునితో, సార్థం = కూడ, జల్పన్తి = సంభాషణచేయుచుందురు. అన్యం = ఇతరుని, సవిభ్రమాః = విలాసపూర్వక దృష్టితో, పశ్యన్తి = చూచుచున్నారు. హృదయే = హృదయమందు, అన్యం = మరొకరినిగూర్చి, చిన్తయన్తి = ఆలోచింతురు. స్త్రీణాం = వేశ్యస్త్రీలకు, ఏకతః = ఒక్కనితో, రతిః = ప్రీతి, న = ఉండదు.

తా॥ కులటలు అన్యపురుషులతో సంభాషింతురు. ఇతర పురుషులను శృంగారమునకు సంబంధించిన హావభావములతో గూడిన విలాస దృష్టులతో జూతురు. హృదయములో మరొకనిగూర్చి యాలోచించుచుందురు. కులటలైన వేశ్యలగు స్త్రీలకు ఒకచోట ప్రీతియుండదు.

వివరణము :- పురుషులు వేశ్యలయం దనురక్తికలవారు కారాదు. కారణము—

ఏతా హసన్తి చ రుదన్తి చ విత్తహేతోః
విశ్వాసయన్తి పురుషం న తు విశ్వసన్తి ।
తస్మాన్నరేణ కులశీల సమన్వితేన
వేశ్యాః శ్మశానసుమనా ఇవ వర్జనీయాః ॥ (మృచ్ఛ. 4-14)

వేశ్యలు ధనప్రాప్తికొఱకు ధనమిచ్చువారిని సంతోషపెట్టుటకు కృత్రిమముగా నేడ్చుచు, కాముకులైన పురుషులయెడ రెచ్చగొట్టు హావభావముల ప్రదర్శించుచు, తా నెవ్వనియందు విశ్వాసముంచక నేను నిన్నే నమ్మియున్నాను. నా సర్వస్వము నీవేయని యాతనికి తనయందు విశ్వాసమును కలిగించుచు ప్రవర్తించు వేశ్యలను ఉత్తమ స్వభావముగల పురుషులు శ్మశానములో బుట్టిన మాలతీపుష్పముగా భావించి విడువవలెను రూపాదులున్నను వేశ్యను విశ్వసింపరాదు.

శ్లో॥ యో మోహాన్మన్యతే మూఢో రక్తేయం మయి కామినీ
స తస్యావశగో భూత్వా నృత్యేత్ క్రీడాశకుంతవత్ ॥ 3

అర్థము :- యః = ఎవడు, మూఢః = మూర్ఖుడైనవాడు, మోహాత్ = అవివేకమువలన, ఇయం = ఈ, కామినీ = సుందరి (వేశ్య) మయి = నాయందు రక్తా = అనురక్తికలిగినయది యని ప్రేమించునో, సః = వాడు, తస్యాః =, ఆమెకు, వశగః = వశమైనవాడు, భూత్వా = అయి, క్రీడాశకుంతవత్ = ఆటబొమ్మవలె, నృత్యేత్ = ఆడును.

తా॥ మూఢుడు అవివేకమువలన ఈస్త్రీ నాయందు దనురక్తికలదై యున్నదని తలంచును. అట్టివా డామెకు వశుడై కొయ్యబొమ్మవలె ఆడుచుండును.

వివరణము :- వేశ్య స్త్రీలయందు విశ్వాస ముంచరాదు.

స్త్రీషు న రాగః కార్యో రక్తం పురుషం స్త్రియః పరిభవన్తి ।
రక్తైవ హి రన్తవ్యా విరక్తభావా తు హాతవ్యా ॥
(మృచ్ఛ. 4-13)

వేశ్యస్త్రీలయం దనురాగముంచరాదు. వేశ్యస్త్రీలు అనురక్తుడైన పురుషునిగూడ ననాదరముగా చూతురు. తనయం దనురాగము కలిగిన భార్యతో క్రీడించుటయే తగును. అనురాగములేని స్త్రీని అన్నివిధముల విడువవలెను.

శ్లో॥ కోఽర్థాన్ ప్రాప్య న గర్వితో విషయిణః
కస్యాపదోఽస్తం గతాః
స్త్రీభిః కస్య న ఖండితం భువి
మనః కో నామ రాజ్ఞాం ప్రియః ।

కః కాలస్య న గోచరత్వమగమ
త్కోఽర్థీ గతో గౌరవం
కో వా దుర్జనవాగురాసు పతితః
క్షేమేణ యాతః పథి ॥ 4

తా॥ అర్థాన్ ప్రాప్య=సంపదలను పొంది, కః=ఎవడు, గర్వితః =గర్వముకలవాడు, న=కాడో. కస్య=ఎవనికి, విషయిణః = విషయాసక్తిని గలిగించు, ఆపదః = ఆపదలు అస్తం=పోయినవో. భువి = భూమిపై. కస్య=ఎవని యొక్క, మనః = మనస్సు. స్త్రీభిః = స్త్రీలతో, నఖండితః=ఖండింపబడదో. నాము=వాస్తవముగ. రాజ్ఞాం ప్రియఃకః = రాజులకు ప్రియమైనవాడెవడు ? కః=ఎవడు. కాలస్య = కాలునియొక్క గోచరత్వం=దృష్టిలో. నాగమత్=పడలేదో, అనగా కాలుని వశములో నెవడుండడు ? కః=ఏ, అర్థీ=యాచకుడు, గౌరవం=గౌరవమును, గతః =పొందెను? వా=లేక, కః=ఎవడు, దుర్జనవాగురాసు=దుర్జనుల వలలలో. పతితః=పడి. పథి=సంసార మార్గమున, క్షేమేణ=క్షేమముగా, యాతః=వెళ్లెను.

భా॥ సంపదలనుపొంది గర్వింపనివాడెవడు ? విషయములందు చిక్కుకొన్నవాడు ఆపదలు పొందనివాడెవడు? స్త్రీలద్వారా నెవని మనస్సు ఖండితముకాదు (చెడదు) ? వాస్తవముగ రాజులకు ప్రియుడెవడు ? ఎవడు కాలమునకు వశుడుకాడు ? యాచకుడైనవాడు గౌరవము నెవడు పొందెను? దుర్జనులవలలో చిక్కి నేర్పుగా తప్పించుకొన్నవాడెవడు ?

వివరణము :- పైనున్న ప్రశ్నలన్నింటికి నొక్కటే సమాధానము ఎవ్వడునులేడు. కాని ప్రపంచములో దీనికి విరుద్ధమైనదియు నున్నది—

చక్రవర్తి రాజ్యమును పొందియు భరతుడు అభిమానము పొంద లేదు. మహర్షి దయానందుని మనస్సును స్త్రీలు వశముచేసికొనలేదు. మదనమోహన మాలవ్య అందరికంటె పెద్ద బిచ్చగాడుగా భావించెడువాడు. ఆయన కాశీలోని విశ్వవిద్యాలయమునకు కోట్లకొలది రూపాయలు యాచించి తెచ్చినను గౌరవమును పోగొట్టుకొనలేదు.

శ్లో॥ న నిర్మితః కేన న దృష్టపూర్వః
న శ్రూయతే హేమమయః కురంగః ।
తథాఽపి తృష్ణా రఘునందనస్య
వినాశకాలే విపరీత బుద్ధిః ॥ 5

అర్థము :- హేమమయః = బంగారుమయమైన, కురంగః = లేడి, కేనాపి = ఎవనిచేతను న నిర్మితః = నిర్మింపబడలేదు, న దృష్టపూర్వః = పూర్వము చూడబడలేదు, న శ్రూయతే = వినబడలేదు, తథాఽపి = అయినప్పటికి, రఘునందనస్య = రామునకు, తృష్ణా = కోరిక కలిగెను, వినాశకాలే = వినాశకాలము సమీపించినపుడు, విపరీతబుద్ధిః = బుద్ధి వక్రించును.

తా॥ బంగారు లేడియున్నదని చూడలేదు. వినలేదుకూడ. కాని శ్రీరామచంద్రునకు బంగారులేడిని పట్టుకొనవలెనను కోరిక కలిగినది. వినాశకాలము సంప్రాప్తించినపుడు మనుష్యునకు విపరీతమైన (వ్యతిరేకమైన) బుద్ధి పుట్టును,

వివరణము :- వాల్మీకి రామాయణానుసారము లక్ష్మణుడు బంగారు లేడిని చూడగానే రామునితో చెప్పెను. ఇది బంగారు లేడికాదు. ఇది మారీచుడనెను. రాముడరణ్యమునకు వచ్చినది రాక్షస సంహారము కొఱకు కావున తెలిసికొనియు బంగారులేడి రూపములోనున్న మారీచుని వెంబడించెను.

శ్లో॥ గుణైరుత్తమతాం యాతి నోచ్చైరాసన సంస్థితః ।
ప్రాసాదశిఖరస్థోఽపి కాకః కిం గరుడాయతే ॥ 6

అర్థము :- మనుష్యుడు, గుణైః=దయా, దానము, దాక్షిణ్యము (చతురత) నమ్రత మొదలగు శ్రేష్ఠగుణములద్వారా, ఉత్తమతాం = శ్రేష్ఠత్వమును, యాతి = పొందుచున్నాడు, ఉచ్చైః = ఎత్తైన, ఆసన సంస్థితః=ఆసనముమీద కూర్చుండుటవలన, న = కాదు, ప్రాసాదశిఖరస్థః =మేడశిఖరముమీద నున్నను, అపి=కూడ, కాకః=కాకి,గరుడాయతేకిం? =గరుడపక్షియగునా? ఎన్నటికికాదు.

తా॥ మనుష్యుడు దయ, దానము, దాక్షిణ్యము, నమ్రత మొదలగు శ్రేష్ఠగుణములతో ఉత్తమత్వమును పొందును అంతియేకాని ఉన్నతాసనము నలంకరించినంత మాత్రమున గొప్పతనమురాదు. కాకి మేడ పైభాగమున కూర్చుండినంత మాత్రమున గరుడపక్షి యగునా ?

వివరణము :- ఈ విషయములో నీ క్రింది శ్లోకము చూడుడు—

ఇహ తురగశతైః ప్రయాన్తి మూఢాః
ధనరహితాస్తు బుధాః ప్రయాన్తి పద్భ్యామ్ ।
గిరిశిఖర గతాఽపి కాకపంక్తిః
పులినగతైర్న సమత్వమేతి హంసైః ॥

వందలకొలది గుఱ్ఱములపై ప్రయాణించు మూర్ఖులు కాలినడకను వెళ్ళునట్టి ధనరహితులైన పండితులతో సరికారు. కాకులపంక్తి కొండ పైభాగమున నున్నను, ఇసుక ప్రదేశములో నిలిచియున్న హంసలతో సమానముకావు.

శ్లో॥ గుణాః సర్వత్ర పూజ్యన్తే న మహత్యోఽపి సంపదః ।
పూర్ణేన్దు కిం తథా వన్ద్యో నిష్కలంకో యథా కృశః॥ 7

అర్థము :- సర్వత్ర = అంతట, గుణాః = మనుష్యగుణములు, పూజ్యన్తే =పూజింపబడుచున్నవి, గుణములను సమ్మానింతురు, మహత్యః =గొప్ప, సంపదః =సంపదలు, అపి =ఉన్ననుకూడ, న = గుణహీనుని సమ్మానింపరు, యథా = ఎట్లు, కృశః = క్షీణించినట్టి, నిష్కళంకః = కళంకములులేని, విదియనాటి చంద్రుడు, వంద్యః = నమస్కరింపదగిన వాడో, తథా =అట్లు, పూర్ణేందుః =పున్నమనాటి చంద్రుడు, వంద్యః కిమ్? =నమస్కరింపబడుచున్నాడా యేమి ? కారణము పూర్ణచంద్రునిలో మచ్చ కలదు. విదియనాటి చంద్రునిలో మచ్చ యుండదు.

తా॥ అన్ని ప్రదేశములందు మనుష్యుని గుణములు పూజింపబడును. గొప్ప సంపదలున్నను గుణహీనునిలో నవి పూజింపబడవు. ప్రకాశము తక్కువైనను నిష్కలంకమైన విదియనాటి చంద్రుని పూజించినట్లు కలంక సహితుడైన పూర్ణిమనాటి చంద్రుని పూజింపరు

వివరణము :- మహాకవి భవభూతి —

గుణాః పూజాస్థానం గుణేషు న చ లింగం న చ వయః
(ఉత్తరామ. 4-11)

గుణముల వలననే గుణము కలవారిని పూజింతురు. పూజింప దగినవి గుణములేకాని స్త్రీ పురుష భేదముకాని, చిన్న పెద్ద వయస్సుకాని కారణముకాదు.

శ్లో॥ పరప్రోక్త గుణో యస్తు నిర్గుణోఽపి గుణీ భవేత్ ।
ఇన్ద్రోఽపిలఘుతాం యాతి స్వయః ప్రఖ్యాపితైర్గుణైః॥8

అర్థము :- యః =ఏమనుష్యుడు, తు =అయితే, పరప్రోక్తగుణః = ఇతరులచే ప్రశంసింపబడిన గుణములు కలవాడో వాడు, నిర్గుణఃఅపి = గుణరహితుడైనను, గుణీ = గుణములు గలవాడు, భవేత్ = అగును, కాని, స్వయః =తనకుతాను, ప్రఖ్యాపితైః =ప్రశంసించుకొన్న, గుణైః =

గుణములతో, ఇన్ద్రోఽపి=దేవేంద్రుడుకూడ, లఘుతాం = నైచ్యమును, యాతి=పొందుచున్నాడు.

తా॥ నిర్గుణుడైనను ఇతరులచేత గుణవంతుడని పొగడబడినచో నతడు గుణవంతుడగును. తనయందు మంచి గుణములున్నను వానిని గూర్చి చెప్పుకొనువాడు తన గుణములను ప్రకటించుకొను ఇంద్రుడు తేలికయైనట్లు తేలికయైపోవును. తన గుణముల తాను చెప్పుకొనరాదు. పొగడుకొనరాదు.

వివరణము :- మనుష్యుడు తన జీవితములో శుభ గుణములను పెంపొందించుకొనవలెను. కాని తన నోటితో తన గుణముల ప్రస్తుతించు కొనరాదు. ప్రస్తుతించుకొన్నచో మనుష్యులలో తేలికయై పోవును.

శ్లో॥ వివేకిన మనుప్రాప్తా గుణా యాన్తి మనోజ్ఞతామ్ ।
సుతరాం రత్నమాభాతి చామీకరనియోజితమ్ ॥ 9

అర్థము :- గుణాః=గుణములు, వివేకినమ్ = సత్యాసత్యములు, ధర్మాధర్మములు, కర్తవ్యాకర్తవ్యములు తెలిసిన పురుషునే, అనుప్రాప్తాః= పొంది, మనోజ్ఞతాం=సౌందర్యమును, యాన్తి =పొందుచున్నవి, చామీకర నియోజితం=బంగారమునందు పొదగబడిన, రత్నము, సుతరామాభాతి= మిక్కిలి యందముగా గనబడును.

తా॥ గుణములు, సత్యాసత్యములు, ధర్మాధర్మములు, కర్తవ్యా కర్తవ్యముల నెఱిగిన వివేకిని పొందినపై సుందరమైనవగును. బంగారము నందు పొదగబడిన రత్నమువలె మిక్కిలి ప్రకాశించును.

శ్లో॥ గుణైః సర్వజ్ఞతుల్యోఽపి సీదత్యేకో నిరాశ్రయః ।
అనర్ఘ్యమపి మాణిక్యం హేమాశ్రయ మపేక్షతే ॥ 10

అర్థము :- గుణైః=గుణములతో, సర్వజ్ఞతుల్యః = పరమేశ్వరునితో సమానము, అపి=అయినసుకూడ, నిరాశ్రయః = ఆశ్రయములేక, ఏకః=ఒంటరిగా నుండువాడు, సీదతి=దుఃఖ మనుభవించును, అనర్ఘ్యం =మిక్కిలి వెలగల, మాణిక్యమపి = మాణిక్యముకూడ, హేమాశ్రయం =బంగారముయొక్క యాశ్రయమును, అపేక్షతే=కోరుచున్నది.

తా॥ గుణములలో సర్వజ్ఞతుల్యుడు (పరమేశ్వరునితో సమానుడు) అయినప్పటికిని ఆశ్రయము లేనివాడు ఒంటరిగా దుఃఖముల పాలగును. మిక్కిలి విలువగలిగినదైనను మాణిక్యము బంగారమునందు పొదగబడకున్నచో ప్రకాశింపదు కావున బంగారము నాశ్రయించును.

వివరణము :- మనుష్యుడు సంఘజీవి. ఒంటరిగా బ్రతుకజాలడు. మొదట చిన్నతనములో తల్లిదండ్రుల సాయముతో పెరుగును. తరువాత స్నేహితులతో, భార్యతో కుటుంబముతో జీవించును. ఇవి యన్నియు మంచివేయైనను ఇందులో నొక్కటియు స్థిరముగా నుండదు. ఇవి యన్నియు విడిపోవునవే. మనుష్యునకు సర్వశ్రేష్ఠమైన సహాయము పరమాత్మయే. అందుచేత మనుష్యుడు పరమాత్మతో సంబంధ మేర్పరచుకొని తన జీవితము నుద్ధరించుకొనవలెను.

శ్లో॥ అతిక్లేశేన యే చార్థా ధర్మ స్యాతిక్రమేణ తు।
శత్రూణాం ప్రణిపాతేన తే హ్యర్థా మా భవన్తు మే॥11

అర్థము :- యే అర్థాః=ఏధనములు, అతిక్లేశేన = మిక్కిలి కష్టముతో, (అనగా దొంగతనము, వ్యభిచారము, హింస, దోపిడి, ఇతరుల యధికారము పొందుటద్వారా పొందుట) చ=మఱియు, తు = ఏధనము, ధర్మస్యాతిక్రమేణ=ధర్మమునుల్లంఘించి, శత్రూణాం=శత్రువులయెదుట, ప్రణిపాతేన=తలవంచుటతో పొందబడినవో, హి=నిశ్చయముగా, తే=

అ. అర్థాః=ధనములు, మే=నాకు, మాభవన్తు = ప్రాప్తించకుండుగాక ! అనగా నట్టి ధనము నా కక్కఱలేదని భావము.

వివరణము :- మనుష్యుడు ధనము సంపాదింపవలెను. కాని యన్యాయార్జితమం దెన్నడు మనస్సు లగ్నము కారాదు. మనుష్యుడు అన్యాయముగా నొక్కపైసయైనను ఇంటిలోనికి తీసికొని రాకూడదు. అని సంకల్పించుకొనవలయును. అన్యాయార్జిత ధనముతో నింటిలో సుఖశాంతులుండవు.

శ్లో॥ కిం తయా క్రియతే లక్ష్మ్యా యా వధూరివ కేవలా ।
యా తు వేశ్యేవ సా మాన్యా పథికైరపి భుజ్యతే ॥12

అర్థము :- తయా=ఆ, లక్ష్మ్యా=లక్ష్మితో, (ధనసంపత్తితో) కిం= ఏమి, క్రియతే=చేయబడును? యా=ఏ సంపత్తి, వధూరివ=గృహిణివలె కేవలా=ఒంటరిగా ననుభవింపదగును. యా=ఏ సంపత్తి, తు=అయితే, వేశ్యా ఇవ=వేశ్యవలె నున్నదో, పథికైరపి = దారిపారుల చేతగూడ, భుజ్యతే = అనుభవింపబడును, సా = అట్టి ధనసంపత్తియే, మాన్యా= శ్రేష్ఠమైనది.

తా॥ ధనము కేవలము ఒంటరిగా అనుభవింపబడు భార్యవలెగాక పదుగురచే ననుభవింపబడు వేశ్యవలె దారినబోవు వారిచేతగూడ ననుభవింపబడునదిగా నుండవలెను. అనగా ధనము పదిమందికి నుపయోగపడవలెను. కాని కేవలము స్వార్థమునకొఱకే కారాదు.

వివరణము :- ధనమున్నందుకు ఫలము దానము. కేవల మొక్కరికే యుపయోగపడు ధనము ధనమేకాదు, అది మనుష్యునకు మృత్యువుతో సమానము. ఇతరులచేతకూడ ననుభవింపబడు ధనమే శ్రేష్ఠమైనది

అది పరోపకారమునకు, ప్రతిప్రాణి కల్యాణమునకు, మానవసేవ కుపయోగపడవలెను.

శ్లో॥ ధనేషు జీవితవ్యేషు స్త్రీషు చాహారకర్మసు ।
అతృప్తాః ప్రాణినః సర్వే యాతా యాస్యన్తి
యాన్తి చ ॥ 13

అర్థము :- ధనేషు=ధనవిషయములోను, జీవితవ్యేషు=జీవితమునకు, ఆయుస్సుకు సంబంధించిన విషయములోను, స్త్రీషు = స్త్రీలను సేవించు విషయములోను, చ=మఱియు, ఆహారకర్మసు = అన్నమును సేవించు విషయములోను, సర్వే=సమస్తమైన, ప్రాణినః = ప్రాణులు, అతృప్తాః=తృప్తి లేనివారై, యాతాః=వెళ్ళిరి, యాస్యన్తి = వెళ్ళుదురు, యాన్తి చ=వెళ్ళుచున్నారుకూడ.

తా॥ ధనము జీవనముకొఱకు, స్త్రీ సేవనముకొఱకు, ఆహారము కొఱకు నుపయోగించి ప్రాణులందఱు అసంతృప్తితో వెళ్ళిరి, వెళ్ళుదురు, వెళ్ళుచున్నారుకూడ.

వివరణము :- దీర్ఘాతి దీర్ఘమైన జీవితము తక్కువయే యగును. మనుష్యునకు ఆయుస్సు నిండిన తరువాత మరల ఆయుస్సు కలిగినను నాతనికి సంతుష్టిలేదు. ఇదే స్థితి స్త్రీ సంబంధమందు, ఆహారము తీసికొనుట లోను సంతుష్టి యుండదు—

యత్పృథివ్యాం వ్రీహి యవం హిరణ్యం పశవః స్త్రియః ।
న దుహ్యన్తి మనః ప్రీతిం పుంసా కామహతస్య తే ॥
(భాగవత. 9-19-13)

ఈ భూమిపై వడ్లు, జొన్నలు, గోధుమలు, బంగారము, పశువులు

స్త్రీలు ఇవి యన్నియు మనుష్యునకు లభించినను నతడు కామవాసనలు గలవాడై ఆశపెడించుచుండ నాతని మనస్సును సంతోషపెట్టజాలవు.

శ్లో॥ క్షీయన్తే సర్వదానాని యజ్ఞహోమ బలిక్రియాః ।
న క్షీయతే పాత్రదాన మభయం సర్వదేహినామ్॥ 14

అర్థము :- సర్వదానాని=అన్నము, జలము, వస్త్రము, భూదానము మొదలైనవియు, యజ్ఞ, హోమబలి క్రియాః=బ్రహ్మయజ్ఞము, దేవయజ్ఞము, బలివైశ్వ దేవయజ్ఞము మొదలగు సర్వకర్మలు, క్షీయన్తే=నశించుచున్నవి, కాని, పాత్రదానం = యోగ్యుల కిచ్చినదానము సర్వ దేహినాం = ప్రాణులన్నింటికి నిచ్చిన, అభయమ్ = అభయదానము, నక్షీయతే=నశింపదు.

తా॥ అన్నము, జలము, వస్త్రము, భూమిదానము మొదలైనవి, బ్రహ్మయజ్ఞము, దేవయజ్ఞము, బలివైశ్వదేవ యజ్ఞము మొదలైన క్రియ లన్నియు నష్టమగును. కాని యోగ్యుడైనవాని కిచ్చిన దానము ప్రాణు లందరకు నిచ్చిన యభయదానము ఎన్నడు నశింపదు.

వివరణము :- దానమునకు యోగ్యుడెవడు? బ్రహ్మచారి, జితేంద్రియుడు, వేదజ్ఞుడు, ధర్మాత్ముడు, సత్యవాది, ఉదారుడు, పరోపకార ప్రియుడు, నిందాస్తుతులందు హర్షశోకరహితుడు, అభిమానశూన్యుడు, గంభీరాశయుడు, సదాచారయుక్తుడు, దుష్టాచార రహితుడు, ఇతరుల సుఖముకొఱకు ప్రాణముల నర్పించుటకైనను సిద్ధపడువాడును, ఉత్సాహి, మొదలైన శుభలక్షణ యుక్తుడైన మనుష్యుడు దానయోగ్యుడు. ఇట్టివాని కిచ్చిన ధనము అక్షయమగును.

అభయదాన మహిమ—

అభయం సర్వభూతేభ్యో దత్త్వా యశ్చరతే మునిః ।
న తస్య సర్వభూతేభ్యో భయముత్పద్యతే క్వచిత్ ॥
(భార. శాంతి. 192-4)

ప్రాణుల కభయదానమిచ్చి సంచరించు మునికి సమస్త ప్రాణులలో నే ప్రాణినుండియు నెక్కడను భయముండదు.

శ్లో॥ తృణం లఘు తృణాత్తూలం తూలాదపి చ యాచకః ।
వాయునా కిం న నీతోఽసౌ మామయం
యాచయిష్యతి ॥ 15

అర్థము :- తృణం = గడ్డిపఱక. లఘు = తేలికయైనది, తృణాత్ = గడ్డిపఱకకంటె, తూలం = దూదియు, చ = మఱియు, తూలాదపి = దూది కంటెకూడ, యాచకః = యాచకుడు తేలిక. అయినచో. అసౌ = ఈ యాచకుడు. వాయునా = గాలితో, కిం = ఎందుకు, ననీతః = తీసికొని పోబడుట లేదు (ఎందుకు గాలిలో ఎగురదు), అయం = ఈ యాచకుడు, మాం = నన్ను, యాచయిష్యతి = యాచించునని, వాయునా = వాయువుచేత, ననీతః కిం = తీసికొని పోబడుటలేదాయేమి ?

తా॥ గడ్డి తేలిక. దానికంటె దూది తేలిక. దూదికంటె యాచకుడు తేలిక. యాచకుడు దూదికంటె తేలికయైనచో వాయువు యాచకుని ఎందుకు ఎత్తుకొని పోలేదు. ఈ యాచకుడు నన్నేమి యాచించునో యను భయముతో వాయువు యాచకుని ఎత్తుకొని వెళ్ళుటలేదు.

వివరణము :- యాచన యన్నింటికంటె నికృష్టమైనది— యాచన వలన సర్వము నశించును.

శ్లో॥ వరం ప్రాణ పరిత్యాగో మానభంగేన జీవనాత్ ।
ప్రాణత్యాగే క్షణం దుఃఖం మానభంగే దినే దినే॥ 16

అర్థము :- మానభంగేన = అవమానముతో, జీవనాత్ = జీవించుట కంటె, ప్రాణపరిత్యాగః = ప్రాణములు విడుచుట, వరం = శ్రేష్ఠము. ప్రాణత్యాగే = ప్రాణము పోయినచో, దుఃఖం = దుఃఖము, క్షణం = క్షణకాల ముండును, మానభంగే = మానభంగమైనచో, దినేదినే = ప్రతిదినమునందు నుండును.

తా॥ అవమానముతో జీవించుటకంటె ప్రాణత్యాగముచేయుట మంచిది. ప్రాణత్యాగము వలన దుఃఖము క్షణకాల ముండును. మాన భంగమువలన ప్రతిదినము దుఃఖముండును.

వివరణము :- అవమానపడి జీవించుటకంటె మృత్యువుమేలు. ఏమర్సన్ అనువారు—

అవమానముతో వేలకొలది సంవత్సరములు జీవించుటకంటె గౌరవింపబడుచు నొక ఘడియ జీవించినను మంచిదే. యోగీశ్వరుడు శ్రీకృష్ణుడు—

పాదాహతం యదుత్థాయ మూర్ధాన మధిరోహతి ।
స్వస్థాదేవావమానేఽపి దేహిన స్తద్వరం రజః ॥
(శిశుపాల 2-46)

పాదములచే త్రొక్కబడి పైకిలేచిన దుమ్ము ఆతని నెత్తిపై బడును. తన్ను త్రొక్కి అవమాన పరచుటను సహింపలేక త్రొక్కినవాని నెత్తిపై బడును. మనుష్యుడైనవాడు అవమానింపబడి వనములో శాంతముగా బ్రతుకు వానికంటె ఈ దుమ్మే శ్రేష్ఠమైనది. అవమానము సహింపలేదు. ఎల్లపుడు ధ్యానములో నుండుము— గౌరవము తగ్గుటను సహింపకు. ధనధాన్యములందు మోహము పెంచకు. మానము పోయినచో ధనము దేనికొఱకు ?

శ్లో॥ ప్రియవాక్య ప్రదానేన సర్వే తుష్యన్తి జంతవః ।
తస్మాత్తదేవ వక్తవ్యం వచనే కా దరిద్రతా ॥ 17

అర్థము :- ప్రియవాక్య ప్రదానేన=ప్రియమైన మాటలు పలుకుటచే, సర్వేజంతవః = అన్నిప్రాణులు, తృప్యన్తి = సంతోషపడును,

తస్మాత్=అందువలన, తదేవ = ఆ మధురవచనములనే, వక్తవ్యమ్ = పలుక వలెను, వచనే=మాట్లాడుటలో,కావరిద్రతా=దరిద్రత యేమున్నది?

తా॥ ప్రియమైన వాక్యములు పలుకుటవలన ప్రాణులన్నియు సంత సించును. అందుచేత ప్రియవాక్యమునే పలుకవలెను. మాటలు పలుకుట కేమి దరిద్రతగలదు ?

వివరణము :- మధురముగా మాట్లాడినచో సమ్మోహితులను జేయును. మధురభాషణ మందఱపైనను ప్రభావము చూపును. వేదవచ నములతో ప్రార్థన చేయుదము —

జిహ్వాయా అగ్రే మధు మే జిహ్వామూలే మధూలకమ్ ।

(అథర్వ. 1-34-2)

నానాలుక చివర మధువున్నది. నాలుకకు మొదట తేనెతుట్టె యున్నది.

వాచా వదామి మధుమత్ భూయాసం మధు సందృశః ॥

(అథర్వ. 1-34-3)

నేను మధురముగా మాట్లాడుదును. నా నడకలో చూపులో ప్రవర్త నలో నంతయు మధురముగానే యుంచెదను.

శ్లో॥ సంసార కటువృక్షస్య ద్వే ఫలే అమృతోపమే ।
సుభాషితం చ సుస్వాదు సంగతిః సుజనే జనే ॥ 18

అర్థము:-సంసారకటు వృక్షస్య=సంసారరూపమగు చేదుచెట్టునకు అమృతోపమే=అమృతముతో సమానమైన, ద్వేఫలే=రెండు పండ్లున్నవి, సుస్వాదు=అత్యంత రసవంతమగు, సుభాషితమ్=ఆలోచించి చెప్పబడిన ప్రియము, మధురమునైన వచనము,చ=అట్లే, సుజనేజనే=శ్రేష్ఠపురుషుల యొక్క, సంగతిః=కూడిక (అనగా సజ్జన స్నేహము).

తా॥ సంసారమను చేదు వృక్షమునకు అమృతమువంటి రెండు పండ్లుకలవు. (1) బాగుగా ఆలోచించి మృదుమధురముగా మాట్లాడుట (2) సజ్జన సాంగత్యము.

వివరణము :- సంసారమును చేదువృక్షమనియు విషవృక్షమనియు నందురు. దీనికి అమృతతుల్యములైన రెండు పండ్లు కలవు.

1) మధురవచనము 2) సజ్జన సంగతి. మనుష్యు డెల్లపుడు మధురముగా మాట్లాడవలెను

మధుమతీం వాచముదేయమ్ । (అథర్వ. 16-2-2)

నేను మధుర వచనమునే పలుకుదును— నే నెల్లపుడు శ్రేష్ఠపురుషుల సంగతిలో నుందును—

దేవానాగ్ం సఖ్యముపసేదిమావయమ్ । (యజు. 25-15)

మేము విద్వాంసుల యొక్కయు, మహాపురుషుల యొక్కయు మైత్రిని పొందుదుము. వారి సంగతిలోనే యుందుము.

శ్లో॥ జన్మజన్మన్యభ్యస్తం యద్ దానమధ్యయనం తపః ।
తేనైవాఽభ్యాసయోగేన తదేవాభ్యస్యతే పునః ॥ 19

అర్థము :- జన్మజన్మని=ప్రతిజన్మమందును, యత్=ఏ, దానం= దానము, అధ్యయనం = విద్యాభ్యాసము, తపః = తపస్సు, (ద్వంద్వ సహనము), అభ్యస్తం=అభ్యసింపబడినదో, తేనైవ = అదే, అభ్యాస యోగేన=అభ్యాసముతో, యోగముతో, పునః=మరల, తదేవ=అదియే, అభ్యస్యతే=అభ్యసింపబడుచున్నది.

తా॥ జన్మజన్మాంతరములలో మనుష్యుడేది దానము, విద్యాభ్యాసము, తపస్సు (శీతోష్ణములు, హానిలాభములు, మొదలగు ద్వంద్వ సహనము)

మొదలగువాని నభ్యసించెనో యవియే తిరిగి యభ్యాస యోగముచే సంప్రా ప్తములగును. వానినే యభ్యసించును.

వివరణము :- మనుష్యుడు చేసిన కర్మానుసారముగా వాని స్వభావము అభ్యాసము తయారగును. జన్మజన్మాంతరములలో నాతడు చేసిన దానాది శుభకర్మలు అభ్యాసమగుటచే మఱుజన్మలో నతడచే విధముగా కర్మచేయును. అందువలన దానము, యోగాభ్యాసము, విద్యాఽధ్యయనము, ధర్మాచరణము తపోనుష్ఠానము, పరోపకారము, సేవాభావనలను తన జీవనమునకు అంగములుగా నుండునట్లు కోరవలెను.

శ్లో॥ పుస్తకేషు చ యా విద్యా పరహస్తేషు యద్ధనమ్ ।
ఉత్పన్నేషు చ కార్యేషు న సా విద్యా న తద్ధనమ్॥ 20

అర్థము :- యా విద్యా = ఏవిద్య, పుస్తకేషు = పుస్తకములందున్నదో, చ=మఱియు, యద్ధనం=ఏధనము, పరహస్తేషు = ఇతరుల చేతిలో నున్నదో, కార్యేషు ఉత్పన్నేషు=కార్యముల కావశ్యకమైనపుడు, న సా విద్యా = ఆవిద్య అక్కఱకురాదు, చ=మఱియు, న తద్ధనమ్= ఆధనము అక్కఱకురాదు.

తా॥ పుస్తకములలోనున్న జ్ఞానము, ఇతరుల చేతులలోనున్న ధనము సమయము వచ్చినపుడు పనికిరానిచో అది విద్యకాదు, అది ధనముకాదు.

వివరణము :- కంఠస్థమైనది విద్యయు, ముడివేసినది ధనము— అనులోకోక్తి కలదు. ఈ లోకోక్తి ప్రకారము కంఠస్థమైన విద్యయు, తన చెంగుముడిలో నున్న ధనము ఉపయోగపడునని యర్థము.

పరాధీనం వృథా జన్మ పరస్త్రీషు వృథా సుఖమ్ ।
పరగేహే వృథా లక్ష్మీః విద్యా యా పుస్తకే వృథా ॥

పరాధీనుడైనవాని జన్మ వ్యర్థము. పరస్త్రీయందు రమించి సుఖించుట వ్యర్థము. ఇతరుల యిండ్లలో నుండిన ధనము వ్యర్థము. పుస్తకములలోని విద్య వ్యర్థము.

షోడశాధ్యాయము సమాప్తము.

# సప్తదశాధ్యాయము

శ్లో॥ పుస్తక ప్రత్యయాధీతం నాధీతం గురుసన్నిధౌ ।
సభామధ్యే న శోభన్తే జారగర్భా ఇవ స్త్రియః ॥ 1

అర్థము :- గురుసన్నిధౌ=గురువుదగ్గఱ, నాధీతం = చదువలేదు, పుస్తకప్రత్యయాధీతం=పుస్తకములు చదివి నేర్చుకొనెను, అట్టి విద్యగలవారు జారగర్భాః=వ్యభిచారమువలన గర్భముదాల్చిన, స్త్రియః ఇవ= స్త్రీలవలె, సభామధ్యే=సభామధ్యలో, నశోభన్తే=శోభిల్లరు.

తా॥ గురువుల సన్నిధి కూర్చుండి గురువుల ద్వారా యభ్యసింపనదియు. పుస్తకములద్వారా నేర్చినదియునగు విద్యకలవారు వ్యభిచారముచే గర్భముదాల్చిన స్త్రీలవలె శోభింపరు.

వివరణము :- విద్యారహస్యము గురుముఖముగానే తెలిసికొనవలెను. కఠినాతికఠినమైన విషయములను గూడ గురువు తేలికగా నర్థమగునట్లు వివరించును. కేవలము స్వయముగా పుస్తకపఠనముచేసిన శుద్ధమైన ఉచ్చారణ చేయలేరు. మనుష్యుడు పుస్తకములు చదువగలిగి

సంతమాత్రముననే విద్వాంసుడగుచో ఈ విద్యాలయముల, మహావిద్యాలయముల విశ్వవిద్యాలయముల యావశ్యకతయేల ? గురుముఖతః అధ్యయనము చేయనివాడు పండితుడుకాడు.

శ్లో॥ కృతే ప్రతికృతం కుర్యాద్ హింసనే
ప్రతి హింసనమ్ ।
తత్ర దోషో న పతతి దుష్టే దుష్టం
సమాచరేత్ ॥ 2

అర్థము :- కృతే = ఉపకారము చేయువానికి, ప్రతికృతం = ప్రత్యుపకారము, హింసనే = హింసకు, ప్రతిహింసనమ్ = ప్రతిహింస, కుర్యాత్ = చేయవలెను, తత్ర = అటుల చేసినచో, దోషః = దోషము, న పతతి = సంక్రమింపదు, దుష్టే = దుష్టునియందు, దుష్టం = దుష్టతను, సమాచరేత్ = ఆచరింపవలెను.

తా॥ ఉపకారము చేసినవారికి ప్రత్యుపకారము చేయవలెను. హింసించువారికి ప్రతిహింస చేయవలెను. దుష్టునియెడల దుష్టత్వము చూపినచో దోషములేదు.

వివరణము :- దయానందమహర్షి ఆర్యసమాజ నియమములలో ఏడవ నియమములో — అందఱియెడల ప్రీతిపూర్వకముగా ధర్మానుసారము యథా యోగ్యముగ ప్రవర్తింపవలెను — ఉపకారికి ప్రత్యుపకారము, చేయవలెను. ఎవడైనను మనకు నష్టము కలిగించుటకు సిద్ధపడినచో అనగా మన సంస్కృతి, సభ్యత, ధర్మమును నాశము చేయుటకు సిద్ధపడినచో నట్టివానిని వధింపవలెను. వేదాదేశము—

మాయాభిర్మాయినం సక్షదింద్రః । (ఋ. 5-30-6)

ఓ మనుష్యుడా! నీవు మాయావులను మాయతోనే చంపివడ వేయుము. వ్యాసమహర్షి —

యస్మిన్ యథా వర్తతే యో మనుష్యః
తస్మింస్తథా వర్తితవ్యం స ధర్మః ।
మాయాచారో మాయయా వర్తితవ్యః
సాధ్వాచారః సాధునా ప్రత్యుపేయః ॥
(భార. ఉద్యో. 37–7)

ఒకడు రెండవవాని విషయములో నెట్లు ప్రవర్తించునో యట్లే రెండవవాడు మొదటివాని విషయములో ప్రవర్తింపవలెను. ఇది ధర్మము. మాయగా ప్రవర్తించువారియెడ మాయతోను, మంచిగా ప్రవర్తించువారి యెడ మంచిగాను ప్రవర్తింపవలెను. మఱొక కవి —

**మా**యావులయెడ మాయగా ప్రవర్తింపకున్నచో వాడు బుద్ధిశక్తి వతో మూఢుడై నిశ్చయముగా పరాభూతుడగును. ఈ విషయము జ్ఞాపకమునందుంచుకొనుడు. ఇది సంన్యాసుల ధర్మముగాదు. జనసామాన్యమునకు రాజులకు సంబంధించిన ధర్మము.

శ్లో॥ యద్దూరం యద్దురారాధ్యం యచ్చ దూరే వ్యవస్థితమ్।
తత్సర్వం తపసా సాధ్యం తపో హి దురతిక్రమమ్॥ 3

అర్థము :- యత్ =ఏది, దూరం = దూరమో, యత్ = ఏది, దురారాధ్యం = కష్టముతో ఆరాధింప యోగ్యమైనదో, చ = మఱియు, యత్ =ఏది, దూరే=మిక్కిలి యెత్తుపై, వ్యవస్థితం=ఉన్నదో, తత్సర్వం =దాని సంతటిని, తపసా=తపస్సుద్వారా, సాధ్యం=సాధింపవచ్చును, హి=ఎందువల్లననగా, తపః = తపస్సు, దురతిక్రమమ్ = దాట వీలు లేనిది, మిక్కిలి ప్రబలమైనది.

తా॥ ఏది దూరముగా నున్నదో, ఏది యారాధించుటకు కఠినముగా నుండునో, మఱియు మిక్కిలి దూరముగా నెత్తున నుండునో అట్టి దంతయు తపస్సుచే సాధింపవచ్చును. తపస్సు అతిక్రమింప వీలులేనిదిగదా! తపస్సుచే సాధ్యముకాని దుండదు.

వివరణము :- తపస్సుచే కఠినాతి కఠినమైన కార్యము కూడ సిద్ధింపజేసికొనవచ్చును. తపస్సుచే మృత్యువునుకూడ జయింప వచ్చును. ఇట్టి తపస్సనగా నేమి? ఒక కాలిమీద నిలబడుటయు ఒక చేయిపై కెత్తుటయు, తనకు నాలుగు వైపుల అగ్నిని మండించుకొనుటయు మొదలగునవి చేయుట తపస్సుకాదు. తపస్సు అనగా శీతోష్ణములను, ఆకలిదప్పులను, లాభనష్టములను జీవనమరణములను అను ద్వంద్వ సహనము, ఆపదలు సంభవించినను ధర్మమును విడువకుండుట. మఱొక కవి—

తపోమహిమ చాల గొప్పది తపస్సుద్వారానే మనుష్యుడు తన యభీష్టమును నెఱవేర్చుకొనగలడు. తనలోని పాపమును అల్పత్వమును దూరము చేసికొని చరిత్రను ఉజ్జ్వలమైనదిగా పవిత్రమైనదిగా చేసికొన వచ్చును. ధీరులైన పురుషులు తపస్సుద్వారానే ప్రపంచములో నున్నతి మార్గమున ప్రకాశించుచున్నారు. జీవితములో తపస్వికావలెను—

అధ్రువే హి శరీరే యో న కరోతి తపోఽర్జనమ్ ।
స పశ్చాత్తప్యతే మూఢో మృతే గత్వాఽఽత్మనో గతిమ్ ॥

ఈ శరీరము క్షణభంగురము, మనుష్య శరీరమును బొందియు తపోనుష్ఠానము చేయని మూఢుడు తాను చేసిన కర్మఫలముల ననుభవించుచు పశ్చాత్తాపము పొందును. తపస్సుచేయుము. కాని—

వినయేన వినా జీర్ణమభిమానేన సంయుతమ్ ।
మహచ్చాపి తపో వ్యర్థ మిత్యేతదవధార్యతామ్ ॥

వినయములేకుండ అభిమానముతో జేయబడిన గొప్ప తపస్సుకూడ వ్యర్థమగును.

శ్లో॥ లోభశ్చేదగుణేన కిం పిశునతా యద్యస్తి కిం పాతకైః
సత్యం చేత్తపసా చ కిం శుచి మనో యద్యస్తి
తీర్థేన కిమ్ ।
సౌజన్యం యది కిం గుణైః సుమహిమా యద్యస్తి
కిం మండనైః
సద్విద్యా యది కిం ధనైరపయశో యద్యస్తి
కిం మృత్యునా ॥ 4

అర్థము:- లోభశ్చేత్=లోభగుణమున్నచో, అగుణేన = గుణము లేకపోవుటచేత, కిం = ఏమి? పిశునతాయది = చాడీలుచెప్పు స్వభావమున్నచో, పాతకైః=పాపములతో, కిం = ఏమి ప్రయోజనము? చ= మఱియు,సత్యంచేత్=సత్యమున్నచో, తపసాకిం=తపస్సుతో పనియేమి? మనః=మనస్సు, శుచిఅస్తియది = పవిత్రముగా నున్నచో, తీర్థేన కిం= జలమయ తీర్థముతో స్నానాదు లొనర్చుటయేల? సౌజన్యం యది=మంచి హృదయము ప్రేమయున్నచో, గుణైః కిమ్ = గుణములతో పనియేమి? సుమహిమా అస్తియది=ప్రపంచములో యశస్సున్నచో, మండనైః కిం= అలంకారములతో నేమి ప్రయోజనము? సద్విద్యాయది=మంచి విద్య యున్నచో, ధనైః కిం=ధనములేల? యద్యపయశః=అపకీర్తియున్నచో, మృత్యునా కిం=మృత్యువేల?

తా॥ లోభగుణమున్నచో వేఱె దుర్గుణమక్కఱలేదు. పిసినారితన మున్నచో వేఱుగా పాతక మక్కఱలేదు. సత్యమున్నచో తపస్సక్కఱ లేదు. మనస్సు శుచిగా నున్నచో తీర్థముతో పనిలేదు. మంచితన

మున్నచో వేఱుగా గుణము లక్కఱలేదు. గొప్పయశస్సు ఉన్నచో అలంకారము లక్కఱలేదు. సద్విద్య యున్నచో ధనమక్కఱలేదు. అపకీర్తిని మించిన మృత్యువులేదు. అనగా అపకీర్తిపాలై బ్రతుకుటకంటె మరణము మేలు.

వివరణము :- లోభగుణమున్నచో నితర దుర్గుణముల యావశ్యకతలేదు. లోభగుణము అన్ని దుర్గుణములకు మూలము.

గుణినాం గుణేషు సత్స్వపి పిశునజనో దోషమాత్ర మాదత్తే ।

పుష్పే ఫలే విరాగీ క్రమేలకః కంటకౌఘమివ ॥

ఒంటెకు ఫలపుష్పములుగల చెట్టనిన ప్రీతిలేదు. దానికి ముండ్ల పొద లనినచో నిష్టముగా నుండును. గుణవంతులలో ననేక సద్గుణము లున్నను తప్పులెన్నువాడు గుణవంతులలోని దుర్గుణములనే వెదకు చుండును. చాడీలు చెప్పువాడు కుక్కతో సమానము. కారణము కుక్కయు నాతడు తన నాలుకతో నితరములను అశుద్ధము చేయును. జీవితములో సత్యమును వచించుటయు సత్యాచరణము నున్నచో తపస్సు చేయు నావశ్యకతలేదు. సత్యమును మించిన తపస్సులేదు.

తీర్థం పరం కిం స్వమనో విశుద్ధమ్ ।

(శంకరాచార్య ప్రశ్నోత్తరీ 8)

అన్నింటికంటె నుత్తమమైన తీర్థము మనస్సు. అది విశేష రూప మున శుద్ధముగా నుండవలెను. ప్రేమయున్నచో నితర గుణముల యావశ్యకత యుండదు. ప్రేమ హృదయములను కలుపును. ప్రేమ యను గంగలో స్నానముచేసిన రాక్షసుడుకూడ దేవతయగును. యశస్సు కలవానికి వేఱుగా భూషణము లక్కఱలేదు. యశస్సే గొప్పభూషణము.

విద్యయున్నచో నితర ధనముల యావశ్యకతలేదు.

విద్యాధనం సర్వధన ప్రధానమ్ ।— విద్యాధనము సర్వధనము లలో ప్రధానము. అపకీర్తికి మించిన మృత్యువులేదు. అపయశస్సే బ్రతికియున్న మనుష్యునకు మృత్యువు.

మృత్యుశ్చ కో వాపయశః స్వకీయమ్ ।

(శంకరాచార్య ప్రశ్నో...6)

మృత్యువననేమి ? తన యపకీర్తియే. శ్రీకృష్ణుడు అర్జునునితో చెప్పెను —

సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే ।(గీత 2-34)

సమ్మానితుడగు వ్యక్తికి అతనికి కలిగిన యప యశస్సు మృత్యువుకంటె అధిక దుఃఖము నిచ్చును.

శ్లో॥ పితా రత్నాకరో యస్య లక్ష్మీ ర్యస్య సహోదరా ।
శంఖో భిక్షాటనం కుర్యా న్నాఽదత్త ముపతిష్ఠతే ॥ 5

అర్థము :- యస్య=దేనికి, రత్నాకరః = సముద్రుడు, పితా= తండ్రియో, యస్య=దేనికి, లక్ష్మీః=లక్ష్మి, సహోదరా = సోదరియో, అట్టి, శంఖః=శంఖము, భిక్షాటనం=బిచ్చముకొఱకు తిరుగుట, కుర్యాత్= చేయవలెను, అదత్తం= ఈబడనిది, నోపతిష్ఠతే=ప్రాప్తింపదు.

తా॥ తండ్రి రత్నాకరుడు (సముద్రుడు). లక్ష్మీదేవి సోదరి అయినను శంఖము భిక్షాటనమునకు పనికివచ్చుచున్నది. దీనినిబట్టి దానము చేయనివానికి ధనము సంప్రాప్తము కాదని తెలియుచున్నది.

వివరణము :- దుఃఖములనుండి తప్పించుకొనుటకు సుఖము పొందుటకు దానమీవలెను.

దారిద్ర్య వ్యాధి దుఃఖాని బంధనం వ్యసనాని చ ।
అదాతుః ఫలమేతాని తస్మాద్దానం విశిష్యతే ॥

(చాణక్యసార సంగ్రహము 1-98)

దారిద్ర్యము, రోగము, దుఃఖము, బంధనము, వ్యసనము ఇవి యన్నియు దానమీయ నందుకు ఫలములే. వానినుండి రక్షణకొఱకు దాన మీయవలెను.

బోధయన్తి న యాచన్తే భిక్షాద్వారా గృహే గృహే ।
దీయతాం దీయతాం నిత్యమదాతుః ఫల మీదృశమ్ ॥

బిచ్చగాండ్రు బిచ్చమును కోరుటలేదు. ఇంటింటికి వెళ్ళి భిక్షద్వారా ఈయండి ఈయండి యని చెప్పుచు దానమీయనిచో మావలెనే భిక్ష యాచింతు రని బోధించు నట్లుండును.

శ్లో॥ అశక్తస్తు భవేత్సాధు ర్బ్రహ్మచారీ చ నిర్ధనః ।
వ్యాధిష్ఠో దేవభక్తశ్చ వృద్ధా నారీ పతివ్రతా ॥ 6

అర్థము :- అశక్తః తు=శక్తిలేనివాడై, సాధుః=సజ్జనుడు, భవేత్ =అగును, నిర్ధనః = ధనములేనివాడు (వివాహము కాని కారణమున) బ్రహ్మచారీ=బ్రహ్మచారిగా నుండును, వ్యాధిష్ఠః=రోగగ్రస్తుడు(దుఃఖము కలవాడగుటచే) దేవభక్తః=ప్రభువు నుపాసించువాడగును, చ = అట్లే, వృద్ధానారీ = వృద్ధస్త్రీ (యౌవనము పోవుటచే) పతివ్రతా = పతివ్రత యగును.

తా॥ నిర్బలవ్యక్తి సజ్జనుడుగా తయారగును. ధనహీనుడు బ్రహ్మచారి యగును. (వివాహముకాదు కావున) వ్యాధిగ్రస్తుడు (దుఃఖితుడు కావున) ప్రభుభక్తి కలవాడుగా తయారగును. వృద్ధస్త్రీ (యౌవనము గడచిపోయినది కావున) పతివ్రత యగును.

వివరణము :- దుర్బలుడు సాధువు అగును. కారణము అశక్తతయే. నిర్ధనుడు బ్రహ్మచారియగును. బీదవాడు కావున పిల్ల నెవ్వరు ఈయరు. పెండ్లిలేదు కావున బ్రహ్మచారి. వృద్ధస్త్రీ భోగవిలాసములకు అశక్తురాలు కావున పతివ్రత యగును.

శ్లో॥ నాఽన్నోదక సమం దానం న తిథి ర్ద్వాదశీ సమా ।
న గాయత్ర్యాః పరో మన్త్రో న మాతుః పరం
దైవతమ్ ॥ 7

అర్థము :- అన్నోదక సమం=అన్నముతోను నీటితోను సమాన
మైన, దానం=దానము, న=లేదు, ద్వాదశీ=ద్వాదశితో, సమా=సమాన
మైన, తిథిః = తిథి, న = లేదు, గాయత్రికంటె, పరం = శ్రేష్ఠమైన,
మంత్రః=మంత్రము, న=లేదు, మాతుః=తల్లికంటె,పరం=శ్రేష్ఠమైన,
దైవతమ్=దేవత, న=లేదు.

తా॥ అన్నముతోను, ఉదకముతోను సమానమైన దానములేదు.
ద్వాదశితో సమానమైన తిథిలేదు. గాయత్రిని మించిన శ్రేష్ఠమైన మంత్రము
లేదు. తల్లినిమించిన దైవములేదు.

వివరణము :- అన్నోదకములతో సమానమైన దానము మరొకటి
లేదు.

అన్నం వై ప్రాణినాం ప్రాణా అన్నమోజో బలం సుఖమ్ ।
తస్మాత్కారణా త్సర్వే రన్నదః ప్రాణదః స్మృతః ॥
(భవిష్య. ఉత్తర. 169-30)

అన్నము ప్రాణులకు ప్రాణము. అన్నమే ఓజస్సు, బలము,
సుఖము. ఇందువలన శ్రేష్ఠము. అన్నదాతను ప్రాణదాతగా జెప్పుదురు.
జలముకూడ జీవనమే. ఇందువలన జలదానముకూడ శ్రేష్ఠమే. ద్వాదశితో
సమానమైన తిథిలేదు. తిథులన్నియు పరమాత్మచే జెప్పబడినవే. అందు
చేత నన్ని తిథులు మంచివే. చెడ్డతిథి లేనేలేదు. ఇచ్చట ద్వాదశిని సర్వ
శ్రేష్ఠమైనదిగా చెప్పు నుద్దేశ్యమేమన ఏకాదశితిథి గొప్పది యను
భావనను ఖండించుటకొఱకే యని తెలిసికొనవలెను. గాయత్రిని మించిన
మంత్రములేదు.

గాయత్ర్యా న పరం జప్యం గాయత్ర్యా న పరం తపః ।
గాయత్ర్యా న పరం ధ్యానం గాయత్ర్యా న పరం హుతమ్ ॥

గాయత్రిని మించిన జపముకాని, తపముకాని, ధ్యానముకాని, యజ్ఞముకానిలేదు. తల్లిని మించిన దేవతలేదు.

నాస్తి మాతృసమో గురుః ॥ (భార. అను. 105-15)
తల్లినిమించిన గురువులేడు.

శ్లో॥ తక్షకస్య విషం దంతే మక్షికాయాస్తు మస్తకే।
వృశ్చికస్య విషం పుచ్ఛే సర్వాంగే దుర్జనే విషమ్ ॥ 8

అర్థము :- తక్షకస్య=పాముసకు, దన్తే=పంటియందు, విషం=విషముండును, మక్షికాయాస్తు=ఈగకైతే, మస్తకే=తలయందుండును. వృశ్చికస్య=తేలుకు, పుచ్ఛే=తోకయందు, విషం=విషముండును, దుర్జనే=దుర్జనునియందు, సర్వాంగే=శరీరమంతట, విషమ్=విషముండును.

తా॥ సర్పమునకు విషము దంతమునం దుండును ఈగకు విషము తలలో నుండును. తేలుకు తోకయందు విషముండును. దుర్జనునకు సర్వాంగమునందు విషముండును.

వివరణము :- దుర్జనునితో నెల్లప్పుడు సావధానముగా నుండవలెను. (జాగ్రత్తగా)

దుర్జనః ప్రియవాదీ చ నైతద్విశ్వాస కారణమ్ ।
మధు తిష్ఠతి జిహ్వాగ్రే హృది హాలాహలం విషమ్ ॥
(హితో 1-83)

దుర్జనుడు ప్రియముగా మాట్లాడినంత మాత్రమున నతనిని విశ్వసింపరాదు. అట్టివారి మాటలలో తియ్యందనమున మనస్సులో కపటరూపమైన విషము నిండియుండును.

శ్లో॥ పత్యురాజ్ఞాం వినా నారీ ఉపోష్య వ్రతచారిణీ ।
ఆయుష్యం హరతే భర్తుః సా నారీ నరకం వ్రజేత్ ॥ 9

అర్థము :- పత్యుః = భర్త యొక్క, ఆజ్ఞాంవినా = అనుమతిలేకుండ, ఉపోష్య = ఆకలిరూపమైన. వ్రతచారిణీ = వ్రతముచేయునట్టి, నారీ = స్త్రీ. భర్తుః = భర్తయొక్క, ఆయుష్యం = ఆయుస్సును, హరతే = తగ్గించు చున్నది, సా = అట్టి, నారీ = స్త్రీ, నరకం = నరకమును (దుఃఖమును), వ్రజేత్ = పొందును.

తా॥ భర్త యనుమతి లేకుండ స్త్రీ ఉపవాస వ్రతమును చేసిరో ఆకలితో నున్నచో నట్టిస్త్రీ భర్త ఆయుస్సును హరించును. ఆ స్త్రీ నరకమును పొందును. (దుఃఖమనుభవించును.)

వివరణము :- మనుమహర్షి ఆకలితోనుండి చేయువ్రతములు ఖండించెను—

పత్యౌ జీవతి యాతు స్త్రీ ఉపవాసంవ్రతం చరేత్ ।
ఆయుష్యం హరతే భర్తుర్నరకం చైవ గచ్ఛతి ॥

భర్త జీవించి యుండగా భార్య ఉపవాసవ్రతము చేసినచో భర్త ఆయుష్షు క్షీణించును. ఆస్త్రీ నరకమును (దుఃఖమును) అనుభవించును.

శ్లో॥ న దానైః శుధ్యతే నారీ నోపవాస శతైరపి ।
న తీర్థ సేవయా తద్వద్ భర్తుః పాదోదకైర్యథా ॥ 10

అర్థము :- నారీ = స్త్రీ, దానైః = నానావిధ దానములతోను, ఉపవాస శతైరపి = వందలకొలది ఉపవాసములతోను, అపి = కూడ, న శుధ్యతే = శుద్ధికాదు, భర్తుః = భర్త యొక్క, పాదోదకైః = పాదోదకములతో, యథా = ఎట్లు శుద్ధియగునో, తద్వత్ = దానిమాదిరిగా, తీర్థసేవయా = తీర్థములను సేవించుటచే, న = కాదు.

తా॥ స్త్రీ నానావిధములగు వ్రతములచేతగాని, వందలకొలది యుప వాసములచేతగాని తీర్థముల సేవించుటతోకాని శుద్ధికాదు. భర్త పాపోద కములవలె శుద్ధిచేయునది మఱొకటిలేదు.

వివరణము :- పతి యొక్క మహాత్మ్యము బ్రహ్మవైవర్త పురాణ ములో వర్ణింపబడినవిధము—

పతిరేవ గతిః స్త్రీణాం పతి ప్రాణాశ్చ సంపదః ।
ధర్మార్థ కామమోక్షాణాం హేతుః సేతుర్భవార్ణవే ॥
పతిర్నారాయణః స్త్రీణాం వ్రతం ధర్మః సనాతనః ।
సర్వం కర్మ వృథా తాసాం స్వామినో విముఖాశ్చ యాః ॥
స్నానం చ సర్వతీర్థేషు సర్వయజ్ఞేషు దక్షిణా ।
సర్వదానాని పుణ్యాని వ్రతాని నియమాశ్చ యే ॥
దేవార్చనం చానశనం సర్వాణి చ తపాంసి చ ।
స్వామినః పాదసేవాయాః కలాం నార్హన్తి షోడశీమ్ ॥
(బ్రహ్మ. బ్రహ్మఖండ 9-64-97)

పతియే స్త్రీలకుగతి. పతియే ప్రాణము. పతియే సంపత్తి పతియే ధర్మము, అర్థము, కామము మోక్షమునకు కారణము. భర్తయే భవసాగర మును దాటించు వంతెన. భర్తయే స్త్రీకి పరమేశ్వరుడు, పతియే వ్రతము, పతియే సనాతన ధర్మము. భర్తయాజ్ఞలేనిదే స్త్రీ చేసిన కర్మలన్నియు వ్యర్థములగును. సమస్త తీర్థముల స్నానము, సమస్త యజ్ఞములందలి దక్షిణ, అన్నిరకములదానము, పుణ్యకర్మ, వ్రతము, నియమము, దేవ పూజ, ఆకలితో ఉపవసించు వ్రతము, తపస్సు—ఇవి యన్నియు పతి సేవలో పదునాఱవ వంతునకు కూడ సరిపోజాలవు.

శ్లో॥ దానేన పాణి ర్నతు కంకణేన
స్నానేన శుద్ధి ర్నతు చందనేన
మానేన తృప్తిర్నతు భోజనేన
జ్ఞానేన ముక్తి ర్నతు మండనేన ॥ 11

అర్థము :- పాణిః=చేయి, దానేన=దానము చేయుటచే శోభిల్లును, తు=కాని, కంకణేన=చేతి కంకణముతో, న = శోభిల్లదు. స్నానేన= స్నానముచేయుటచేత, శుద్ధిః=శరీరశుద్ధియగును. తు=కాని, చందనేన= గంధముచేత, న = కాదు, మానేన = ఆదరముతో, సన్మానముతో, తృప్తిః=సంతుష్టి యగునుగాని, భోజనేన=భోజనముచేత, న = కాదు, జ్ఞానేన=జ్ఞానముతో, ముక్తిః = ముక్తియగునుకాని, మండనేన తు = తిలకాదులు దిద్దుటచేతను, మాలలు ధరించుటచేతను, న=కాదు.

తా॥ చేయి దానముచేయుటచేత శోభిల్లును గాని కంకణము ధరించుటచేతగాదు. శరీరము స్నానము చేసినచో శుద్ధియగునుగాని గంధము పూసికొనుటచేగాదు. ఆదరగౌరవాదులచేత మనస్సునకు తృప్తికలుగును. గాని భోజనము చేతగాదు. జ్ఞానముతో ముక్తి లభించునుగాని తిలకాదులు ధరించి ఆడంబరముగా నున్నంతమాత్రమున కలుగదు.

వివరణము :- చేతులకు శోభ దానముచే కలుగును—

హస్తస్య భూషణం దానం సత్యం కంఠస్య భూషణమ్ ।
శ్రోత్రస్య భూషణం శాస్త్రం భూషణైః కిం ప్రయోజనమ్ ॥

దానము చేయుట చేతికలంకారము. సత్యము పలుకుట కంఠమున కాభరణము. శాస్త్రములు వినుట చెవుల కాభరణము. ఈ యాభరణము లున్నచో నితరాభరణములనావశ్యకములు. ముక్తి జ్ఞానము వలన కలుగును. దర్శనములలో స్పష్టముగానున్నది.

జ్ఞానాన్ముక్తిః । (సాంఖ్య. 3-23)

జ్ఞానమనగా జడచేతనముల భేదజ్ఞానము. దానివలన మోక్షప్రాప్తి కలుగును.

శ్లో॥ నాపితస్య గృహే క్షౌరం పాషాణే గంధలేపనమ్ ।
ఆత్మరూపం జలే పశ్యన్ శక్రస్యాపి శ్రియం
హరేత్ ॥ 12

అర్థము :- నాపితస్య = మంగలి వాని యొక్క, గృహే = ఇంటి యందు, క్షౌరం = క్షౌరము చేయించుకొనుటయు, పాషాణే = రాతిపైన, గంధలేపనం = గంధము వ్రాయుటయు, ఆత్మరూపం = తన బింబమును, జలే = నీటిలో, పశ్యన్ = చూచుటయు, ఈపనులు, శక్రస్యాపి = ఇంద్రుని యొక్కయు, ఐశ్వర్య వంతుని యొక్కయు, శ్రియం = శోభను, హరేత్ = నష్టముచేయును.

తా॥ మంగలివాని యింటికివెళ్ళి క్షౌరము చేయించుకొనుటయు, రాతికి చందనమును పులుముటయు, నీటియందు ప్రతిబింబమును చూచుకొనుటయు, వైభవశాలియైన యింద్రుని యొక్క శోభనుకూడ నష్టపఱచును.

వివరణము :- మా దృష్టిలో ఈ శ్లోకము ప్రక్షిప్తము. ఈ రోజులలో నింటికివచ్చి మంగలిక్షౌరము చేయుటలేదు. నూటికి 99 మంది సెలూన్ (క్షౌరశాల)కు వెళ్ళి క్షౌరము చేయించుకొనుచున్నారు. ఎవ్వనికినే నష్టము కలుగుటలేదు. రాతికి చందనమును పట్టించుట యాతని మూర్ఖతను తెల్పును. రాళ్ళుకాని యేధాతువుతో జేయబడిన బొమ్మకాని చందన సువాసనను గ్రహింపగలవా ? నదులలో, చెఱువులలో స్నానము చేయువారు నీటిలో తమ ప్రతిబింబము చూచుచునే యున్నారు. ఎవనికి కూడ శోభకాని ఐశ్వర్యముకాని నష్టమగుటలేదు.

శ్లో॥ సద్యః ప్రజ్ఞాహరా తుండీ సద్యః ప్రజ్ఞాకరీ వచా ।
సద్యః శక్తిహరా నారీ సద్యః శక్తికరం పయః ॥ 13

అర్థము :- తుండీ=దొండ, సద్యః = వెంటనే, ప్రజ్ఞాహరా = బుద్ధిని హరించును, వచా=సరస్వతి ఆకు, సద్యః=వెంటనే, ప్రజ్ఞాకరీ= బుద్ధినిచ్చును, నారీ = స్త్రీ, సద్యః =వెంటనే, శక్తి హరా = శక్తిని పోగొట్టును, పయః=పాలు, సద్యః=వెంటనే, శక్తికరము=శక్తినిచ్చును.

తా॥ తుండియనగా కుందరు అనునొక యోషధి. ఇది బుద్ధిని వెంటనే నష్టపఱచును. వచ అను నోషధి బుద్ధిని వెంటనే పెంచును. స్త్రీ శక్తిని నశింపజేయును. పాలు వెంటనే బలము నిచ్చును.

వివరణము :- తుండి = కుందరు అనునది తాత్కాలికముగ వెంటనే బుద్ధినాశకము—ద్రవ్యరత్నాకరమను దానిలో కుందరు ఫలము బుద్ధినాశకము మఱియు స్తన్యవర్ధకము. బధిరము ఆక్సుదకాహి అను సారము ఇది బరువైనది. అట్లే పిత్తము, కఫము, రుధిర వికారము, దమా, జ్వరము, దగ్గు అనువానిని పోగొట్టును. కుందరు విషయములో ఇది బుద్ధినాశకమను ప్రవాదము కలదు. (పం. విశ్వేశ్వర దయాళుజీ వైద్యరాజ్ ఆయుర్వేదీయ విశ్వకోశ తృతీయ భాగము పేజి 2434) వచ అనునది తత్కాలమందే బుద్ధిని పెంచును.

వచాయుష్యా వాతకఫతృష్ణాఘ్నీ స్మృతివర్ధనీ । (రాజవల్లభుడు)

వచ యనునది ఆయుస్సును పెంచును. వాతమును, కఫమును దప్పికను నశింపజేయును. అట్లే స్మృతిని పెంచును. మఱియు—

అద్భిర్వా పయసాజ్యేన మాస మేకం తు సేవితా ।
వచా కుర్యాన్నరం ప్రాజ్ఞం శ్రుతిధారణ సంయుతమ్ ॥
(గరుడ. 191-37)

వచ అను నౌషధమును నీటితోగాని, పాలతోగాని, నేతితోగాని యొకమాసము సేవించినచో మనుష్యుడు మహాబుద్ధిమంతు డగును. అందుచేత వేదములను కంఠస్థము చేయగలవాడగును.— స్త్రీ యత్యధిక సంభోగము చేయుటవలన శక్తిని హరించి త్వరగా ముసలితనము తెచ్చుటకు కారణమగును.—పాలుకాని, పాలనుండి తయారగు వెన్న, పెరుగు, నెయ్యి మొదలైనవి శరీరమునకు శీఘ్రముగా బలమును గలిగించును.

శ్లో॥ పరోపకరణం యేషాం జాగర్తి హృదయే సతామ్ ।
నశ్యన్తి విపదస్తేషాం సంపదః స్యుః పదే పదే ॥ 14

అర్థము :- యేషాం = ఏసతాం = సత్పురుషుల యొక్క, హృదయే = హృదయమందు, పరోపకరణం = పరోపకారబుద్ధి, జాగర్తి = ఎల్లప్పుడు మేలుకొని యుండునో, తేషాం = వారియొక్క, విపదః = ఆపదలు, నశ్యన్తి నశించును, పదేపదే = అడుగడుగునను, సంపదఃస్యుః = సంపదలు ప్రాప్తించును.

తా॥ సజ్జనుల హృదయములో పరోపకారము చేయవలయునను భావన యుండును. అందుచేత వారి యాపదలు నశించి యడుగడుగునను సంపదలు చేకూరును.

వివరణము:- పరోపకారము చేయుటయే జీవితమునకు పరమావధి. పొట్టనింపుకొనుట పశువుకూడచేయును. పొట్టనింపుకొనుటయే జీవన పరమావధియైనచో మానవతలో విశేషమేమున్నది? స్వార్థపరుడైన మానవుని జీవితము వ్యర్థము —

పరోపకార శూన్యస్య ధిక్ మనుష్యస్య జీవితమ్ ।
జీవన్తు పశవో యేషాం చర్మాప్యుపకరిష్యతి ॥

పరోపకారము చేయని మనుష్యుని జీవనము నిందింపదగినది. పశువు జీవించినపుడేకాక చనిపోయిన తరువాతకూడ వాని చర్మముతో నుపయోగపడును. మనుజోకరు—ఎవడు తన శరీరముతో ధర్మముకాని. యజ్ఞముకాని, చేయడో యా శరీరము నీచమైనది కావున దానిని మరణా నంతరము పశుపక్ష్యాదులు కూడ ముట్టవు.

శ్లో॥ యది రామా యది చ రమా
యద్యపి తనయో వినయగుణోపేతః ।
యది తనయే తనయోత్పత్తిః
సురవరనగరే కిమాధిక్యమ్ ॥ 15

అర్థము:- రామా=సుందరి సాధ్వియైన భార్య, యది=అయినచో రమా=ధనసంపద, యది=ఉన్నచో, అపి=మరియు, తనయః=కుమారుడు, వినయగుణోపేతః = వినయాదిగుణములు కలవాడు, యది = అయినచో, తనయే=కొడుకునకు, తనయోత్పత్తిః = కొడుకు పుట్టుట, యది=జరిగినచో, సురవర నగరే = ఇంద్రలోకములో, ఆధిక్యం = అధిక్యత, కిమ్=ఏమున్నది ?

తా॥ సౌందర్యవతియు, సాధ్వియగు పత్నియు, ధన సంపత్తియు, వినయాది సద్గుణ సంపన్నుడైన పుత్రుడు,పుత్రునకు పుత్రుడు(మనుమడు) కలిగియున్నచో ఈ మానవలోకముకంటె సురలోకములో (దేవలోక ములో) గొప్పయేమున్నది ?

వివరణము :- స్వర్గమెక్కడ నున్నది ? స్వర్గము ఆకాశములో లేదు. స్వర్గ మీ భూతలమందే యున్నది, అవర్యగృహస్థు డగుటయే

స్వర్గము. ఉత్తమభార్య అధిక ధనధాన్యాదులు, గుణవంతుడైన పుత్రుడు కలిగి మనుమలు ఇంటియందు గంతులువేయుటచూచి ఆనందపడుటయే స్వర్గము. వేదము—

ఇహైవ స్తం మా వి యౌష్టం విశ్వమాయు ర్వ్యశ్నుతమ్।
క్రీడన్తౌ పుత్రైర్నప్తృభిర్మోదమానౌ స్వే గృహే ॥
(ఋ. 10-85-42)

ఓ దంపతులారా! మీ రిద్దఱు ఈ గృహస్థాశ్రమమందుండుడు. ఎన్నడు మీ రిద్దఱు నొకరి నొకరు విడిచియుండవలదు. పూర్ణాయువు ననుభవింపుడు. మీ యింటిలో మీ పుత్రపౌత్రులతో మిక్కిలి ప్రసన్నులై సంతోషముగా వారితో గూడ ఆడుకొనుచు జీవనము గడపుడు.

శ్లో॥ ఆహార నిద్రా భయమైథునాని
సమాని చైతాని నృణాం పశూనామ్ ।
జ్ఞానం నరాణామధికో విశేషో
జ్ఞానేన హీనాః పశుభిః సమానాః ॥ 16

అర్థము :- ఆహార నిద్రా భయ మైథునాని = ఆహారము తీసికొను టయు, నిద్రపోవుటయు, భయపడుటయు, బిడ్డల కనుటయు, నృణాం = మనుష్యులకు, పశూనాం = పశువులకు, ఏతాని = ఈనాలుగు, సమాని సమములు, నరాణాం = నరులకు, జ్ఞానం = అనునది, విశేషః = విశేష మైనది, అధికః = ఎక్కువ, కావున, జ్ఞానేన = జ్ఞానముతో, హీనాః = హీనులైనవారు (జ్ఞానములేనివారు), పశుభిః = పశువులతో, సమానాః = సమానులు.

తా॥ ఆహారము తీసికొనుట, నిద్రపోవుట, భయపడుట, సంతానము కనుట యను నాలుగు క్రియలు మనుష్యులకు పశువులకు సమానమే.

కాని మానవులకు జ్ఞానమనునది నధికముగా విశేషముగా నుండును. జ్ఞానములేని మానవులు పశువులతో సమానులు.

వివరణము :- జ్ఞానము శక్తి. జ్ఞానముతో మనుష్యు డున్నతు డగును. జ్ఞానముచేతనే మనుష్యుడు మోక్షమును పొందును. మరొక డిట్లు చెప్పెను — జ్ఞానమనునది రెక్క, దానిద్వారా మనము ఆకాశము వైపు ఎగురుదుము.

శ్లో॥ దానార్థినో మధుకరా యది కర్ణతాళై-
రూరీకృతాః కరివరేణ మదాంధబుద్ధ్యా ।
తస్యైవ గండయుగ మండన హానిరేషా
భృంగాః పునర్వికచ పద్మవనే వసన్తి ॥ 17

అర్థము :- మదాంధబుద్ధ్యా=మదముచే అంధమైన బుద్ధిగల, కరివరేణ = గజరాజుచేత, దానార్థినః=గజమదమునుకోరి వచ్చిన, మధుకరాః =తుమ్మెదలు, కర్ణతాళైః=చెవులు కొట్టుకొనుటచే, దూరీకృతాః = దూరముగా వెళ్ళగొట్టబడినవి, ఏషా = ఈపని, తస్యైవ = ఆ ఏనుగునకే, గండయుగ మండన హానిః=రెండు గండస్థలముల శోభకు హానికలిగినది, భృంగాః యది = తుమ్మెదలైతే, వికచపద్మవనే = వికసించిన పద్మవనములో, వసన్తి=నివసించుచున్నవి.

తా॥ మదముచే అంధమైన బుద్ధిగల శ్రేష్ఠమైన గజరాజు దగ్గరకు ఆ యేనుగు యొక్క మదమునుకోరి సమీపించిన తేనెటీగలను ఆ యేనుగు తన చెవులను టపటప కొట్టుటచే ఆతేనె టీగలు లేచిపోవును. అందుచేత గండస్థల శోభయే పోవును. కాని ఆ తేనెటీగలు అక్కడనుండి లేచిపోయి వికసించిన పద్మములందు చేరి వసించును.

వివరణము :- రాజుదగ్గఱకుగాని ధనవంతుని దగ్గఱకుగాని విద్వాంసుడు లేక గుణవంతుడు వచ్చినచో ధనమోహముచేగాని, మూఢత్వముచే గాని విద్వాంసుని లేక గుణవంతుని ఆదరింపక పోయినచో తన లక్ష్మి యొక్క శోభకే హానికలిగించిన వారగుదురు. అనంతకాలములో విశాల ప్రపంచములో గుణవంతులను విద్వాంసులను ఆదరించి సత్కరించువారు ఎక్కడో యొకచోట నెప్పుడో యొకప్పుడు తప్పక సంభవింతురు.

శ్లో॥ రాజా వేశ్యా యమో హ్యగ్ని స్తస్కరో బాలయాచకౌ।
పరదుఃఖం న జానన్తి అష్టమో గ్రామకంటకః ॥ 18

అర్థము :- రాజా=రాజు, వేశ్యా=భోగముది, యమః=యమరాజు, అగ్నిః=నిప్పు, తస్కరః=దొంగ, బాలయాచకౌ=బాలుడు, యాచకుడు, అష్టమః=ఎనిదవవాడు. గ్రామకంటకః=గ్రామస్థులను పీడించువాడును, పరదుఃఖం=ఇతరుల దుఃఖమును, నజానన్తి=ఎఱుగరు

తా॥ రాజు, వేశ్య, యమరాజు, అగ్ని, దొంగ, బాలకుడు, యాచకుడు, గ్రామకంటకుడు గ్రామములోని వారిని పీడించువాడు, అను నెనిమిది మంది యితరుల దుఃఖమును తెలిసికొనలేరు.

వివరణము :- ఈ ఎనిమిదింటిలో అగ్ని జడపదార్థము. అందుచే నది యితరుల సుఖదుఃఖములను తెలిసికొనలేదు. మిగిలిన యేడుగురు తమ గృహమును సరిదిద్దుటలోనే ప్రయత్నము చేయుచుందురు. రాజు ప్రజలను పీడించి తమ కోశాగారమును నింపుకొనుటకు ప్రయత్నించును. వేశ్యకు ధనమే ప్రధానముకాని ప్రేమతో నిమిత్తమేలేదు. యమరాజు ప్రాణులను సమయమురాగానే వారి కుటుంబమువారు ఎంత దుఃఖించుచున్నను ఇతర యోనులలో ప్రవేశపెట్టును. దొంగతనము చేయువాడు సొమ్మును కాజేయును కాని యాసొమ్ముకు సంబంధించిన వారెంత బాధ

పడుదురో యనెడు విచారింపడు. ఇక బాలుని యొక్క హాసము సంగతి యందఱకు తెలిసినదే. యాచకుడు తన స్వార్థమునే కోరుకొనును. గ్రామ కంటకుడు గ్రామస్థులను పీడించి తాను జీవింప ప్రయత్నించుచుండును

శ్లో॥ అధః పశ్యసి కిం బాలే పతితం తవ కిం భువి ।
రేరే మూర్ఖ న జానాసి గతం తారుణ్య మౌక్తికమ్ ॥ 19

అర్థము:- బాలే=ఓ బాలికా!, అధః=క్రిందికి, పశ్యసి = చూచు చున్నావు, భువి=భూమిపై, తవ=నీకు సంబంధించినది, కిం పతితం= ఏమిపడినది? రేరేమూర్ఖ! =ఓరి మూర్ఖుడా!, తారుణ్యం=యౌవనమను, మౌక్తికం=ముత్యము, గతం=పోయినది, న జానాసి=ఎఱుగవా?

తా॥ ముసలి ఆమె నడుమువంగి నడచుచుండ నొక యువకుడు ఎగతాళి చేయుటకు ఓ బాలా! నేలమీద నేమి పడిపోయినది? క్రిందికి చూచుచున్నావనెను. ఆమాటలు వినిన ముసలి ఆమె — ఓరీ మూర్ఖుడా! నా యౌవనమను ముత్యము పోయినది. దానిని వెదకుచుంటి ననెను.

వివరణము :- వృద్ధులను ఆదరముతో గౌరవింపవలెను. వారితో వ్యంగ్యముగా మాట్లాడరాదు. ఒకనాడు వ్యంగ్యముగా మాట్లాడిన వారికి గూడ ఆగతి తప్పదు.

శ్లో॥ వ్యాలాశ్రయాఽపి విఫలాపి సకంటకాఽపి
వక్రాఽపి పంకిల భవాఽపి దురాసదాఽపి ।
గంధేన బంధురసి కేతకి సర్వజంతోః
ఏకో గుణః ఖలు నిహన్తి సమస్తదోషాన్ ॥ 20

అర్థము :- కేతకి!=ఓ మొగలీ!, వ్యాలాశ్రయాఽపి = పాములకు ఆశ్రయమైనను, విఫలాఽపి = పండ్లులేని దానవైనను, సకంటకాఽపి=

